'బహిర్వెట్టి నతని యన్నమును...అభోజ్యమంత్రము' భార. శాం. ౧. (శ.ర.) [అప్రేరణమున 'బహిర్వడ్డ'.] దున్నులో ద్విత్వలోపము నిఘంటు త్రీయకారునికే కాక అతనికి ముందే 'అరణ్యపర్వమున శేషము' చెప్పిన 'విచిత్రకవిత్వ వాగ్విభవజృంభితు'నికి ఆంధ్రవిద్యా తృతీయమునికి శ్రీప్రబంధ పరమేశ్వరునికిం గూడ ప్రియమై యుండినది:—దును - దే.స.క్రి. దున్నునకు రూ. 'దునకయుం బెదపెట్టకయుం । దనరె నఖిల సస్యములును. హరి.పూ. శ.ర.

ఒలె (ఒల్లె) భాషాస్వభావముంబట్టి యిది స.రా.లో కైకొనఁబడినది. 'ముకు' నకు — 'మఱచునొక కడిలిఁ బతి ముకు చెరమలకై యేను'— మను. 4(45).

కొన్నిరూప విశేషములు :—4(199) గాలఁ — 'గాలు' బహు., కాన నిపాతము. 4(45) ఒకొ్కట—'ఇట నవ్వరూధినియు నొ । కొ్కటఁ గతిపయసఖులు తన్నుఁగొలిచి వదువఁగా' మను 3 (199), అనాకు (=అనకు). 'సర్వ మసహ్య మనా నెలుంగవే'—మను. 3(99) 'పట్టణ మేలు...దిక్కటీ। పట్టచరత్ప్రతాప హరిదశ్వుఁ డనా యువనాశ్వుఁ డున్నతిన్' క.క.ర. 1(26). భూరిరజో నుణస్ఫురిత పద్మజుఁ డనా' [ఈ సీసమున 4 అనాలు ]నృసింహ. 1(85). 6(3) పుణ్యభూమియందులకు (=పుణ్యభూమికి అని తాత్పర్యము.)— పుణ్యభూమికి వ్యస్తము చేసి దాని తర్వాత అర్థవశంబున 'కలదే' అని యూహించుకొనవలయును.

స్త్రీత్వసృష్టి.

2(31) కురంగిమద—ఇందు స్త్రీత్వ మెట్లు సరపడును ? కస్తూరి మగలేడినుండియే కలుగు నని తలంపక చేసిన ప్రయోగముగా గానిపించుచున్నది. కాని యిందు స్త్రీలింగము కవిసమ్మతము.:—'నవ్యవసుధా పతి...కృష్ణరాయ నృపచంద్రుని బాహువునందు భూషణోజ్జ్వలమణులన్ మృగిమదము వాసనయుం గని ధూర్తలంగనల్' పారి.1(20).

స్త్రీత్వనష్టి.

3(85) కరివర కరోరుయుగుచిర జంఘ నిమాణయు.—'జంఘాముక్ జు' అను వ్యాఖ్యాతలు అధోజ్ఞాపికలో వ్రైచినది సాధువాదము. 7(31) పతాక రణన్మణికింకిణీ కలాలాపములన్—పతాకయుక్త రణన్మణీ కింకిణీకలాలాపములు అని సాధ్యసమాసముగా చేసికోవచ్చును. 'పతాక' అనుట టీకాకారులది. 'పతాక' అను పా. కలదని వారే తెలుపుచున్నారు.

4(27) శ్రాంతరథ్య నిరంతరచ్ఛాయదములు—'ఛాయా' అని యుండవలదా ? వలదు. ఎట్లన —'ప్రచ్ఛాయ సులభనిద్రాః'—ప్రకృష్టా ఛాయా యత్ర అని విగ్రహము; అట్లే ఇటను 'నిరంతరా ఛాయా యత్ర నిరన్తరచ్ఛాయమ్ - తద్దదాతి అనియేని, లేదా, నిరంతరాణాం ఛాయా నిరన్తరచ్ఛాయమ్ అని ష. స. గా నేని విగ్రహించుకొనవచ్చును.

4(120) 'బలాకమాలికల్'—పుల్లింగ మెట్లు ? బలాక శబ్దమునుం గలదు. 'ఆభాతి సంహతి గృహీత బలాకశబ్దః,' మృచ్ఛకటి; 'హంసబలాక సారసారవ' భార. ఆది. 6(284).

6(87) కాషాయ యుగిసోడ—బొండసము యుగి(?) జోడనఁ బొల్పుగాంచు' ఆం. భా. 'కుచయుగీ హారాళినిలత్వ సంపదలో'—నిరంకుశ. 1(86) 'కుచకలశయుగీమణ్డలమ్' పంచబాణవిజయము. లేదా, ప్రకృతి ప్రయోగమును—'కాషాయములజోడ' అని పఠింపవచ్చును. యుగత్వము ఆచారముచేత గమ్యమే యగును.

## ప్రకీర్ణము.

5(38) బాహిరము— ఇది భారతసిద్ధము—'బాహిరములై నఁ గలనికగ్గులు.'— విరాట 1(187). శాటి 1(65), 78, 4(183), 5(141)—పంధాన వస్త్రమాత్రపరముగా ఈ శబ్దము కలదా? 'తళుకుదుకూలశాటి కటిఁదాలిచి'—మను. 5(73). 'యుగళ్ళనీరు పద్మావళి ప్రాంత శోడి కరకంచుగ నొప్పుచుఁ గోట శాటిలాగై పలుంగ. కళాపూ.1(16). 5(137) ఊడుకొను-ఊడుకొనఁగ వై పుఁ దుర్వ్రధముల' నృసింహ. 4(178). 6(78) గనపరాకులు (నిగిడ్చి)—'గనపరాకులు - గన్నెరాకమ్ము' అని బ్రౌను దొరగారు. సీతారామాచార్యులవారు దీనిని పఠింప లేదు. భోజరాజీయమున 'ఇనుపరాగోలల నితికించి'—5(321) అని యున్నది. 'గనపు' అనఁగా పెద్ద; ప్రకృతమున గనపరాకోలల నితికి' అని యుండునోపు.

6(82). నోరిసని—ఈసని మనువులోని 'సీరాముసేన' వంటిది. 5(159) కోనిరి—'కోనెరి' అనుటకు సంస్కృతములో ఎకారము (హ్రస్వము) లేనందున ఇకారము పఠించుట. 'కోనెటి చిన్నతిమ్మ నృపకుంజరు' రామాభ్యు. పీఠిక 41; 'కోనెటి తిమ్మభూవిభుని కూఁతురు'- రామాభ్యు. పీఠిక 93. 6(17) మూళ్లు-(=మూళులు)-(ధూళ్లి)పిప్పల్యాది. 4(94) తాళ్ల నే కలయ వాకిళ్లఁ జల్లి—ఇందు 'తాళన్' అనుటకు 'రాళ్ల' అనుట దుష్టము, లేదా 'ఇంటిముందటి పందిటి రాదుల చేరువను' అని యర్థము చేసికొనవలయును, లేదా 'తాలనే గలయ ద్వారాలఁ జల్లి' అని పఠింపవచ్చును. 5(20) కేళ్లు - ఇవులు కేలు శబ్దములు నిత్య బ. వ. నాంతములుగా వని (ప్రౌ. వ్యా. శబ్ద. 23, సూ. కావున, 'కేళ్లు' సాధువే. అటనే కళా., క. క. ర. ప్రయోగములు ఉదాహృతములు. 2(24) ఉవ్వు, 6(77) ఊపు: 'ఏటులుగఁ దద్వహా తాల ఉవ్వి ఉవ్వి' 2(24) 'పేవాయూథంబులు ఊపు వారు'—పువ్వు × పూవు, నొవ్వు × నోవు, ఎల్లిదము × ఏలిదము, తెప్ప × తేఁప, కొప్పు × కోపు ఇత్యాదులయందుంబోలె ద్వైరూప్యము. 5(44) 'పొందు'-పొందునకు ప్రా. అని టీక. 'జలచార స్తబ్ధరోమత్వకే! సరిత లొంపం పవతాగ దంధమున నాస్వాదించుఁ దాఁ బ్రౌఢిమన్'. 'ఒందు' అనుటకు 'పొందు' అని వ్యవహారము వేఱువాదులందు ఉండెను గావలయు. లేక - 'పొందు' అని యుండెడిని. 'జలచార...పొందు' అని షష్ఠీసమాసము. పొందు=ప్రాప్తి.—ఱట్టుమీఁది యత్తునకు లోపము. 'తూరి గజనిచరశాస్త్రం బింబముల్ దుమన్.' రామాభ్యు. 5. అని ప్రౌ. వ్యా. 5(44). ప్రౌఢిమన్ -ఈ పదమున ఇమనిచ్చు అసాధు వని వామన సూత్రము; ఇది ఆంధ్ర ప్రబంధములం గనఁబడుచున్నది, 'ప్రౌఢిచేన్' అన్న నిర్వాహము. 'మిగులఁ బ్రౌఢిమమునఁ గాళిక నిల్చి కోలము నటింప.' అనుచో 'యమునఁ గాళిక' యని పఠించిన సరిపడును. 6(89) నమన్స, 4(221) విధను - ఇవి 'ఇహాను' 'బహి' ఇత్యాదులవలె ప్రయుక్తములు.

4(196) కొన్నాళ్లు, 4(203) ఇన్నాళ్లు, 6(54) ఎన్నాళ్లు - ఇటనెల్ల నిలోప మెట్లు సాధువు? ప్రాచుర్యముచేత సాధువు. 'కొన్నాళ్లు' - 2(11) అనిరుద్ధ; 'కొన్నాళ్లకు గర్భిణియై' దశావ. 8(289), 'కొన్నాళ్లు వసించుటొప్పు.' అందే, 6(189-12 పంక్తి) ;'ఇన్నాళ్లు' కాశీ.8(73), కువలయాశ్వ. 5(35,105). 'తన కెన్నాళ్లుండియు' - బద్దెన నీతి. (24) పా 'ఇన్నాళ్లవలె' భోజ 5(105).

1(33). తిరుమల్దేవి (-తిరుమలదేవి) - ఇందు అత్వలోపమునకు గతియేమి? సంజ్ఞాపద

ముల రూపములను కవులు 'అపి మాషం మషం కుర్యా చ్ఛన్దోభఙ్గం న కారయేత్' అను న్యాయం బున ఛందోనుకూలముగా మార్చి ప్రయోగించుట ప్రసిద్ధము. ప్రకృతపదమునంబోలె అలోచ వంతములు. 'మాదర్దేవి', 'మాచల్దేవి', 'సోల్దేవి'.

"ఆనరసింగక్షితిపతి । మానవతీ తిలక యైన మాదల్దేవిన్
భూనుత సమస్తగుణల । క్ష్మీనిధిఁ దగఁ బెండ్లియాడెఁ గీర్తి దలిర్పన్."

O. L. Mss. Vol. II. కళాపూర్ణోపాఖ్యాన.

"ద్వీపాంతంబుననుండి వచ్చితివె భూదేవా 'ప్రశాన్తం మహా
పాపమ్!' సర్వజగత్ప్రసిద్ధ మహనోబాణాసనామ్నాయవి
ద్యోపాధ్యాయిఁ బ్రతాపరుద్రధరణీశోపాత్త గోష్ఠీప్రతి
ష్ఠా పారీణ దెలుంగరాయ్యాహవు మాచల్దేవి వారాంగనన్."  క్రీడాభిరామము.

అట్లే నరసరాజీయములో—'అనూనపతి సోల్దేవి యందుఁ బ్రబలునిఁ గాన్చి క్షితిపాలు నిఁ గాంచెను.' 1(61). లేదా, 'తతో భూదృక్కనా జాని రీశ్వర క్షితిపాలకః । అనాన సముణభ్రంశం వారిరత్నం మహీభుజామ్.' ప్రా. లే. మా. 109. అను 'బుక్కమా' ప్రయోగము బడి 'రహిఁ దిర్మలమా' అని పఠింపఁదగు. ప్రాచీన లేఖకులలో 'వల్లామ్బికా ముదవహత్', 'శ్రుతం వల్ల భాలభర,' అనియు, వల్లభాదేవి యనుటకుం బ్రయోగములు. 'మాచల్దేవి' కళాపూర్ణో పాఖ్యానము. కల్లూరి నరసింహకవి నాగ్నిచిత్తపరిణయములో 'పేరరాజు' అని ప్రయోగించియు న్నాఁడు. అట్లే 'బస్వరాజు'

4(4) 'జానుదఘ్న' - 'జానుదఘ్ని' అని యుండవలయును. దఘ్నచ్ప్రత్యయము టాప్పు రాదు, జీప్పు వచ్చును.

5(8). శ్యామాత్వంబు - 'ఇట పుంవద్భావము రాని యెట్లు?' ఇత్యాది చర్చ కలదు. 'శ్యామాంకంబు' (=శ్యామ యను సంజ్ఞ) అని యున్న సరిపడును, అంకము = నామధేయము. 'ఓ భూసురవంశ్య, పుణ్యజన పుణ్యజనాంకము తావకీనమే। హో సముపార్జితం గులము పొర్లున దైత్యుల కల్ల నంకరన్' 6(51).

2(21) అనుభవతకు—'పద్మాక్షుఁ బూరి వసుధవతకు నీవ యొత్తులు పెట్టు నగఁగ రావల సినటకు'—'వసుధవమున కీవ' అని పఠించుట సరి

2(18) ఒకహారతన్ - హారము లెన్నియే వగును గాని హారత మాత్రము ఒక్కటే; కావున 'ఒగి హారతన్' అని పఠింపవలయును.

4(269) కపట మానిసి - అపశబ్దము - 'కపుడు మానిసి' అనునది.

2(93). భూనాయక సభ—'సభా రాజా మనుష్యపూర్వా' అను సూత్రముచేత 'భూ నాయకసభమ్' అయి, తెనుఁగున 'భూనాయక సభమున' అని కావలయును. కావున దీనిని సిద్ధసమాసముగా చేయక 'భూనాయకు సభ' అని సాధ్య సమాసము కావించికొనవలయును.

4(104) 'స్వరు ఖర...దధ్యుదాకరముల' - ఉదాకరము - ఈ యుదాదేశమెట్లు? 'ఉదక స్యోదః సంజ్ఞాయామ్'

4(96) ద్రుహిణాండ కరండక ధూర్వహ - 'ఋక్పూరబ్ధూః పథా మానక్షే.' అను సూత్రముచేత 'కరండక ధురావహ' అని యుండదలదా? అని యాక్షేపింతురు, 'కరండక'

శబ్దమునకు 'ధూర్వహ' శబ్దముతో సమాసముగాని ధూశ్శబ్దముతోఁ గాదు, కావున ఉన్న రూపము సిద్ధము.

2(99) దోర్ధూర్ధృత - అన్నచో - దోః = బాహువుయొక్క - ధూః = భరముచేత-అను టీక సరిగాదు. ఆ పక్షమున 'దోర్ధురంధృత' అని యుండవలయును. ఇచట ధూః శబ్దము అక్షవాచకము. దోః = బాహువనెడి - ధూః = కాడిచేత (లేక కాడివంటి బాహువుచేత) అని యన్వయించుకొనవలయును

4(165) ప్రథగ్నశాల్యవనిన్ - 'ప్రథగ్న = విలుచుటచేత - శాలి = ఒప్పుచున్న' - అను టీక సమంజసము కాదు. కావున 'ప్రథగ్న = దున్నఁబడిన - శాలి అవనిన్ = వరి పొలమందు' - అని యర్థము చెప్పవలయును.

4(29) సప్తరాత్రమున్ - ద్విగుత్వప్రాప్త మయిన యేకవచనాంతత్వము ఇట తెనుఁగున నపేక్షితము. ఇచట ఏడుదినములు అని యర్థము - బహువచనముచేత ఎన్నియేని ఏడులు అర్థము కావచ్చును. కావున, 'సప్తరాత్రమున్' అనుట శ్రేయము.

కొన్నిటికి అర్థనిర్ణయము.

2(19) పద్మినులు - 'జాతులేవంటెవేఁ బద్మినులు చిత్తినులను నన్నయుడ జాతులనికి యరుదె.' ఒక పక్షమున పద్మినీజాతిస్త్రీలు అని యర్థము సరిపడుచున్నది; రెండవ పక్షమున పద్మములు అను నర్థమెట్లు వచ్చును? అని యాక్షేపింతురు. ఇచట మత్వర్థీయము సమూహార్థకము సంభవము. 'పద్మినీ యోషిదంతరే। అబ్జేఽబ్జిన్యాం నరసాయాం చ' హేమ., 'పద్మినీ పద్మసంఘాతే స్త్రీవిశేషే సరోఽప్యథ.' నానా.

2(8) జలజపత్త్రములు - 'తిరుగు తీవాల జలజపత్త్రములు పొదువ'; 'జలజదళస్థగితములు' 4(151); 'జలజదళములు' 4(149) - ఈ మూఁటను తామరాకులు అర్థము కావలయును. అరవిందములకు తామరరేకులు గదా అర్థము. అయాకులకు 'పద్మినీపత్త్రాణ' ఇత్యాది వ్యవహారము ప్రసిద్ధము. రేకునకు.—'శతపత్త్రిక' మను. 'అమ్భోజపత్త్రాయతలోచనానామ్' భోజప్రబంధ. ఆకునకు - 'స్థిత మురసి విశాలం పద్మినీపత్త్ర మేతత్' రత్నావళి; 'కుసుమశయనం నలినీదళకల్పితస్తనావరణమ్' శాకుం.; 'అనిరమె యుక్తమట్లు నలినీదళ సంస్థితమై తనర్చు' భర్తృ.; 'క్లాన్తో మన్మథలేఖ ఏష నలినీపత్త్రే నఖైరర్పితః' శా. 'అనరాళ నాళనలినీపత్త్రాతపత్రం ధృతమ్.' మాలతి. ఇత్యాద్యుదాహరణములు పెక్కులు కలవు.

'సౌవర్ణే రాజతే పాత్రే తామ్రే పద్మదలాశ్రయే। భోజనే భోజనేచ్చైవ త్రిరాత్రాత్ఫలమశ్నుతే' పైఠీనసి. ''య ఇచ్ఛే దూర్ధ్వగామిత్వం పరం స్థానం చ శాశ్వతమ్। పద్మపత్త్రేషు భోక్తవ్యం మాస మేకం నిరన్తరమ్' స్మృతిచంద్రిక.

2(78). ఘృతపిండ నిభకర్పూరీ ఖండములతోడ - కర్పూరి యనఁగా దోస యని యుట టీక గలదు. ఇందుకై అనుబంధములో కర్పూరీశబ్దమును జూచునది.

5(121) జ్యోత్స్నగన్ - 'ఉరుశక్తిస్మృతిమానసోద్ధపిదుకన్ జ్యోత్స్నగవి చంద్రమః స్ఫురదూధః ప్రవిముక్తమైన నిబిడజ్యోత్స్నాపయః పూరమున్'- జ్యోత్స్న చన్ద్రిక 'యాన్విత' అను నమరవాక్యముచేత 'జ్యో' అని ఔకార ముండఁగా యతికై జ్యో యని ప్రయోగించుట శబ్దధ్వంసము చేయుటగాదా? కాదు. 'జ్యోత్స్న' అని వృద్ధిహీనరూపము

కూడ సాధువే. 'జ్యోత్స్నాదిభ్య ఉపసంఖ్యానమ్' అను వార్త్తికముచేత ఈ శబ్దము నిష్పన్న మయినది. సంజ్ఞాపూర్వకత్వమువలన వృద్ధి లేమింజేసి పక్షమున జ్యోత్స్న అని రూ;చూ.రామా శ్రమీయము.

8(67) కళల్ పదునాల్గు నేర్చి - విద్యలనుటకు కళ లనుట చక్కఁగా లే దని ఆక్షేపింతురు.— 'ఉండుదుఁ జోళభూమి నొకయూరఁ గళల్ పదునాల్గు నేర్చి' అని పూర్వముద్రిత పాఠము. కళల్ = విద్యలు అని టీక. 'ఒకయూరను విద్యల నెల్ల నేర్చి' అను దానిని పదునాల్గు సంఖ్యకొఱకు ఇట్లు మార్చియుందురు, అని తలంపఁదగియు నున్నది. లేదా గౌణప్రయోగముగాఁ గొనునది.

5(130) జడిసెన్ (=కురిసెను, వర్షించెను). 'జడియు- దీనికి వర్షించు అను నర్థము శబ్దార్థ కల్పతరువునందు వ్రాయఁబడియున్నదిగాని ప్రయోగ మగపడ లేదు.' అని శ. ర. లో సీతారామాచార్యులవారు వ్రాసినారు. ఇదియే ప్రయోగము. జడిసేయు అనునర్థమున జడియు అని కవి చమత్కారముగా ప్రయోగించినాఁడు.

4(50) 'నాభిఁ దుడిచి కప్పురపునాభిఁ బెట్టు'-నాభి శబ్దమునకు తిలకార్థ మెట్లు కలుగును? ఈ యర్థము పెక్కు నిఘంటువులలో కనఁబడ లేదు. నైఘంటుకమగుఁగాక, కాక పోవుఁగాక.- 'నాభిర్ముఖ్యనృపే చక్రమధ్య క్షత్రియయోః పుమాన్ । ద్వయోః ప్రాణిప్రతీకే స్యాత్ స్త్రియాం కస్తూరికామదే' మేదిని. 'ఖం వీజ్యతే మణిమయైరివ తాళవృన్తైః' మృచ్ఛకటి. 'ఏటు లార్చు నసిపుఁ దాళవృంతములన్' ఆముక్త. ఇత్యాది వ్యవహారమందు తాళవృంతము ఎట్లు విసనకఱ్ఱకు పేరయినదో అట్లే ఈ నాభిప్రయోగమును దలంపవచ్చును. మఱియు నాభి శబ్దము తిలకవాచకంబుగానుం గలదు.

2(46) నిద్రితద్రుచ్ఛాయ - ద్రుమ నిద్రితమా, ఛాయ నిద్రితమా ? అని యాక్షేపింతురు గావలయును. ఈ రెండునుం గావు. నిద్రితుని (నిద్రపోయినవాని) ద్రుమ అని విగ్రహము. అర్థవశమున ఏద్రుముక్రింద నిద్రితుఁడో ఆద్రుమే అతని ద్రుమ.

ఈ క్రింది పద్యములో 'రొంపులు వంటి' యనుచో ను శబ్దప్రయోగము పాదపూరణార్థకము గాదా ? అని యాక్షేపింతురు ?—

'వరి యగు నిట్టి వెట్టలను సర్వము నంచటమీఁదిస్రుక్కెక
కరధిపరిజ్మరుజ్జ్వలిత చండతరాతపవహ్ని నాఁగఁగా
గరువు లజాండు పీనిపయిఁ గట్టినవ న్గనుపట్టె వెట్టలన్
గరికిరి కాసరాంగములఁ గప్పిన రొంపులు వంటియాంటఁగన్.

కదమరొంపులే గాక పీనిం గప్పిన యీరొంపులు సైతము ఆఱినందున ఇట్లుత్ప్రేక్షింపనాయెను, అని తత్సముచ్చయార్థ విశేషము. లేదా, 'పంకము లంటి' అని పఠించుకొనవచ్చును.

2(58) వందిరియ చేరి.— ఇందు అవధారణార్థకమయిన - అ - ఏల? వెట్టకతంబున మతి రొచ్చుటను ఈపాటిరేయియు మదనోద్దీపనము లే దాయె నని భావవృష్టి. కొందఱు 'వందిర' అని ఏకారాంతశబ్దము నూహింతురు.

## అప్రయుక్తములు.

ఇందు అప్రయుక్తము లయిన కటి గల్గు బగ్గలు ప్రయుక్తములు.—

'పామరులభావ గ్రామ్యము। భామినికటిగల్లములు విభాసిల్లు ననఁగ' నరస.

'శుకవాణి బుగ్గలు ముకురంబు లన రాదు' అప్పకవి.-

ప్రకృతప్రయోగములు. 1(50) రంగల్వడిగ్గియు నిరుచ్యుతమజ్జనార్థము కటిం గిలించి. 4(158) కటి దిసలు నిక్క-[కటి ఏనుఁగుకటి], 4(80) కటిం జందురకావికె బసుర, 6(80) కటి నుండి చనుమర గడిగాఁగ[దొంగల రాణానికటి]; 6(64) కటిసీమఁ గనక మేఖలఁ దాల్చి; 8(85) అతిక్రమగల్లభాగా భోగశాలాఢ్య; 5(125) నిండుబుగ్గలఁ దొరసె మధుప్రపూర్ణత.

ఏనిని మహాకవు లెందరో ప్రయోగించినారు.-

'కట్టు రింగులు వాలెఁ గటిభాగమునయందు' - కా. 3(118); 'కటీభార శాటీభవ త్సింధురక్రవ్యభుక్కృత్తి' కా. 7(73), 'కటితటం బెట్టినమోటకత్తులను' - మను. 4(33), 'వేణీభరం బట్టిబైట కటిఁ జిమ్మ పికటులుగా' మను. 4(88), 'శ్రోణీతాసి వాతాశన ప్రారజ్యత్కటిచక్ర' మను. 71, 'చీరఁగటి బింకపుఁజన్నులఁ జేర్చుకొంచు' మను. 5(68), 'కటీవిలోలద్రశనాకలాపా' ది. సూ. చ 6(49), 'ఒక నేత్రాంబుజ మొక్కగల్లము'-మను - 5(60), 'అతి వేలమణితయాచ్ఛార్ద్ర గల్లచపేటము' మను. 3(116), 'గల్లభాగద్వయీ' క. క. ర. 5(198), 'గల్లములఁ గుండలద్యుతి' మను. (195).

'సావష్టమ్భ నిశుమ్భ సంభ్రమ నమద్భూగోళ నిష్పీడన
న్యఞ్చత్కూర్మకపృష్ఠ పిండితద్విచక్రాణ్ణభ్రమణసితి
పాతాళప్రతిమల్ల గల్ల వివర ప్రక్షిప్తసప్తార్ణవం
వన్దే నన్దితనీలకణ్ఠ పరిషద్వ్యక్తర్ధి తవ క్రీడితమ్.' మాలతీ 5(22).

'ఇప్పపూవుబుగ్గలం బోనిబుగ్గలం దెగలెక సూపు' మను 3(28).

'చిన్నిబుగ్గల లేఁత చిఱునవ్వుల' - పారవిలా. 2(115).

'పాలబుగ్గలకాంతి పల్లవంబులతోడ' - కా. 3(240).

## దుర్బోధములు

4(154) 'గండప్వం ద్వ' ...(ప్రకీర్ణకముల్లై -యుక్తిసాపేక్షము-వేదండంబుల్వ్రపుపంతు లౌట (చుఁ?) దలిపెడఁ దండెత్తి ఘూపాలికిన్'..... 'జఘుదంతులౌట' అని పఠించిన సుగమముగా నుండును. కప్రమంటిన కరాళమదరేఖల్ రెండవ జతి దంతములు, తత్సంపర్కపుఁ దలిరేఖలు చెవులందు ప్రకీర్ణకములు -'చామరం తు ప్రకీర్ణకమ్'. 5(119) 'స్విజతి గాంచియు'-ప్రపుష్టమా? ఈ దోషములు నిస్వనముల కెట్లు? 4(179) 'క్రౌంచ మొకకొన్ని గ్రుడ్లులు' ఈ గ్రుడ్లు హంసగ్రుడ్లు.

## ప్రక్రమభంగములు

2(30) 'ముడివిప్ప'- 'తమ్ములని వ్రాలుటఁ దేంట్లు నెన్నెలు లగుట' అని పఠించిన సరిపడును. 5(107) 'చిలువసుధారసాధరల' - మందు ఆకు రాలును, తలిరు లనంతరము పొడమును. ఆక్రమము ఉత్తరార్థమున నిరూఢము; సుధారస విషజ్వాలనలకు క్రమము లేదు, కావున యథాక్రమానుదేశంబును లేదు. చూ.-

' ఇద మసులభవస్తు ప్రార్థనా దుర్నివారం।
ప్రథమ మపి మనో మే పఞ్చబాణః క్షిణోతి

కియుత మలయవాతోన్మూలితా పాణ్డుపత్త్రై
రుపవనసహకారైర్దర్శితే ష్వబ్జ్యకేషు.' వి.ఉ.
'పండిన యాకు డుల్ల, నవపల్లవముల్ తిలకింప,'- వ్య.పు.

## పెద్దన్న కవనముపై యాక్షేపములు

పెద్దనవాదులను తత్ప్రత్యుత్తరమున సమాధానము చెప్పవలసిన తదీయ ప్రయోగములు మనువులో గొన్ని కలవు.-(1) లాలాటికము('పాటవ సేయవిలె') = తిలకవాచకము, (2) గ్రహయాళు ('చకితైణాహులి') - ఈ రూపము హరవిలాసమునందునుం గలదు, (గృహయాళు - సాధురూపము). అంకస్థాయి- ('రారాపిల్లి'), అంగస్థాయినిఁ అనవలయు. (4) సలీలన్ (అవ్యయీభావము) (స్త్రీత్వమెట్లు?) (5) పణినసూను [వ్య. నై. లో 'పణినాపత్య'] [పాణిని పాణినసూనుఁడు గాని పణినసూనుఁడు గాఁడు.

## రాయవాద విమర్శ - లింగసామ్యము

ఆయుపోద్ఘాతములో రాయకర్తృకత్వమును సిద్ధాంతించుటకైన వాదములలో 'శబ్దవిమార్గము తక్కినకవుల మార్గమునకు కేవలవిజాతీయముగాఁ గానవచ్చుచున్నది' అని తొడంగిన విజాతీయాధికరణములో నుదాహరింపఁబడిన మార్గములు ప్రాయికముగా సజాతీయములే గాని విజాతీయములు గావు. వానిలో మొదటిది.—

కొన్నిచోట్ల విశేషణములు విశేష్యముయొక్క లింగవచనాదికముం బొరయుట - ఇందులకు ఉపోద్ఘాతకారు లొసంగిన ప్రయోగములు:—

4(29) 'ఆయతియున్మదాకృతిక X రాగ్రనగాంచలవాంత వారిధా। రాయుత చంద్రకాంత ఫలకావళిబింబిత యై' - ఇందు 'బింబిత' అను పదము ఆకృతికి విశేషణమై స్త్రీలింగంబునం బ్రయుక్తము. ఇది ముద్రణమాత్రదోషము- 'బింబితమై' అనియు పఠింప నగు, ముద్రింపను నగు.

3(74) 'సాత్త్వి। కపుమనోగతి యొయ్యన X గలదు దాని బ్రహ్మసంబంధినిఁ జేయు X ప్రౌఢి మావె. ఇట 'బ్రహ్మసంబంధిని' 'మనోగతి'కి విశేషణమై స్త్రీలింగంబునం బ్రయుక్తమఁట. అగుఁగాక. ఈసంబంధిని ద్వితీయగా నేనియుం గొనవచ్చును. కావున ఈయుదాహరణమును అకించిత్కరమే.

## లింగసామ్యము.

4(36) "కవచితకుథాకర్బుర లగుకరివర కరేణుకంధరలన్' - ఇచట 'కంధరల'కు విశేషణ మగుటచే 'కర్బురలు' అని స్త్రీత్వమఁట; సరియే; కాని, ఇదియును ముద్రణకరణమే. ఈవచనములో 'కర్బురము లగు' అని ముద్రించినను నిర్బాధము.

ఇట్లు ఆయుదాహరణము లన్నియు విఫలములు. ఇట్టివి గాక గణయతిప్రాసాదినియమప్రేరితములై సఫలము లగునవియు ఇందు సమృద్ధిగా నే గలవు. వానిం గొన్నింటిం బ్రదర్శించెద :-

1(7) 'అట్టి కాం। మోదకి మోదకిలిత సముజ్జ్వల కల్పకమాల్యఁ గొల్చెదన్'.

2(3) 'అక్షోభ్యవప్ర। దనరు ..క్షీణమధుర సాంద్ర ద్రుమమధుర.'

4(154) గండద్వంద్వ గళత్కరాళ మదరేఖల్ పుల్లసప్తచ్ఛదా। ఖండతోదసితల్.'

5(87) 'తామరసాక్ష తామ్రముఖి.'

## లింగసామ్యము

[ఈ సామ్యము లేని ప్రయోగములును ఇందు బహుళముగాఁ గలవు.] ఈ సమత ఇతరకవన సజాతీయమే యై ఈ కవియొక్క అఖండ గీర్వాణ పాండిత్యమును నిరూపించుచున్నది. సజాతీయమే యనుటకు.—

(౧) 'స్వకీయ యగు చంద్రిక నిల్లడ వెట్టెనో' కాశీ. 3(196) [ముద్రణశరణము.]

(౨) 'స్నానంబు సిద్ధించునే వారాణస్యుపకంఠదేశ విలుఠద్వార్వేణి వీచీఘటా । ధీరధ్వాన పరంపరాకలకలోద్విఘ్నాఘు భాగీరథిన్.' 5(32). [ఉద్విగ్నాఘున్ భాగీరథిన్ అని ఛేదము- ముద్రణశరణము గాదు.]

(3) 'గ్రస్త సమస్తలోక ప్రపంచయై మాయ'—5(71). [ముద్రణశరణము].

(౪) 'అరుగుదెంచె। గాశి నగరికి నికటభాగ ప్రకీర్ణ। గగనగంగా తరంగిణీ కనకకమల। పరిమళోద్గారిణికి మహాభైరవుండు'.—5(121). [ముద్రణశరణము గాదు].

(౫) 'బ్రహ్మమున సమయ ప్రపూరపూర్ణ సురతటినిన్' 5(41) [ముద్రణశరణము గాదు.]

(౬) 'సాకార యగు బ్రహ్మహత్యతోఁ జనుదేర'—5(123). [ముద్రణశరణము.]

(౭) 'నిఖిల జగత్ తిరస్కృద్రాజికి'.—6(77). [ముద్రణశరణము].

(౮) 'అదవీయసి మోక్షపదవి యధికవివేకా'.—6(282).

(౯) 'గజశాలలు ప్రభవించె నతివిశాలలు పెక్కుల్' 4(118). వరాహపురాణము. [ముద్రణశరణము గాదు]. ఇట్టివి వాఙ్మయములో నెన్ని లేవు!

## విజాతీయములలో రెండవ ప్రకారము

## గౌణప్రయోగములు.

నిష్ఠ్యూతాది శబ్దములు వాచ్యవృత్తిలో గ్రామ్య కష్ట్య విగాహములై, గౌణవృత్తిలో అతి సుందరము లగుట సంస్కృతమున ప్రసిద్ధము. అది యిందు తెనుఁగున నవలంబిత మని ప్రతిపాదించి, అందులకు ఉదాహరణముగా, ఉపోద్ఘాతకారులు 'ఉమిసిన' అను నీక్రింది ప్రయోగమును చూపినారు.

4(118) 'ఉరువిద్యుద్దీపకళిక లుమిసిన ధూమ స్ఫురణ.' ఇదియు ఇతరకవన సజాతీయమే కాని విజాతీయము గాదు:- 'ఉమిసి'యే గాక, క్రాసి, యుమిసి, క్రక్కి, మేసి, ఓకిలించి ఈవిధ ప్రయోగములు సయితము గలవు.

(౧) 'ఎఱ్ఱనంట లుమియుచు నెసఁగు చూడ్కులచేత ।
ప్రళయాగ్ని సూర్యాంతరములు వోలె.'—నృసిం. 4(48).

ఇది ప్రహ్లాదుని మడియింప హిరణ్యకశిపుఁ డంపిన యేనుఁగుల వర్ణనము.

(౨) 'చిచ్చు లుమియు శిలీముఖంబు లొడలఁ గ్రుచ్చి.' కాశీ.4(221).

(౩) 'ధవళ లాంగూల పల్లవచ్ఛాలనంబులు। కౌముదీచ్ఛాయలఁ గ్రాసియుమియ.'-(269)

(౪) 'మానినులపైఁ గడు నాగ్రహమెత్తి యంగ భూ
ఫల్లచయంబు కోపమునఁ బావకకీలలు గ్రక్కెనో యనన్' తపతీ సంవరణము 4.

(౫) 'ఉగ్రవిషానలం బుమియుచున్న' భా. అర. ఆ.6. ప.315.

(౬) 'కోలఁది యెఱుంగక తిని కో । కిలకామిని వాడలఁ ద్రాపెఁ గిసలయ ఖండం। బులు
విరహిజనులపై నిప్పులు గ్రక్కెడు ననఁగఁజూడు పుష్పసుగంధీ.' వరా. 3(88)

(౭) 'ఘనసువర్ణపలాశకవాసనాగలిగెఁ । గలసి రజస్స్ఫులింగములు గ్రక్కుచు వీవలి
వేగ చేరి రాఁగెఁ.' చంద్రికా. 4(58).

(౮) 'శిరమున మించుఁదీవల నసిఁగెఁ మిసిమి గాఁడు కెంపుఁ జెన్నడల్
కరమున వాఁడివాల్ మెఱుఁగు గ్రక్కెడు గొడ్డలి గల్గి పొల్చు న
ప్పురమతపః ప్రభావు భృగువంశ వివర్ధను క్షత్త్రియాంతకుఁ
మరగి నమస్కరించితి సుపుత్రమ నెమ్మి యొగ్గి నిల్చితిఁ.' కర్ణ.

(౯) 'ఖడ్గ మగ్గలికఁ దడిల్లతల్ వెడలఁ ద్రాయు.' కళా. 1(88).

(౧౦) 'కమ్మవిల్తునిఁ మేసినకన్ను' శృం. శాకుం. 4.

(౧౧) 'నలునిఁ జూచినపిదప మన్మథునిఁ జూడ।
నాకనిలయుల నయనంబు లోకిలించె' శృం. నై.

(౧౨) 'వికటారకూట వల్లికడార పుంపెద్ద ।
మకుటంబు లేయెంప బిగుల నీన' — శృ. శా. 4.

(౧౩) 'తరుణాంగుళిచ్ఛాయ దంతంపు సరికట్టు ।
లింగిలీకపువింత రంగు లీన' — మను. 1(5).

(౧౪) 'ఇందీవరంబుల నీను గ్రాల్గన్నులు శరదిందు
ముఖులు చామరము లిడఁగ' — 12.

(౧౫) 'దేహకాంతులు బాలచంద్రికల నీన ।
జడలు మోక్షద్రుపల్లవ శంకఁ జేయ.' — హరిశ్చంద్ర.

(౧౬) 'అందంబుగ నళికమం దొప్పు తిరుమణి ।
తిరుచూర్ణములు వింత మెఱుఁగు లీన' — కృ. రా. వి. 2(2).

### విజాతీయములలో మూఁడవ ప్రకారము. ద్రావిడజాతీయము

'ద్రావిడజాతీయము' - ఇందులకు ఉపోద్ఘాతకారుల యుదాహరణము: 'పదింబదిగా' 3(55) 'మీరును నా కనురక్తుల్। పరికించి పదింబదిగా। నరయుండు మరి పెద్దమేలు ప్రార్థించుటకుఁ.' — ఇట 'పదింబదిగా' ననునది ద్రావిడజాతీయ మఁట. ఇది యేజాతీయ మైన నగుఁగాక విజాతీయముమాత్రము గాదు. ఈయుదాహరణములం గనుఁడు: —

౧ 'విరుసును జూపి యనేకవిధంబులఁ। బెక్కులు వల్కియుఁ జూచితి నీ
కరుణకుఁ బాత్రుఁడు గాఁడు పదింబది। గాఁ గనిపచ్చినవాఁడుఁ దుదిఁ.' రాఘ. 4(161)

౨ 'దీనికిఁ గర్తవ్య మెద్ది మనకుఁ బదియుఁ బదియును గా నీతిపదవి నరసి।
తెలియఁ దగు నని యి ట్లని పలికె మఱియు.' - కళా. 7(21).

3 'అనఘుఁడ నిన్ను సోదిగొనునంతటిదానవె యేను? దప్పులే (లెంరి?)
దును, దలపోయనీవలన దోస మెరి? యాత్మను బాయకున్నవా
రని బలుకొక్కమా అనుసరించుట మే లది యిందు నేఁ దొలం
గని పెనుఁదప్పు నాయదియకాక పదింబదిగాఁగ నెంచినఁ.' ప్రభా. ప్ర. 5(122)

౮ 'మదిరాక్షుల నమ్మకు, నయా। విడువఁడవు గద, వేగిరంబు వెరవరిఁ జెఱుచుర్,
బవరికుమీ, లెస్స పడి। బదిగ విచారించి చేయ మంచిది సుమ్మీ.' సారంగ. 2(259)

౫ 'చాలు విచారము ల్వదిగ శంభునిఁగూరిచి.' - హరవి. 4(32)

వాఙ్మయమున నెమకుదుమేని ఈపద సముచ్చయమునకు ఇంక నెన్ని ప్రయోగములు దొరకునో! దీనిని ఆంధ్రమన్యాదగా దనుట యెట్లు?

పూర్వముద్రణమందలి యుపోద్ఘాతమున రాయకృత్యైకతాస్థాపనకై విజాతీయము అని నిర్దిష్టలింగములలో నాలవ ద్రావిడపద ప్రయోగము, ఇదియు ఇతరకవి సాధారణమే—

క. 'ఉణ్ణాములె జగదంబిక। నణ్ణామలె విశ్వనాథు నారాధించెన్
మణ్ణాసయుఁ బొన్నాసయుఁ। జెణ్ణాసయు లేనివారి పెన్నిధు లగుటన్.' కా. 3(180)

[ఉణ్ణాములె=అపీతకుచాంబ, అణ్ణామలె=అరుణాచలము.]

'వైశాలియింతివే' మార్కండేయ. అఱవమున 'అవిశాలి' = యనఁగా జారిణి.

పొరివిళంగాయ 2(87), అప్పవారు 2(94), మున్నవారు 5(92), పెన్దిరువడి 4(30)— ఈయఱవపదములు అనుక్తమాల్యదలో కలవు. వీనిలో 'పొరివిళంగాయ' శ. ర. లో లేదు, ఇవి శ్రీవైష్ణవగృహవ్యవహారమున నతిప్రసిద్ధము లగుటంజేసి ఝడితి అర్థస్ఫూర్తికై ప్రయుక్తములు; కవియొక్క జ్ఞానాతిశయమును బుద్ధికౌశలమును దెలుపుచున్నవి. ఇందుంబోలె 'పొరివిళంగాయలు' హంసవింశతియందుం గలవు.

పొరివిళంగాయలు.—ఇవి శ.ర.లో లేదు. బ్రౌణ్యములో కలదు. "A Sort of cakes. (A Tamil word) A. 2(14) (ఒకవిధమైన భక్ష్యము - అఱవ పదము) 'భక్తిఁ ద్రోవకు సాధ్య పరికరంబులు వెట్టి। కట్టిన పొరివిళంగాయగమియు' - వేఁచిన బియ్యపుపిండి విసిరి బెల్లము పాకముపట్టి పుండలు చేసినవి. H.I. 116. (...పొరివిళంగాయలు తేమనంబులును."

ఈ క్రిందివి ఆముక్తములోఁ గలవు.-తేఁడు(=వెదకు, కోరు.)

'గాదంబుఁ బన్నిదంబును। వాదును బతిపోషించిఁ దేఁడు వలవదు కడుఁబో,
రాదయ్యె సేని భృత్యులు। ఖేదము గాకుండు గొలువు పెనుపఁగవలయున్.' భోజ.

'తేఁడు' అనఁగా వెదకుట అని యఱవమున ప్రసిద్ధము; ఆయర్థమున శ. ర.లో లేదు.

పణ్యారము(=భక్ష్యము.) 'మహోపిషంబులో నద్దిన పణ్యారంబు' ఆహల్యా. అని బ్రౌను. శ.ర.ములో (1) నానఁబ్రస్వ, (2) భక్ష్యము, అని యర్థములు కలవు. భక్ష్యార్థమున అఱవమున వాడుక.

ఒడమె(ధనము.) 'ఒడమె గల వెఱఁగు నైనను। పుడమిం గలవార లెల్ల భూషింతురు' - ఒడమె యని యలంకారమునకు అఱవములో వాడుక.

ఎరియ(=మండు) - 'మనం బెరియఁగ నసహ్యపడున। న్నరుఁడు దెవ్వలు లేని వేదనం బడు నధిపా.' అఱవములో 'ఎరియు' అనఁగా మండుట.

సావి (= బీగము, తాళపుంజెవి, కుంచిక.) 'తిరుసావులవైచిటిమి.' 'బీగములు వైచి పదిలము కావించితి మనుట.' చె. మల్లి. విప్ర. 5(12).

'సాపడి'-,,-2(33). (వైష్ణవ సంప్రదాయమున వచ్చిన యఱవ పదము, భుజించి యనుట).

మొరము[=చేట]-'గురుసేవ రోఁకలి చేతఁబూని, దురహంకారముపొట్టూడదంచి,...శ్రీ

మారామానుజుల తిరుమంత్ర మనే మంచిమొరము నానించి, దురితంపుకామక్రోధము పొల్లుగాఁ దెరిఁగి,...' భక్తిబోధక సువ్విపాట.

నంజు[విషము.] 'నంజుమురిచ్చాఁకా' ఇది విషహరమైన యొకయోషధికి అఱవపేరు. 'నంజుండస్వామి' - శివునిపేరు కన్నడము; 'నాలుక బంతి వ్రేలఁబడి నంజున వోఁగి'--మను.

పూర్వకవులు ప్రసక్తి యున్నను లేకున్నను అన్యభాషాపదములకు తమపాక లేఁగినట్లెల్ల ప్రయోగించుచుండిరి.-అందు కన్నడ పదములకు శ్రీకాళహస్తి మాహాత్మ్యము 'బిజమాడు దేవర' లోనగు సీసపద్య మొకయుదాహరణము. హిందుస్థానీపదములకు పెద్దనగారే యున్నారు:—
'సకుటుంబముగ వీఁగి చరమశైలము చేరు! తుహినాంశు దుముదారు దొరయనంగ.' మను 3(54).

'ఖుసి మీఱఁగ సురధాణ నిండుకొలువై కూర్చున్నచోఁగా.' అని హంసవిలాసము పీఠిక (22)

పసి[=ఆఁకలి, అఱవమాట.]

'ప్రబలపన్నగకులరాజ్య పట్టభద్రుఁ! డెన్ని పసి వీఁచె నొకప్రక్క నిన్ను మేసవి!
లేఁడు పొమ్మని యనకున్నవాఁడుగాన! దళిత పాంథవిహార శీతలసమీర-' కువ. 4(82).

## ద్రావిడజాతీయభేదము—సంధ్య విరహోద్దీపకము కాఁదట.

'చరమసంధ్యా సమయము విరహిణులకు మదనోద్దీపక మని వర్ణించుట ద్రావిడ కవి సమయసిద్ధమే గాని సంస్కృతకవిసమయ సిద్ధము కాదు'-అని ఉపో. అందులకుం బ్రదర్శిత మయిన యుదాహరణము 'తామరసాక్షు తామ్రముఖి' ఇత్యాది పద్యము. ఇదియు విజాతీయము కాదు, సంస్కృత కవీంద్ర సంప్రదాయోపదిష్టమే. కనుఁడు.-

(౧) ఆర్యా సప్తశతి. 592 శ్లో. సాం 9 - సఖీం ప్రతి-వియోగిన్యాః సాయన్తనసమయః అత్యన్త దుఃఖద ఇతి నాయికా సఖీం వక్తి:-

'సాయం రవి రనల మసౌ! మదనశరం ప్రవిశన్ వినోదితం !
ఇద మపి తమస్సమూహం ! సోఽపి సఖి నిర్మలం శశీ.'

టీక.-'సాయమితి; అత్ర సఖీతి - పదానుపాదానం తావద్వ్యర్థో చ్చారణేఽపి కాలాతిపాతో భవతీతి భావి సాయన్తనసమయ స్యాతిదుఃఖదత్వ మిత్యావేదయతి.'

(౨) 'పరిపతతి పయోనిధౌ పతఙ్గః ! సరసిరుహా ముదరేషు మత్తభృఙ్గః !
ఉపవనతరుకోటరే విహఙ్గః ! యువతిజనేషు శనైశ్శనై రనఙ్గః.'-భోజ ప్రబంధము.

(3) 'పతతి రవి రపూర్వ వారిరాశౌ ! స్ఫురతి పథికస్య సుధాత్మభూః స్థితాత్మః!
ప్రసరతి చరమాం తమఃప్రరోహః ! ప్రతిపద మస్య సుధా మనోవిమోహః' సు. ర.

ఈ చెప్పినది పురుషునికి మాత్రమే వివక్షిత మనఁగూడదు; కనుండు:-

(౪) 'గాఢం ప్రౌఢాంగనాభిః సురత రతి మనస్సమ్మదోత్సారితాత్మం !
ముగ్ధాభి స్త్రిస్తనేత్రం రతిసమరభయం చిన్తయన్తీభి రేవ !
సాన్ద్రానా మగ్ననాభిః సలిల నయనం శూన్యచిత్తాభి రుచ్చైః !
కష్టం దృష్టోఽస్తశైలే ధృత మథజ దయుం మణ్డల శ్చణ్డభానోః. సు.ర.భా.476(72).

(౫) 'అరుణకిరణ కేసరాభిరామం ! వరుణదిగన్తరలమ్బి భానుబిమ్బం !
త్రిభువన విజిగీషుణాస్త్రి మభాత్ ! ప్రసవ ఇవ ప్రసవేషుణా ప్రయుక్తమ్,'

(౬) 'ఆపూరితే సంధ్యారాగేణ జీవలోకే, కుసుమాయుధానల దహ్యమాన హృదయసహస్ర

ధూమ ఇవ జనితమానినీనయనవారిణి విస్తార్యమాణే తరుణతరతమాలత్విషి తిమిరే.' కాదం.

(2) 'శోకకామినీ కరుణకూజితే శిరసిజన మనోదుఃఖే వికచ దళారవిన్ద మరన్ద నిష్యన్ద సుగన్ధ గన్ధవహానన్దిత దశదిశి ప్రదోషసమయే, శిశిరసిత కుసుమామోద ముకుళిత మానినీ మానగ్రహోన్మోచనహస్తే కుసుమాయుధే.' కాదంబరి.

రసతరంగిణియందలి నిబంధనము

శృఙ్గారస్య ఉద్దీపనవిభావాః। తత్రభరతః -
'ఋతుమాలాలంకారైః। ప్రియజన గాన్ధర్వకావ్య సేవాభిః
ఉపవన గమనవిహారైః। శృంగారరసస్సముద్భవతి.'
చన్ద్రి చన్దనాదయ ఉద్దీపనీయాః। యథా—
'సంధ్యాశోణామ్బరజవనికా, కామినోః ప్రేమనాట్యం,
నాన్దీ భ్రామ్యద్భ్రమరవిరుతం, మారిషః కోఽపి కాలః,
తారాః పుష్పాఞ్జలిమివ కిరన్, సూచయన్ ప్రస్తుతేతోః
వృత్త్యారమ్భం, ప్రవిశతి సుధాదీధితిః సూత్రధారః.'

అపూర్వశబ్దములు.

ఝూటము.

'ఈకవికి ఝూటశబ్దమును (సమూహవాచిని) తఱచుగా వాడుక చేయు నలవాటు గలిగియున్నది.' అని యుపోద్ఘాతము.(తఱచుగా - వాడుక చేయుట = అలవాటు); ఈ ప్రతిపాదనయొక్క యుద్దేశ్యమేమో వాచ్యభంగిగా నిరూపితము గాదు. ఆముక్తములో ఈశబ్దము రెండుమాఱులే వచ్చినది. ఇంతగ్రంథములో ఇంతమాత్రమే తఱచా? అలవాటా? ఇది యితరకవు లెవ్వరును ప్రయోగింపని వనికూర్చిన పదసూచికలో సూచితము. చూ. అనుబంధము ఇతరులు కావించిన దీనిప్రయోగములను పట్టికావిమర్శలో నుదాహరించి ప్రదర్శించియున్నాఁడ. అందులో ఇంతుంబోలె నిరంకుశోపాఖ్యానకవి దీనిని రెండుమాఱులు ప్రయోగించినాఁడు. నిరంకుశమందు 421 పద్యములు; ఇందురమారమి 872. అందువలన తఱచును అలవాటును గుణితముచే ఇక్కవికన్న ఇనుమడుంగులు గలవాఁడనంగలరు. కాన నిరంకుశకవియే ఆముక్తమును గావించి యుండునా?

తృణతా.

మఱియు ఆముక్తమాల్యద మనుకొని ప్రణతిము కాదను నుపోద్ఘాత విస్తరములో- ''తృణతా=ధనువు - మొదలగు సంస్కృతపదములుగాని 'తేండి' (శయనించి) మొదలగు వాంధ్రపదములు గాని మాఱుఖులవి. ఏనిఘంటువులయందును గానరానివి. సామాన్యముగాఁ గవు లెవ్వరును వాఙ్మయమునం దిట్టిపదముల నుపయోగింపరు.'' అని ప్రతిపాదితము.

ఇందు తృణతాశబ్దమును (చూ. అనుబంధము), గోవిందామాత్యాణి రుక్మిణీపాణిగ్రహణమందు రెండుమాఱులును అభినవకాళిదాసుఁడు చంపూభాగవతమున రెండుమార్లును, ప్రయోగించియున్నారని పట్టికావిమర్శమందే తెలిపియున్నాఁడను. అయినను, ఇంకనుం, ప్రయోగాదికమును చూపెదను.—

'కావ్యేషు మాఘః కవికాళిదాసః' అని యాభాణకము.

'దణ్డినః పదలాలిత్యం భారవే రర్థగౌరవమ్,।

ఉపమా కాళిదాసస్య మాఘ స్యైతే త్రయో గుణాః.' అని యొజ్జలయాదేశము.

“జైనమేరుతుఙ్గాచార్యేణ 1361 సంవత్సరే ప్రణీతే ప్రబన్ధచిన్తామణౌ చ - 'అథ శ్రీ భోజరాజః శ్రీమాఘపణ్డిత విద్వత్తాం ధన్యవత్తాం చ సతత మాకర్ణ్య, తద్దర్శనోత్సుకతయా రాజాదేశైః సతతం ప్రేష్యమాణైః శ్రీమాలనగరాద్ధిమసమయే సమానీయ, సబహుమానం భోజనాదిభిః సత్కృత్య, తదను, రాజోచితాన్వినోదాన్ దర్శయన్ రాత్రావారాత్రికావసరానన్తరం సన్నిహితే స్వసన్నిధే పల్యఙ్కే మాఘపణ్డితం నియోజ్య, తస్మై స్వశీతరక్షాముపనీయ ప్రియాలాపాం శ్చిరం కుర్వాణః సుఖం సుష్వాప.' అని శ్రీజయపుర మహారాజాశ్రిత శ్రీపణ్డిత వ్రజలాలపుత్త్రి శ్రీపణ్డిత దుర్గాదాసుని మాఘకావ్యోపోద్ఘాతములో, సిద్ధర్షి చరితము.

'తస్య శ్రీభోజభూపాలబాలమిత్రం కవీశ్వరః।
శ్రీమాఘో నన్దనో బ్రాహ్మీస్యన్దనః శీలచన్దనః।
ఇదంయుగీనలోకస్య సారసారస్వతాయితమ్।
శిశుపాలవధంకావ్యం ప్రశస్తిర్యస్యశాశ్వతీ.
శ్రీమాఘోస్తాఘధీః శ్లాఘ్యః ప్రశస్యః కస్య నాభవత్।
చిత్తజాడ్యహరాయస్యకావ్యగఙ్గోర్మివిప్రుషః.'

ఇట్లు విద్వన్నుతింబడసిన శ్రీభోజరాజపూజిత సిద్ధర్షిచరితప్రశంసిత శ్రీమాఘకవి ప్రయోగముం బ్రదర్శించెద.—

'స్వగుణై రాఫలప్రాప్తే రాకృష్య గణికా ఇవ।
కాముకానివ నాళీకాం స్త్రిణతాః స[illegible]ముచన్.' 19(61).

ఇందులకు-“త్రి[illegible] స్థానేషు మధ్యేషు నతాః త్రిణతాః శార్ఙ్గాణి। 'పూర్వపదాత్సంజ్ఞాయా' మితి ణత్వమ్”అని మల్లినాథటీక.-ఇందుపై జయపురరాజకీయ సంస్కృతకళాశాలాధ్యాపక శ్రీ శివదత్త పండితుని జ్ఞాపిక—“(1299) శకలిఖిత పుస్తకే తు 'తృణతాః' ఇతిపాఠ ఉపలభ్యతే। అత ఏవ 'తృణతా తృణత్వే కార్ముకేపి చ' ఇతి హైమకోశ వ్యాఖ్యావసరే కార్ముకార్థే ఇమమేవశ్లోక ముదాహృత్య వల్లభ స్తు 'ధనుషి త్రిషు నతాః త్రిణతాః' ఇత్యాహ।తత్ర గణికాపక్షే ణత్వంచిన్త్య' మిత్య నేకార్థకైరవాకర కౌముదీ.”అని. ఇందువలన నుదాహృత మాఘశ్లోకమందు 'తృణతా' అనురూపంబునుం గలదనియు, అది హేమవల్లభాదులచే నుపాత్త మనియు, విశదమగుచున్నది. సిద్ధర్షి చరితమువలన నిపుణము సారస్వతసార మనియు, చిత్తజాడ్యహార మనియు, తెల్లమాయెం గదా. ఇప్పటికేనియు దీనికి నిఘంటువు లేదను వాదు శమింపదా? హేమముకన్నను నిఘంటువా? అయినను, ఇంకనుం బ్రదర్శించెద:— [ఇట త్రిణతా శబ్దమునకు 'తృణతా' రూపము పృషోదరాదిత్వసిద్ధ మనియు, గణికావిశేషణముగా త్రిణతాశబ్దమును మాఘకవి యుద్దేశింపలేదనియు, నెన్నందగును.]

'త్రిణతా-a bow' ఆప్టే నిఘంటువు. 'తృణతా తు ధను ష్యపి' నానార్థరత్నమాల.- దానికి పుదూరి వాంగారిపాపన శాస్త్రులవారి టీక:—'తృణతా సీ. ఇది ధనుస్సునకును-అపిశబ్దమువలన తృణభావమునకును పేరు.' అని.
ఇంకనుం జూడుండు.—'తృణతా తు ధనుష్య పీతి భాస్కరః.' 'ధర్మో నాతృణతా స్త్రియామ్।

అస్త్రీయాం చాపధనుషా వితి వైజయన్తీ' అని బాలభాగవత టీక, 'స్థావరం తు ధనుర్గుణీ। శరావాపోధనుః స్త్రీస్యాత్। తృణతా త్రిణతాపిచ.' అని త్రికాండశేషము.

ఈతీరున మాఘపండిత - హేమచంద్ర - వల్లభ - మల్లినాథ-భాస్కర - వైజయన్తి - ఇరుగపదండనాథ-అప్పయ్యాది మహావిద్వాంసుల సమాదరమునకు భాజనమైన (ఇందు 5రు నిఘంటుకారులు)యీనుడువును జనసామాన్య పండితమ్మన్యానులభ మయిన యమృతంపుమడువును ఆముక్తమాల్యదాతీర్థకముగా ఆంధ్రలోకమున కెల్ల గంగాఝరమును భగీరథుండునుంబోలె, తెచ్చి యిచ్చిన మహాపురుషుని వేనోళ్లం బొగడంగానక, ఈమడువును ఇవ్వరంగొట్ట సమకట్టుటయు, దీనిని సుప్రాపము చేసినవానిని కాకవి యని కేకరించుటయు, పైగా, కాకవి కావున నే కృష్ణరాయండే యని బూకరించుటయు, సమంజసము గాదు.

ఆముక్తమాల్యదాకవి శార్ఙ్గధనుర్లతను త్రివక్రకుంబోల్చి 'పిడికెండు' పద్యమును [1(8)] రచించునప్పుడు 'త్రిషు స్థానేషు నతాః త్రిణతాః శార్ఙ్గాణి' అను మాఘటీకా వాక్యమును స్మరించుచుండె ననియుం దోంచుచున్నది. ఆపద్యము.—

> 'పిడికెండు కౌనుఁగొప్పుఁగని ప్రేమఁ ద్రివక్ర సమాంగిఁ జేసి తేఁ,
> బిడికెండుకౌనుఁ గొప్పుఁ బయిఁబెచ్చు గుణంబును గంటి నంచు, నే
> ర్పడర నిజత్రివక్రతయుఁ బాపఁగ ముక్కడు నా సుమాలిపై
> జడిగొన నమ్ము లీను హరిశార్ఙ్గధనుర్లత గాచుఁ గావుతన్.' 1(8)

[ఇందు-'నేర్పడర' ఇత్యాదిపాదములో యతికి కపాలమోక్షము అయినది. 'చొప్పడఁగ' అని పఠించిన ఇంకను భూమిసూఁదనే యుండును.]

'తెండి'-ఇదియు మాఱుమూలపదమఁట? ఇది ముక్కుతిమ్మనార్యుని ముద్దుఁబలుకు. 'నందిని యట్లు వాకుచుం బచ్చికఁ దండి యున్నయది భామిని వేలుపుటావు చూచితే.' పారి. 4(85). దీనికిని ఆక్షేపమా! ఇఁక నాంధ్రభారతికి గతి యేమి? ఈబ్రాహ్మణ్యముం జూడుఁడు.—

'తెండుట. V. N. To Sleep నిద్రించెను. D.'

ఇట D అనఁగా మామిడివెంకయ్యప్రణీత మయిన యాంధ్రదీపిక. ఆయన ఈధాతువును కవనమందు చూచియే నిఘంటువున నెక్కించె నన ఈ బ్రౌను వాక్యములం గనుఁడు.—

The Dipica gives a mere selection of the words used *in* Telugu Poetry. The ordinary Telugu of common life is but slightly noticed.

'తెండు. దే. అ. క్రి. పరుండు శయనించు (చూ. తేఁడు)' శ. ర.

'తేఁడు. దే. అ. క్రి. తెండు, శయనించు 'గీ. అతివ పూర్ణేందుభీతిఁ దనశ్మశాలఁ దేఁడి... (కొన్నిప్రతులందు 'తెండి' అని పాఠమున్నది.) అను. 5, అనియు, శ. ర. ఆంధ్రవాఙ్మయమును సేవించుచు, ఈ తృణతా తెండులను ఎగిరించుట, పెరుఁగన్నముం దినుచు అందలి నూఁగడను గుడ్డపేలిక యని పారవైచుటగా నున్నది.

ఉపోద్ఘాతములో ఆముక్తమాల్యదకు కృష్ణరాయప్రణీతత్వము స్థాపించుటకై అందులోనివి 'కన్కసరు' 'హిండిత' శబ్దములు కన్నడపదము లని వ్రాయఁబడియున్నది. వానిలో-'కిసరు' నకు ఇందలి పద్యము:—

> క. ఒసఁగి రగస్త్యార్ఘ్యులకుం। గొసరి జనుల్ వార్ధినీరు గ్రోలితి, వీనిం
> బసికై మా కిమ్మని క। న్నిసరు దుడుగంగ వనప్పగించెదు మాఱ్కొన్.' 4(175)

'కిసరు' మదరాసులోనే కలదు. శ. ర. మునందును గలదు. బ్రాహ్మణోత్తములయిన మదరాసు వెలనాటివారియిండ్లలో వాడుకలో ప్రసిద్ధము. మఱి 'కన్ను' తెనుఁగే. ఈరెంటి సమాహారము ఆంధ్రజాతీయము గాదనియు కన్నడజాతీయముమాత్రమే అనియు వాదింతురేని అది యిట 'కణ్కిసరు' అని ణత్వవంతముగా నుండక 'కన్కిసరు' అని నత్వయుక్తముగా ఆంధ్రీకృతమై యున్నది. పెద్దనగారును దానిం బ్రయోగింప నర్హులే. వారు నందవరపురవంశోత్త్యనులు. నందవంకులు బళ్లారిజిల్లావారు. బళ్లారిజిల్లాలో కన్నడభాషయు ప్రచురమే; అన్యదేశ్యములను పెద్దనగారు ముట్టనివారు గారు.—'సకుటుంబముగ వీఁగి చరమశైలముఁజేరు। తుహినాంశు దుముదారు దొరయనంగ'-మను. 3,54) ఇట 'దుముదారు' అనునది హిందుస్తానీపదము. [దుముదారుదొర యనఁగా సేనానాయకుఁడు అను మనుటీక సరిగాదు. 'సేనాపృష్ఠనాయకుఁడు' అనవలయును. చూ. బ్రౌను. మిశ్ర.నిఘం. 'దుముదారు...The rear of an army.']; దానిం బ్రయోగించినవారు స్వదేశీయము నేల ప్రయోగింపరు? ఇందుకై 'కనరా'వాఁడే రావలయునా? అతఁడును తరములబడి కనరా వదలినవాఁడే. ఈయుపోద్ఘాతములో 'పెద్దనాదులవలన రచింపఁబడలేదని నిశ్చయముగా జెప్పవచ్చును' అని యొకవాక్యముకలదు. 'వలన' ప్రత్యయము కర్తను జెప్పుట 'By' ఆంగ్లేయభాషా మర్యాదగాని ఆంధ్రభాషాసమ్మతము గాదు. ఎట్లన-By=వలన; 'బీవై బై వలన,' 'బీవై బై వలన' అని ఎద్యుకేటెడ్డు ఆంధ్రుల బాల్యపాఠము. ఈప్రయోగముచే ఆయుపోద్ఘాతము రచించినవారు ఆంగ్లేయులే యని సిద్ధాంత మగునా? 'కన్కిసరుచేత' ఏతత్కావ్యకర్తలువరాయఁడే అగునేని 'పరింబాఁ'చే పింగళిసూరనయు చేమకూర వేంకటపతియు అగుదు రని సిద్ధాంతముకాదా; వాస్తవమున మదరాసు 'కిసరు' 'కన్కిసరు' గానేయుండి-సేతు వన రామసేతువు, ఆలయ మన శివాలయము ఇత్యాది వ్యవహారములందుంబోలె 'కిస' రని సంక్షిప్తమైనదా. దృష్టితాఁకుడు అర్థము. దృష్టితాఁకుడు సంక్షేపముగా దృష్టి యనఁబడును గదా. ఇందు తాఁకుడు పోయి దృష్టి నిలిచినది. అందు కన్ను పోయి కిసరు నిలిచినది. ఇందువలన కన్కిసరు రాయనిదే యన వలనుపడదు.

హిండితము.—ఇది పిండిత మనుటకు కన్నడమా? చూ.

> 'ఖండితపూగీనాగర । ఖండంబులు ఘనశశాంక ఖండంబులచే
> హిండితములు గావించి యు। ఖండస్థిగభక్తి నొసఁగి కడలి చెలులతోన్.'

ఈ పద్యములో ఆ యొసఁగిన వస్తు వేదో లేదు. వ్రాఁతలలో మాఱిపోయినది గావలయు. 'హిండిత మగు తాంబూల మఖండ' అని పఠించినయెడల తాంబూలము దొరకును.—[టీక. హిండితములు గావించి=కలియఁగూర్చి.] ఇందే 'పరిహిండితంబులు' 'హిండన' యుం 'గండ పెండెరంబునం బొడము నఖండ ప్రభామండలంబునం బరిహిండితంబులై మత్తిపండుల వడువు గల మడమల బెడంగుపడి భావినిజ కమఠావతార సూచకంబులుంబోలెఁ గొదమ తాఁబేళ్లు మేళ్లవగు మీఁగాళ్లతో'- 6(98). [టీక. -మండలంబునన్=సమూహముచేత-పరిహిండితంబులై.]

'కొండయుఁబోలె భక్తివల ♦ గొంచు నె వాఁడు నిజద్రుమభ్రమీ
హిండన వ్రాలుపాకలపు ♦ టేనుఁగుపోలె నొసత్తపంక్తులం
దుండగ రోదల్మహీగిరులు ♦ హోరనఁ బ్రస్తుతిప్రాలి' - 6(47)
[టీక.—భ్రమీ=చుట్టు తిరుగుటయొక్క - హిండనన్=ఆవృత్తిచేత.]

మను 4(60) లో 'వెండికొండలఁ జండకరకరహిండనంబునం బాండుప్రభలు నిండ.'
[కర=కిరణములయొక్క - హిండనంబునన్=వ్యాపనచేత.]

శ్రీకాలహస్తిమాహాత్మ్యములో [దాసిని రాజు తల గొరిగింపఁగా దానిశిరమునం దద్వత్సలుఁడు పరమశివుఁడు హస్తమును నుంచఁగా,] 1(52, 53)

ఉ. 'ఎత్తిన నింద్రజాలగురుఁ ♦ డెత్తినబుర్ర మనంగ, మన్మథుం
డెత్తిన పువ్వువింటిపుడు ♦ మెత్తినతొమ్మిద సిందు నారిశాఁ
జిత్తజరాజ్యలక్ష్మి కభి ♦ షేకము సేసు శివుండు కాంతకై
యొత్తిన నీలకుంభరుచి ♦ హిండనమో యన నద్భుతంబుగాన్;

క. 'నెఱి మిగులఁ గలిగి నలువై తఱుచై మిసిప్రతాప దావాగ్నిశిఖన్
మెఱయు నవధూమ మనఁగాఁ దఱితఱుఁ [illegible] చకురము వచ్చె దేవునికరుణన్.'

మఱియు దశావతారచరిత్ర - నృసింహావతార కథలో—
'చండవాతోత్థ ఘూర్ణ [illegible] హిండనముకఁ గొండమెండునఁ గదలక యుండు దైత్య
మండలేంద్రుని దేహ నిష్కంపమునగను! గండకంపోతి నొరయు వేదండగణము.' పు. 29

పారిజాతాపహరణచంపువు (3 పు.) - 1(13-14) లకు నడిమిగద్యలో—'ప్రచణ్డ భుజదణ్డ చణ్డిమాకర్ణకుణ్డలిత కోదణ్డ హిణ్డమాన కాణ్డ ప్రకాణ్డ తాణ్డవాడమ్బరోద్దణ్డ ఖణ్డితారిముణ్డ పుణ్డరీక ఖ(?)ణ్డ మణ్డితాఖణ్డ భూమణ్డల'—

'పక్షిణ ఆహిణ్డన్తి' స్వప్నవాసవదత్తే; 'ఇతస్తతో ప్యాహిణ్డన్తే;' మృచ్ఛకటీ.

'అశ్మత్యంత కఠోర [illegible] ♦ హాలాహలజ్వాలధూ
మ్రశ్మశ్రుల్ భుజదండ హిండితకుఠా ♦ [illegible] ప్రాసఖడ్గార్గళా
దశ్మ్రవ్రాలముసోడ వెల్వడి [illegible] ♦ ద్రుద్రూ [illegible] గాత్రంబునన్
గూశ్మాండాగ్నివతని (?) పిశాచగణ ♦ క్షోభూతబేతాళముల్.' వరాహ. 5(106)

'మండువా బెడంపకోట ♦ మాహు [illegible]
మండలేశ్వరసమ్మతాస ♦ మాన [illegible] మహోదయా
ఖండనాజితప్రచండ ♦ పటహ (వాద్య?) నిస్వనాద్భుత
హిండితాష్టదిక్కుడుంగ ♦ యాశ్వరాత్మసంభవా'—,,—1(154)

'సంధ్యాతాండవ చండఖండపరశు ♦ స్ఫారజటామండలీ
సంధ్యాహిండిత గాంగభంగజమిథ ♦ స్సంఘర్ష పుంజీకృతా
వంధ్యారావ ఘుమంఘుమోన్నతిసమృ ♦ ద్వ్యాచాలపుణ్యాకృతి
వింధ్యక్ష్మాధరకూటకోటివిచల ♦ ద్విద్వేషి [illegible] ష్టత్తతీ.' కువలయాశ్వ. 4(217)

'తాండవఖేలనోద్దండ ఖండపరశు జటామండలాగ్ర హిండమాన పుండరీక' 1(17)

'హిండనము. సం. వి. అ. న 1. వ్యాప్తి., 2. భ్రమణము; 3. సురతము,' శ. ర.

'హిండితము. సం. విశే. (అ. ఆ. అ.) వ్యాపించినది.' శ. ర.

''హిండనము N. S. spread, extension, wandering; వ్యాప్తి, ప్రసరించడము, తిరగడము, (హిండనము, రతే, తేఖనే, ? Sc) Swa. 4(60) 'వెండికొండ' [ఇత్యాది పూర్వోదాహృతము.] Calahasti mahatyam 1(60) 'నిలఁబడి హిండనము యాన.' A. 6(58) 'నిజభ్రమణాభ్రవిభా హిండన వ్రాలు పాకలపుచేనుఁగుజోలె''-బ్రౌన్యము.

'హిండితము-వ్యాపించే, తిరిగే, [ఇట్లర్థము వ్రాసి బ్రౌనుదొరగారు అందులకు తారాశశాంకవిజయము 1(85), వసుచరిత్ర 6(60), అను సంఖ్యలతో 'హిండితకీర్తియుక్తి', 'మదాకరవంశ హిండితంబు' అను ప్రయోగములను, ఆముక్తమాల్యదలోని 'ఖండిత పూగినాగ' ఇత్యాది పద్యమును - ఉదాహరించినారు.] [హిండితములు గావించి=సమ్మేళనము చేసి అని వారిటీక.]

ఆతారాశశాంక పద్యము:—

> 'పండిత మండలీహృదయ ♦ పంకజభానుఁడు బుచ్చికృష్ణరా
> ర్యుండును సీనమాంరమణి ♦ యుఁగా దొలి నోమిన నోముపంటగా
> హిండితకీర్తియుక్తి జని ♦ యించెను వేంకటరాఘవాధ్వరీం
> ద్రుండు విభాసమానగుణ రుంద్రుఁడు వంగలవంశ చంద్రుఁడై.'

ఆ వసుచరిత్ర ప్రయోగపాదము:—

> 'మాణిక్యసారంబు లాణిముత్తెములు ను। మ్మివి మదాకరవంశ హిండితములు' 6(37)

[దీనిటీక.—'ఇవి - మదాకర=నాకు ఆకరమైన-వంశ=కులమందు- హిండితములు నమ్మి=ప్రవర్ధమానములైనవినుమాయనియర్థము. మత్=నాసంబంధమయిన- ఆకర=గనులయందును - వంశ=వెదుళ్లయందును - ప్రవర్ధమానములైనవి - అని యర్థాంతరము.']

'మన్మథః—సఖే సాంఖ్యాయన, విప్రలబ్ధోఽసి పూర్వేద్యు రగ్రభోజనసముత్సాహేన యన్నదృష్టం దర్శనీయం త్వయా.

'విదూషకః—వయస్య, త్వయా తావత్ అమధ్యాహ్నం వృక్షంవృక్షం ప్రతి హిణ్డమానేన బుభుక్షా పరిశుష్కముఖేన సమాసాదితం సాహిత్యమ్.' రతిమన్మథ.

> 'నారదః - దమ్పత్యో రనురక్తయోరపి మిషాత్ సంపాదితం వాకలిం
> ప్రక్రాన్తం సహసా నియుద్ధ మథవా భక్త్యోత్సుకై ర్బాలకైః
> ఉక్ష్ణోవాథ చతుష్పథేఽభిపతతో ర్యోద్ధుం విషాణోద్ధురా
> పశ్య న్నిర్వృత మానసోఽనవరతం హిణ్డే మహీమణ్డలే' —,,—ఛా.

'విదూషకః...వనరాజి ష్వాహిణ్డ్యతే అటవీతోటవీమ్,' శాకుంతల.

'విదూషకః - ఛా, త్వం తావత్ అటవీతః అటవీ మాహిణ్డమానః నరనాసికామివ లో లుపస్య కస్యచి జీర్ణర్క్షస్య ముఖే నిపతిష్యసి'—

> 'అవికుణ్ఠవేగ హయమణ్డలికా। ఖురషణ్డ తాణ్డవిత ముణ్డశతమ్
> భుజదణ్డ కుణ్డలిత చణ్డధను। శ్చ్యుతకాణ్డ హిణ్డిత వితుణ్డగజమ్.' అచ్యుతరాయా 4(17)

[టీక.-కాణ్డై ర్బాణై ర్హిణ్డితాః దూరతో నిరస్తాః వితుణ్డాః ఛిన్నశరాః గజాః యస్మిం స్తత్.] 'త్వం తావన్మత్తోఽత్ర హిణ్డసే.' ప్రతిజ్ఞాయౌగన్ధరాయణ.

హాలాయుధుని కవిరహస్యమునందు—

> 'హిణ్డన్తే యే మృషా రాత్రౌ పరస్త్రీషు హిండన్తి యే।
> హీండతే నీతిసంపన్నో బాన్ధవా నపి తానసౌ.'
>
> 'అయి కురఙ్గి, కిమకాణ్డ మితస్తతో హిణ్డసే.' యశస్తిలక. 2(350 పు)

ఈప్రమాణములవలన 'హిండితములు' అనుపదమునకు 'వ్యాప్తములు' అని యర్థమనియు 'శశాంక ఖండంబులచే హిండితములు గావించి' అనఁగా 'కర్పూరపుఁ దునియలతో మిశ్రము చేసి' అని భావమనియు, స్పష్టము. 'ఖండంబులచే' అను పదమందలి 'చేత' ప్రత్యయము కర్తను తెలుపుచున్నది. 'హిండితము'లో కర్మార్థమందు క్తప్రత్యయము. 'హిండితము'నకు అవ్యుత్పన్న కర్ణాటకపదముగా 'కూర్చుట' యర్థమేని 'ఖండంబుల ఘనశశాంకఖండంబులనుఁ' అని ద్వితీయయేని 'ఘనశశాంక ఖండంబులతో' అని తృతీయయేని ప్రయుక్తమై యుండును. మఱియు, అన్యదేశ్యమునకు 'పరి' యని యుపసర్గసయుతము వచ్చునా? 'పరిహిండితంబులు,' 'జటామండలీ సంధ్యాహిండిత గాంగభంగ' అను స్థలములందు సంస్కృతసమాసములో ఇది యెట్లు చేరును. అకర్ణాటకసాధారణంబును అగు నీపదముచే కర్ణాటకకవిని సాధించుట శక్యము గాదు.

శైలి.

శైలి.—ఉపోద్ఘాతమందు అముక్తశైలీపరీక్షలో 'ఈగ్రంథకర్తవలె నింతగాఢ సంస్కృతము నెవ్వరును వాడుక చేయలేదు.' అనియున్నది. అందులకు తార్కాణముగా (1) 'స్యందనస్థిత', (2) 'అద్ధావాగ్విబుధ,' 3 'చనికాంచెఁ' - అనుపద్యము లుదాహృతములు.—ఇట గాఢత్వమనఁ ప్రాఘుష్టసంస్కృత సమాసభూయిష్ఠత్వమా, దీర్ఘసమాసము లున్నను లేకపోయినను పద్యమందు సంస్కృతశబ్దములే మిక్కుటముగా మిక్కిలియుండుటయా? మఱి 'స్యందనస్థిత' వంటిది పాదమెల్ల నొక్కటే దీర్ఘసమాస మయినసీసము ఇదిగాక యీగ్రంథమందు 'ఘనటత్పరిరాబ్ధి' 1(3) అను గరుడస్తుతిపద్యమందు కలదు. ఇంచుమించుగా పద్యమెల్లను ఒకటే దీర్ఘసంస్కృత సమాసముగా నున్నట్టిది, 'చనికాంచెఁ' వంటిది, ఇందు 'కాంచె నైష్ణవుఁడు' 6(15) అనునది ఇంకొక్కటియే కలదు. ఈరెండవది మాలదాసరి చతిసిన 'వటవృక్ష' వర్ణనము. 'అద్ధావాగ్విబుధ'ము వంటి సంస్కృత బహువ్రీహులు గుప్పించినట్టిది యీగ్రంథమున మఱిలేదు.' ఒక్కొక్క పెద్దపాదము రెండేసి సంస్కృతసమాసములుగా విఱిగినట్టి సీసములు ఇందు రెండు మాత్రమే కలవు. అవి 'మరుదూథమలయాహి' 5(118) అను తుమ్మెదలవర్ణనము, 'తామ్రవశార క్త 5(110) అను చిగురాకువర్ణనయు; ఇతరకవులు పెక్కురు ఇట్టిగాఢబంధంబులం గవనము చేసియున్నారు. 'అద్ధావాగ్విబుధ'మువలె ఏకవర్ణ్యమునకే విశేషణములగు పెక్కు సంస్కృతబహువ్రీహులుగలది మనువులో 'శకితైణాహుతి' 4(38) అని మృగయాలుబ్ధ మృగచేష్టాగరిష్ఠ వన వర్ణనపరము కలదు. ఇట్టివి పెక్కులు పెక్కుగ్రంథములందు సులభములు, మఱియెవ్వరు నిట్లు ప్రయోగింపలేదనుట నామనస్సునకు నచ్చకున్నది.—ఇంక కొన్ని యుదాహరణములను వాఙ్మయములోఁ జూపెద:—

'స్యందనస్థిత' వంటివి - పారిజాత 1(95), 2(85); జైమిని భా. 2(4); ఉ. హ. 4(28), 5(138), 6(266, 269); కాశీ. 1(126); హరవిలాస - పీఠిక 5, 6; 2(30), 4(74), 5(88); శా.

మల్ల. విప్ర. 4(99); నిరంకు' 1(62), 3(5), 4(5,7,105); భీమేశ్వర, 3(17); హంసవింశతి 5 ఆ. 117 పు. 12 పం. 'చండవేగోద్ధూత.'

మను. 1(25) 'అది యట్లుండె' నిత్యాదివచనము. పారిజాత 1(95) 'కృతకాద్రి కందరా' 2(85), 'శీర్ణపర్ణద్రు'; జైమినిభా. 2(4) 'స్ఫాటికమణి;' ఉ. హరి. 4(23) 'ప్రబల దంష్ట్రా', 6(266) 'మానినీమంజుల,' 6(269) 'గళితమహోదక'; హర వి. పీఠిక 5 'కఠినకుండా దండ,' 6 'వేదండవదన,' 3(30) 'గంగాప్రవాహ', 4(74) 'సంతానకద్రు', 5(38) 'నిర్ఝరాంభఃకేళి'; మల్ల. విప్ర. 4(99). నిరంకు. 1(65) 'అభ్యాగతారాధ', 3(5) 'కఠినకాకోలూకికా,' 4(5) 'సరసీరుహ నవీన', 4(7) 'వదనజిత్వర,' 4(105) 'చామరగ్రాహిణీ'; కాశీ. 2(126) 'దోర్దండ ఘట్టన'; భీమేశ్వర. 3(17). హంసవిం 5 ఆ. 'చండవేగోద్ధూత' నారా. పంచ. 1(35) 'త్రిభువనాలంకార', 1(48) 'వేదశాస్త్ర'; ఋతుచక్రము—ప్రథమాంకము. 146. వసుచ. 'లలనాజనాపాంగ', 180. వైజయంతీ. 'అంగజకృతాంతరంగ' 'ఘుసృణరజ' 204. ముకుంద. 'సురసాల,' 243. రుక్మిణి. 'ఘనసార,' 280 యాదవ. 'ఘనసాల,' 289. తారాశ. 'ఏలాలతాజాల'; 293. మిత్రవిందా. 'కుంజఘనాఘన';

వరాహ. 11(30); కళాపూ. 8(208) 'అమృతపూరోచ్ఛ్రితము;' దశావ. 43. పు. (1) క్రింది పంక్తి), 84(3. పం. క్రిం.), 207 (క్రిం.), 254 (4 పం. క్రిం.). 'గంధర్వభామినీ', 'వజ్రమౌక్తికరతి'; 'హరిబింబరమా'; 'మదకల ప్రతిమల్ల'.

అర్థావాగ్విబుధంబువంటివి.—మను. 4(38) 'చకితైణాహుతి'; ఉ.హ. 6(116) 'ఈశ్వరాయు,' 6(115) 'కృష్ణాజ్ఞాయు;' దశావ. 41-పు. (6 పం. క్రిం,) 'శ్రీమీనాకృతయేనమో.' భాస్క. రామా. కిష్కింధా. వర్షా. 381 'స్ఫుటశక్రాయుధ', 382 'యమునదంగగము';

'చనికాంచెగా' వంటివి—కళాపూ. 7(177) 'హేమంతంబంత' భార. విరా. 3(78) 'మాలిస్రక్'. నన్నెకుమార. 8(3) 'హారవాణి,' 8(46) 'ఘనభృన్నాథోత్తమాంగ,' 11(662) హరఫాలాంబక; ఋతుచక్రము, ప్రథమాంకము 170 చంద్రభాను. 'అంతిమగంత'; 162 చారు. 'తనరె వసంత' ఉ.హ. 2(27); 'గాండీవారావ'; క.క.గ. 6(107) 'కనిరంతర్మగ్న', 16(218) 'ప్రస్తుత్య'; నిరంకు. 1(44) 'మాణిక్య'; తారాశ. 5(80) 'కనిరీతు'; చంద్రికా. 1(167), 3(68) 'అలసతిగాంచెఁజెంత,' 'కలఁడత్యుత్కట.' హం.విం. 5 ఆ. 'వరుణాశాగత', నృసింహ. 2(39) 'శ్రీస్తనకుంకుమ', 3(3) కనిరుగ్రగ్రాహ.'

'పాషాణకల్పతను' (అనఁగా కఠినతను) గూర్చి విస్తరము పమ్మట చెప్పెద:—దీనిని భేదించి యర్థముం బడయుటచే మెండయిన బుద్ధికుశలత కలుగును. గ్రంథము ధారణార్హమగును, ధృతము నగును. కఠినతకు ఇమిడికయు, అభిధేయోత్కృష్టత్వంబును, అధికారము చాలమియు, కారణములు. ఉదా. 3 ఆ. (8) 'జగదుద్గతికి' - (12) 'వాదపహృత' - (18) 'ఆకేశధ్వజాఁడంత' - (64) 'ఏనవిద్యవళన' - అనువానియందు (8) లో అయిదు సూత్రములు శ్రుతిసాంఖ్యాదిదర్శన సిద్ధాంతములు ఖండనములును కలవు. (12) లో సుబాలోపనిషత్తు పరామృష్టము; (18, 64) లలో ఈశోపనిషత్తు పరామృష్టము. ఉక్తసూత్రాదివాఙ్మయము నెఱింగిన వారికి అవి సుబోధములు, హృదయంగమములు, ఆనంద నిష్యందములును; ఎఱుఁగనివారికి దుర్బోధములే. ఎల్లకాలమును 'రారానందకుమారక,' 'ఓయమ్మ నీకుమారుఁడు,' అనియే పలుకు

చుండవలయునా? అధికారికిని క్లేశావహ మయిన నిస్సారకఠినత దోషముగాని, అనధికారికి అధికారము నొసంగున దైన సారభూయిష్ఠతావినిర్ముక్తమయిన యాముక్తమువంటి కఠినగ్రంథము పుణ్యలభ్యము

మఱి పైవాక్యసరణిలో నారికేళపాకముంగూర్చి ఉపోద్ఘాతకారుల యప్రీతి కనఁబడుచున్నది. 'పాకమా నారికేళపాకము' అనువాక్యధాటిలో నారికేళపాక మనుమాట నిందాగర్భముగా నున్నది. నారికేళపాకము నికృష్టమా? నైషధము నారికేళపాకము గాదా? నారికేళపాకము మహాకవిజుష్టము గాదా? నారికేళపాకము మనుచరిత్రలో లేదా? ఈక్రింది మల్లినాథసూరిసూక్తిని పరికింపుఁడు:—

'నారికేళఫలసమ్మితం వచో భారవేః సపది తద్విభజ్యతే
స్వాదయన్తు రసగర్భనిర్భరం సారమస్య రసికా యథేప్సితమ్.'

ఈక్రింది శ్రీనాథ శ్రీహర్షులసూక్తుల నరయుఁడు:—

'పనివడి నారికేళఫలపాకమునం జవియైన భట్టహ
ర్షుని కవితానుగుంభములు సోమరిపోతులు కొంచెఱుంగ్యలా
వని కొనియాడ నేర; రది యట్టిద; తేజవరాలు చెక్కఁగాఁ
టిన వసవల్చు బాలకుఁడు డొందిమునం గలఁగంగ నేర్చునే.'

'మదుక్తిశ్చేదన్తర్మదయతి సుధీభూయ సుధియః
కిమస్యా నామ స్యాదరసపురుషానాదరభరైః
యథా యూనస్తద్వత్పరమరమణీయాపి రమణీ
కుమారాణామన్తఃకరణహరణం నైవ కురుతే.'

శ్రీహర్షుఁడు తననైషధములో ముడు లేల పెట్టెనో తానె చెప్పినాఁడు:—

'గ్రన్థగ్రన్థిరిహ క్వచిత్క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా
ప్రాజ్ఞమ్మన్యమనా హఠేన పఠితీ మాస్మిన్ ఖలః ఖేలతు,
శ్రద్ధారాద్ధగురుశ్లథీకృతదృఢగ్రన్థిః సమాసాదయ
త్వేతత్కావ్యరసోర్మిమజ్జనసుఖవ్యాసజ్జనం సజ్జనః.'

ఈసూక్తి ఆముక్తమునకును జెల్లును. నారికేళపాకమయినచో రసము పంచపాత్రలతోను టంబ్లర్లతోను త్రాగవలసినదిగాఁ గదా యుండును. ఆనీరు జలుబు సేయును, గావునను, కొబ్బరపిప్పిని ఉమియవలసి యుండునుగావునను, ఆముక్తమాల్యదను నేను నారికేళపాక మనను; మఱి యేమందు నన, పరిపక్వ పనస ఫల పాక మందును. తేటగాఁ జెప్పిన పనసపండుపాక మగును, పచనమయిన గింజను కూడ త్యజింప నక్కఱలేదు.

మఱియు రాయవాదములో ఉపోద్ఘాతకారులు కృత్యాదియందు గ్రంథకర్తృవంశమును వర్ణించుట పరమావశ్యక మనియు, ఆచార మనియు, అందువలన కృష్ణప్రభువు దానిని మానలేకయు, ఆత్మశ్లాఘాపరాఙ్ముఖుఁ డయిన ధీరోదాత్తుఁ డగుటంబట్టి, దానిని తానే రచించికొన నిష్టపడకయు, ఆవర్ణనను పెద్దనగారి మనుచరిత్రనుండి కైకొనెననియు, నుపపాదించినారు. ఈవ్రాఁత నామదికి నందకయున్నది. ఎట్లనఁగా—గ్రంథకర్త నిజవంశమును వర్ణించుకొనుట అవశ్యకముకాదు, ఆచారమును గాదు; నన్నయ్య తనతండ్రి తాతలపేర్లు భారతములో చెప్పుకొన్నాఁడా? ఆచార

మయేని దోష మేల యగును ? ఆచారపరాఙ్ముఖుఁడు పాపిగాఁడా ? ఆచార మైనశ్లాఘ యేల దోష మగును? తన పెద్దల గుణాతిశయముం జెప్పుట ఆత్మశ్లాఘయా ? నిజవంశమును వర్ణించుకొన్నవారెవ్వరేని కలరేని వారు ధీరోదాత్తులు కారా? ఆత్మశ్లాఘాదూషితులా? 'చతుర్విధకవితామతల్లికాల్లసాని... పెద్దనార్య' అని, 'శతలేఖినీపద్య సంధానధారేయ ఘటికాశతగ్రంథ కరణధుర్య!...నను బుధ విధేయ శుభమూర్తి నామధేయు' అని, 'తనకుల బ్రాహ్మణు... అవిరళజపహోమతత్పరు ... ఉభయభాషా కావ్యరచనాభిశోభితు! ... సత్ప్రతిభాభియోగ్య...మత్యమరాధిపాచార్య! నన్నపార్య' అని, 'వాణీం కాణభుజీ మజీగణత్' అని, 'మీమాంసే బహు సేవితాసి' అనియు, గ్రంథాదులయందు వ్రాసికొన్నవారందఱు పామరులా ? తిక్కనాదుల గ్రంథములలో నెందయినను తదీయవంశవర్ణనములు కలవా ? ఆత్మశ్లాఘాపరాఙ్ముఖులు శ్రీరాయలవారు తాను ప్రతియాశ్వాసాంతమునను పద్యరూపమున అగ్గలికమీఱ ఆత్మోత్కర్షం జెప్పకొనలేదా? 'ఇభరాడుదయోర్వీధర తత్పిత్ర్యన్వయకృత నవ్యోపాయనోక్షిప,' 'వీరభద్రజన జీవగ్రాహరాహూయమాణ...భుజ.' 'ఉత్కలానీక గుప్త దివిస్పృక్పటుయంత్ర కొండపలి ప్రాగ్వాహాసి,' 'ఆంధ్రోక్తి యథార్థ నామ యవనాస్యకృష్ణ' 'కెంబావి...విఘాత క్రియాస్పద." ఇవి ఆశ్వాసాంతపద్యముల ప్రతీకములు, ఆపద్యములను సమగ్రముగా చదివిన ఆయాత్మశ్లాఘాపటిమ బోధపడును.

ఇట మఱియొక విశేషము — రాయఁడు నిజవంశ వర్ణనమును మనువునుండి తెచ్చికొనెననుట సరిగాదు. తన సభ్యులు ఆవర్ణనం జేసిరని ఆముక్తములో ఆతఁడే తెలిపినాఁడు. వారు పాడిన పాటను మానవ లోకమునకుం దెలియుటకై అనువదించినాఁడు, కాని, నిజవంశవర్ణనకై తాను దెచ్చికొన్నవాఁడు గాఁడు. ఆ సభ్యులు 'కృష్ణరాయనితో దివి కేఁగలేక వసుధ జీవచ్ఛవంబనంగ బ్రదికిన' పెద్దనయును, నందుల సుఘటియు గావున, ఆయనయే అందఱిలోనుం బెద్దన గావునను, ఆయనయే తనకు గ్రుడ్డివానిగా నున్న యాపద్యములను బాడియుండును. సభ్యులు పాడిరని కుయుక్తిగా మిథ్యయే గ్రంథమందు రాయఁడు చెప్పెనని వాదమేని, ఆప్రకారమున, కలయెల్ల మిథ్యయే కవనమును మిథ్యయే కావచ్చును. ఎవరి కృతియేని యగుఁగాక రాయకృతి యని గ్రంథమందు నిబద్ధమై యుండఁ దీనియందు దోషములను పెద్దనయుండనిచ్చునా ? ఇందు దోషములు కలవను ఘోషకు కతముండునా ?

## పాకము.

ఉపోద్ఘాతములో మను విష్ణు చిత్తీయముల కవనముల పరస్పర వైలక్షణ్యముం జెప్పు ప్రకరణమున 'ఆముక్తమాల్యద యన్ననో పాషాణ కల్పము, పాకమా నారికేళ పాకము' అని యొక యుద్ఘాటనము కలదు. ఇందు పాషాణకల్ప మనుట అత్యుక్తి. ప్రౌఢ మనిన సమంజసముగా నుండును. రసికులకు ప్రౌఢి కర మపేక్షణీయము గాని యుద్వేజకము గాదు. ప్రౌఢిచే అద్భుతమయిన యుత్కర్ష కలుగును.—

'యత్ప్రౌఢత్వ ముదారతా చ వచసాం యచ్చార్థతో గౌరవం।
తచ్చేదస్తి తత స్తదేవ గమకం పాణ్డిత్య వైదగ్ధ్యయోః' — (మాలతి).

అనెడు భవభూతిసూక్తిని అనుసంధింపుఁడు. మనుచరిత్రము ప్రౌఢము గాదా ? దాని యర్థ

మును వ్యాఖ్యానముఖమున మహనీయులు జాలూరు అప్పయ్య పంతులవారు ఎల్లరకుం జెల్లను గావింపనియెడ, నదియును పాషాణకల్పము గాదా ? మఱి, రాఘవపాండవీయ వసుచరిత్రముల మాట చెప్పవలయునా?

మఱి రాయవాదాభిని వేశముచే అప్రమాణితము లగు తేదులచే వృత్తాంతములును, అట్టివ యగు వృత్తాంతముల చేత తేదులును ఉట్టిపడునట్టి బెట్టిదపు ఘట్టములో ఈక్రింది వాక్యముగలదు.-

'కృష్ణదేవరాయలు రాచూరు ముట్టడించి ఏడిల్ షాను జయించె ననియు, బీజపురసుల్తాను మీఁదికి దండెత్తిపోయి కలుబర్గ సాగరు మొదలగు పట్టణములను గైకొని తురుష్కులం బాఱఁ దోలె ననియు, మనుచరిత్రలో చెప్పియుండక పోవుటను, పైయుద్ధవృత్తాంతముల నాముక్తమాల్యదలో నుదాహరించి యుండుటను, చూడఁగా, నాయుద్ధములకుఁ బూర్వమునందు మనుచరిత్రయు, తరువాత నాముక్తమాల్యదయు రచితములైనట్లు స్పష్టమగుచున్నది.'

ఇ దేమి స్పష్టమో గాని కృష్ణరాయఁడు కలబరిగిని కొట్టిన వృత్తాంతము మనువులో లే దనుట పొరఁబాటు; 'ప్రళయ ఘనాఘన ఘోష జయానక భాంకృతి భీమచపేట లుఠత్। కలబరగీ కటక కీలితరత్నక కన్నడ రాజ్య రమారమణా' మను. 2(78).

మనువున కలబరగివిజయప్రస్తావము లే దను నీవాదము 'తొల్లి విష్ణుచిత్తీయమును తర్వాత మనువును రచించితివి' - అని అజ్ఞాతకర్తృకమయిన యొకానొక సీసమందు పెద్దనంగూర్చిన స్తుతిగా నిబద్ధమయిన ప్రస్తావమును ఖండించుటకై కల్పింపఁబడినది.

ఈరెండుగ్రంథముల పౌర్వాపర్యమును వంశావళి పద్యములచేతఁ దప్ప ఒండుపాయముచే సాధించుట సులువుగాదు:—ఏలయన, పారిజాత - మను - విష్ణుచిత్తీయ - రాయవాచక - కృష్ణరాజవిజయములను పరిశీలించిన నిది యేర్పడును.—

పారిజాతాపహరణము.

తిమ్మనార్యుఁడు కావించిన కృష్ణరాయ ప్రశంసనుండి లేశములు:—రాయఁడు కావేరీ తోయమును అహితోర్వీనాథరక్తంబున వన్నె గావించెను [1(18) శ్రీరంగేంద్రుని నాభి-కొంచ], వీటికడ వీరరుద్రుని ఓడించి కాచెను। (21) [మునుకొని], 'ఉత్కలభూమీధవ దర్పహరణ' [3(1) శ్రీమహితగేహ-]; 'విదళితకాళింగ సింధుర' (60);

'మరుద్వృతాతటస్థ శత్రుమండలీ గళాంతర। స్ఫురన్నవాస్రగాప గాభిసారకాద్భుతాంబుధీ' (61) 'శ్రీవేంకటగిరివల్లభ...కవితాప్రావీణ్యఫణీశ' - 4(1) 'ఉమ్మత్తూరిశివం సముద్రపురవప్రోన్మూలనా' 2(103);'చండతరమూరు...కొండపలికొండవీటీ...కటకేశసింధుమందరకుధరా' 3(91)'ద్విరదాకరదారణవీరబలా'—42 ఏకచ్ఛత్రిత సర్వభూవలయ...,శ్రీకర్ణాట మహీశ.... 5(108) 'వీరరుద్రదర్పశతవజ్రీ.' 109. 'ధరావలయాగ్రగణ్య' 5(1).

మనుచరిత్రము.

'అవిభునవంతరంబు ధరావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నాదేవియుఁ దుభమతిఁ దిరుమలాంబయు...' 1(33). 'తొలుదొల్త నుదయాద్రి...మఱి కొండవీడెక్కి....నటసాఁగి జమ్మి...' గోన...,గొట్టాన ... కనకగిరి...కోరమి...పొట్నూర మాడెములు... ఒడ్డాది...కటకపురిఁ

గ్రాచేఁ గజరాజు గలఁగి చెడవ....' (37) 'ధరఁ గొండవీడును..వింధ్యగహ్వరముల్...వీరరుద్ర గజరాట్ప్రబద్ధాంత ముగ్దాంగనల్..'(38)

'కృష్ణరాయఁడు...పొట్నూరికడ నిల్పిన కంబము సింహభూధరప్రభు 'కళింగమేదినీ...' (39); 'కవితా స్త్రీలోలునకు' 45, 'నిమిషార్ధగృహీతకళింగరాజ తనయాగ్రణికిన్' 46. కవితాస్త్రీకి కవి తండ్రిగాని వల్లభుఁడు గాఁడు. దీనివలన రాయఁడు కవనరసజ్ఞుఁడుగాని కవి కాఁడని సూచితము. 'గంగాస్వచ్ఛ... నిరంకుశ ప్రతికల ప్రౌఢప్రియంభావుకా। గాంగేయాచల ...వహో గాంభీర్య లీలాస్పదా। బంగాళాంగ కళింగ భూపసుభటాభ్రశ్రేణి ఝుంఝానిలా' 81.

'మండలిక తపనశోభిత కుండలిపతి శయనకన్య కుండలిత రసాఖండ కవికావ్య...'82, [అతఁడే కవి యనమిచేత అప్పటికి రాయని నిజకృతిగా ఖ్యాతమైన యాముక్తము లేదని తెలియనగుచున్నది.] 'కుకుర...ఆంధ్ర...అంగ వంగ సింహళేశ.' 83. 'శ్రీఖండ...విద్యా కేలనభోజ...' 2(1). నిస్త్రింశప్రతిభా...నుధీనుత...ద్వైతప్రమోత్థ రజోవ్రజస్థగిత కృష్ణా గౌతమీ మధ్యభూ మ్యస్తోకోత్కల రాట్పురీ...'79. 'బల నృపరంతి జయానక భాంకృతి భీమచపేటబురత్ కలబరిగికటక క్షితిరక్షక కన్నడరాజ్య రమారమణా' 81. 'హిందూరాజ్య యవనక్షోణీ ధవస్థాప నామందీనూత...అపకృన్నామ్రద్వత్కళింగాంగనా (కళింగేందిరా) బందీ గ్రాహవిగాహినో త్తుంగకకుప్తాటీ సఘోటికనా' 3(142), 'బహుళీక...వహనప్రథమ...భుజయుగళ...గజపత్యహిపహరణ తార్క్ష్య...'—4(122) అతులశాంతిగభీర...భోజతుమాపతి విద్యా పరిపాక...కాంతారపాతిత కాళింగ కులేశ.'5(105).

'కర్పూర దళవిరామా' 6(1) [మా, హమ్మీరమదమర్దన.]
'వ్యాయామస్థిర సంధిబంధ కటకావ్యక్తఘనుగ శ్రీశిక్ష
త్యాయాగ్రావభిదా విధాభిమనసో ఖడ్గాగ్ర యుగ్రాచల
జ్యాయః కీర్తిధరప్రపంచ, వరపంచారామ రామామణీ
గేయామేయజయాంక, పంకజదృగంగీకార ధీరాకృతీ'- 6(121)

ఆముక్తమాల్యద.

'సనకాది...తిరుగు హరిపురి...ధృతకలబరిగనగర సగరపురవర పరిబృఢ...యవనవృతన భవదసి ననఁ దగి'1(41). 'తిరుమద్దేవియును...చనకుఁ గూర్చు దేవేరులుగాఁగ' 1(23)

['తొలుదొల్త నుదయాద్రి...గజరాజు గలఁగి చెడవ' 38. ఇందువలన నప్పటికి కటక జయము కటకరాజ కన్యావివాహమును భూతవృత్తము లని తెలియుచున్నది.] 'చిత్రము... నిలింపకామినులవాడకుఁ గాపులుపోదు రుత్కళులు। తిరియ వారెల్ల మాత్రమే పన్నినారో బలమూదనువీటికిఁ గొండవీటికిన్' — 37. 'కూరిమిఁ గృష్ణరాయ నృపకుంజర,...చేరఁ గళింగ రాజ్యలక్ష్మీ రమణీలలామ...మోహనాలతో...వీరభద్రుఁ డెందున సోదరుఁడైన రుద్రునిన్'- 38, 'కచసక్త ఫణికంచుకము...పొగ, మర్కట కీటకృతమైన మర్గంబు నేత్రసంపద...అలిక చిక్కణాస్రపంకము చెంద్రమై తనులగ్నబర్హిబర్హంబు...మువ్వన్నెచుంగై...అచటు విడుచు గజ రాజు నిధాటి వింధ్యవాటి' 39. [=కాంతారపాతిత కాళింగకులేశ]. 'అభిరతి...పొట్నూరి కడ నిల్పిన కంబము సింహభూధర...'40. "అలుకన్...కట్టించి తా దృష్టి కేదుల ఖానోగ్ర కపాల మర్దపహారిద్భుజాంగల శ్రేణికిన్' 42. 'సాహితీ సమరాంగణ సార్వభౌమ కృష్ణరా

యేంద్ర' 44. 'ఇది కర్ణాట ధరాధ్యక్ష భుజా 'హేవాకల బ్ధిత రా ఉదయాద్రీశ్వర' — 39. 'ఇది భూమండన కొండవీటి... ధాంచద్భుజ' —2(111). 'ఇది పాత్రమహాశ్వర ... గుత్తి దివిప్రాక్ప్రటుయంత్ర కొండపలి ప్రాద్బ్బాహసి...కృష్ణరాయ...' —3(98). 'ఇది సింహాచల దంభకేసరిపదాభిష్టార్చనా లబ్ధపుణ్య దురుట్టంకణపొట్టునూరి విజయస్తంభోపలోట్టంకితాంక... 4(269). 'ఇది...కేంబాని...విఘాతక్రియాస్పద సేనాగ్రగ కృష్ణరాయ'5(160). 'ఇది సైరా వన యావనావని ధవాహీనాథ్రమంబి...'.

## కృష్ణరాయ విజయము.

1 దిగ్విజయప్రస్థానము. 2 తిరుమలదేవి కర్పూరతాంబూల మిచ్చి పంపును. 3 శివంసము ద్రపుర మేలుచున్న గంగరాయనోడయుని జయించెను. 4 ఆదవని, ముదిగల్లు, రాచూరు దుర్గము లంగు కాపుంచెను. 5 కృష్ణకడ బీజాపూరు అహామదాబాదు గోలకొండ సుల్తానుల నోడించెను. 6 ఉదయగిరి, 7 కందుకూరు, 8 కొండవీడు, 9 కొండపల్లి,10 వినుకొండలను పట్టెను.—11 కూడ నుక్కాలిమ్మన, పెద్దన, మాదయ్యగారమల్లన, అనుకవులు పోవుచుండిరి. 12 అహామదు నగరము నుండి కటకమునకుం బోవుదారిలో చితాపుఖానుఁ డెదిరింప వానిం గూల్చెను. 13 పొట్టునూరి సింహాచలముకడ విడిసెను. 14 భేదప్రయోగము. 15 గజపతిపలాయనము. 16 అతనికూఁతును తుక్తారమణీమణిని రాయఁడు వివాహమాయెను. 17 మరలి వచ్చుచు కలబరగినిం గొట్టెను. 18 తీర్థక్షేత్రయాత్ర. 19విద్యానగర ప్రవేశము. 20 పారిజాత మనుచరిత్రాదులను కృతి నందుట.

## రా య వా చ క ము.

అశ్వపతి గంగాతీరమువాఁడు - (అగరా?)]

రాయఁడు వరుసగా - ఉదయగిరి, కొండవీడు, వినుకొండ, బెల్లముకొండ, అహమదాబాదు లను గూల్చెను. అటనుండి కటకమునకుం బోవుదారిలో చితాపుఖాను అను తురకం గూల్చెను. పొట్టునూరు సింహాచలములకడ విడిసెను, కటకముకడకుం బోయెను.— భేదోపాయము.— ముకుంద గజపతి వింధ్యారణ్యమునకుం బలాయితుఁడగుట. తత్పుత్రిని జగన్మోహినిని రాయఁడు పెండ్లి యాడుట. పొట్టునూరి విజయస్తంభము. నిజదేశమునకై మరలి వచ్చుచు తిరుపతికడనుండి కల బరగినిమీఁదికి దాడిసేయును. దానింగూల్చును.

అనంతరము తిరుపతిలో వేంకటాచలపతి దర్శనము; కాళహస్తి, త్రిపురాంతకములు కొలి చినదైవమును సేవించుట, నందీశ్వరుని దర్శించుట, మున్నగు.

## దండయాత్ర.

అళఘురు, విలుఁబుత్తూరు, సంపఁగిమన్నారుస్వామి, కరవనల్లూరులో శంకరనారాయణ స్వామి; తెన్కాశి - త్రికూటాచలము - ఆకాశగంగాస్నానము, చిత్రసభ -అనఁగా అగస్త్య పర్వతము, కృష్ణరాయ సముద్ర మనునగ్రహారమును నిర్మించుట. రామలింగస్వామి పర్వతవర్ధ న్యంబ, కాశీవిశ్వేశ్వర - రామలింగ-గోకర్ణ బృహదంబ, శ్రీరంగపట్టణము, విద్యానగరము, చేరినదినము బహుమానములు; మఱునాఁడు పారిజాత మనుచరిత్రకృతుల వంకితంబందుట.

ఈరేఖనింటినిం బరిశీలింపఁగా పారిజాత మనుసంభవాముక్తమాల్యదలు మూఁడును సర్వ దిగ్విజయ తీర్థయాత్రానంతరమే రచితములనియు, దీనిలో మనుసంభవాముక్తమాల్యదల పౌర్వా పర్యము వంశవర్ణనోద్ధారము చేతఁ దప్ప ఒండుపాయమున సిద్ధాంతపడదనియు తెల్లమగును.

లేదా ఆముక్తములోని కృష్ణరాయ తద్వంశ తద్విజయాది ప్రస్తావన సర్వమును పిమ్మట ఎప్పుడో ప్రక్షిప్తము గావలయును.

మఱి రాయఁడు కళింగదేశ విజిగీషా మనీషన్ దండెత్తిపోయి, ఇంకను మధ్యేమార్గము, విజయవాటికయందే కటకమునకు బహుయోజనములదూరమున ఇవతలనే యున్నప్పుడే, విద్వాంసులు అతనితో ఆతఁడు కళింగమును అప్పటికే జయించినట్లును గజరాజు వింధ్యవాటికిం బలాయితుఁ డయినట్లును వక్కాణించినారే, అది యెట్లు సంఘటిల్లును? ఇందులకు ఎవ్వరేని యీ క్రిందియట్లు సమాధానముం బన్నుదురు గావలయును. 'అసకృ ద్యాద్యత్కళింగాంగనా' ఇత్యాది మనువాక్యముచే పెక్కు దండయాత్రలు ఉక్తములు. అందు కళింగాంగనా వివాహముతో ముగిసినట్టిది ఒకటి. ఇది దానితర్వాతిది మఱియొకటి, అని; కాని, అందులకు ఈ ప్రతిహతిం గనుఁడు. అసకృత్తను విశేషణము మాద్యత్తను శత్రంతమునకే. రాయఁడు స్వయముగాఁ బోయిన దండయాత్ర ఒక్కటే; లేదా అవి యన్నియైనను దీనికి పూర్వములే. ఆ యసకృత్త్వము వివాహమయిన దండయాత్ర ముగిసి మరల రాజధానిం జేరిన వెంటనే చెప్పినమాట. కావున నది అటుతర్వాతి వృత్తాంతములకుఁ జెల్లదు. మఱియు 'మున్నే కళింగదేశ విజిగీషా మనీషన్' ఇత్యాది వాక్యంపుధోరణింబట్టి ఒకటే తానేఁగిన దండయాత్రగా తోఁచుచున్నది. కానిచో ఈదండయాత్రనాఁటికి, కళింగులు రాయజితులు అయిన తము తొంటి దుర్గాదులను మరల నాక్రమించినారని, లేదా ఎట్లో ఉపద్రవపెట్టుచున్నారని తద్దండనార్థము ఈ దండయాత్ర యనియు, నేర్పడును. ఆపక్షమున 'విజిగీషా మనీషా' యను పదరచన సాంపారదు, 'దండనార్థము' అనియే యుండును. మఱియు ఆపక్షమున ఆ విద్వాంసులు లంఘనాలలో మనుగుడుపుల వర్ణనగా 'భగ్నప్రాయము లయిన యా పూర్వజయములం బ్రస్తావించుట అరయుక చాలమిగా నుండును. అదియుం గాక వారి వాగ్వర్ణనచే ఆ జయములకు భంగము ఏమాత్రమును కలిగినట్లు కనఁబడదు. మఱియు రాయని కాలమున కనంతరము ఎప్పుడో తదీయచరిత్రమును రచించిన కృష్ణరాజవిజయ రాజవాచక కర్తలు జయము స్థిరపడని యీ వివాహ తీర్థయాత్రాంత దండయాత్రతోనే ఏల తము ప్రబంధములను సమాప్తిఁ జేసింతురు? కావున సరియయిన సమాధాన మేమనఁగా ఈ విద్వదుక్తి రాయకర్తృకత విశ్వాసోత్పాదనార్థ కల్పిత మయిన కథ. దీనితో పృథసంబద్ధమయి యున్న స్వప్నంబును అట్టిదిగానే యున్నను ఉండవచ్చును.

మనువులో కలబరిగి జోలి లేదన్నట్లు, మనుచరిత్రనాఁటికి రాచూరిని రాయఁడు కొట్టలేదని ఒక ప్రతిపాదనము ఉపోద్ఘాతములో అంతర్గతువుగా నున్నది. ఎట్లన రాయఁడు దిగ్విజయానంతరము మనువుం గృతినందె ననియు, దిగ్విజయారంభములోనే రాచూరిని (అప్పటివఱకు ఎదిల్‌ఖానుని వశములో నుండినట్టిదానిని) రాయఁడు పట్టుకొనె ననియు, కృ.రా.వి. యందు చెప్పఁబడియున్నది. చూ.—

'అమ్మహీమండలాఖండలుండు తొంటి రఘుమహారాజు చందంబున నిఖిలరాజులు తనకు హస్తగతంబులు సేయ, నాదువని, ముదిగల్లు, రాచూరు మొదలైన స్థలంబుల నిజబలంబు లంచి మించి గోలకొండపురంబుపై నుద్దండ వేదండ కాండ భట ప్రకాండంబులతో నురవడించునవసరంబున.' 2(9).

అప్పటికి రాచూరు రాయనివారికి కాదేని అచట వారు దండును కాపుంచి పోవుట యెట్లు ఘటించును? కావున ఈ యుపోద్ఘాత వాక్యమంతయు వటిమ చాలకయున్నది.

### పెద్దనాదికాగోచరతావాద పరామర్శ.

మఱియు బ్రాహ్మణజాత్యసంభావ్య మగు వర్ణ్యము నొక్కటిని అముక్తమునుండి యుదాహరించి, తన్మూలముగా రాయవాదులు రాయఁడే తత్కృతి గాని పెద్దన కానేరఁడని వాదించుచున్నారు, ఆవర్ణన :— చేఁపతేఁపడము - "తారుణ్యాతిగ" 2(69); ఈచేఁపతేఁపడ పుఁగవనము మాత్స్యభోజియే గాని యితరుఁడు అల్లలేఁడఁట! అపత్తుమున పరమశివుఁడు మెచ్చునట్లు సిరియాళుఁడు చేయించిన యతనినిసుఁగు నేమ్మేని దివ్యపాకమును చక్కఁగా వర్ణించుటకు శ్రీనాథుఁడు అట్టినిసుఁగుల నెంచుటను వండి భుజించియుండెనో!

శ్రీనాథుఁడు శృం. నైషధములో -

క. సేవించి రొకటి తోలఁగం। బ్రోవక జంబీరరసమునో నూనియలో
నావంజెట్టిన కటివర్ధ్రాణవలయము లమృతమధుర రస ఖండంబుల్.

అని పెండ్లిభోజనమును వర్ణించినాఁడు. ఇందుల మూలములో వరాహప్రస్తావము లేదు - కాన నిట నితఁడు స్వతంత్రించినాఁడని తోఁచుచున్నది. కావ్యానుశాసనములో హేమంత స్వభావాఖ్యానమందు —

'వరాహవర్ధ్రాణికనవౌదనాని దధీని సన్నద్ధరసాని చాత్ర।
సుశోమలాః సర్షపకన్దశాకా భుక్త్వా జనో నిన్దతి వైద్యవిద్యామ్.'

అని చెప్పఁబడియున్నది - శ్రీనాథుఁడు ఈయడవిపందిపోల స్వారస్యమును స్వయముగా భుజించియే యెఱింగినవాఁడా? ఇట మూలములో ఆవ మాత్ర మున్నది, దాని కితఁడు పంది వర్ధ్రాణను జేర్చినాఁడు. ఇది జాణతనము గాని యాథార్థ్యము గాదు.

ఎన్నిచేఁపలనో ఎండుకప్పలనో వండి భుజింపక ఈవర్ణనలస్వారస్యమును వ్యాఖ్యాతృవిద్యార్థిప్రభృతులెట్లు గ్రహింతురు? సారాయి మైకమును గ్రంథమున వర్ణించుటకై నీరు బోట్లు కలవనీక గ్రుడ్డుటకునట్లుగా బుడ్డి సేవించి యుద్ధుఁడునుచు కూర్చుండ నక్కఱలేదు. అట్లు కూర్చున్నచో వర్ణన కుదురదు. దానిని రంగమున నడుటకు నటుఁడును సారాయిపీపాయి ప్రవేశింప నక్కఱలేదు. ఈచేఁపకనను వృత్తాంతపువర్ణనంబును అట్టె యని గ్రహించుట న్యాయ్యము. క్షత్రియాదులకు ఈకనరువోరి గాదేవిప్రులకు అవకాయ కనరును కిచ్చిలియూరఁగాయకనరునుం గలవు. చల్లలోనగు పేయములచే దానిని శమింపంజేసికొనుటయుం గలదు. ఉత్తమజాతివివేకికి సుత్రగోష్ఠిలో ఉబుసుపోక కగు ప్రసక్తానుప్రసక్త ప్రస్తావములలో ఈమాత్స్యచ్ఛేదపాకాదికము వంటివి రావచ్చును. అనంతరము వర్ణనార్థమై నూనసంవాదముచే పరిశీలనచేసికొనవచ్చును. పెక్కులు దృష్టములునుం గావచ్చును. పెద్దనగారు మనువులో నాలవయాశ్వాసమున మృగయానంతర పలలచ్ఛేదవిభజన మర్యాదా పచనభర్జన నైపుణీ నివేదన భోజనాది విశేషములను పిక్కిలి ప్రాచుర్యముగా వర్ణించినారు, ఇందుచే వారు పలలసేవి యనుట లేదు. అవిస్తరము నోరి నీమాత్స్యచ్ఛేదవృత్తాంతంబును విని కని యెఱుంగఁదగినదే.

కృష్ణరాయనివారు సహకారఫలరసములోడి సారాయిని ఆస్వాదించు స్వారస్యమును స్వయ మనుభవింపరయే, అరెంటిపలపుల కదంబమును స్వయముగా మోవులం బరిశీలింపకయే,

దానిని - "సహకారఘుసరస సౌరభ్యములఁగూడి। మాధ్వీమోవులఁ గదంబముగ గలసి" 5(148) అని యిట్లు అగ్గించిరి? పరతత్త్వమును ఇన్నివిధముల నీగ్రంథమున తెలిపిన యీ రాజర్షి సురాసేవియా! శాంతము పాపము!—

మఱియు వసంతములో మాధ్వీస్వారస్యమును, నిదాఘమందు 'నారికేళాంభఃప్రదీప్తు'ను, అని భేదమును పాటించి, రాణివాసములకుం గూడ త్రావించినారు గావలయు! కిరాతార్జునీయ శిశుపాలవధ కథాసరిత్సాగరములయందు సురాపానమహిమ విరివిగా వర్ణితము. అందువలనఁ దత్కర్తలు సురాపానరతు లని చెప్పఁదగునా? ఇదియునుంగాక ఇంత ముదిరినవైష్ణవములో మునుంగుచుం డేలుచున్న రాయనివారికి చేఁపకనరువోలె నారికేళాంబుపానమే సంధ్యావందనమా? లేక, ఆ నారికేళాంబువులతోనే కనరుం బోవునట్లుగా సురలు స్రవించునట్లుగా తియ్యని యాచమనీయములతో సంధ్యను వార్చిరో?—

ఇదియునుంగాక కృష్ణరాయఁడు తనయింటికి తానే వంటవాఁడా? చేఁపవేఁపుడమున ఇంత అవాంతరక్రమము నెట్లెఱింగినాఁడు? ఆయనకు చేఁపలవిషయమునమాత్రము స్వయంపాకనియమమా?

## సాజముగా కృష్ణదేవరాయని కలవడని వర్ణనలు.

1(56) కయపూజాంబుజములఁ. 59 సవలసాధ్వనిగాఁగ. 76 ఎదురేఁగి సాష్టాంగ మెఱఁగి. 82 చట్టి (?) చుం యనునాదాతని కూరగుంపు [చట్టి - దీనిం జర్చించునది] - ఇంత శిష్టునియింట చట్టిలో కూర వంటయా? 2(46) నిర్ఝరప్రజలవేణిక లింక, ['పెన్నేటు తెగయు' అనుట మేలు.] 53 నులివాఁడు నాఁచు. 54 మిటగు మూలసెల్ల. 68 తారుణ్యాలిగ చూత. 97 భక్తిఁ ద్రోవకు సాధ్వి. 4(127) ఇల్లిల్లు దిరుగ నొక్కింతబ్బా శిఖ. 118 తడి తల డిగ్గి ముంప జడితం దుడకొప్పల. 183 నరతు ర్వ్యాల్వడి వానకై గొడుగు మోవఁ రాక. 184 గురుగుం జెంచలిఁ దుస్మి. 117 మును నసల్ దపిఁబట్టి. 6(6) చమురైన తోల్కుబుసంబు. 18 ఇడిసిన యిదుపుల. 17 ఎలనీటిబొంపెలంబులఁ బోలె. 67 ఉండుదుఁ జోళభూమి. 69 బహిర్వద్ధద్విజున కల్పఁబాచితం బిడి. 71 కలివాడుని క్రొత్తమలక డాల్. 77 పస లేదు నిల లోరి పాతకులా రని. 78 తొడుపింటివాఁడు సన్న్యాసిఁ బోవక.

——*ఉపసంహారము*——

(1) ఆముక్తమాల్యదకు పెద్దనయే కర్త యను వారిచే రాయనివారికి, ఆముక్తమాల్యదలో మదాలస చరిత్ర, సత్యభామాప్రీణము, జ్ఞానచింతామణి, సకలకథాసారసంగ్రహంబు, రసమంజరి అని నాలుగు సంస్కృత గ్రంథములు ఆరోపితములు; కాని ఇవి దేశములో ఎక్కడను లేవఁట. వ్యాఖ్యాతాదులయందును ఎటను పరామృష్టములు గావఁట; అందొకదానిపేర భానుసూరి విరచితము ఒక గ్రంథము రసమంజరి కలదు. (ఒకఁడు తన గ్రంథమునకుఁ బెట్టుకొన్న నామమును ఇంకొకఁడు తనగ్రంథమున కేల పెట్టుకొనును?)

(2) మఱియు, రాయఁడు తెనుఁగున తెనుఁగున్నపుల గోష్ఠిలో నేర్చినవాఁడే గాని, అది యాతనియింటి భాష గాదు, గురుశిక్షితమునుం గాదు; అట్టివాఁడు తన తెలుఁగుం గబ్బమును ఇట్లు వాఙ్మయమున కెల్ల, ముఖ్యముగా ఆంధ్రవాఙ్మయమున కెల్ల, ఎల్లరైయుండునట్లుగా రచించినాఁడటను విశ్వసనీయము గాదు. గురు శిక్షితుల కబ్బములందుఁ గలదోషములు ఇందు లేవు.

(3) రాయనికిని పెద్దనకును సమకాలికుఁడైన రామలింగకవి ఆముక్తమాల్యద పెద్దనకృతమే యని తెలిపినాఁడు; ఈతఁడు తత్సమకాలికుఁ డని యితని పండితారాధ్య చరిత్రమునం దెలియును.

(4) ఆముక్తమాల్యద పెద్దనకృత మని రాయనివారికంటె నర్వాచీనుఁ డైన యప్పకవి తెల్పుట:-
"ఆంధ్రకవితాపితామహుఁడు 'కానియొ'యనుటకు 'కానె' యని చెప్పె...విష్ణుచిత్తీయమునందు, 'పూని ముకుందునాజ్ఞ కనుబొమ్మను గాంచి యజాండభాండముల్। వానను మీఁదఁ బోవ నడువన్ గొనెఁ దన్నన.'" అప్పకవీయము (343, 345).

సీ. ప్రౌఢదీర్ఘసమాసపదములు గూర్చి శ్రీ। నాథుండు తూలార్చె నైషధంబు,
దానితల్లిగ నల్లసాని పెద్దన తెల్పె। మది మది దప్పి యాముక్తమాల్య,
నూహించి తెలియరా కుండ సూరపరాజు। భ్రమఁ గళాపూర్ణోదయము రచించె,
నతిశ్లేషశబ్దవాగాడంబరం బొప్పఁ। బస ఘటించెను మూర్తి వసుచరిత్ర,
తే. నిట్టికవులకు నేను వాకట్టుగొలుపఁ। జెప్పినాఁడ మదీయవైచిత్రి మెఱయఁ
బాండురంగవిజయమును బట్టిమ దనర। విష్ణువర్ధిష్ణుఁడను రామకృష్ణకవిని.

['ఆముక్తమాల్య'మన్నచో నామైకదేశమున నామగ్రహణము. అతి=అత్యంతము 'ప్రతి' అని తెనుఁగుగా ఎఱ్ఱాప్రగడ ప్రయోగించినాఁడు, కావున తీకి గురుత్వము లేదు. పాండురంగకవి ఆముక్తమాల్యదా వసుచరిత్రలను పాండురంగకృతిలో ప్రస్తావించినాఁడు.]

'యమదండచండ మగు భుజ।గమునకు వెఱచఱచి యాఖు కన్యక కమలా
రమణాంఘ్రిఁ జేరె గురుభీ।తమతికి నాముక్తమాల్యదకు నెనయగుచున్.' పాం. 4(244).

'గిరికానుషక్తబుద్ధి న్వ।రవరునింబోలె నొక్క పన్నగ మొకనాఁ
డురవడి నెచ్చటనుండియొ। సురమర్దనుదివ్యభవనమున కేతెంచెన్.'—242.

(5) వ్యాఖ్యాతృపరంపరయు దీనిని పెద్దనకృతమే యనుట.—
'ఉరు విష్ణుచిత్తీయ సౌభాగ్యమహాంబుధి సంప్లుతాంధ్రభా
గ్గరిమ నలంక్రియాంగపసరం బగునట్లుగఁ బెద్దనార్యుఁ డు
ద్ధురఫణితిన్ రచించె, నది దుర్ఘటబోధము గావునన్, స్థిరన్
స్థిర మగుచుండునట్లుగను జేసెదఁ దీక సరిస్ఫుటంబుగన్.' — శ్రీనివాసవ్యాఖ్య.

(6) గుడిపాటి వేంకటకవి యను యొక ప్రాచీనపండితుఁడు ఆముక్తమాల్యదకు టీక వ్రాసె ననియు, అందు ఉపోద్ఘాతమున ఇట్లు వ్రాసెనియు, ఆంధ్రపత్రిక.—1916– 28 ఆ.

చ. నను గుడిపాటివెంకన ననారతసద్గురుభక్తియుక్తునిన్
ఘనఘృణి కృష్ణపాటికుల కంధిసుధాఘృణి చెన్నమంత్రి
నందను గని వేంకటాద్రిని ప్రధానశిఖామణిఁ బిల్వఁబంచి యి
ట్లనియె సుధారసంబు నిరియించు మధురోక్తుల నాదరించుచున్.
గీ. పేర్మి నల్లసాని పెద్దన్న యాముక్త। మాల్యదాఖ్యకృతి సమంచితముగఁ
జేసె, నీవు టీక చేయుము, లోకుల। కందుపండినట్లె యుండుఁ గాక.
క. ఏవంవిధ బహుసుగుణ। శ్రీవననిధి వైన నీవు చెలఁగి యశేష్యం
బావనకృతికిం జేయం। గావలయున్ టీక యనఁగఁ గడు ముద మయ్యెన్.'
సీ. 'కరమర్థిఁ గవిరాయగండపెండేరంబు। చెల్లించుకొన్నట్టి పెల్లిదుండు,
కవులలోపల నాంధ్రకవితాపితామహ। బిరుదాంకుఁ డైనగంభీరమూర్తి,

మనుచరిత్రాది సత్కావ్యరచనము । సలిపిన వైష్ణవ చక్రవర్తి,
కృష్ణరాయఁడు తన కేల్దమ్మిచే నెత్తఁ । బల్లకీ యెక్కిన భాగ్యశాలి,

గీ. అలఘుఁ డలసాని పెద్దన, యాఘనుండు । మహిమఁ జేసినయాముక్తమాల్యదాప్ర
బంధ మేడ, మదీయధీపటిమయేడ, । నాకు శక్యంబె దానికిఁ డీక సేయ.

క. వినఁ దదీయ దయాసం । తానంబునఁ దోఁచినంత తద్దయుఁ దద్వ్యా,
ఖ్యానము చేసెద నీమది । కానందం బైనఁజాలు నని హర్షమునన్.'

ఆముక్త ప్రథమముద్రణ పీఠికయందుఁ గల హెచ్చరిక వాక్యము బఠికించునది.—

(7) 'దీని యాశ్వాసాంతములయందుఁ గర్ణాటక దేశాధిపతిగా నున్న శ్రీకృష్ణదేవరాయఁడు దీనిని రచించినట్లున్నను, అతని సభయం దష్టదిగ్గజము లని బిరుదు వహించియున్న యష్ట కవులలో నాంధ్రకవితాపితామహుం డని నుతి కెక్కిన యల్లసాని పెద్దనగారు రచించినట్లు సంప్రదాయజ్ఞు లైన పండితులు వాడుకొనుచున్నారు.'—ప్రథ యిట్లుండుట;

(8) రాయకీర్తిప్రఖ్యాపనకొఱకే వ్రాసిన గ్రంథము లగు కృష్ణరాయవిజయ రాయ వాచకములలో రాయకృతము లన్నయాసంస్కృత గ్రంథముల నేని ఆముక్తమాల్యద నేని ప్రస్తావింపమియు;

(9) తిమ్మన పెద్దనలును ఏతత్కృత గ్రంథమును దేనిని గాని పేర్కొనమి. కీర్తితత్కృత గ్రంథముం బేర్కొనుటవలనఁ గలుగునట్లు సామాన్యస్తుతిచే కలుగదుగదా.

రాయనిని పెద్దనగారు ఎంతవర్ణించినను విద్యావంతుఁ డన్నారే గాని కవి యనలేదు. ఆయనకన్న పటువుగా తిమ్మనార్యుఁడు 'కవితాప్రావీణ్య ఫణీశ' అనలేదా? యందురేని—ఈ నుడియు రాయఁడు కావ్యాలంకారి మర్మజ్ఞుం డని తెల్పుచున్నదే గాని, కృతి రచించినాఁ డన్నమాట గాదు. తిమ్మన్నగారే రాయని 'ఏకచ్ఛత్రిత సర్వభూవలయ' అని సంబోధించినారు; రాయఁడు అట్టిఁడా? అగునేని, ఢిల్లీ సుల్తాన్ పారసీక యవన తురుష్కాంగ్లేయాది దేశముల ప్రభువుల మాట యేమి? 'కవితాప్రావీణ్య ఫణీశ' అను తిమ్మనకృత విశేషణము 'కవితాప్రౌఢిలోలునకున్' అను పెద్దన కృతివిశేషణమునకు సమార్థకము. అట్లే పెద్దనగారు 'భోజక్షమాపతి విద్యాపరిపాక,' 'ప్రతికల ప్రౌఢిప్రియంభావుకా,' 'నిస్తంద్ర ప్రతిభా,' అని యు సంబోధించినారు గాని 'కవి' యనలేదు. మఱియు పెద్దన తాను రాయనిపైఁ జెప్పిన చరమ సంకీర్తనమందేనియు రాయఁడు ఆముక్తమాల్యదా కవి యను మహోన్నతిసూచక వృత్తాంతమును పిగలనీయలేదు.

(10) ఆముక్తమాల్యదాకవి వీరవైష్ణవుఁడు. శివునిని శైవమును సహింపఁడు. రాయఁడు శివుని సహింపనివాఁడు గాఁడు, దిగ్విజయానంతరము శివక్షేత్రములనుంగూడ సేవించి సత్కరించినాఁడు.

గీ. 'కల్బరిగ కోటమీఁద లగ్గలకు నెక్కి । కార్య మొనరించి జయలక్ష్మిఁ గాంచి యచట,
నుండి తనరాజ్యమునఁగల్గు నొంపుమీఱు । మంచిదేవస్థలములు వీక్షించి పెంచి.

సీ. శ్రీశైల కాళహస్తి చిదంబరాదిక । రమణీయ శైవస్థలములఁ జూచి,...
శ్రీరంగ కాంచికా శేషాచలప్రము । ఖములైన విష్ణుస్థలములఁ జూచి,...
...విజయనగరంబు చేరె దిగ్విజయలీలఁ । బ్రజలు వర్ణింప నలకృష్ణ రాయనృపతి.'

గూడ సమర్థులగుదురు. వారే రచించినట్లు గ్రంథములో నున్నది. కొండంత స్వప్నకథయు నిబద్ధము. కావున దీనిని పెద్దనగారి తోడ్పాటున రాయనివారు రచించియుందు రనియు నెన్నవచ్చును. పెద్దనగారి యనుప్రవేశము తప్పదుగావున, ఇందు తప్పు లున్న వనుట న్యాయ్యము గాదు.

గ్రంథమున కర్త వీరవైష్ణవుఁడుగా నగపడుచున్నాఁడు. అంతటి మతావేశము శివస్తుతి చేసిన పెద్దనగారియందును, శైవక్షేత్రములకుఁ గొప్ప శాశ్వత కైంకర్యములు చేసిన కృష్ణరాయని యందును పొసఁగునా - అని కొందఱు ఆక్షేపింతురు. అందులకు కొందఱు, 'ఇరువురును జీవితములో ఉత్తరకాలమున వీరవైష్ణవులై ఆ విష్ణుపారమ్యాభినివేశముచే ఒండొరుల హెచ్చరికలు మెచ్చెండ ఈ ప్రబంధమును నిర్మింపఁ బోలుదు'రని వచింతురు. తెనాలి రామకృష్ణ కవీంద్రుఁడును ఆదిలో వీరశైవుఁడుగా నుండి పండితారాధ్య చరిత్రమును రచించి, అనంతరము వీరవైష్ణవుఁడై, పాండురంగ మాహాత్మ్యమును సర్మించినట్లును, అతని జీవిత చరిత్రమువలనఁ దేటపడును. అతఁడు పెద్దనకాలమువాఁడే కావున ఆముక్తము పెద్దనరచితమని అతఁడు ఆ సీసపద్యములో చెప్పినమాటను నమ్మకుండుటకు నిమిత్తము గానరాదు. రాయఁడును తాను పల్లకిలో నునిచి యెత్తిన యాంధ్రకవితా పితామహునికిం దలయూనిక ప్రముచ్చఁపనముగా నిట్టి లోకోత్తర మహాప్రబంధమును రచించునా - పెద్దనగారును తనకుం బ్రాణమిత్రమయిన రాయనికి అకీర్తి కాకుండునట్లును, మహాకీర్తి యగునట్లును తదీయ కవనమును సంస్కరింపక యొప్పరకింతురా?

ఈనడుమ ప్రపంచపర్వ మను సంస్కృత గ్రంథమొకటి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారికి దొరికినది. అందు-

“అల్లసాని పెద్దనార్యేణ సత్యవధూపరిణయే:—
‘అఙ్గుళీషు కురఙ్గాక్ష్యా శ్శోభతే ముద్రికావళిః।
ప్రోతేవ బాణైః పుష్పేషో స్సాత్మ్య లక్ష్యపరమ్పరా॥’
“అల్లసాని పెద్దనార్యేణా ప్యేవ ముక్తం వసుమఞ్జర్యామ్:—
‘ఉడురాజ ముఖీ మృగరాజకటీ గజరాజగతిః స్తనభారనతా।
యది సా రమణీ హృదయే రమతే క్వ జపః క్వ తపః క్వ సమాధిరతిః॥’ అనికలదు.”

1(18) పలికి తుత్ప్రిత్యాదిసీసమందు పేర్కొనఁబడిన గ్రంథము లివ్వియే యగునాఁ ఏల కాఁగూడదుఁ

దుర్మతి మాఘ శు. ౧ శనివారపు టాంధ్రపత్త్రికలో మన్మిత్రపర్యులు బ్ర. శ్రీ. వేటూరి ప్రభాకర శాస్త్రిలుగారు ప్రకటించిన పైవ్యాసము ఆముక్తము పెద్దనప్రణీత మను వ్యాఖ్యానమునకు కైదండ యొసంగుచున్నది. సర్వజ్ఞులైన పెద్దలు ఈ విషయమున పరమసిద్ధాంతమును నెలకొల్పుదురుగాక.

---

# ఆముక్తమాల్యదా పీఠికానుబంధము.

క్రీ.శ. 1914-వ సంవత్సరమునం బ్రకటింపఁబడిన యాముక్తమాల్యదా చతుర్థ ముద్రణములో అపూర్వమగు ఒక యుపోద్ఘాతము 79 పుటలది కనుపట్టుచున్నది. అందు మూఁడు ప్రధానవిషయములు ఉపన్యస్తములు. (1) మతవిషయము. (2) చరిత్రాంశ విషయము. (3) కవన విషయము. తొలిదాని అభ్యుపగంతవ్యములు సందేహించుచున్నవి. కడమ రెంటను నా మతము వేఱుపడియున్నది. [ఆ పూర్వముద్రణోపోద్ఘాతమందు మతవిషయము దప్ప కడమ వ్రాఁతయెల్ల-ఆముక్తమాల్యదా కర్త పెద్దన కాఁడనియు, కృష్ణదేవరాయఁడే యనియు, నిర్ధారించు నుద్యమముతోడి యుపన్యాసముగా నగపడుచున్నది: అందు 54-వ పుటలో 'ఇందుఁ బ్రయోగింపఁబడిన సంస్కృతపదములు కాని ఆంధ్రపదములు గాని సంస్కృతభాషలోని యే చంపూ కావ్య నాటకాదులయందును తెలుఁగు ప్రబంధములయందును గానరావు. అట్టి శబ్దముల పట్టిక నొకదాని నిక్రిందఁ బొందుపఱిచియున్నాను.' అని యున్నది. దీని కనంతరము 61 సంస్కృత పదములును, 43 తెలుఁగు పదములును, రెండు పట్టికలుగా ముద్రితములై యున్నవి. పట్టికలలో ఆ పదములకు ఆశ్వాస గద్య పద్యాదిసంఖ్య నిర్దేశితముగా నుండ లేదు. అంగుచేత వానిని గ్రంథమందు కనిపట్టుట కరము క్లేశకరమయినది. కనిపట్టిన పిమ్మటను ఇవి భిన్నార్థములయందు పెక్కుతావుల నున్న యేకపదము ఏ యర్థమందు అప్రయుక్తమని యభిప్రాయమో, ఆ యన్ని యర్థములందును అప్రయుక్తమే యని యభిప్రాయమో, అదియు విశదము గాకయున్నది. పదముల ముద్రణములో ఆ గ్రంథమున వచ్చిన క్రమమేనియు అనుసృతము గాదు; అకారాది క్రమమేనియు లేదు. ఇందు పదముల వర్ణక్రమము పెక్కింట మూలగ్రంథమునకు వేఱ్పడి యున్నది. మఱియు పట్టికలకు అవతారికయగు నుద్ధృతవాక్యమునుబట్టి, ఆముక్తమాల్యదలోని యేపదముగాని ఇతర కవులు ప్రయోగించినది కాదని, అనఁగా - 'పూని ముకుందునాజ్ఞ' ఇత్యాది పద్యములోనివి - పూనుధాతువు, ముకుందశబ్దము, ఆజ్ఞాశబ్దమును ఇత్యాదులు అనఁగా ఆముక్తమాల్యదలోని సకల శబ్దంబులును ఉభయ భాషలయందు (ఏకావ్యనాటకాదులయందును) లేవని యుపోద్ఘాత రచయితగారి యభిప్రాయముగాఁ గొనవలసివచ్చును. మఱియు ఈ యప్రయుక్తతాఖ్యాపనము గ్రంథమందు దోషారోపణకో గుణారోపణకో మఱి యేప్రయోజనమునకో అచట వ్రాయఁబడియుండలేదు. అయినను వైలక్షణ్యము గాన దోషారోపణకే, రాయకర్తృకతా స్థాపనకే, ఉద్దిష్టమని యున్నఁ దగియున్నది. పట్టికలం జదువఁగా అందలి పదములు ప్రాయికముగా అన్యగ్రంథ ప్రయుక్తములుగానే స్ఫురింపఁదొడంగినవి; కతిపయ పదములు ఇతర గ్రంథములందు ప్రయుక్తములు గామికి కారణము స్పష్టముగానే కనఁబడినది. అది యెల్ల నెట్లన్న—

**35.** ప్రథమపట్టికలో 'పాదూనాహూః' [ఆపదములను సులభముగా దెలిసికొనుటకై అకారాది క్రమముగా ఇందు ఆపట్టికలను అనువర్తించినాఁడను.] దీనియర్థము 'పాదుకలను మోచువానిని' అని; అనఁగా - 'తాము రాజసభలోనికి పోవునపుడు బయట వదలిన తమ పాద

రక్షలను అపహృతములు గాకయుండునట్లు తనచేతం బట్టుకొనియుండి, తాము సభనుండి వెలువడి రాఁగానే, తమ పాదములకడ నిడునట్టి తమ సేవకుని' అని ప్రకరణానుసారియైన వివరణము. దీనినే తెనుఁగుపదములచే 'చెప్పులమోపరి' అని చెప్పనొప్పును; పాదూశబ్దము ప్రసిద్ధమే, వహధాతువును ప్రసిద్ధమే. ప్రసక్త వివక్షితార్థబోధకమై కవి కల్పించికొన్న యీనుడిమొత్తము మఱి యెందునేని ఏల యుండవలయునో దురూహముగా నున్నది. ఇది యిట్లు యౌగికముగా కూర్చుకోఁదగిన దౌటను ఈక్రింది 'పాదుకాధారక' ప్రయోగము సూచించుచున్నది:—'వేంచేయు నవసరంబున...తాంబూలిక తాళవృంతిక నరవాహక ఛాత్త్రిక చామరిక కాళాచిక కరదీపికాధారక కాతారిక కాగవాలిక పాదుకాధారక నర్తక గాయక వైణిక శాకునిక...' ప్ర. వేం. వి.వి. 78.

(14) ఇట్లే 'కస్థల(ము)' అర్థము—క=నీటియొక్క - స్థలము=తావు; ఇట్టిదే 'కవి' శబ్దము జలపక్షిపర్యాయము.

'కరబదరసదృశ మఖిలం। భువనతలం యత్ప్రసాదతః కవయః।
పశ్యన్తి సూక్ష్మమతయః। సా జయతి సరస్వతీ దేవీ.' వాసవదత్తపీఠిక.

[కం జలం విః పక్షీ తత్ర బహువచనమ్- కవయః జలపక్షిణః' అని దానిటీక.]

'కవి యల్లసానిపెద్దన। కవి తిక్కనసోమయాజి గణుతింపంగా,
కవి నేను రామకృష్ణుఁడ। గవి యనునామంబు నీరుకాకికి లేదే?'— రామకృష్ణుఁడు.

'కం శిరోఽమ్బుసుఖే క్లీబం తత్రైవ చ క మవ్యయమ్' అని నానార్థరత్నమాల. 'క-న। ఇది శిరస్సునకును ఉదకమునకును సుఖమునకును పేరు. ఈ యర్థములయందే 'కమ్' అని యవ్యయముఁ గలదు.' అని తట్టీక. ప్రకృతమున 'కస్థల' అనునది 'నీటితావు' అను నర్థమున కవి కల్పించుకొనిన సమాసము. ఇది మఱి యేగ్రంథమందును లేదనుట పూర్వోక్తము వంటిదే. (21) 'ఘర్మగవి' ఇందుల పద్యము—

ఆ. 'తనువు గోరిజఁ గొమ్ముఁ గొనకుండ మలఁపుచుఁ। జప్పుడేఁ సగఁ గోఁక నప్పళించి,
శోణితంబుఁ గ్రోలుచునె నేర్పుమై ఘర్మ। గవిని గవికి నీడ్చు నవసరమున.'

'ఘర్మగవిన్ = ఘర్మధేనువును' అని టీక. 'ఘర్మగవి' యను మొత్త మప్రయుక్తమనియో, 'ఘర్మ'శబ్ద మప్రయుక్తమనియో, 'గో'శబ్ద మప్రయుక్తమనియో, భావ మెఱుకపడకున్నది. మొత్తము పూర్వోక్తములవంటిదే. 'ఘర్మ'శబ్దమాత్రమే వివక్షితమేని అశుశుక్షణ్యాదులవలె గ్రహింపఁదగు నని మన్మతము. 'ఛాన్దసానామపి క్వచిద్భాషాయాం ప్రయోగః'—'అధ్వర్యుః క్రతుః' 'ఇతిజ్ఞాపకాత్' అని రామాశ్రమి. 'గిరిశ' శబ్దంబును నిట్టిద. [ఇదియే 8(19)లోని 'ఘర్మధేనువు' నకును సమాధానము.] కాళిదాసు 'త్ర్యమ్బకం సంయమినం దదర్శ' అని ప్రయోగించుకొనిన విధమున నని యేనియు సమాధానపడఁదగును.

(4) 'అయనిష్ట' అని యొకపదము; ఇందు టకారము ఠకారమునకు బదులుగా పొరఁబాటని గ్రహించిన, 'అయనిష్ఠ' అనునది. 'అయనిష్ఠన్ ధవళాతపత్త్రి డగునయ్యాగంబు' ఇత్యాది 4 ఆ. 165. పద్యములోనిది. 'అయనిష్ఠన్=శుభావహ విధి నిష్ఠచేతను. 'అయశ్శుభావహో విధిః' అని యమరము. అని యందుల టీక. రఘు. 4(26) చూ. 'స గుప్తమూలప్రత్యన్తః శుద్ధపార్ష్ణిరయాన్వితః। షడ్విధం బల మాదాయ ప్రతస్థే దిగ్జిగీషయా.'




అందుల టీకలో "అయాన్వితః (అయేన శుభావహవిధినా అన్వితో యుక్తః) శుభదైవాన్వితః । 'అయశ్శుభావహో విధిః' ఇత్యమరః," అని సందర్భకారపండిత ముద్రితము.

అట్లే కిరాతార్జునీయమున 5(20) - 'సులభైః సదానయవతాయవతా' ఇత్యాది. ఇందు మల్లినాథీయటీకలో — 'అయవతా భాగ్యవతా...' 'అయశ్శుభావహో విధిః' అను పై రెండు ప్రయోగములును ఆప్తినిఘంటూదాహృతములు. మఱి అతి ప్రసిద్ధమైన నిష్ఠాశబ్దమునకుం గూడ ప్రయోగము వలయునా? ఆప్తినిఘంటువునుండి యుద్ధరించెద,—"మనో నిష్ఠాశూన్యం భ్రమతి చ కిమ ప్యాలిఖతి చ" మాలతీ 1(31). "శాస్త్రేషు నిష్ఠా సహజశ్చ బోధః" మాలతీ. 3(11). ఇట్లు నిష్ఠాశబ్దమునకు ఎన్నియేని సంకలింపవచ్చును. ఈ రెంటి సమాస మైన 'యయానిష్ఠ' అనుదానికై ప్రయోగాంతరాన్వేషమేలొకో గోచరింపకున్నది.

(47) 'వార్ధశ్రవస' ఇందు 'ర్ధ' అనియే ముద్రితము. ఇట రధలనడుమ ఢకారము లేదు. మఱి 'వా(ర్ధ్ఢ) శ్రవస=కాకిసోపుగల జయంతునియొక్క' అని తట్టీక. వృద్ధశ్రవసుఁ డనఁగా ఇంద్రుఁడు, అతని యపత్య మైనపురుషుఁడు 'వార్ధశ్రవసుఁడు' అని వ్యుత్పత్తి; ఇంద్ర పుత్రుఁ డనుట; అతని పేరు జయంతుఁడు. ఇట్లు సుబోధ మైన తద్ధితాంత ప్రయోగము నకు ప్రయోగాంతర భావాభావ చింతవలనం బ్రయోజనమేమి?

(33) 'పర్జని' - ఇది 5(89) వ యగు సీసపద్యములోనిది. ఇందు స్నానీయ వస్తువులలో 'హారిద్ర' (పసుపు) చెప్పఁబడినది. మరల నప్పద్యమునందే పసుపునే చెప్పవలసివచ్చి నంతట, చెప్పిన పదమునే చెప్ప నేల యని 'పర్జని' శబ్దమును కవి ప్రయోగించియుండు నేమో.

సీ. "హేమపాత్రిక హారిద్రామలక్యాదిక। స్నానీయవస్తువ్రజంబుగొనుచు...పర్జనీ లేశ పూర్ణ
సౌభాగ్యదాంగి । ధూతి చకచక లీరంపులోని మాఱుమలయు..."

పర్జనీశబ్దము నిఘంటువులలో హారిద్రాపర్యాయముగా పఠితముగాదు. 'దారుహారిద్రా' పర్యాయముగా పఠితము; దారుహారిద్ర యన మ్రానిపసుపు. దానినిఁగూడ ఇట్లు ఉపయోగించుట కలిగియుండెనేమో?

'నిశాహ్వ కాంచనీ పీతా హారిద్రా వరవర్ణినీ'

'అథ పీతద్రు కాలేయక హరిద్రవః ।
దార్వీ పచంపచా దారుహరిద్రా పర్జనీత్యపి' అమ.

'హారిద్రా వ్యశదీ పీతా పిణ్డాగౌరీ నిశాహ్వయా'। అభిధానరత్న
పర్జనీ రజనీ దీర్ఘరాగా రోమశపర్జికా।' "

'దార్వీ పచంపచా పీతదారు దారు నిశాభిధా ।
కటంకటేరీ పర్జనీ స్యాత్ కాలేయక కుసుమ్భకౌ'—




ఇట కవి పర్జనీశబ్దమును మ్రానిపసుపనెడి వాచ్యార్థమందుఁ బ్రయోగింపక లక్ష్యార్థముగా పసుపును జెప్పుటకు ప్రయోగించినాఁ డనియేని తలంపవచ్చును. ఇట్లే మఱియేకవియేని యీశబ్దమునే ప్రయోగించుట కాకతాళీయము గావున, అట్టి ప్రయోగ మన్యకవనములలో దుర్లభమైయున్నది. అయినను వాఙ్మయము నెల్ల చూచినవా రెవరు? పక్షాంతరము అభిధానరత్నమాలనుండి పై నుదాహరించిన హారిద్రాపర్యాయములలో 'పర్జని' అని యొక శబ్దము

గలదు. ఇట నదియే కవి ప్రయోగించినదిగా నుండి, లేఖకాదులచే 'పర్జనీ' అని మార్పఁబడి యున్న నుండును. ఆముక్తమాల్యదలో అట్టివి లేఖకాది ప్రమాదజము లెన్ని లేవు?

(25) 'చండాలిక'— అర్థము చండాలవీణ. 'చాణ్డాలికా తు కణ్డోలవీణా చణ్డాల వల్లకీ' అను. ఆముక్తమాల్యదలోని చండాలుని కథకు మూలమయిన వరాహపురాణ చండాలకథలో గీతిప్రభావప్రాప్తసిద్ధి యైన చండాలుఁడు (వీణా మాదాయ నిర్యయౌ) 'వీణం గేలఁగొని బయలువెడలెను' అని యున్నది. చండాలవీణను పైయమరవాక్యానుసారముగా 'చాండాలిక' యని ప్రకృతికవి వ్యవహరించినాఁడు. ఈచండాల కథను ఈయన ప్రసక్తము గావించికొన్నందున ఈయనకు ఈ పదము సుప్రసక్తమైనది. సంస్కృతి గ్రంథములో ప్రసక్తమయినను వీణాశబ్దముచేతనే నిర్వాహమైనది. ఇతర కవులకు ఇట్లు ఈ కథయు ఈ వీణయు ప్రసక్తములే కాలేదు. అనుషంగికముగా నేనియు ఇది మత్పరిచిత కతిపయ గ్రంథములలో ప్రయుక్తముగా లభింపమి వాస్తవమే. అంత మాత్రాన వాఙ్మయములో నుండదనే యుండెడి దని తలఁపఁజాల. ఇఁకనేని దొరకినను దొరక రాదా? ఆంధ్ర వరాహపురాణమున ఈకథ కనఁబడలేదు.

(31) 'ధామార్గవము' అది అపామార్గాయకును ఉత్తరేనికిం బేరు. ఆముక్తమాల్యదలో పై రెండవయర్థమున నున్న దని పట్టిక.

నా కెరిగిన యలంకారికావ్యములందు నెటను ఇది ప్రసక్తము కాలేదు. కాని ప్రసక్తిని బట్టి చరక సంహితలో ప్రయుక్తము. —'మదనం కుటజకం నిమ్బం జీమూతం కృతవేధనమ్। పిప్పలీ కుటజత్వాకూణ్యేలాధామార్గవాణి చ, ఉపస్థితే శ్లేష్మపిత్తే వ్యాధా వామాశయాశ్రయే। వమనార్థం ప్రయుఞ్జీత భిషగ్దేహ మదూషయన్.'— అపామార్గ తండులీయాధ్యాయము.

---

ఈచెప్పిన ౨౫—కీ గాక కడమ ౩౧—కిని బహుప్రయోగములం జూపెద.

---

(41) 'మత్తల్లి (మతల్లికా ద్యూపాంతరము)'— అని పట్టిక. [తద్రూపాంతర మేమో కాదు. ఈ పదమును అన్యత్ర ప్రయుక్తము. 'కాళిందుత్పలో..., రక్షళీ నృత్తమతల్లి హల్లీసకా' 3,92)

౧ శా. 'కందర్పాస్త్రము లంచు, నంచితతనుత్కాండంబు లంచున్, సుధా
మందస్యందము లంచుఁ, గాంచనలతామత్తల్లు లంచున్,' పాం. రం.

౨ క. 'చెల్లఁబో హింసోత్కథ। మ్మల్లకుఁ బ్రియమోవి గలుగు మదిరాక్షీమ
తల్లికి ఘాతితవాణికి। వల్లెయె యీజాటుకూటుపలఁ బొనరింపన్.'

[ఇట నానుషంగికముగా నొకటి చెప్పెద:— ఉపోద్ఘాతములో(38)ఉపనిషద్వాక్యములు ఉద్ధృతములు. వానిలో 'తిష్టన్' అని 5 మారులు ముద్రించినారు. ఈపదమున తకారము గాని టకారము గాదు.

'శబ్దో హీనః స్వరతో వర్ణతో వా। మిథ్యా ప్రయుక్తో న తమర్థమాహ
స వై వాగ్వజ్రో యజమానం హినస్తి। యథేన్ద్రశత్రుః స్వరతోఽపరాధాత్.' అని]

౩ శా. 'పల్లాంబావరపుత్త్రి, గర్వితరిపుక్ష్మాపాల సంపత్తిని
ద్ధ్యల్లావణ్యకళా శరత్సముఖ, లీలోల్లాసిబాహాసిమ

త్తల్లీ నర్తన రంగ రంగదనుహృద్ధాత్రీశకోటీర, మా
ద్యల్లీలా కకుబంతవారణ, సువర్ణాహార్య స్థైర్యోదయా.' జై. భార. 1(140)

౪. వ. 'రయాయత్తంబు లగుతత్తత్ప్రతుల నుత్తరంగిత కుతుకంబు చిత్తంబున నత్తమిల్ల రుచిమత్తల్లికల (మతల్లికల?) మత్తల్లిన తత్తరంబున...' వనవిహారము. G. O. M. L.

౫ మ. 'క్షయకాలంబున సీధుసాగరరసాస్వాదాతిరేకంబునన్
నయనాబ్జంబులు ఘూర్ణితంబులుగ సంధ్యాకాళరాత్రీకర
ద్వయతాళానుగతిం బ్రమోదమున మత్తల్లీమహానృత్యమున్
బ్రియ మొప్పారఁగఁ జేయుభైరవుఁడు గల్పించున్ మహైశ్వర్యముల్' ప్ర. 547.

ఈప్రయోగములలో కొన్నిటివలన 'మత్తల్లి' యనునది నృత్యవిశేషమని స్పష్టపడుచున్నది. మత్తల్లిలక్షణము:—భరతనాట్య శాస్త్రము.

'వామదక్షిణపాదాభ్యాం ఘూర్ణమానోపసర్పణైః।
ఉద్వేష్టితాపవిద్ధైశ్చ। హస్తైర్మత్తల్ల్యుదాహృతమ్।
స్ఖలితాపసృతౌ పాదౌ వామహస్తశ్చ రేచితః।
సవ్యహస్తః కటిస్థః స్యా। దర్ధమత్తల్లిత స్స్మృతమ్'

౬. మ. 'ఎలమిన్ శైశవయౌవనాంతరవయోహేలావిలాసంబు పై
నలమన్ గన్గొని జ్యోత్స్న నుంచినశుభోదంచన్మహాస్త్రంబునన్
జెలిమిన్ భూనుపృష్ఠాంశ్రపజ నాగిర్వాణ పూర్వంబుగాఁ
దలిమం బెక్కఁగఁ జేసెఁ దిల్లీ నను నుద్యన్మోదమత్తల్లియై.' వైజయంతీ వి. ఆ౨. ప౬౯.
(ఉద్యన్మోద మత్తల్లియై మోదమునుప్పతిల్లుచున్న మత్తల్లి నృత్యము కలదై)

౭. 'ఖేలత్కుండల మాకులాకులమణిహారం క్వణత్కంకణ
శ్రేణీనూపురమేఖలం చలకుచం వల్గన్నితమ్బస్థలమ్
అన్యోన్యం మణిపట్టికాహతివల న్నేత్రాంచిద్రావ్యులం
ప్రక్రాన్తం యమినోమనోఽపి హరతే హల్లీసకక్రీడితమ్.' రతిమన్మథనాటకకి(38)
(60) హల్లీసక-'నృత్తమత్తల్లి హల్లీసకా' ఉ. ౮

౧. 'కుండలీదండలాసక ...హల్లీసకాది నృత్యంబుల నవలోకించుచు.' భీమేశ్వరపురా. 1(117)
౨. సీ. 'గగనకల్లోలినీ కల్లోలమాలికా హల్లీసకములతో నవఘళించి' శృం. నైష. 1(37).
౩. వ. 'చకాసత్కల్లోల హల్లీసక హల్లోహల తమసారంబును.' ప్ర. రా. వేం. వి. వి 561]
౪. వ. 'పట్టఁ జాలనిసంతోషంబు (న) హల్లీసకంబు సలుప.'—,,—569.
౫. వ. 'సముల్లోలకల్లోల హల్లీసకప్రభూత ఝంఝానిలంబులు చలిచికొట్టినన్' ప.(121)
౬. వ. 'జలధిసముల్లోల హల్లీసక నిభాన్భటి'—,,—10(21)
౭. వ. 'భూషణద్యుతుల హల్లీసకంబు లగు సువర్ణాంశుకంబులం...' కృ. రా. వి. 1(56)

౮. 'ఉదఞ్చత్కావేరీలహరిషు పరిష్వఙ్గరభసే నటన్తః
కుహూకణ్ఠీ కణ్ఠీరవ రవలవత్రాసితా ప్రోషితేభాః

ఆమీ చైత్రే మైత్రావరుణి తరుణీకేళికచ్ఛేలిమల్లీ
చలద్వల్లీ హల్లీసక సురభయ శ్శృణ్వి చఞ్చన్తి వాతాః' సు. ర. భాం. 544(132)

(40) 'మణిధనువు'—ఉ. ౫

'అసితమేఘస్థ మణిధనువు' 4(103); 'మణిధనో ర్జ్వాలాపాథముల్' 105; 'చివికిన మణిధనువునఁ దోరఁగునుసి'—,,—141; 'కరఁగుచుఁ బుట్టుచుండుమణికార్ముకరక్తిమ' 100.

౧ మ. 'అమరెం దత్పృతి నేఁగునీలమయచక్రాంకంబు లింద్రావరో
ధముఁ దప్పించుక ధాత్రిఁ జేరినసముద్యత్పుష్కలావర్తము
ఖ్యమహామేఘకులంబులో యనఁగఁ జక్రం గాండధారావిశే
షములన్ భూరిమణీశరాసన విభాజాతంబులుం జూపఁగన్.' చంద్రికా. 1(159)

['భూరిమణీ=అధికమణులుగల, శరాసన=ధనువులయొక్క, భూరిమణీశరాసన = ఇంద్రధనువులయొక్క యని యర్థాంతరము.' అని తట్టీక.]

౨. చ.'కలితమణీశరాసఘన కాండభృతిన్ వరవాజిసంగతిం
బొలుచు సువర్ణకూట మరిభూపవిదారణఁ జూడఁ గాంచనా
చలవిజయప్రయాణ పరిపన్నహనాత్మతఁ బూనుటల్ గడుం
దెలిపె మరుద్గతిధ్వనదు దీర్ణగుహాచయ శైలకాధ్వనుల్' 2(11)

౩. సీ. 'సన్మణిచాప మొసంగెదర్ గను సరిమండలి కిని యార్తి మన్ను మనుచు'
['ఇచట సన్మణిచాపము=ఇంద్రధనుస్సు' - అనిటీక.]—,,—6(86)

౪. చ. 'అనుడుఁ బరశ్వధాయుధుఁ డహంకృతిఁ జేతికి నిచ్చినట్టి విల్
దనకడకంటిచాయ మణిధన్వతఁ గన్పడ నెక్కువెట్టి సం
జనితగుణ ధ్వనిస్తనితసంగతి నొప్పె ఘనాఘనంబుసో
ల్కాని నరపుంగవుండు నరిలేఖశిఖావళికోటి రంజిలన్'' ఆంధ్ర. చం.రా.ఆ. 3(150)

౫. వ. 'రామభద్రుండు...మరుచ్చటుల జవ నిర్ఘాతఘోట కానుషంగం బగు శతాంగంబు నుత్తుంగరంగ శ్యామశృంగంబు నారోహించు చంచలామణిధనురుదారధారాధరంబు డంబున మెఱయ నెక్కె.'

(13) 'కలంబ'—ఉ. ౯

'కలుషము లడంచుఁగాత లంకాపురాంగ। దాంబర చరత్కలంబ కదంబకములు.' 4((27)

౧. 'పరస్పరోత్తాల నృపాలమాలా। కలమ్బజాలై ర్బలయో ర్ద్వయో స్సా
అకమ్పతాన్యోన్య విలోలచక్షుః। కటాక్షపాతై ర్య్యగదీ వయో నోః.' బాల. కర్ణ (56)

౨. క. 'బిసరుహ నయనావిసర। ప్రసవకలంబకుఁ డతండు పరితోషిత వి।
ప్రసతీకదంబ కౌనన। హసితైందవ బింబఁ గోసమాంబ వరించెన్.' కువల. 1(35)

౩. చ. ఘనగజదర్పభేదన మఖండసురారి పురప్రభంజనం।
బున లఘుధర్మఖండనపుఁ బూనిచివేలుపు లెంచ నుగ్రవ।
ర్తనఁ దనరారు నమ్మనుజరాజకలంబము చిత్రవైఖరిన్
దనిపె నజాత్మజాంతర ముదారతరప్రమదోర్వి నయ్యనిన్.' చంద్రికా. 3(115)

౪. వ. 'హరపురాసుర సమరాస్థానంబు పోలిక ననంత కలంబ విజృంభగుణంబై' 120(22పం.)
౫. చ. ...మద్భుజోగ్రగ । న్వతరుణభోగివాంత విషవహ్ని సమాన కలంబధారచేన్. 131
౬. వ. కంతుండు ప్రయోగించు నిర్వ్యాలజ్వాలాకుల...కలంబ కదంబకంబులడంబున...' 6(48)
౭. వాఞ్ఛన్తి చేమే మమ మాతరం సతీ । మిత్యేవ కిం పంచశరేణ స క్రుధా
విద్ధాః కలమ్బై రవిలమ్బితం నిజై । ర్యోధాముమూర్ఛుః సకలాస్తదైవతే' రుక్మి. 4(23)
[కలమ్బైః=బాణైః' అని తట్టీక]
౮. నలినకలంబ వీరబలనాయకుండు చైత్రుండు తద్బలోచితోజ్జ్వల లతికా కుటీపటలిఁ జక్కఁగఁ
బాళెము డించె నయ్యెడన్'' చంద్రికా. 2(72) ౯.'అపూర్వ కలంబ సమీక కేళి'—3(108).

(53) 'శృంగాటక.'ఉ 33.

'కలసి యొకకొంతసేపు శృంగాటకముల । నగరిదెసఁ జూచుచునె మంతనంబు లాడి
చనిరి విద్యాంసుపిండ్ల(కు)' '[శృంగాటకము=నలుత్రోవలు గలిసెడు చోటు 4(8).

౧. వ. 'అకటకట వికటకూటకోటి విటంక శృంగాటకాఘాకమాన జరదిందు బింబ
గళ దమృతబిందు దుర్దినార్ద్రీకృత' మను. 1(72). [3(11).

౨.సీ. ఘనసానుశృంగ శృంగాటకంబులు గాంచి।యమరులు హేమాద్రి యనుచుఁ బ్రాల'

౩. గీ. 'ఘనశరశృంగ శృంగాటకములు వెంచి' కాశీ. 1(116).

౪. 'స్వాధ్యే నే హవనే పురీం విదధతీ మృత్యోః స్వకృత్యాత్యయ
క్రీడత్కింకర సంఘసంకట మహాశృఙ్గాటకా తాటకా' భోజచం. బాల. 80.

౫. గీ. అగజ భయమందఁ బ్రమథులు బెగడుగుడిచి,
యుపనిషత్తులు ఘోషించె నొక్కపెట్టఁ,
గాలకంఠుని వాలి శృంగాటకంబు,
గాండివంబునఁ గాటింపఁ బాండవుండు.' హరవిలాసము. 7 (10).

౬. ఉద్యానే జీర్ణకూపే చ వటశృఙ్గాటచత్వరే... । ఏషుస్థానేషు యే దష్టా స్తే న
జీవన్తిమానవాః.' కామరత్నము. సర్పవిషనివారణము. 4.

౭. శృంగాటకంబుఁ జైత్యము । నం గలమహీజంబుఁ బిత్ృవనస్థలమును దు
ష్టాంగన నుద్యానవనం । బుంగదియుఁగ రాదు రే విబుధవర్యునకున్.' విష్ణుపు.

౮. 'శ్రీరఙ్గార్య కవి ర్బభాణ లలితం శృఙ్గార శృఙ్గాటకం
భాణం కఞ్చన పఞ్చబాణ విజయారమ్భ ప్రియంభావుకమ్'—పఞ్చ. భాణ.

౯. 'శృఙ్గారీ సవయోభి రఞ్చతి సమం శృఙ్గాటకోపాన్తికమ్'—78.

౧౦. ధాతుశ్చతుర్ముఖీకణ్ఠ శృఙ్గాటకవిహారిణీం ।
నిత్యప్రగల్భవాచాలా ముపతిష్ఠే సరస్వతీమ్.' మురారి. 1(11).

౧౧. పురా పురాం భేత్తు రిహ త్రినేత్రీ । శృఙ్గాటకే తుల్యరుషి స్థితేపి
దగ్ధగిత్యజ్వల దేక మన్యే। తద్ధూమలేఖా మపినాసహే తామ్'—7(31).

౧౨. 'ఘనశృంగాటము నర్మనోర్మిపటలీ గర్జద్దిశాపేటముఁ.'—2(13)

౧౩. 'కలకల నవ్వు మేడలు పాడుగాఁ ద్రవ్వి।
శృంగాటకంబులఁ జిన్నఁబుచ్చి'—రామాభ్యు. 6(201).

౧౪. దృశ్య శృంగాటక దీర్ఘిక నాభిగాఁ। బ్రహ్మవ ప్రచక్రంబు పిఱుఁదు గాఁగ'—108.

౧౫. 'శృంగాటకచంద్రశాలకొనఁ గాలిచి'—246.

౧౬. 'కలిగియె వెలుఁగు శృంగాటకంబులు'—7(31).

౧౭. 'యత్ర కణ్వవర్త్మన్యపి సువర్ణాభరణే నిఖిలగుణశృఙ్గాటకే రతిమన్మథ నామ్ని నాటకే అన్యతో గవేష్యతే'—రతిమన్మథనాటకప్రస్తావన.

౧౮. ఉ. పాటిత దుష్టసత్త్వ వనవాటక నిష్ఠబలావరుద్ధ శృం।
గాటక గ్రంథిలభ్రుకుటి గాఢలలాటకఁ గ్రూరతారకా।
నాటక నాంత్రకాంచి పరిణద్ధశవప్రపతత్క్రిమిచ్ఛటా।
కీటక రక్తసిక్తపటుఖేటకఁ దాటకఁ గాంచిరయ్యెడన్, భాస్కరరామాయ.

౧౯. 'కదలి నిజకటకాంచితోత్కట గిరీంద్ర। కూటకందరవాటి శృంగాటకములఁ।
బాటిలుచు నుండు రహితు లేమేటివలన। నతఁడు వేంకటరామరాజాఖ్యవిభుఁడు.'

అభిషిక్తరాఘవము.

౨౦. సీ. 'అవనతాంగుష్ఠాగ్రగహర్మ్యనిర్వ్యప్రదత్న। ఖనిఘనాంతరిత శృంగాటకములు.'మను.6(102).

౨౧. తే. అన్నపూర్ణ విశాలాక్షి యనెడు శ్వేఁ। గాశికామధ్య శృంగాటకములయందు
విశ్వపతిదేవి మధ్యాహ్న వేళఁ బెట్టు। నమృతపాయసదివ్యాన్న మనుదినంబు.'కాశి.

౨౨. తే. అడ్డపెట్టెదఁ గాక తీవ్రాంశురథము। ప్రహరిదియగక యుండెంగ ధర్మగిరికిఁ।
దరతరంబ యుజాండకర్పరము దాఁక। ఘనశిరశ్శృంగ శృంగాటకములు వెంచి' 1(16)

౨౩. 'నగరం హిమవంతమివ...శృఙ్గాటకోపచితమ్' కవికల్పలత-శ్లేషస్తబకము - ప్రకీర్ణము 21. ['పక్షే చతుష్పథేన ఉపచితమ్'—అని టీక.]

౨౪. మదకుమ్భి కుమ్భ దమ్భ కుచకుమ్భ సంభావనీయరమ్భాభా పరీరమ్భ సంభార ఘుసృణ హరిణమద ఘనసారప్రభృతి సురభిద్రవ్య సంపాదన చటులభుజంగ పుంగవ సంగత శృఙ్గాటకోత్సఙ్గ హృదయంగమాయాః శ్రీరఙ్గనగర్యాః.' పంచబాణవిజయము.

౨౫. వ. వింధ్యంబు... విబుధశైలంబుతో స్పర్ధించి యూర్ధ్వాండ కర్పరంబు నిజశిరః శృంగ శృంగాటకంబుల నుద్ఘాటించు' కాశి. 2(98).

౨౬. వ. 'కాంచన శిరః శృంగ శృంగాటకంబులం గమలభవాండ కటాహంబు నుద్ఘాటించుచు తనమేనిహొడవు నేలసపాటంబుగా వంచి'—1(59).

౨౭. సీ. 'అభ్రంకషము లైన యానీశిరశ్శృంగ। శృంగాటకము లెట్లు చిఱుతపఱిచి.'—2(165).

౨౮. వ. 'పాటల జటాకిరీటుండు హాటకకూట శిఖరశృంగాటకాఖేటంబుల.'—3(57).

౨౯. మ. స్ర. 'అనివారవ్యాంట రాగానరిగి సకుతుకుండై పురోభాగభూమిన్
గనియెన్ నక్షత్రమార్గగ్రహాళి శిఖరశృంగాటకస్థాంధకస్ప
ర్ధినిరాఘాట ప్రకాశ వ్యగుణసిత మహాదీప్యమానాత్మరోచి
ర్ధుని కల్పీభూత సర్వద్రుమజలధి చతుర్ముద్రి నారాజతాద్రిన్.'

వరాహ. 6(82).

౩౦. వ. 'సముత్తుంగ శృంగ శృంగాటక నటన్మయూరంబుల,'—3(6).

౩౧. 'అమరమన్దిరైర్విరాజిత శృంగాటకా' కాదంబరి, పూ. 103(3).

3౨. 'భ్రాతృశ్రీరాఘవశ్రేయసే శ్రేష్ఠిమోకలః భ్రాతృసాజ్గలీ వాసహితో మార్గే శృజ్గా టకే మృష్టోదక పూర్ణాం వాపీం నిర్మిమీతే.'—ప్రా. లే. మా. 74,

33. 'యస్మిన్ జగన్మజ్గళ మస్తివస్తు । యస్మైస్వయంభూః స్పృహయ త్యజస్రమ్
తద్రోచ్ఛ్రితయో ర్లోచనయోః పథా నః। శృఙ్గాటకం నాటక మావిరస్తు.' ప్రతాప.

(27) 'ఝూట.'—౧౭.

'తదుద్దామదీర్ఘ సటా ఝూటముల్ బెల్లగించుగతిన్.' 4(22). 'విటపిఝూటమ్ములం బ్రతిశబ్దంబులు పుట్టింప' ... (35). 'శాఖోపశాఖాఇచ్ఛ ఝాటచరన్మరుద్రయ...' 6(15). ['ఝూట=గుంపులయందు' అని తుదిదానిటీక.']

౧. 'అలముకొని పెంటి చెఱలాటములుఁ గూటములుఁ ।
జలిపె నళిపక్షి మృగఝూటములుఁ గీటములు' రాఘవపాండ. 2(16).

౨. ఉ. 'శంబరవైరి నీవు...నిశాటఝూటమౌర్వం బడఁగించు బల్లిదునిపట్టివి నీవు' వసు. 4(48)

3. సీ. 'ఒకచోట మునికూటసకల ప్రణుతిఝూటము' ప్ర. రా. వేం. వి. వి. 80.

౪. క. 'కనకోజ్జ్వల కూటఝూట ఘనగోపుర...' హంసవిం. 1

౫. సీ. 'మదచండవేదండమండలు గ్రాండలు । ఘోటకచ్ఛట లార్కృ ఝూటకములు' తా. 5(1)

౬. శా. 'భూపామా క్తికకాంతి జేహురుచితోఁ బోరాట మాడి న్మరు
ద్వ్యాపారత్నకిరీట ఝూటనుషమా యోయుజ్యమానాంఘ్రిని
శ్శ్రేపశ్రీ విరిదమ్మి గద్దియనమాశ్లేషింపఁ గొల్వుండు వా
భాషాదేవిఁ దలంచెదన్ రసలసద్భాషా విశేషార్థ మై' నిరంకుశ. 1(7)

౭. వ. ఇట నతండును బ్రకటితవిటపఝూట హాటకసంఘాట సముచ్చాటన నిరాఘాటంబైన వేళ
వాటంబు చేరి'—,,—2(110)

౮. వ. 'ప్రకట వటవిటపి ఝూట పటల వేల్లిత ఝిల్లికా ఘుంకార ప్రతిధ్వానచంగ రంగమం
టపంబును...నగునొక్క పాడుగుడిఁ గాంచి'—,,—3(6)

౯. సీ. 'కైటభాదినిశాటఝూట ఖండనపాట। వాటోపకరుసోఁడిపాట లమర' కువల. 5(40)

౧౦. చ. 'అమిత నృపాల సాయకచయంబు నిశాటచమూ తనుత్ర ఝూ
టము వడిఁ దాఁకి పై కెగయుటల్ వినుతింపఁగ నయ్యె నార యూ
త్తమనవకాముకచ్ఛట ముదంబునవచ్చె నటంచు నిర్జర
ప్రమదల కెల్లఁ జక్కఁ దెలుపం జనుపెంపు వహించి యయ్యెడన్' చంద్రికా 8(114)

౧౧. 'ధారాస్ఫార కృపాణబాణపటలీ ధారాహతిం దచ్చతు
ర్ధిరీ శోణిత ఫాణిత ద్రవ నిపీతిప్రీతు లై తన్నుఁ జె
న్నారం బన్నగయక్షరాక్షసు లను స్తృప్రాతి చేతః స్ఫుర
త్స్ఫర సోఫర విహార ఘోర నటనా. ఝూటస్ఫుటాటోపు లై' ఉ. హ. 6(52)

౧౨. 'ఉత్తుజ్గ తరజ్గఝూటలుఠితఫణ ధరమణ్డలమూ
ర్ధన్య మణీ మహాపుఞ్జ రఞ్జితా న్తరతయా." వేమ. 1(138)

౧౩. 'కోటిరవిప్రకాశములఁ గుందఁగఁ జేయఁగఁద త్తనూప్రభా
ఝూటములోఁ గుమారుఁ డిల జన్మము నొందినమాత్ర...' బసవపురాణము 1(114)

౧౪. 'మర్దిత తాటకసాత్కృత ధీ।
విరచిత నాటక దండక ఝాట కవీంద్ర కిరీటకలాలలితా' తారాశశాంక 4(205).

౧౫. దం. 'హరిత్తురంగ ప్రభాఝాట పాటచ్చరోద్యన్మణీ కోటికోటీర' దశా.నృసిం. 158పుట.

౧౬. ఉ. 'నాటినభక్తిపాటవమునం గనియెం బిత్పఝూటయుక్ గుహా
కోటర కుంజపుంజగత కుంజర ఝూటము శాబరీకృతా
ఖేటము నిష్ఠురాఘశరఖేటము దివ్యమణిప్రభానిరా
ఘాటము నిర్ఝరీలహరి కంకణకోరకి తాగ్ర్యఘోటముక్.' వరాహ. 2(178)

౧౭. 'బల ఝాట స్థేమ చిత్రంబు.' చంద్రికా. 1(70)
(18) 'కుథ' గ్, 'గభమహాకుథము పై' 4(58), 'మణి వేఁకుధ(థ)ంబుపయిన్' 6(96), 'కవచితకుథా కర్బురలగు' 4(35) [ఇందులటీక—కుథా=పృష్ఠాస్తరణములచేత - 'ప్రవేణ్యాస్తరణం వర్ణః పరిస్తోమః కుథో ద్వయోః' అనియమరము.']

౧. 'శరధి శార్ఙ్గ। ఖేట కుథ ఘంటికొన్యలంకృతులఁ జెలువ। మెసఁగుగంభీ వేది భద్రేభశతము। నల్లునకు నిచ్చె గంధర్వవల్లభుండు.' మను. 5(98)

౨. 'అధ్యాసితాం కుథా, మేకాం హంసచిత్రరథాత్మజే' కాదంబరీ కథాసారము. 5(58)

౩. 'తఱచుగ రత్నచిత్రితకుథా పరివేష్టితదంతికోయముల్' శిశుపాల. 4(95)

౪. 'నిసర్గచిత్రోజ్జ్వలసూక్ష్మపక్ష్మణా। లసద్బిసచ్ఛేద సితాఙ్గసఙ్గినా
చకాసతం చారుచమూరుచర్మణా। కుథేన నాగేన్ద్రమివేన్ద్రవాహనమ్' మాఘ. 1(8)

౫. 'కనకకక్ష్యా కుథ సనాథంబులైన మదాంధగంధసింధుర సందోహంబులు...ఒక్కొక్క యొద్దున నొడ్డియోటువడినం జూచి విదురుండు,' సభా. ఆ. ౨(౧౭౭)

౬. 'కుథంబులతో...నాగంబులును' ఉ. హరి. 4(209)

౭. 'ధూతానిలేన మురశైన్యమహాగజానాం। సద్యః శతాని విధురాణి దశత్కుథాని' కుమా.17(29)

౮. 'తత్రం త్ర్యాపణచూర్ణయుక్త మథవా మద్యం హసన్తీం సతీం
తద్వత్కమ్బళరల్లకా నథ కుథాం శీతాతురః శీలయేత్' రోలంబరాజీయము

౯. 'కదళికాకుథకంఠ రజ్జుఘంటిక వచ్చి' వరాహ. 4(120)

౧౦. పీ. 'ఘంటాకుథాప్రముఖద్విపసన్నాహ। భూరితర త్వరాధోరణంబు. కళాపూ. 8(27)

౧౧. 'ఆక్షిప్తకేతు కుథసైన్యగజచ్ఛలేన.' మాఘ. 5(31) కాదంబ. పూ. 181(4)

౧౨. 'ఆసనోత్థిత భూమిపాలసంవర్తితానాం చ కుథానాం చ రత్నాసనానాం చ రాశిభిః'

౧౩. 'జఘనోపవిష్ట పురుషోత్సంగావస్థితద్విగుణకుథాభిః'—,,—193(4)

౧౪. 'ద్విగుణితకుథాసనోపవిష్టః'—,,—202(2)

౧౫. 'క్షితితలే విన్యస్తకుథప్రసుప్తయా పత్త్రలేఖయా సహ' 237(7)

౧౬. 'నివేశితబాహూపధానాయాం కుథాయాం నిపత్య'—,,—379(9)

౧౭. 'తురగాదవతారితం చ కుథోపవిష్టం చ'—,,—502(9)

౧౮. 'కుథంబులలోఁ బెటికిన మెఱుఁగుటమ్ముల' ఉ. హ. 4(218)

౧౯. 'శీర్ణోర్ణాశకల శిథిలమలినమలకుథైశ్చ

(12). 'కర్బుర' ౨౫

'కవచితకుథాకర్బురలగు కరివరకరేణు కంధరలన్' 4(35)

'కేయూరమణి కర్బురంబగు కూర్పరంబూని' 7(34)

౧. 'పురః కర్బుర కిర్మీరకిరణః కలచిత్రలః' కావ్యకల్పలతా. 2 శ్యామ.

౨. 'కర్బురాకృతియు' వసు. 5(42)

౩. సీ. 'తనవాలదంభోళి కినయుక్కర్బురగోత్రి। గరిమ కర్బురగోత్రగరిమ గాఁగ' వరసరా. 1(7)

౪. 'కర్బురకోఽహీః పురుషః కృష్ణా మృత్' బృహత్సం 54(42)

౫. 'ఇతి చైన ముఖాచ దుఃఖితా సుహృదః పశ్య వసన్త కిం స్థితమ్।
త దిదం కణశో వికీర్యతే పవనై ర్భస్మ కపోతకర్బురమ్' కుమా. 4(27)

౬. 'నీ చెలికానిం జూడు కపోతకర్బురం బైనభస్మం బైనవాఁడు' హరవిలాసము. 3(93)

౭. 'సాభ్యజ్ఞభూషానుభాగాబభాసే। సిద్ధార్థదూర్వాఙ్కురకర్బురాఙ్గీ' బాలభార. విరా. 4(59)

౮. 'ఉర్వీం క్రామ న్నర్వతా కర్బురేణ' అమృతోదయ. 2(22)

౯. 'నిర్ణయాపిషయ మస్య వాలతః। కర్ణికారనికురుమ్బకర్బురః।
నిర్మ మేషగణ భాగ్యసంచయా। దున్మిమేష భగవా నుషర్బుధః' భోజచంపువు, సుంద.97

౧౦. 'అవద్ధకర్బురితకేతుచామరై। రపయాతి మేవ హి విమానమణ్డలైః' ఉత్తర. రామ. 6(4)

౧౧. 'పరావర క్రీడిత కర్బురాణి। ద్వేధా నవన్ దౌహృదలక్షణాని' యాదవాభ్యుద. 2(2)

౧౨. 'అశ్మ క్రుజాత మనుయాతి న కర్బురీశః।
శ్యామాఙ్క కర్బుర వపు ర్వినాజ్ఞ మస్య' నైష. 1(101)

౧౩. 'స్ఫురత్కుణ్డలకౌ ఘుముఘువద్ధనుకర్బురః।
మేఘనాదోఽథ సంగ్రామే ప్రావృట్కాలఇ వాబభౌ' సరస్వతీ 2(369)

౧౪. 'నాగదన్తాద్యజన్యం గదాకర్బురమ్'—,,— 2(415)

౧౫. 'సముద్భిన్న రోమాఙ్కురకర్బురః శరీరస్తుతి మకరోత్'హమ్మీర ఉప 57.

౧౬. 'అస్రా ణ్యసూ న్యశ్మనకర్బురాణి' - తపతీసంవరణ 5(7)

౧౭. 'ఒకయెడ నూత్న మేఘునిచ యోజ్జ్వలకర్బురవర్ణతుల్యమై' -
దీనిమూలమే మాఘునందు 'క్వచి ల్లసద్ఘన నికురుమ్బ కర్బురః' 17(56)

౧౮. 'కర్ణాటాన్ధ్రివ్యతికరవశా త్కర్బురేగీతి గీః' హంససం. 1-(20)

౧౯. 'కపిశకదంబనం భూతియుఁ గర్బురాకృతియుఁ బుఙ్కరభూతియుఁ బూని' వసు. 5(42)

౨౦. 'కలని। స్వనకోకిలకర్బురికా। వనరేఖావంధ్య వింధ్యనగమున విడియన్'' నిర్వచ.ఉ.రా,

౨౧. 'బర్బరవారాహాకర్బురంబు' వరాహ. 1(64)

౨౨. 'సంధ్యాంశుభిన్న ఘనకర్బురితా న్తరీక్ష। లక్ష్మీకిడమ్బశిబిరం శివకీర్తనస్య' మాఘ. 5(68)

౨౩. 'క్వచిల్లసద్ఘననికురుమ్బకర్బురః। క్వచిద్ధిరణ్మయకణపుఞ్జపిఞ్జరః।
క్వచిచ్ఛరచ్ఛశధరఖణ్డపాణ్డురః। ఖురక్షతక్షతలరేణురుద్యయౌ—,,—17(56)

౨౪. 'దహ్యమానకాలాగురు ధూపపటలకర్బురేణ.' గద్యచింతామణి. 74 పు. 4 పం.

౨౫. 'మహావరాహ కేసరనికరకర్బురేణ' కాదంబ. పూ. 232(8)

(19) 'ఘుణ' (22) — "ఘుణ గణ విహరణఁ జివికెన। మణిధనువున' 4(41)

౧. క. 'ప్రతిపద్యము చోద్యముగాఁ। గృతి చెప్పిన నొప్పుఁ గాక కృతి నొకపద్యం

బలిమూఢుఁ డైనఁ జిత్రతఁ। బ్రతిపాదింపఁడె ఘుణాక్షరన్యాయమునన్' జ.వి.క్ర.1(1)

[ఘుణాక్షరన్యాయము వాఙ్మయములో పలుమాఱు ప్రస్తుతము.]

౨. 'న జాతమాత్రోఽసి హతోఽసి హా ధిక్। శశాఙ్కవంశైకఘుణ స్త్వ మేకః.' బా.5(19)

౩. 'వంశే ఘుణఇవ న విశతి దోషో రసభావితే సతాం మనసి' ఆర్యాసప్తశతి 41.

౪. ఘనతర తిమిరఘుణోత్కర జగ్ధానా మివపతన్తి కోషానాం॥

ఛిద్రై రమీభి రుడుభిః కిరణవ్యాజేన చూర్ణాని.' మురారి 2(53)

౫. 'పరస్పరస్పర్ధిపరార్ధ్యరూపాః। పౌరస్త్రియో యత్ర విధాయ వేధాః

శ్రీనిర్మితిప్రాప్త ఘుణక్షతైక। వర్ణోపమావాచ్య మలం మమార్జ.' మాఘ 3(58)

౬. 'ఘుణజగ్ధం కాష్ఠమివ అవినీతరాజపుత్రం రాజ్య మభియుక్తమాత్రం భజ్యేత.' నీతి.వా.

౭. 'గుడం కరఞ్జబీజం చ ఘుణచూర్ణేన సంయుతం।

సమం పానేఽథవా ధూపే మోహం ప్రకురుతే నృణామ్.' సిద్ధనాగార్జునకక్షపుటి, మోహ

౮. 'పురుషా వివరం ప్రాప్య కేఽప్యలక్షితసంభవాః।

దూషయన్తి మహావంశా న్ముఖే తీక్ష్ణా ఘుణా ఇవ' కవిరాక్షసీయము. 19.

౯. 'ఘుణేన ప్రోత్కీర్ణా త దహహ శిలా వజ్రఘటితా.' కంసవధ 2(13)

౧౦. 'శౌర్యరాశే రార్యస్య కశ్చిద్దధతి కోణపఘుణనిఘాతాం విపత్తిమ్' భోజ చం. అరణ్య60.

౧౧. 'షట్చరణకీటజుష్టం। పరాగఘుణపూర్ణ మాయుధం త్యక్త్వా।

త్వాం ముష్టిమేయమధ్యా। మధునా శక్తిం స్మరో వహతి' ఆర్యాస. పా. 1.

౧౨. 'త్రైలోక్యవిజయాద్ధత్యై నిత్యదుర్లలితస్య సః।

ఘుణక్షతలిపిప్రఖ్యః। కాదాచిత్కః పరాభవః" అద్భుతదర్పణము 7 అం.

౧౩. 'ఘుణాక్షరస్యేవ విధాన మత్ర। త్వం నిర్మితా దేవి తథా విధాత్రా

విధే స్తు జానామి సుకౌశలత్వం। త్వద్రూపకల్పా యది దృశ్యతేఽన్యా' వి. ద్యా. కావ్య

౧౪. 'అయం ఘుణాక్షరన్యాయో యద్వరాధో హతో.. మునా

శక్తిరస్యాస్తి చే ద్యోద్ధుం పర్భయ త్వేష తాం మయి' - జానకీపరిణయ 6 అం.

౧౫. 'తవ ముఖరవదనదోషం। సహమానా మోస్తు మత్కృమా సుతనుః।

సా వహతి విట భవన్తం। ఘుణ మన్తః సాలభఞ్జీవ.' —,,— శాది 16

౧౬ 'లోకాశ్రయో మణ్డప మాదిసృష్టి। బ్రహ్మాణ్డ మాభాత్యనుకాష్ఠ మస్య

స్వకాన్తిరేణూత్కరవా న్తిమన్తి। ఘుణ వ్రణద్వారనిభాని భాని.' నై ష. 22(26)

౧౭. 'సత్యభామా తు త దాకర్ణ్య ఘుణాక్షర న్యాయాగతమివ

రభసవాద మిమ మాశఙ్కమానా." పారిజాతాపహరము 3.

౧౮. 'కా శ్లాఘా ఘుణ జర్జరేణ ధనుషా। కృష్టేన భగ్నేన వా' బాలరామాయణనాట· 1(51)

౧౯. కాష్ఠంబుగొని ఘుణకీటకం బగు' మార్కండేయ,

(8) 'కతక' ౧౪

'కుంభసంభవుఁడ నకతకంబు.' 4(146) 'నగాటవీకతక పరాగము,' 5(188)

౧. ప్రకృతి ముపనయన్తి వాంధానిం। కతకగజాంసి రజోన్తరాపకర్షాత్' అమృతోదయ. 4(77)

౨. 'వఞ్జుళతిల కామలకకుటజ లికుచ కతక తక్కోల...' భో. చ. నుం. 25.

౩. 'కణచరభారతీకలుష కల్లోలినీ కతకక్షోద సంశోధహైః' పఞ్చబాణ.

౪. 'అజ్ఞానకలుషం జీవం జ్ఞానాభ్యాసాద్విర్మలం।
కృత్వా జ్ఞానం స్వయం నశ్యే జ్జలం కతకరేణువత్' ఆత్మబోధ.

౫. 'కిన్ను ధ్వాన్తపయోధరేవ కతకక్షోదైర వేన్దోః కరై
రత్యచ్ఛీయ మధశ్చ పఙ్క మఖిలం ఛాయాపదేశా దధూత్
కింవా తత్కరక ర్తరీభి రభితో నిస్తక్షణా దుజ్జ్వలం
న్యోమ్నై వేద మితస్తత శ్చ పతితా శ్ఛాయాచ్ఛలేన త్వచః' అనర్ఘ. 2(75).

౬. 'అమలసరళనిచుళ ... తిలక కతక కరక రుచిక' ... మందార మకరందచంపువు.

౭. ఛా. 'శ్రీవస్తుపాలకీర్తి కతకక్షోద సంగమోల్లసితా।
అధరితరిపుకులపఙ్కా। జయతి మతి స్తేజః పాలస్య,' హమ్మీరమదమర్దననాటక-(5-1)

౮. కాతుకకఙ్కతక కేతకీకేతక ...' కా. క. ల, 118 పు।

౯. త. 'కురవ కాశోక వకుళ తక్కోల కేత। కీ కురంటక కుటజ కంకేళి కతక
కాక తిందుక కింశుక క్రముక తిలక। కాఞ్చనకదంబ కలిత మకాననంబు' నిరం కు 6(67)

౧౦ 'ఫలం కతకవృక్షస్య యద్య ప్యమ్బుప్రసాదనమ్।
న నామగ్రహణా దేవ తస్య వారి ప్రసీదతి' మనుస్మృతి 6(67)

౧౧. 'న కతకం పఙ్కప్రసాదనాయ' వామనకావ్యాలంకార సూత్రము - 2(5)

౧౨. 'న హి కతకం పఙ్క ఇవ పఙ్కస్య ప్రసాదనాయ ప్రభవతి' —,,— టీక.

౧౩. సీ. 'వానకాలమునాఁడు పండువట్టననిటి। కాలుష్య ముడిపెడు కతక ఫలము.' కాశీ. 2(160)

౧౪. 'కతకస్య ఫలం నేత్ర్యం జలనిర్మలతాకరమ్। వాతిశ్లేష్మహరం శీతం మధురం తువరం గురు'
మదనపాల. 6(26.)

(55). 'పాడబ' ౪

'నానావిధపాడబములు। నానున్నపాహారము' 4(281)

['పాడబములన్=రుచులతో' అని టీక.]

౧. 'పరమాన్నశర్కరా। పాడబగోఘృతేక్షురసశాకములన్' పాం. రం. మా. 2(105)

౨. 'పాడబరసావళీ రసావళీ పానకప్రచురంబును' భీమేశ్వ. పు. 2(144) ౩. 'శాకపాకరసావళీ పాడబములు' కాశీ. 4(119) ౪. 'పాడబంబులతోడఁ బానకంబులతోడ'—,,—7(135)

(18). 'దివాకీర్తి' ౨

'తనదివాకీర్తి జని నగుపరమార్తి' 6(10)

౧. 'ధిక్పుణ్డరీకత న్తు। ప్రాప్తోఽ స్యేతాం దశాం యు త్త్వమ్
మునితనయత్వే మహా స్యా। పతితః పాణౌ దివాకీర్తేః' అభినవకాదంబరి 232.

౨. 'అస్తిఖల్వస్యా మేవపురి ప్రకృతిపురుష స్యేశ్వరవర్తే ర్దివాకీర్తేర్గ్న ప్తా.' య.తి. పు40శపం.(14)

(36) 'ప్లవ' ౧౯

'కృకవాకుధ్వజ దీర్ఘికా ప్లవతపః క్రీడోత్సవాద్యుత్సుకా' 3(90)

['ప్లవ=ఈఁదులాట' అనిటీక.] [తెప్పయగునా?]

'బట్టలెల మించఁ బ్లవుఁ జేరఁ బాలు తెంచి' 6(46)

['ప్లవుక్=అనురియాఘుని' - అని టీక,]
'లహరీప్లవనప్లవ భావభాక్' 6(49) ['ప్లవ=తెప్ప' టీక,]
'పుళింద్లప్లవబృందంబుల్ వనిన్' 6(75)

౧. 'యస్మిన్ లాఙ్గలిగన్ధసారనివహాః సోద్వేగపూగ ప్లవాః।
శైలాపాశ్చ పలాశి ః. - రుక్మిణీపాణిగ్రహణము. 9(3) ['ప్లవాః=చణ్డాలాః' అనిటీక.]

౨. 'సిన్ధుః ప్రసన్నాప ఉదారభఙ్గః కీలాలపో గోపయతి ప్లవాదీన్' రుక్మి. పాణి; 1(69)
['ప్లవాదీన్=చణ్డాలాదీన్' - టీక.]

3. 'ఇతి కోపనపద్మపన్నగీ గరళోర్మిప్లవకల్పయా గిరా
పరిపేతు రుపేతమూర్ఛనాః క్షితిపీఠే క్షితివల్లభాదయః' బాల. భార. కా. స్త్రీ. 1(7)

౪. 'మనోజ్ఞహంసకులాధిరాజ రామాభిరామ ప్రస్థాన విశేషంబు గావున నకుంఠితతరో విజృంభమాణ నానాప్లవగ వీరారాజకోలాహల లీలాచుళుకిత దిశాంతంబై' చంద్రికా. 4(68) (383 పు.) (14 పం) ['ప్లవ=తెప్పలయొక్క'టీక.]

౫. 'వనుకకుమారీప్లవాది పురవారాః' రుక్మి. పాణి. 2(40)
['ప్లవాద్యాః=ప్లక్షాదయః...ప్లవాదయశ్చండాలాద్యాః' - టీక.]

౬. సీ. 'జానకీరఘురామచంద్ర ఘోరవియోగ। కాండాకరప్లవదండవరము' ప్ర.రా. వేం.వి.వి.

౭. సీ. 'కాంతినిర్ఝరమిాంను కామయౌవనములు।కుంభప్లవను లింతి కుచయుగంబు'శృం.నై.2(15)

౮. 'అష్టౌ ద్వీపాద్రిరత్నోర్మిపోతయానోజలప్లవాః' కవికల్పలత - వర్ణ్యస్థితి 13

౯. స్యాతా మాగధచరదూ। తమూతపోతప్లవనటాద్యాః' బృ. సం. 10(10)

౧౦. వ. 'మతియు నన్నదీప్రవాహరత్నంబు......ప్లవాకీర్ణంబయ్యును బరమహంసనేవితంబై.' శ్రీరంగమా. 1(88)

౧౧. 'దురితోదన్వదావర్తే ఘూర్ణమానస్య దుఃఖ్యతః సమగ్రగుణసంపన్నః తారక స్త్వం ప్లవో మహాన్' యాదవాభ్యుదయ. 1(54)

౧౨. 'అకృతసేతు మనాకలితప్లవాం। జననసిన్ధుదృఢప్లవ ముద్వహన్
రవిసుతా మతిలఙ్ఘ్య రమాపతిం। సపది ఘోషసమీప మపానయత్' 3(44)

౧3. 'ఇతి స్నుత స్తన్య రసా యశోదా। చిస్తార్ణవేన ప్లవమన్వపిన్వత్'—,,—4(66.)

౧౪. 'స్వేదప్లవప్రణయినీ తవ రోమరాజిః' నైష. 11(123)
['స్వేదప్లవే=ఘర్మజలస్నానే' - టీక.]

౧౫. 'స్మరయౌవనయోః ఖలు ద్వయోః ప్లవకుమ్భౌ భవతః కుచా వుభౌ.'—,,—2(31)
['ప్లవస్య=సన్తరణస్య' - టీక.]

౧౬. 'డిండీరమండల ప్లవరిరంసుహంస.' వరాహ. 10(122)

౧౭. 'ప్లవోదిత। భ్రమీనిమీలల్లలనావలమ్బితైః' మాఘ. 12(71)

౧౮. 'పాలప్రాపణ ప్రవీణాఅప్యపేత పాళయన్త్రిణా మహాప్లవాః' గద్యచింతామణి. 134(13)

౧౯. 'ఇంటనైన సకలగర్హితస్థలమునం బ్లవగేహమునందునైన' పాండు 5(63)

(24) 'చండాతక' ౯

'పిష్టాతకంబు నభోమండలికిం జండాతకంబై' 4(35)

['చండాతకంబై=అర్ధోరుకంబై'-టీక.]

౧. 'అర్ధాలక్ష్యమనోహరోరుయుగళీ చణ్డాతకాలమ్బనాత్।
వక్షః కఞ్చుకకేన సామిపిహితవ్యక్తస్తనం బిభ్రతి' రససదన,

౨. 'హస్తోదఞ్చితదారుఖణ్డలతికాః కౌసుమ్భచణ్డాతకాః
చణ్డాః కేపిజవేన సన్నిదధతే సాడమ్బరాడమ్బరాః' పంచబాణవి.

౩. 'శ్లథైర్దృఢైః స్తమ్భయుగస్య రమ్భయోః। చకాస్తి చణ్డాతకమణ్డితా స్మ సా.' నైష. 16(8)

౪. 'ధృతబర్హాచణ్డాతక బర్హిణ వితన్యమాన లలితలాస్యే'-వేమ.6(109 పు,)

౫. 'గమ్భీరేణ గర్జితాలోద్యరవేణ కలితకలాప చణ్డాతకాని గృహశిఖణ్డి మణ్డలాన్యకాణ్డే
తాణ్డవయన్తమ్'—,,—3(127పు.)

౬. 'కుసుమ్భరాగపాటలం పులకబన్ధచిత్రం చణ్డాతక మాదధానా' హర్ష. (2)

౭. 'కార్దమికచేల చీరకానియమితోచ్చచణ్డాతక.'

౯. 'కేతకీగర్భపత్త్రపాణ్డురస్య చణ్డాతకస్య ఉపరి శ్యామతరీకృతకుక్షిః కఞ్చుకబన్ధంవిధాయ'(2)

(11) 'కర్కరీ' ౬ (కర్కరీ * కర్కటీ)

'ఘృతపిండనిభకర్కరీ ఖండములతోడ' 2(73)

'ముష్టికతోరార్పణకర్కరీఫలితకేశిక్రూర ...' 3(90)

[కర్కరీఫలిత=దోసపండుగాఁ జేయఁబడిన' అని పూర్వటీక.]

'పాకనిర్దళితమహోఘరౌఘ హారితచ్ఛద కర్కరికావనాళినా' 4(140)

['కర్కరికా ...=దోస...' - టీక.]

ఈశబ్దము నిఘంటువులందు ఎక్కడను నాయలంతి పఠనములో దోసకు పేరుగాఁ గనఁబడలేదు. ఉన్నచోట దీనికి గిండివంటి మట్టిపాత్ర అర్థము. కర్కటీశబ్దము, దోసవాచకము.

'కర్కర్యాలుర్గళన్తికా' అమర. 'కర్కరీ(?)ఖాణ్డఖడేనా(?) దర్పణేకఠినేత్రిషు' విశ్వమేదిన్యౌ, దోసకునుంబేరయిన ఆయర్థము ఇందుండవలదా?

ఋతుచక్రములో—పుట 63(229) 'అలమధ్యకర్కరికౌననములు' - చంద్రాంగదచరిత్రము. 'నెమ్మది గాదములోనిదోసకాయలవలె' వరాహపురాణమున - 24 'ఘర్ఘరికల్'-'కర్కరికల్' అనుటకు. 'కర్కటీ శీతలా రూక్షా గ్రాహిణీ మధురా గురుః కర్కటీ లోమశీ వ్యాళపత్త్రీర్వారు బృహత్ఫలా॥' మదనపాలనిఘంటువు.

'ఉర్వారుః కర్కటీస్త్రియౌ.'అమర. ఆముక్తమాల్యదయొక్కపూర్వటీకలో ప్రకృతోపయోగిగా ఈనిఘంటువాక్యమే 'కర్కరీస్త్రియౌ'అనియుద్ధృతము. 'ఉర్వారౌ శూకశిమ్బ్యాం చ కర్కటీ మర్కటీ క్రమాత్' అనిటాంతములలో నానార్థరత్నమాల. (ఇందులటీక.—కర్కటీ, మర్కటీ, సీ॥ ఈరెండును వరుసగా దోసకును దురదగొండిచెట్టునకును పేరులు.')

ఇట్లు 'కర్కరీ'శబ్దము దోసవాచకముకా దనియు, దోసవాచకము 'కర్కటీ'శబ్ద మనియు నేర్పడుచున్నది. ఆముక్తమాల్యదలోని తొలియుదాహరణములో కర్కరీశబ్దమున రీకారము యతిలోనున్నది. కాశీఖండమున-

౧. వ. 'పాయసంబులఁ గర్కారీకారవేల్ల కూష్మాండనిష్పావక పటోలికా......' 7(185) అని
నవీనప్రాచీనముద్రణంబులు సమముగ నున్నవి. మఱియు-
౨. 'కర్కారీ కళాచికా పీతగండోపధా నమణిముకుర శయ్యాకటాహారి(సనం?)బులకల్మియు'
5(275) ఇట నిది గళంతికావాచకము.
౩. 'కర్కారీపాదుకా వీటికాకరంక పేటికలు దాల్చి' - 5(294) (గళంతీపరము)
ఇశ్లే - 'సుశీలోఽపి సువృత్తోఽపి యాత్యదానా దధోఘటః।
పునః కుబ్జాపి కాణాపి దానాదుపరి కర్కరీ' పంచతంత్రే. 2(78)
'విష్ణ్వాత్మమిత్రమ త్రాగ్నిం దూరతః క్రూరతాం గతం।
క్రూరతాం వాయువోఽప్యాపుః కర్కరీకృతపర్వతాః॥' బాలభార. సౌప్తి - 1(74)
[ఇటనిది తునుకవాచకమగు కర్కరీశబ్దము గానోపు]
౪. 'వామనేత్రాకరాంచలావర్జ్యమానః కనకభృంగారకర్కరీకాముఖాగ్ర
గళితగంధోదకంబులఁ గంపవైరి। చేతులకుఁదార్చు బాంధవశ్రేణితోడ.' పారి 2(20
౫. గురుశైలోన్నతగాత్రులు లుద్ధతభుజోగ్రుల్ వజ్రపాషాణ
కర్కరులర్కప్రతిమానతేజులు గుహాకల్పు ల్మహాకల్పభీ
కరకాలాంతకకల్పు లాజినిపుణుల్ గర్వోన్నతుల్ యుక్తివా
నరవీరుల్ జనియించి రెల్ల యెడలన్ నానాయుతప్రాణులై.
(కర్కర = కఠిన). భార. 6ఆర. అ. 270 (292).
౬, కణ్టకితకర్కారీచక్రాక్రాన్త కాష్ఠయష్టికాకుటీ త్రపాను......అటవీప్రవేశ ప్రపాణాం
శైత్యేన త్యాజయన్తీమివ గ్రైష్మ్యకా-' హర్ష 77.
౭. అవిరహితరాజమాషత్రపుష కర్కటికా కూష్మాణ్డాలాబు బీజైః......
అటవీకుటుమ్బినాం గృహైః' హర్ష 77.—కర్కటీశబ్దమునకు:-
౮. 'స చ పీవరత్వా ద్వృతిభఙ్గం విధాయ కర్కటికాక్షేత్రే శృగాల సహితః ప్రవిశతి' పంచ
తంత్రము, అపరీక్షిత. 6 - వకథ ; కావున దోసవివక్షిత మేని 'కర్కటీ' యనిపఠింపవలయు.
యతిభంగమగును. 2(73)లో చెఱకు అర్థము.
౯. 'ఘనమూలో రసా లేక్షు గుడమూలా స్సపత్త్రికః।
కాన్తారః స్యా త్కర్కరకా పౌణ్డ్రికస్తు రసాలకః' అభిధానరత్నమాల.

ఉదాహృతశాకీఖండాది వాక్యములయందు కర్కటీ అనుటకు బదులు 'కర్కారీ' అను పాఠము ప్రకృతాముక్తమాల్యదాపాఠమువల నిభ్రమచేతనే ముద్రకకృత మనియు - ఇట కర్కారీ శబ్దము (పౌండ్రక అనఁగా తెల్లజెఱకునకు వాచకమనియు తలంపవలయును, అటయిన 'రసదాడిగనెలకోడు' అనుచో మరల చెఱకునకుఁ జెప్ప నేల అని యాక్షేపము. ఇట రసదాడి యనఁగా కదళీవిశేషముగాని చెఱకు గాదు. దనికి కదళియు అర్థమే. అటయిన ఆదిలోనే చెప్పిన సురభిరంభాఫలములు ఎక్కువగాదా యనిన, అవి సుగంధియారఁటు లనుకదళీ విశేషము లనియు, కొనవచ్చును. అట్లు చేసినచో దోసను చెప్పవలదా? ఏమిచెప్పకున్న? అద్భుతమయిన కడమ ఫలములరుచిని చెరుపుటకా?

(16) కికట (కీకట?) ౯.

శ్రీరస్తు.

# ఆముక్తమాల్యద.

## ప్రథమాశ్వాసము.

ఇష్టదేవతాస్తుత్యాదికము.

ఉ. శ్రీకమనీయ హారమణిఁ జెన్నుగఁ దానును, గౌస్తుభంబునం
దా కమలావధూటియు నుదారతఁ దోఁపఁ, బరస్పరాత్మలం
దాకలితంబు లైన తమ యాకృతు లచ్ఛతఁ బైకిఁ దోఁప. న
స్తోకత నందుఁ దోఁచె ననఁ, శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్. ౧

శ్రీ ...... దన్. - శ్రీ = లక్ష్మియొక్క - కమనీయ = మనోహరమయిన (మణికి విశేషణము) - హార = ముత్తెపుఁబేరుయొక్క ('హారో ముక్తావళీ' అమ.) - మణిన్ = నాయకరత్నమందు 'మణిః స్త్రీపుంసయో రశ్మజాతౌ ముక్తాదికేపి చ' మేదిని.) చెన్నుగన్ = స్ఫుటముగా, తానున్ = వేంకట భర్తయు, కౌస్తుభంబునందున్ = (క్షీరసాగరోత్పన్నమై హరివక్షస్థలాలంకారభూతమయిన) కౌస్తుభాఖ్యమణివిశేషమందు, ఆ కమలా వధూటియున్ = ప్రసిద్ధురాలయిన లక్ష్మి యువతియు ('లక్ష్మీః పద్మాలయా పద్మా కమలా శ్రీర్హరిప్రియా' అమ. 'వధూటచిర్భిటీ శబ్దౌ యౌవనస్థాంగనావాచినౌ' సి. కౌ.), ఉదారతన్ = స్ఫుటముగా, తోఁపన్ = అగపడఁగా, పరస్పరాత్మలందున్ = ఒండొరుల హృదయములయందు ('ఆత్మా యత్నో ధృతి స్స్వాత్మ స్వభావ పరమాత్మను జీవ బుద్ధి శరీరేషు.' నానా.; 'చిత్తం తు చేతో హృదయం స్వాన్తం హృన్మానసం మనః' అమ.), ఆకలితంబులు = నెలకొల్పఁబడినవి, ఐన - తమ యాకృతులు = మహాలక్ష్మీవేంకటభర్తలయొక్క స్వరూపములు, అచ్ఛతన్ = (దేహములయొక్క) స్వచ్ఛత్వముచేత, పైకిన్ = వెలుపలికి, తోఁచి = అగపడి, అస్తోకతన్ = గొప్పతనముచేత ('స్తోకాల్పక్షుల్లకాః' అమ.), అందున్ = ఆ నాయకమణియందును ఆ కౌస్తుభమందును, తోఁచెన్ = అగపడెనని, అనన్ = అనునట్లుగా, శోభిలు వేంకటభర్తన్ = ప్రకాశించుచున్న వేంకటేశ్వరుని, కొల్చెదన్ = సేవించుచున్నాను. [వేం పాపం - కటతి ఆవృణోతి హరతి ఇతి వేఙ్కటః - వేంకటమని శేషశైలమునకు పేరు. పాపమును హరించును అని ఆపదమున కర్థము. ఆకొండకు దొర(అందు నివసించువాఁడు) గాన వేంకటభర్త యని భగవంతునికి పేరు.]

లక్ష్మీవేంకటేశ్వరులు ఒండొరుల కెదురుగాఁ గూర్చున్నప్పుడు, లక్ష్మియొక్క ముత్యాల సరంపు నాయకమణియందు వేంకటేశ్వరస్వామి స్ఫుటముగా ప్రతిబింబించెను, అట్లే వేంకటేశ్వరస్వామి హృదయమందలి కౌస్తుభమణియందు లక్ష్మి చక్కఁగా ప్రతిబింబించినది. ఆ ప్రతిబింబించుట ఎట్లుండె ననఁగా—ఆమెహృదయమం దున్న వేంకటభర్త, ఆహృదయము స్వచ్ఛము

గావున అందుండి వెలికి తోఁచి అట వెలుపల నున్న స్వచ్ఛనాయకమణియందు అగపడినట్లును, ఆయనహృదయమందున్న లక్ష్మి ఆహృదయముయొక్క స్వచ్ఛతచేత వెలికి అగపడి అటవెలుపల కౌస్తుభమణియందు అగపడినట్లును ఉండెను. అట్లు లక్ష్మియుక్తుఁడై మహానందములోనున్న వేంకటేశ్వరస్వామిని సకలమంగళప్రాప్త్యర్థమై కొలిచెదను.

ఇట లక్ష్మీనారాయణులు ఒండొరులను స్వాభిముఖవ్యక్తాంతరములనుగా భావించుట గాదు. మఱియే మనఃపూర్ణత్వప్రత్యర్థమై అభేదభావన వహించి యనవలయు. అనఁగా శ్రీ తన్ను హరినిగాను హరి తన్ను శ్రీనిగాను భావించుట చెప్పఁబడినది. అట్లైనచోఁగాని హరికౌస్తుభమందలి లక్ష్మీముఖమును, లక్ష్మీమణియందలి హరిముఖంబును బహిర్వ్యక్తములు గావు.

ఈపద్యమందు లక్ష్మీవిశిష్టుని వేంకటభర్తను ప్రధానీకరించుటచేత కవి ఈప్రబంధమందు విశిష్టాద్వైతమతము ప్రతిపాద్యమని సూచించినాఁడు.

విష్ణువుయొక్కయవతారాది విశేషములు ఎన్నియో యుండఁగా అందు వేంకటభర్తనే కవి యిటం గొలుచుటకుం గారణము "సకల వేంకటపతి యిష్టమైనవేల్పనుటన్" అని వక్ష్యమాణ భగవద్వాక్యము (౧ ఆ. ౧౬ ప.) చే స్పష్టము.

ఇందు శ్రీహరుల యన్యోన్య సానందాభిముఖ్యావస్థను జెప్పుటచేత పరస్పరాత్యంతానురక్తి సూచితము.

ఇందు ప్రతిబింబములను బైకగపడిన మనోగత మూర్తులనుగా సంభావించినందున ఉత్ప్రేక్షాలంకారము; 'అనన్' - తద్వాచకము.

"ఫలితను హేతుత వస్తుత। నలరెడు సంభావనంబు లగు నుత్ప్రేక్షల్." అలం.

సకలశుభార్థము కావ్యాదిని శ్రీకారము ప్రయోగింపఁబడినది.—

"వేదములకెల్ల నోంకారమాద్యమైన। కరణిఁ గృతులకునెల్ల శ్రీకార మాది;
కానఁ గవివరులెల్లను దానిఁ జెక్కు। నితరవర్ణంబు లిడరు సత్కృతుల మొదల."

"పదపడి శ్రీకారము కృతి। మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును। గదిసి సువర్ణంబు సేయుకరణిన్ ధరణిన్."

"శుభదేవతాత్రయంబును। శుభఖచరత్రయము గలిగి శుభవాచకమై
యభినుతిఁ గాంచినకతమున। శుభములు శ్రీకారమునను జొప్పడు టరుదే." అప్ప.

ఇందు ఉత్పలమాలావృత్తము.—

"ఉత్పలమాలలో భరన లొప్పును భారవలుం గిశాయతిన్."

కావ్యాదియందలి భగణమునకు ఫలము.—

"రసము హాస్యంబు, వన్నియ రజతనిభము,
ఫలము ధన హేమ మణి వస్త్ర పశు తనూజ
పరిజనారోగ్యాది సంప్రాప్తి, భగణమునకు
దానవవినాశ కామెపల్లీనివేశ." అప్ప.

భూమాత్రే సర్వసస్యాఢ్య భువ్యపి' హేమ.), వంచనన్ = మోసముగా (అనఁగా లక్ష్మిని మోసగించి), కూడఁగాన్ = పొందుటకై, కలు.....రలు - కలుగు = ఉన్నట్టి - భాస్వత్ = ప్రకాశముగల - చంద్రశాలా = మేడలయొక్క ('చన్ద్రశాలా శిరోగృహమ్.' హలా.), పరంపరలు = పంక్తులుగా, అయ్యెన్ = అయినవో (ఉపయోగపడినవో), దాంతునిన్ = ఇంద్రియనిగ్రహము కలవాఁడును, అతీ...తునిన్ - అతీత = దాఁటఁబడిన - బ్రహ్మ = బ్రహ్మయొక్క - కల్పాంతునిన్ = ప్రళయములు గలవాఁడును ('సంవర్తః ప్రళయః కల్పః క్షయః కల్పాన్త ఇత్యపి.' అమ.), (అయిన), అయనంతునిన్ = ఆశేషాహిని ('శేషో౽నన్తః' అమ.), నిరంతరమున్ = సర్వదా, భజింతున్ = సేవించెదను.

వారికి లక్ష్మియు భూమియు భార్యలు. అందు లక్ష్మి యెప్పుడును ఆయనయొక్క వక్షఃస్థలమందే ఉండును. కావున ఆమె యెఱుఁగకుండ భూదేవిని కూడుట వానికి శక్యము గాదు. భూమిని హరి కూడుట లక్ష్మికి సవతికి ఇష్టము గాదు. ఇట్టియెడలో ఎప్పుడేని లక్ష్మికి తెలియకుండ హరి తన్ను కూడునేని అందులకై ప్రార్థించుచు ఆయనం బొందుటకై భూదేవికి ఆయనయునికి విశాలపుం బడగలపంక్తులు ప్రకాశమానములయిన మేడల వరుస లనఁ బట్టియున్నవో ఆయనంతుని జితేంద్రియుని బ్రహ్మకల్పములకన్న నక్కుడు కాలముండువానిని ఎల్లప్పుడును సేవించెదను.

'ఒక్కప్పుడు' అనుటచే అరుదుగాననియు, సిరిని కనుమొఱంగుట లెస్సగా ఘటిల్లదనియు, భా. మొఱంగుటకును చేరుటకును కష్టముగా 'హరిని' జెప్పుటచే వానికి భూదేవియందుఁగల ప్రేమాతిశయమును సూచితము. ఆ ప్రేమాతిశయమునకే భూదేవి 'ప్ర' మిక్కిలి - అర్థించుట'. సర్వసస్యాఢ్యయగుటను నర్థమునకుల 'యుష్మద్రూపశ్రమప్రయోగము' అలంకృతియని సూచితము. 'ప్రార్థించు సర్వద' యనుటచే సస్యరూపమైన రోమాంచము దాల్చెననియు ధ్వ. 'వంచనన్'- వాస్తవమయిన చంద్రశాల లనుకొనని అందుండునని శంకకలుగును, పడగలు గావున అట్టిశంక గలుగదు; అట్టిశంకకు అవకాశము లేకుండఁ జేసికొనుటయే వంచన. 'భాస్వ...' - పడగలు మణులుగల వగుటచేత.... 'దాంతునిన్' - తనయందే ప్రేమికులు ప్రార్థించుచున్నను నిర్వికారుఁడనుట. అట్టిమహనీయుఁడు గావునను, వానికిని భూదేవికిని అట్టిమహోపకారం గావునను తదనుగ్రహముచేత 'అతీతబ్రహ్మకల్పాంతుఁడు,' అవశ్యసేవ్యుఁడనుట.

ఇందు ఫణములను చంద్రశాలలనుగా సంభావించినందున ఉత్ప్రేక్షాలంకారము.

'కన్నుమొఱంగి' - 'తుది నులులక్రింది నలలకు లోపంబు బహుళంబుగ నగు'. (బా. ప్ర. 8.) కావున 'కనుమొఱంగి' అని యేర్పడి, 'పదాంతంబుల యసంయుక్తంబు లయిన నులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు.' (బా. ప్ర. 16) అను సూత్రముచే 'కనొ్మఱంగి' అయినది.- 'తనుఁజెరన్' అనియుండఁగా, బా. ప్ర .16. చేత ఉత్వలోపము రాఁగా, 'పాలఁతి' ఇత్యాదులయందు అత్వమునకుఁగూడ తదాశ్రితమగుసరుసున్న పోయి 'పాల్తి' అయినట్లు, 'తజ్జరన్' అని యైనది.- 'పఱపు' - 'స్త్రీసమంబులగు విశేషణంబులయు...బహువచనంబున కేకవచనంబు బహుళంబుగా నగు' (బా. కా. 20); కావున 'పఱపులైన' యనియుం జెప్పనగు.- 'సిరిని కనొ్మఱంగి' - ఇట ద్వికర్మకత్వ మంగికర్తవ్యము. - 'పంప్తుల్' - బా. ప్ర. 16.

చెడుపనులయొక్క - పంక = పాపముతోడి ('పఙ్కోఽస్త్రీ కర్దమే పాపే' మేది.) - సంకర = కూడికగలదైన - దైత్య = అసురులయొక్క - అసు = ప్రాణములయొక్క ('పుంసి భూమ్న్యసవః ప్రాణాః' అమ.) - పరంపరన్ = వరుసను, కముచు రేఖన్ = కప్పుకొను రీతిగా, పొల్చు = ప్రకాశించుచున్నట్టిది, రాకా.... తి - రాకా = నిండుపూర్ణిమయందలి - నిశాకర = చంద్రునివలె - గౌర = తెల్లని - ద్యుతి = కాంతిగలది (ఉపమ), (ఐన), పాంచజన్యము = నారాయణునిశంఖము, కల్యాణసాకల్యమున్ = మంగళములయొక్క సమగ్రత్వమును (ఎల్లమంగళములను అనుట), ఒసఁగున్ = ఇచ్చునుగాక.

పంచజనుఁ డను నొకానొక దైత్యుఁడు శ్రీకృష్ణునికి ఎగ్గు చేసెను. అంత నాభగవంతుఁడు వానిని సంహరించి వాని మెడయెముకతో శంఖముచేసికొనెను, కావున ఆశంఖమునకు పాంచజన్యమని పేరు కలిగినది.

దైత్యారియగు శ్రీహరి దైత్యసంహారార్థము కపెంగి పాంచజన్యమును ఊఁదుడు దానియందు నిండిన యాయనముఖవాయువుయొక్క నెత్తావి పొక్కుటి తమ్మిలోపలినుండి తుమ్మెదలు బారుగా నెగిరిపోయి యాపాంచజన్యము పైఁబడుట యెట్లు లుండు ననఁగా ఆపాంచజన్యము పాపకళంకితములయిన దైత్యప్రాణములవరుసలను గ్రసించుచున్నదో యనునట్లుండును. అట్లొప్పుచున్న యాపాంచజన్యము పున్నమరేయిటి చందురునివలె తెల్లనయినట్టిది సకలమంగళములను ఇచ్చునుగాక.

'క్రోడ' - ఒడి యనుటచేత లోపలిమకరందమును గ్రాగుచున్నట్టి వని భా. 'అసు' - ప్రాణములు వాయుస్వరూపములు, వానికి రూపములేదు, అయినను వాని నంటియున్న పాపము నలుపుగావున నల్లనిప్రాణము లనునట్లున్నవని తుమ్మెదలకు ఉత్ప్రేక్ష. 'కముచు' - దానిధ్వనికే ఎందఱో గుండె బ్రద్దలై చత్తురు గావున, అదియో వారిప్రాణములను గ్రసించుచున్నట్లున్నదని యుత్ప్రేక్ష. 'రాకానిశాకర' సామ్యము 'గౌర' త్వాతిశయద్యోతనార్థము. మఱియు, ఇట గౌరత మాత్రమే సామాన్య ధర్మముగా కంఠోక్తమయినను, పాపసంకీర్ణములయిన యసువులు కళంకమువలె నున్నవనియు భావము కలదు; కావున 'రాకా' ప్రయోగము కలంకోత్కట త్వార్థము కూడ. 'కల్యాణ' - దుర్నిక్కయాపంకము హృతిమయినచో కల్యాణమునకు ఏలోపము నుండదు.

'పొల్చు రాకాద్యుతి' - ఇందు 'రాకా...ద్యుతి' - అనునది బహువ్రీహిసమాసము. 'పాంచజన్య' మునకు విశేషణము; దానికి 'పొలుచు' అను తద్ధర్మార్థకవిశేషణముతోవిశేష ణోభయపదకర్మధారయసమాసము - 'పాంచజన్యము' వ్యస్తపదము. కానిచో 'రాకా... ద్యుతి' అను విశేషణమందు అవిమృష్టవిధేయాంశదోషము సంభవించును. 'ఒసఁగున్' - తద్ధర్మార్థములలో ఆశీస్సుకూడఁ జేరియున్నది.

ఇందు వృత్త్యనుప్రాసములు గలవు.

—*సందకివ్యాస.*—

మ. ప్రతతోర్ధ్వాధరభాగ పీఠ యుగళీ భాస్వత్సరుత్స్తంభ సం
స్థితిఁ దీండ్రించెడు జాళువా మొసలివా దీర్ఘోర్చిగాఁ గజ్జలా

ణముయొక్క - హేమ మణీ వరణంబు = బంగారముయొక్కయు రత్నములయొక్కయు (తన్నిర్మితమయిన యనుట) ప్రాకారము ('ప్రాకారో వరణః సాలః' అమ.), సంగతంబు ఐ = అంటుకొన్నదై, దివిన్ = ఆకాశమునందు, ఆత్మ = తనయొక్క (కౌమోదకియొక్క) - కంకణములందున్ = వలయములనడుమ, ఒకకంకణము = తానును ఒకవలయముగా, అదెన్ = ఒప్పెనో, మో...ల్యన్ - మోద = సంతోషముచేత - కీలిత = తగిలింపఁబడిన - సముజ్జ్వల = వెలుంగుచున్న - కల్పకమాల్యన్ = ఈవిమాని పూవులదండకలదైన, అట్టి కౌమోదకిన్ = అటువంటివిష్ణుగదను ('కౌమోదకీ గదా' అమ.), కొల్చెదన్ = సేవించుచున్నాను.

శిశుపాలుని మిత్త్రులలోనొకఁడు సాల్వుఁడనువాఁడు లోకమున యాదవులు లేకుండఁ జేసెదనని ప్రతిజ్ఞచేసి శివునిఁగూర్చి తపసించి వరముగా దేవాసురాదులు దాసునను సౌభకమను వ్యోమగామిపురమును బడసి దానిలోఁ బోయి ద్వారకపైఁ బడెను. అందులకై శ్రీకృష్ణుఁడు ధర్మజరాజసూయమునుండి వచ్చి కౌమోదకిచే సౌభకమును సాల్వుని నుఱుమాడెను. ఆకథ నిట ననుసంధించికొనవలయును. శ్రీకృష్ణులవారు కౌమోదకితో సౌభకమును గొట్టినప్పుడు ఆగద ముందుల దానిప్రభావమెందులకును కొఱగాక దానిహేమమణిప్రాకారము తన్ను శోభించిన యాగదయొక్క తదీయాలంకారభూతములైయున్న వలయములలో తానునొకవలయము వనునట్లుండెను. అట్టిజయోత్కృష్టమగుటచే దేవతలు సంతోషముచే దానిని కల్పకమాల్యములు మరిసి యలంకరించినారు. అట్టి యాగదను సేవించెదను అని పద్యార్థము. ఈకౌమోదక్యాదిస్తుతులచేత శ్రీకృష్ణరాయల వైరులును ఆయాకౌమోదక్యాదిదేవతాప్రసాదముచేత రూపుమాయుదురుగాక యని కవియాశయము.

ఇందు హేమరత్నమయమైన సౌభకసాలము కౌమోదకీవలయముగా సంభావితము గావున నుత్ప్రేక్ష; వాచకములేనందున గమ్య. 'మోదకీ మోదకీ' అనుచో వృత్త్యనుప్రాసము.

'ఎందు ఏని మనుజేంద్రుఁ' అనియుండఁగా 'అకః సవర్ణే దీర్ఘః' అనుసూత్రముచే వికల్పముగా ఏని శబ్దేవర్ణమునకు లోపము రాఁగా, 'ఎందేని మనుజేంద్రు' అయి, అనంతరము సార్థము పరమైయున్న కారణంబున ద్రుతలోపము కలిగి, 'ఎందేదమనుజేంద్రు' అయినది.

'సార్వభౌమ' - సర్వభూమీశ్వరుఁడైన నారాయణుఁడు గాని 'యాదవమాత్రుఁడు గాఁడనుట. 'ఆయతి' - (మహాపురుషుఁడు) అనుమానార్హుండనుట. 'హరిన్' - గానిమిన్నంటునంతి గొప్పది యనుట. 'సముజ్జ్వలములు' - అప్పుడే కోసిన పువ్వులతో రచితములు గావున. సాల్వుని నాశము ఇట్లు దేవతలకుసయితము ప్రమోదము మరియొవ్వఁగావున వాఁడు ఆజన్ముఁడు మనుజమాత్రుఁడు గాఁడు, దను'జేంద్రుఁడే'. సాలము వలయాకారమును, సౌవర్ణమును, మణిఖచితంబును; కంకణమును అట్టిదే; కావున సాలమునకు కంకణసామ్యము.

—* శార్ఙ్గవర్ణనము. *—

చ. పిడికెఁడు కానుకఁ గొన్నఁ గని ప్రేమఁ ద్రివిక్రమాంగిఁ జేసి, తేఁ
బిడికెఁడు కానుకఁ గొన్నఁ బాయఁ బెచ్చు గుణంబును గంటె సంచు, నే

పన్నిద్దఱు సూర్యులు – 'ధాతా మిత్రోఽర్యమా రుద్రో వరుణః సూర్య ఏవచ। భగో వివస్వాన్ పూషా చ సవితా దశమః స్మృతః। ఏకాదశ స్తథా త్వష్టా విష్ణుర్ద్వాదశ ఉచ్యతే॥'

పన్నిద్దఱు ఆళ్వారులు: – సరో భూత – భక్తిసార – మధురకవి – శఠకోప – కులశేఖర – విష్ణుచిత్త – గోదాదేవి – భక్తాంఘ్రిరేణు – ప్రాణనాథ – పరకాలయోగులు.

వీరిలో 'పెరియాళ్వారు' అను నామాంతరముగల విష్ణుచిత్తులవారి దివ్యచరిత్రము ఈగ్రంథమున వర్ణితము. వారివలననే దీనికి విష్ణుచిత్తీయమని పేరువచ్చెను. వీరి కూఁతురే 'ఆండాళ్' అని నామాంతరముగలదైన గోదాదేవి. ఈమెయే ఆముక్తమాల్యద, ఇందు కథానాయికయు.

'సవితృమండల మధ్యవర్తీ నారాయణః' ఇత్యాది శ్రుతిప్రమాణముచే నారాయణుఁడు సూర్యునియందు వసించును. సూర్యులు పన్నిద్దఱు. అట్లే నారాయణుఁడు ఆళ్వారుల హృదయములందును వసించును, వారును పన్నిద్దఱు మహాత్ములు. 'హృదయకమలమకరందప్రవాహమందు సోఁగియుండు' అనఁగా నచట సర్వాంతర్యామి నివసించుట, – అనఁగా 'సదా పశ్యన్తి సూరయః' అను శ్రుతిప్రకారము ధ్యేయమగు దివ్యరూపము వారిహృదయములయందు సదా ప్రస్ఫుటముగా నెలకొనుట. అందువలన వారు అత్యంత ధన్యులై యానందించుచుందురు. అట్లు ఆ పన్నిద్దఱు హృదయములయందును ప్రవాహ సోఁగియుండుట, ఆ పన్నిద్దఱాదిత్యులయందు నివసించుటవలనం గలిగిన తాపమును పోఁగొట్టుకొనను ననుట ధ్వనించును. వీరి హృదయ వసతి ఆదిత్యమండల వసతికన్న అంత యుత్కృష్టము. ఆళ్వారులు మోక్షసామ్రాజ్యధురంధరులు గావున మోక్షార్థియై కవి వారి నాశ్రయించుచున్నాఁడు.

ఇందు ఆళ్వారుల హృదయములందు నివసించుటకు ఫలము గానరాదు. ద్వాదశాదిత్యమండల నివాస తాపోపశమనము ఫలముగాఁ జెప్పఁబడెను గావున ఫలోత్ప్రేక్ష; అట్టితాపతచ్ఛాంతులు లేవు గావున అసిద్ధవిషయ.

'సూరులందునున్' – ఇచట సముచ్చయార్థము కలదు, దానిచే సూర్యులయందేకాక వీరియందు నని యర్థము లభించుచున్నది. 'ఆ పన్నిద్దఱు సూరులందును.' 'ఆ పన్నిద్దఱు సూరులన్' – 'సర్వనామ సంఖ్యాభిధాన విశేష్యంబులం దయ్యాది ముందుఁ బ్రయోగింపఁబడు దాని ద్వితీయాదులకుం బ్రథమ వికల్పముగా నగు.' అను (బా. వ్యా. కా. 26 సూత్రముచే తొలి దాన 'పన్నిద్దఱు' అని ప్రథమ వచ్చినది. రెండవదాన 'పన్నిద్దఱ' అని పా. కలదు.

వ. అని యిష్టదేవతావందనంబుఁ జేసి మున్ను గళింగదేశ విజిగీషా మనీషం దండెత్తిపోయి విజయవాటిం గొన్నివాసరంబు లుండి శ్రీకాకుళనికేతనుం డగునాంధ్రమధుమథను సేవింపం బోయి హరివాసరోపవాసం బచ్చటం గావింప నప్పుణ్యరాత్రిచతుర్థయామంబున. ౧౧

[ఇష్టదేవతావందనేత్యాది–ఇంతటివీరవైష్ణవుఁడు తనయాచార్యునిం బేర్కొనమియు, తన తెలుఁగు మునిషినైనను తలంపమియు పూర్వకవిస్తుతి సేయమియు నాశ్చర్యముగా నున్నది.]

—*కలలోఁ బ్రత్యక్షమైన తెనుఁగు వల్లభరాయని వర్ణనము*—

సీ. నీలమేఘముడాలు డీలు సేయఁగఁ జాలు
  మెఱుఁగుఁ జామనచాయ మేనితోడ,
నరవిందములకచ్చు లడఁగించుజిగి హెచ్చు
  నాయతం బగు కన్నుదోయితోడఁ,
బులుఁగురాయనిచట్టుపలవన్నె నొరవెట్టు
  హొంబట్టుజిలుఁగు రెంటెంబుతోడ,
నుదయార్కబింబంబు నొఱపు విడంబంబు
  దొరలంగ నాడు కౌస్తుభముతోడఁ,
తే. దమ్మికే లుండఁ జెలుకేల దండఁ గూర్చు
లేము లుడిపెడుచేఁ జూపులేమతోడఁ
దొలఁకుదయఁ జెల్వు చిఱునవ్వుతోడఁ గలఁ గ
నంధ్రజలజాక్షుఁ డిట్లని యానతిచ్చె. ౧౪

1. నీలమేఘముడాలు = నల్లమబ్బుకాంతిని (నీటితో నిండినమబ్బు నల్లఁగా నుండును నీ రెడలినం దెల్లఁబడును.), డీలుసేయఁగన్ = పసలేనిదానినిగాఁ జేయుటకు, చాలు......తోడన్ – చాలు = సమర్థమైన – మెఱుఁగు = తళుకుగల – చామనచాయ = శ్యామలవర్ణముగల – మేనితోడన్ = దేహముగలవాఁడై (సంస్కృతమందు వపుః శబ్దమెట్లో అట్లే తెనుఁగున మేను శబ్దము అందమైన దేహమునకుం బ్రయోగింపఁబడును, – చామనచాయ అనేకులకుండును గాని దాన మెఱుఁగుమాత్రము [illegible]; మేఘశ్యాముఁ డనుట.)

2. అరవిందముల కచ్చులు = కమలములయొక్క గర్వములను, అడఁగించు జిగి = పోఁగొట్టునట్టి కాంతి, హెచ్చు = మిక్కుటముగా నున్నట్టియు – ఆయతంబు = దీర్ఘమును – అగు – కన్నుదోయితోడన్ = నేత్రద్వయము కలవాఁడై – పుండరీకాక్షుఁ డనుట;

3. పులుఁగు రాయని చట్టుపల వన్నెన్ = పక్షిరాజుయొక్క (– గరుత్మంతుని యొక్క) ఱెక్కలయొక్క (చట్టుపలు అని రూ.) వర్ణమును, ఒరవెట్టు హొంబట్టు జిలుఁగు రెంటెంబుతోడన్ = పరీక్షించునట్టి (అంతకన్న హెచ్చు వన్నె గలదైన) బంగారు తోడి (హొన్ను = పొన్ను = బంగారము) పట్టు అయినట్టి సన్నని (రెట్టనేఁత) వస్త్రముగల వాఁడై;– పీతాంబరుఁ డనుట;

4. ఉదయ......పున్ – ఉదయ అర్కబింబంబు = పొడుపుసూర్యని యొక్క (‘ఉదయః పూర్వశైలే స్యా దున్నతే–ప్యుద్గతా వపి’ నానా.) – ఒఱపున్ = సొంపును, విడంబంబు దొరలంగన్ = వెక్కిరింత మీఱ, ఆడు కౌస్తుభముతోడన్ = నిందించుచున్న కౌస్తుభమణి

కలిగి యున్నది; 'ఇట్టిప్రయోగములు కవిత్రయమువారి కృతులందు దొరకినవి కావు.' అని ప్రౌ. వ్యా. సమా. 18.

ఈ పద్యమునుంబోలిన పద్యములు కళాపూ. ౧-౨(౯౧), మను. ౬-(౧౦౫), పరమయోగి. (౨౯౯) - ఉపోద్ఘాతమున నుద్ధృతములు.

—*భగవద్వాక్యము.*—

సీ. పలికి తుత్ప్రేక్షోపమలు జాతి పెంపెక్క
  రసికు లౌ నన మదాలసచరిత్ర,
భావ ధ్వని వ్యంగ్య సేవధి గాఁగఁ జె
  ప్పితివి సత్యావధూ ప్రీణనంబు,
శ్రుతి పురాణోపసంహిత లేర్చి కూర్చితి
  సకలకథాసారసంగ్రహంబు,
శ్రోత్రఘచ్ఛటలు విచ్చఁగ రచించితి సూక్తి
  నైపుణి జ్ఞానచింతామణికృతి,
తే. మఱియు రసమంజరీ ముఖ్య మధురకావ్య
రచన మెప్పించికొంటి గీర్వాణభాష,
సంధ్రభాష యసాధ్యంబె యందు నొక్క
కృతి వినిర్మింపు మిఁక మాకుఁ బ్రియము గాఁగ. ౧౩

1. ఉత్ప్రేక్షోపమలు - ఉత్ప్రేక్షాలంకారమును ఉపమాలంకారమును, జాతి = స్వభావోక్త్యలంకారమును, పెంపు = అతిశయమును, ఎక్కన్ - పొందునట్లుగా, రసికులు = రసజ్ఞులు, ఔ ను అనన్ = మెచ్చునట్లుగా, మదాలసచరిత్రన్ = (మదాలసయొక్క కథయైన) మదాలసచరిత్ర యను ప్రబంధమును, పలికితివి = రచించితివి;

ఉపమోత్ప్రేక్షల లక్షణములు పూర్వపద్యములలో చెప్పఁబడినవి. 'స్వభావోక్తిః స్వభావస్య జాత్యాదిస్థస్య వర్ణనమ్.' అను లక్షణము చేత జాత్యాది స్వభావ వర్ణనయే స్వభావోక్తి గాన అది జాత్యలంకార మనియు వ్యవహరింపఁబడుచున్నది.

2. భా......గన్ - భావ = అభిప్రాయము - ధ్వని = వాచ్యాతిశాయి యయిన వ్యంగ్యముగల రచన - వ్యంగ్య = లాక్షణికార్థ ప్రయోజన రూప మగువ్యంగ్యార్థము - వీనికి - సేవధి = నిధి ('నిధి ర్నా సేవధిః' అమ.) - కాఁగన్ = అగునట్లుగా, సత్యా వధూ ప్రీణనంబు = సత్యభామను ప్రీతినొందించుట ఇతివృత్తముగాఁగల ప్రబంధమును ('తర్పణం ప్రీణనావనే' అమ; సత్యయనఁగా సత్యభామ; 'శబ్దా అవయవే ష్వపి వర్తన్తే ఇతి న్యాయా దనుగోద మితి పదైకదేశప్రయోగోయం భీమోభీమసేనః సత్యాసత్యభామా ఇతి.' అని రఘువంశ చారిత్రవర్ధన వ్యాఖ్య.)

**3.** శ్రుతి పురాణ ఉపసంహితలు = వేదములు (‘శ్రుతిఃస్త్రీ వేద ఆమ్నాయః.’ అమ.) పంచలక్షణములు (మత్స్యపురాణాదికములు-‘పురాణం పఞ్చలక్షణమ్’ అమ.) ఉపపురాణములు ను, ఏర్చి - ఏర్పరించి, సకలకథాసారసంగ్రహంబు = ఆపేరి గ్రంథమును, కూర్చితి = రచించితివి;

**4.** శ్రో......లు - శ్రోతృ = వినువారి - అఘ = పాపములయొక్క - ఘటలు = సమూహములు, విచ్చుగన్ - చెల్లాచెదరగునట్లుగా, సూక్తి నైపుణిన్ - మంచిమాటల నేర్పుచేత, జ్ఞానచింతామణికృతిన్ = జ్ఞానచింతామణి యనెడు గ్రంథమును, రచించితి = చేసినాఁడవు;

మఱియున్ - ఇవిగాక, రసమంజరీ ముఖ్య మధుర కావ్య రచనన్ = రసమంజరి లోను గాఁగల మనోహరకావ్యముల రచనచేత, గీర్వాణభాషన్ = దేవభాషయందు (సంస్కృతభాషయం దనుట), మెప్పించికొంటివి = మెప్పుపొందితివి; (అట్టిసమర్థునికి నీకు) ఆంధ్రభాషన్ = తెనుఁగులో (కృతిరచించుట), అసాధ్యంబె = అశక్యమా, (కాదనుట), ఇఁకన్ = ఇటుమీఁద, మాకుఁబ్రియముగాఁగన్ = మాప్రీతియే ప్రధానోద్దేశ్యముగా (అనఁగా మాకు ప్రియ మయిన మాకథగా), అందున్ = ఆంధ్రభాషయందుఁగూడ, ఒక్కకృతిన్ = ఒకప్రబంధమును, విని ర్మింపుము.

సంస్కృతమందు మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనము, సకలకథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి, లోనుగాఁగల యద్భుతప్రబంధములను రచించిన మహాకవికి నీకు తెలుఁగొకలక్ష్యమా ? కాన తెలుఁగులోఁగూడ మాప్రీతికై యొక గ్రంథముం జేయుము.

‘సంస్కృతమందే అట్టిప్రబంధములు రచించినవానికి ఆంధ్రభాషలో రచించుట యసాధ్యమా’ అనుట యర్థాపత్త్యలంకారము.

‘కైముత్యముచే నన్యార్థామననము కావ్యపూర్వకార్థాపత్తిన్
నీమోము బంధుజీవము నేమోదుచు నన్యజీవ మెపుడు యరుదే.’ అలం.

ఉ. ఎన్నినుఁ గూర్తు నన్న, విను, మే మును దాల్చినమాల్య మిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము, మున్ను గొంటి నే
వన్నెదండ యొక్క మగవాఁ డిడ, నేను దెలుఁగురాయఁడ,
న్గన్నడరాయ, యక్కొమరుఁ గప్పు ప్రియోపరిభుక్తభోక్తృతన్. ౧౪

ఎన్నినున్ ఏనిన్ను, కూర్తున్ అన్నన్ ఉద్దేశించినకథను వర్ణింతును అని యడుగుదు వేని, వినుము - ఆకర్ణింపుమా ; ఏన్ = నేనును, మునుదాల్చినమాల్యము ఇచ్చునప్పిన్నది = తాను ముందుగా ధరించినదండను నాకు పిమ్మట సమర్పించుచుండినయాబాలికయు (ఆముక్తమాల్యద యనుట. చూడి కుడుత్తనాచ్చారు’ అని అఱవము. ఆమెపేరు గోదాదేవియని ఉత్తరగ్రంథమునఁగో తెలియును.), రంగమందున్ = శ్రీరంగమందు, అయినపెండిలి = చేసికొనిన వివాహమును, చెప్పుము - వర్ణింపుము ; మున్ను = పూర్వము (కృష్ణావతారములో ననుట), వనదండ - పూలసరమును, ఒక్కమగవాఁడు = ఒకానొకపురుషుఁడు (సుదాముఁడను మాలికుఁడనుట), ఇడన్ = ఇయ్యఁగా, ఏవన్ = జుగుప్సతో, కొంటిన్ = గ్రహించితిని. నేను, తెలుఁ

గురాయఁడన్ = తెలుఁగు వల్లభరాయఁడను, కన్నడరాయ = ఓయికర్ణాటరాజా, ప్రి...ధన్-ప్రియా = వల్లభచేత - పరిభుక్త = చక్కఁగ అనుభవింపఁబడిన (చక్కఁగ ధరింపఁబడిన యనుట) దానిని - భాక్ = పొందిన రంగమన్నారుస్వామియొక్క - కథన్ = కతచేత, అక్కొదువ = ఆకొఱఁతను, కప్పుము = ఆచ్ఛాదింపుము (తొలఁగింపు మనుట).

'నీ యర్చావతారము లనేకములు, అందు ఏయవతారమును గూర్చి కృతిరచింతును?' అని యడుగుదువేమో? విను ; పూర్వము నేను కృష్ణావతారమందు సుదాముఁ డనుమాలాకారుఁ డీయఁగా, పూదండలను మగవానిచేతినుండి కొనవలసివచ్చెను గదా యని మనస్సులో నేవగించుచు కయికొంటిని. ఆకొదువ యిప్పటికిని నామనంబున నున్నది. తా మున్ను దాల్చినమాల్యము నాకర్పించిన చూడికుడుత్తదేవియు నేనును అయిన వివాహమును చెప్పుము. ప్రియాపరిభుక్తమాల్యముం దాల్చినే నానందించిన యాకథచె పైఁజెప్పిన యాకొదువం దొలఁగింపుము ఎంతటివానికొదువను అంతటివాఁడే తీర్పసమర్థుఁడు. అట్లు నేను తెనుంగు రాయఁడను, నీవు నాయంతటివాఁడవు కన్నడరాయఁడవు. 'ఆవివాహముతో నాకొదువ తీఱిపోలేదా? ఇంకనున్నదా?' అందువేమో, వివాహముచేత నయితము తీఱనియాకొదువ నీచేయు తత్కథావర్ణనముచేత తీఱును. నీకవనసౌభాగ్యము అట్టిది, కావున నిన్ను ఆ కృతి నడుగుచున్నాను.

'గోదాదేవి' యనక 'మునుదాల్చినమాల్యమిచ్చినప్పన్ని' అని రమ్యతరభంగ్యంతర స్వీకారముచే పర్యాయోక్తాలంకారము. ఈభంగివలె నామము దలుపుచు భగవంతుఁడును 'ఎవ్వఁడును భార్యను పేర్కొనరా' దను లోకశాస్త్రమర్యాదను గౌరవించినాఁడు.—

"ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ
శ్రేయఃకామో న గృహ్ణీయా జ్జ్యేష్ఠాపత్య కళత్రయోః"

'మాల్యము'= వేవిలందాల్చు పూదండ ('మాల్యం మాలా స్రజౌ మూర్ధ్ని' అమ. ఇట రామాశ్రమీయములో 'జౌవల' నని నిశ్చయము లేదని స్పష్టముగా 'మూర్ధ్నిశిరసి, ఇవి మత్ప్రాని' అని వివరింపఁబడియున్నను, ప్రయోగములును తద్విరుద్ధములుగానే యున్నను, ఆముక్తమాల్యద ౨ ఆ. ౩౨ ప.

సీ. '............ కట్టడు కమ్మ చెంగల్వవిరుల
తోమాలె లలకలు దువ్వి కంతునకునా। గ్రనిబద్ధఘటకంబనఁగ నిల
తే. వృషకకుద్దేశ నెడమ కొక్కొంత యొలుగ। నిడినధమ్మిల్లవలయంబునడుగునందు
గొంతనే పర్వఁ గెలించి కూపవారి। నిడ నిక్షించి క్రమ్మఱ గూడనునుచు.'
'పితృబద్ధలతాంతము లర్థిఁగొప్పునం। బూని యొకింతనే పునిచి పుచ్చి.'

ఇత్యాదికథాంశముచేత మూర్ధ్ని ధార్యమే యిట చెప్పంబడిన దని యెన్నఁదగును.) 'తెనుంగురాయఁడన్ కన్నడరాయ' అని తుల్యసంజ్ఞా ప్రయోగము తుల్యప్రభావ ధ్వననార్థము. - 'రాయన శబ్దము ఆచ్ఛికము మగాంగ జీయము; మగాదులకు డుజ్జగును గాని నత్వంబు లేదు, కావు 'రాయఁడు' అని రూపము గాని 'రాయుఁడు' అనిరాదు.

'......కృష్ణరా। యనికఁ వారణరాజవత్సుఁడుకృపాయత్తైక చిత్తాబ్జుఁడై.' పారి.

'.....................................శ్రీకృష్ణరా
యల బాహామృగనాభిసంకుమదసాంద్రాలేపపంకంబునన్.' మను.

ఇది బల్లిదాది గణీయముకానందున, సంస్కృతతుల్యంబు గాదు, కావున (బా. వ్యా. సూత్ర మర్యాదచే) సంబుద్ధిడుజ్ఞునకులోపంబు రాదు; 'మగఁడా' అని సంబుద్ధిగాని 'మగా' అనిగాదు; అట్లే ఇట 'రాయఁడా' యనవలయునుగాని 'రాయా' అని రాదు; అయినను పెద్దవారల ప్రయోగములయందు దీనిసంబుద్ధి డుజ్ఞునకు లోపము గనఁబడుచున్నది—

'శ్రీకృష్ణరాయ గుణాగ్రగణ్యకల్పా' మను. ౪. ఆ. ౧౨.
'శ్రీతిరుమలరాయ జనశ్రీతిరుణీరమణ' వసు. ౨ ఆ. ౧౨.
'ధీరోద్ధృత సాంపరాయ తిరుమలరాయా' వసు. ౪ ఆ. ౧౨

ఇత్యాదిప్రయోగము లనేకములు గలవు.

'రాయగ్రామణి కృష్ణరాయ భవదుగ్రక్రూరఖడ్గాహిచే.' అప్ప.
'కృష్ణరాయ మఖ్యాయ వెలయఁగ.'
'భవదసి వనిఁదెగ కృష్ణరాయ.'
'శ్రీకృష్ణరాయ నిన్ను.'
'అభినవ కృష్ణరాయ.'

అని యీగ్రంథమందే కలవు. ఇప్పటికొన్ని యూచ్ఛికశబ్దంబులకును ఇట్టిసంబుద్ధి ప్రయోగములు అందం గనఁబడుచున్నవి.—

'వారింప బదాక్ష్ట్రంగ మామిడి సింగా.' శృం. నై.
'అలఘునిహోత్సాహ సరస యాబశేవరసా.' నరస.
'లోకములో నేకపి కంప సికపనపుత్రప? వుప్పనే కూపనటన్
భేకములకు నాకఘనా! శీకరములనిమ్ము నరసింగ మతిమ్మా.'

ఆ. తెలుఁగ దేల యన్న ? దేశంబు తెలుఁ, గేను
దెలుఁగు వల్లభుండఁ, దెలుఁగొ కండ.
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి,
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. ౧౫

తెలుఁగు అది ఏల అన్నన్ = తెలుఁగులో కృతిసేయు మనుట యేలయని శంకయేని, దేశంబు తెలుఁగు = ఇది తెలుఁగుదేశము, ఏను తెలుఁగు వల్లభుండన్ = నేను తెలుఁగువల్లభరాయనామము కలవాఁడను, తెలుఁగో = తెలుఁగు భాషయన్ననో, కండ = పులకండము, ఎల్లనృపులున్ కొలువన్, బాస ఆడి = సంభాషించి, దేశభాషలందున్, తెలుఁగు = తెలుఁగు, లెస్స=ఉత్కృష్టము, ఎఱుఁగవే = ఎఱుంగుదువుగదా.

'దేశంబు తెలుఁగు'-త్రిలింగ మని శ్రీశైల కాళేశ్వర దాక్షారామ లింగములు వెలసియున్న దేశమునకు (ఆంధ్రదేశమునకు) పేరు.

‘శ్రీకిటిధర కాళేశ్వర। దాక్షారామంబు లనఁగ దనరారెడునీ
త్రిక్షేత్రంబుల లింగము। లీక్షితిని త్రిలింగసంజ్ఞ నెన్నిక కెక్కెన్.’ అప్ప.
ఆదేశము పేరే తెలుఁగని అచటిభాషకును వచ్చినది.

కన్నడరాయఁడవైన నిన్ను కన్నడములో చెప్పుమనక మఱియేభాషలోఁగాని చెప్పుమనక తెనుఁగుననే చెప్పుమనియెద నేల యనఁగా అందులకు ఈవక్ష్యమాణకారణము లున్నవి. ఒకకారణము - ఇది తెలుఁగుదేశము, రెండవకారణము - నేను తెలుఁగుదేశము నభిమానించిన వల్లభరాయఁడను, మూఁడవకారణము ఆరెంటికంటెను గొప్పది. అది ఏమన, తెలుఁగుబాసయనఁగా ఫులకండముగదా; నానాభాషలాడు రాజులు నిన్నుఁ గొలుచునప్పుడు వారితోనాయా భాషలాడి దేశభాష లన్నిటిలోను తెలుఁగుయొక్క యాయుత్కృష్టను నీవు కనిపట్టియుండలేదా.
‘కండ’ - ‘ఖండ’ శబ్దభవ మనియు ఫులకండ మర్థమనియు బ. సీ. వైకృతదీపిక.
‘సీ. చింపి వల్కాలను లేమి చేసెడి వసఁ గావు! నెఱపైనకండ మండెగలుగాని.
[జై. 8. ఆ. శబ్దరత్నాకరధృతము.

‘ఖణ్డోఽస్త్రీ ఐక్షవే। మణి దోషేచ.’ హేమ.
‘ఖణ్డోఽస్త్రీ శకలేచేక్షువికారే మణిదోషయోః.’ మేది.
‘ఖణ మస్త్రీ మణోర్దోషే శకలేక్షువికారయోః.’ నానా.
‘మత్స్యణ్డికా ఖణ్డసితాః క్రమేణగుణవత్తమాః.
యథాయథా హి నైర్మల్యం మధురత్వం తథా తథా.’ వైశేషిక.
‘వృష్యాః క్షతక్షీణహితా రక్తపిత్తానిలాపహాః
మత్స్యణ్డికాఖణ్డసితాః క్రమేణగుణవత్తమా.’ వాగ్భట.
వ్యా. - మత్స్యణ్డికాదయస్త్రయో వృష్యాః తథా క్షతక్షీణహితాః రక్తపిత్తానిలాపహాశ్చ; తథా క్రమేణగుణవత్తమాః, ధాతిగుడాదపి మత్స్యణ్డికా గుణకలినిర్మలతరత్వాత్, తతోఽపి ఖణ్డో గుణవత్తరః, ఖణ్డాదపి శర్కరా గుణవత్తమా నిర్మలతమత్వాత్.’

‘ఆడి’ - తెనుఁగును రాజులతో ఆడినేర్చినేగాని చదివినేర్చినవాఁడు గాఁడు - ‘నృపులు’ అనుటచే తెనుఁగు అతని ఇంటిభాష గాదు.

క. అంకితమో యనఁ సెకల,। వేంకటపతి యిష్టమైన వేల్పగుటఁ దదీ
యాంకితము సేయు మొక్కొక। సంకేతముగా కతఁడ రసన్నేఁ గానే. ౧౬

అంకితమో = అంకితము ఎవరికి చేయనగును, అనన్ = అనిన, సెకున్..... వేల్పు = దేవత, అగుటన్ = అయినందున, తదీయ అంకితము = అతని సంబంధియగు నంకితమును, చేయుము, ఒక్కొక సంకేతముగాక = ‘వేంకటపతి’ ‘వల్లభరాయఁడు’ అని వేఱువేఱు సంజ్ఞలేగాని, రసన్ = భూమియందు (‘రసా విశ్వమ్భరా స్థిరా’ అమ.) నేన్, అతఁడన్ = ఆవేంకటపతిని, కానే = కానా (అగుదును అనుట).

తే. పాత్త్ర మిటు సేయ సీ కుత్తరోత్తరాభి
వృద్ధ యని పోవ మేల్కని వెఱఁగుతోడ

భక్తిఁ దద్గృహగోపుర ప్రణతిఁ జేసి
వేగుటయుఁ గల్యకరణీయ విధులు దీర్చి. ౧౨

ఇటు = పైఁజెప్పినప్రకారమున, పొత్తము=కృతిని, చేయన్ =చేసినంతట, నీకున్, ఉత్తర ఉత్తర అభివృద్ధి = అభ్యుదయము వెంబడి దానికన్న నభ్యుదయము, (కలుగును అని శేషము.) అని = అనిపల్కి, పోవన్ = ఆదేవుఁడు అంతర్ధానము కాఁగా, (నేను), మేల్కాని, వెఱఁగుతోడి = ఆశ్చర్యముతోఁ గూడుకొన్న - భక్తిన్ - తత్పరత్వముచేత, తద్గృహగోపుర ప్రణతి = ఆస్వామియాలయముయొక్క ద్వారమునకు ('ద్వారమాత్రేతు గోపురమ్.' అమ.) నమస్కారము, చేసి, వేగుటయున్ = తెల్లవారినంతట, కల్యకరణీయ విధులు - వేకువయందు ('ప్రత్యూషోఽహర్ముఖం కల్యమ్' అమ.) కావింపవలసినసంధ్యావందనాద్యనుష్ఠానములను ('విధిర్విధానే దైవే చ' అమ.), తీర్చి = కావించికొని.

వ. నిండ నోలగం బుండి దండనాథ సామంత సందోహంబుల నిలిపించి పెందల కడన మందిరంబుల కనిపి వివిధ వేదాగమ విదులగు విద్వజ్జనంబులఁ గానిపించి కొని నమస్కరించి యాశుభస్వప్నంబు వినిపించినఁ బ్రశంసించినారును సవిస్మయస్వాంతులై 'దేవా, దేవదేవుండు విజయంబు చేసిన యాస్వప్నం బనేక శోభనపరంపరలఁ దెలుపుచున్నయది. ఎట్లనిన, ప్రథమ మప్పద్మాక్షుస్వప్న సాక్షాత్కారం బితోధికభక్తియు, నతండు ప్రబంధనిబంధనంబుఁ గావింపుమను ట యితోధికాగాధసారస్వతోద్బోధంబును, నతని దేవీసమాగమం బితోధి కాఖండభాండాగారసమృద్ధియు, నతని యాసనతిచేతి విశదశశిచ్ఛాయం బితోధికా ద్వితీయసితచ్ఛత్రతయు, నతం డదేవప్రసాదనవవస్త్రద్వయంబు తొడంగనె యనుట యితోధిక సమస్తసామంత సమాజ సమాకర్షణంబును, ప్రియోపభోగ పరిశిష్ట భోగం బిచ్చె ననుట యితోధిక బహుప్రేయసీప్రాప్తియు, కృతిచెప్ప నుత్తరోత్తరా భివృద్ధియగు ననుట యితోధికాపత్యపరమాయుర్దాప్తియు. నగు. నఖర్వమహి మాతిశయావహుఁడగు సూర్యునివంశంబునం బుట్టినట్టి నీకిట్టి శోభనపరంపర లేమ ద్భుతంబు, లవధరింపుము. ౧౩

నిండు ఓలగంబు ఉండి - నిండుసభతీరి ('ఓలగంబు' - ఓలగంబుగా అని యర్థముగా క్రియావిశేషణముగా గ్రహింపవలయును), దం......లన్ - దండనాథ = సేనాపతులయొక్కయు - సామంత = అరిగాఁపు దొరలయొక్కయు - సందోహంబులన్ - బృందములను, పెందల కడన = ప్రాతఃకాలమందే, మందిరంబులకున్ = ఇండ్లకు (బసలకు), అనిపి = పంపి; వివి...... లు - వివిధ = పలువగల - వేద = శ్రుతులును ('శ్రుతిః స్త్రీ వేద ఆమ్నాయః' అమ). - ఆగమ = శాస్త్రమాత్రములును (లేక దేవపూజావిధాన తత్సంబద్ధ విషయములను తెలుపునట్టి పాంచరా త్రాది గ్రంథములను-

'సర్వవేదః క్రియామూలం ఋషిభి ర్బహుధోదితః
కాలో దేశః క్రియా కర్తా కారణం కార్య మాగమః
సిద్ధం సిద్ధైః ప్రమాణై స్తు హితం వాత్ర పరత్ర వా
ఆగమః శాస్త్ర మాప్తానా మాప్తా స్తత్త్వార్థవేదినః
శృణ్వతాం జాయతే భక్తిః తతో గురు ముపాసతే,
స చ విద్యాగమాన్ వక్తి విద్యాయుక్ స్యాచ్ఛ్రితో నృపః.')

ఎదుల = ఎఱింగినవారు - అగు విద్వజ్జనంబులన్ - పండితులను, కానిపించికొని = తనదర్శనము చేయించుకొని, ......స......లు - సవిస్మయ = ఆశ్చర్యముతోఁ గూడుకొన్న ('విస్మయోఽద్భుత మాశ్చర్యమ్' అమ.)-స్వాంతులు=మనస్సుగలవారు ('స్వాన్తం హృ న్మానసం మనః' అమ.), ఐ, (ఆశ్చర్యపడి యనుట),......దేవా = ఓరాజా ('రాజాభట్టారకో దేవః' అమ. ఈసంబుద్ధి మొదలుకొని ౪౪-వపద్యములో 'కృష్ణరాయేంద్ర కృతి వినిర్మింపుము' అనువఱకును విద్వాంసుల వాక్యము.), దేవదేవుండు = నారాయణుఁడు, విజయంబు చేసిన = వచ్చిన......శోభన = కల్యాణ......,అప్న...బు. - అప్నశ్రీకాంత=ఆపుండరీకాక్షునియొక్క - స్వప్న = కలలోని - సాక్షాత్కారంబు = అగపడుట (ఆపుండరీకాక్షుఁడు కలలో అగపడుట యనుట), ఇతఃఅధిక భక్తియున్ = ఇప్పటి తత్పరత్వముకన్న ఎక్కుడగు తత్పరత్వమును,

"దృశ్యతే భగవాన్ యస్య స్వప్నే సర్వశుభావహః
తస్మి న్నేవ దృఢా భక్తి ర్జాయతే తస్య సంతతమ్."

అతండు = ఆదేవదేవుండు, ప్రబంధనిబంధనంబున్ = కావ్యరచనను, కావింపుము = చేయుము, అనుట = అని యానతిచ్చుట, ఇతో......ను - ఇతః = ఇప్పటి (విద్య) కంటె - అధిక = ఎక్కుడు - అగాధ = లోఁతయిన ('అగాధ మతలస్పర్శే' అమ.), సారస్వత - విద్యయొక్క - ఉద్బోధనంబును = ప్రాప్తియు, అత...బు - అతని = ఆనారాయణునియొక్క - దేవీ = దేవియగు మహాలక్ష్మియొక్క - సమాగమంబు = రాక, ఇతో......యున్ - ఇతః = ఇప్పుడున్నదానికంటె - అధిక = ఎక్కుడగు - అఖండ = తెంపులేని - భాండ - అగార - బొక్కసపుటండ్లయొక్క - సమృద్ధియున్ = నిండుపును, అత......బు - అతని యొక్క - అసతిచేతి = ఆభార్యచేతనున్న - విశద = తెల్లని ('శుక్ల శుభ్ర శుచి శ్వేత విశద శ్యేత పాణ్డరాః' అమ.) - శతచ్ఛదంబు = నూఱు రేకులతామర ('సహస్రపత్త్రం కమలం శతపత్త్రం కుశేశయమ్' అమ.), ఇతో...యున్ - ఇతోధిక - అద్వితీయ = రెండవదికాని (మఱెవ్వరికిని లేని) - సిత - తెల్లని - ఛత్త్రితయున్=గొడుగుకలిగియుండుటయును (ఏకచ్ఛత్త్రాధిపత్యమనుట. ఇంక ననేకదేశముల నేలుటయని భా.), అతండు, అశేష నృప సేవన్ = సకలరాజుల కొలుపుచేత (ఎల్లరాజులును సేవించుచుండుటచేత ననుట), తత్ తత్ భాషలు = ఆయా దేశభాషలను, ఎఱుంగవే = తెలిసికొన్నవాఁడవు కదా, అనుట=అనిపలుకుట, ఇతో......బును - ఇతోధిక - సమస్తసామంత = ఎల్ల యిరుగుపొరుగు రాజులయొక్క - సమాజ = సమూహముయొక్క ('పశూనాం సమజోఽన్యేషాం సమాజః' అమ.) - సమాకర్షణంబును = రప్పించుకొనుటయు (వశపఱుచుకొనుటయు ననుట), ప్రియా......ము - ప్రియా = కాంతయొక్క (మాడికుఱుత్తదేవియొక్క) - ఉపభోగ = అను

భవమునుండి - పరిశిష్ట = మిగిలినదానియొక్క (ముందు ఆమెచే అనుభవింపఁబడినదై పిమ్మట ఈఁబడినదాని - అనఁగా అట్టిమాల్యముయొక్క యనుట) - భోగంబు = అనుభవము (ప్రియ ముందుగా ధరించినమాల్యమును తాను పిమ్మట ధరించుట), ఇంపు = ఇష్టము, అనుట = అని వచించుట, ఇతో...యుక్ - ఇతోధిక - ఇప్పటివారికన్న ఎక్కువయగు - బహు = పలువురు - ప్రేయసీ = ప్రియతమలయొక్క - ప్రాప్తియుక్ = లాభమును, కృతి = కావ్యమును, చెప్పక = రచించినచో, నీకు , ఉత్తరోత్తర అభివృద్ధి = ఒకనాఁటికంటె ఒకనాఁటికి అభ్యుదయము, అగు అనుట = కలుగునని చెప్పుట, ఇతః అధిక అపత్య పరమ ఆయుః అవాప్తియుక్ = ఇప్పటికంటె ఎక్కువయగు సంతానముతోడి పూర్ణాయువు యొక్క ప్రాప్తియును, అగు = అయియున్నది. ['అగు' అనుక్రియ 'భక్తి' 'ఉద్బోధనంబు' ఇత్యాదిపదములతో పై లఘు వాక్యములందెల్ల నన్వయించును; సాక్షాత్కారమే ఇతోధికభక్తి యగు ననుటచే, అనఁగా సూచ్య సూచకములకు అభేదము చెప్పుటచే, సాక్షాత్కారము తప్పకుండ ఇతోధికభక్తిని సూచించు చున్నదని భా. ఇట్టి యూకమును వాక్యములందును అన్వయించుకొనవలయును.] అఖ......డు- అఖర్వ = పెల్లయిన - మహిమ = ప్రభావమునకు - అతిధుర్యవహుఁడు = మిక్కిలి ధురంధరుఁడు. అత్యంతప్రభావశాలి యనుట. 'ఖర్వో హ్రస్వశ్చ వామనః' అమ. ఖర్వమనఁగా కుఱుచది-దానికి విరుద్ధమయినది అఖర్వము - అనఁగా ఉన్నతమయినది-అనఁగా మిక్కిలి గొప్పది యటను విరోధము కూడ నక్షత్ర కర్తము:—

'తత్సాన్వయే మహాన శ్చ తన్వో రోధ స్తు వల్లభా।
తదన్వయే నిరీశ్శ్చ నరాధిప పతిత్వకీర్తితా.'

అను - తుర్వసు వంశంబునకు తుర్వసుఁడను రాజుకులములో (తుర్వసుఁడు యయాతికొడుకు - పూరుననకు తమ్ముఁడు. ఈశబ్దమును ఆకారాదిగా వ్యవహరించుట పొరబాటు), ....

సీ. కలశపాథోరాశిగర్భ వీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి,
యనలాక్షు ఘనజటావనవాటి కెవ్వాఁడు
వన్నెవెట్టు ననార్తవంపుఁబువ్వు,
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టు గామిని లేని మొట్టుపంట,
నెలకు చీకటితిండి కరముల నిగిడించు
నెవ్వాఁడు భోగకన్నె నవ్వఁజేయు,
తే. సతతము భోగనొందు మధుకైటభారిమఱఁది,
కళల నెలవగువాఁడు చుక్కలకు ఱేఁడు,
మిసిమిపరసీమ వలరాజు మేనమామ,
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు. ౧౯

(ఆ మధురాపురమందు), సౌధా...లిక్-సౌధ = మేడలయొక్క - అగ్ర-తుదలయందు విహారి = క్రీడించుచుండు - యౌవత = యువయువతీసమూహములయొక్క - రతి = కామకేళు యందు - భిన్న = పెరిగిన (యౌవనముగనుక రతిలో నుత్సాహమెక్కువ - కావుననే పేరుల పెరిగిపోవుట) - అచ్ఛ = తేటయైన (అనఁగా తళతళని నిగుగల)-హార - ముత్తెపుఁబేరులయొక్క - స్ఫురత్ = తారళ్యవంతము లయిన - గురు పెద్దలైన ('గురుస్త్రీలిఙ్గ్యం మహతి దుర్జరాలఘునోరపి' మేది.) - ముక్తా = ముత్తెములయొక్క - ఆవళిక్ - మొత్తమును, చేటికలు - పరిచారికలు ('భృత్యే దాసేర దాసేయ దాస గోప్యక చేటకాః' అమ.), నిరులతోఁగూడఁగక్ = (ఆదంపతులు రాత్రిధరించి వేకువను త్యజించినవి గాన) పుష్పములతోఁగూడ, (సౌయక్ = (ఆసౌధాగ్రములనుండి) తుడిచి పాఱవైచఁగా, మొగిలు = మేఘము, అధస్స్థంబు = (ఆ సౌధాగ్రములకు) క్రిందిప్రదేశములందు ఉన్నదై, ఐ, నిజ ఉదర లగ్నంబు = తనకడుపులో తగుల కొన్నదై, అగుదానినే = అయిన యామ్ముత్తెపు మొత్తమునే, తతిక్ - వర్షాగమనందు (వానతోఁగూడ ననుట), రాల్పక్ = కురియుటంజేసి, క్షితిక్ = భూమిలో (అనఁగా లోకులు - 'భూ ర్భూమి రచ లానన్తా రసా విశ్వమ్భరా క్షితిః' అమ.), అభ్రంబు = మేఘము ('అభ్రం మేఘో వారివాహః' అమ), ఆకరము - ముత్తెములకు జన్మస్థానము ('ఖనిః స్త్రియా మాకరః స్యాత్' అమ.) అని, అంద్రుగాక = అందురేగాని, ముత్తెములు, ఉదధిక్ = సముద్రమందు ('ఉదన్వా నుదధిః సిన్ధుః సరస్వాన్ సాగరో ర్ణవః' అమ.), తక్కక్ = తప్ప (వేఱొకచోట), పుట్టునే = పుట్టవు.

ముత్తెములకు జలధరాద్యాకరములు పెక్కు చెప్పఁబడియున్నవి (౫. ౨౦ వ్యా.చూ.), కాన సముద్రమొక్కటియే వానికి వాస్తవమయిన యుత్పత్తిస్థానము. కడమ తావులందు అవి పుట్టవు. అందులో మేఘమందు పుట్టునని లోకులు భ్రమించుటకు కారణమును జెప్పెడు; మధురాపుర సౌధాగ్రవిహారులగు యౌవతమును మొక్క [illegible] ముత్తెములను వేకువను నిర్మాల్య కుసుమములు కుప్పతోఁగూడ చేటికలు క్రిందికి దిగఁద్రోయఁగా ఆముత్తెములు క్రిందనున్న మేఘములు వానికి కడుపులోనికిం జొచ్చి వానితోఁగూడ క్రిందికి రాలఁగాఁ గాంచి జనులు అవి మేఘోత్పన్నములే యని భ్రమించుచున్నారు. - అతిశయోక్తి - కొందఱు మతంబున అత్యుక్తి.

'గురుముక్తా' — గొప్పవని చెప్పుట యేలనన, మేఘోత్పన్నములయిన ముత్తెములు పెద్దవిగా నుండును,—

'వర్షోపలవ జ్జాతా వాయుస్కన్ధా చ్చ సప్తమా చ్చ్యుతాః
హ్రియతే కిల ఖా ద్దివ్యై స్తటిత్ప్రభం మేఘసంభూతమ్,' బృ. సం.

'వర్షోపలవత్' అనుటచే పెద్దవనియు మేఘోత్పన్నమనియు తెలియనగుచున్నది. దానిని ఆకాశమందే దేవయోనులు హరింతురనియు అది మొలుపుకాంతిగలదని యనియు కారికార్థము. ఈక్రింది పారిజాతాపహరణ పద్యములో 'నాణేయు స్తరు' ము లనుటచేతను విద్యాధర ధార్యము లనుటచేతను మేఘోద్భూత ముక్తాఫలములే కథితములు.—

శా. 'ఏణీశాబవిలోలనేత్ర కనుఁగొంటే వీరు విద్యాధరుల్
మాణిక్యోజ్జ్వలకర్ణకుండలులు సంబద్ధాసిధేనుల్ రణ
ద్వీణాపాణులు చంద్రికామల శిరోవేష్టా స్త్రీపుండ్రాంకితుల్
నాణీయస్తర తారహారులు శివధ్యానైక నిష్ఠాపరుల్.' పారిజాతాపహరణము.

అణీయస్ = కడుంజిన్నది - న అణీయస్ = నాణీయస్ = కడుంబెద్దది - నాణీయస్తరములు = మఱియుంబెద్దవి = వర్షోపలములంతలేసి. 'నాణీయస్తన' అను బజారుముద్రణమును మదీయ ముద్రణంబున 'నాణీయస్తర' అని సవరించితిని. 'ఈయస్సు' మీఁద 'తరప్పు' వచ్చిన యుదాహరణాంతరము,—

"ఆస్థితా హీంద్రశయ్యాణీయస్తర
ప్రస్థితాంఘ్రీశ్రిత వ్రాత చేతోఘదా
కస్థల ప్రస్ఫురత్కాళి యాత్మేశమా
ధస్థలీ న్యస్తవత్సీహ్నోసకా."—ఆము. 3 ఆ. 92.

మ. ఘనసౌధాళి వియన్నదీజలధిఁ దేకన్ స్వచ్ఛతన్ నీడఁ దోఁ
ప నెలంతల్ల్వాళిగాక్ష్మిన్ సరకు మార్పన్ గోలలన్ గట్టి యి
చ్చు నిజస్వాపవిచిత్రపట్టవసనస్తోమంబు నాఁ బొల్చుఁ బె
ల్లనిలానోన్నతవిమర్శితన్నగరనాకానేకకేతుచ్ఛటల్. ౧౨

ఘనసౌధ అళి = (మధురా స్వర్గములయొక్క) గొప్పమేడల పంక్తి. వియ...దిన్ - వియత్ ధునీ = మిన్నేఱు అనెడి ('వియత్స్వర్గాపగాపదం వాతు పుం స్యాకాశ విహాయసీ', 'తరఙ్గిణీ శైవలినీ తటినీ హ్రాదినీ ధునీ' అమ.) - జలధిన్ = సముద్రములో, నీడన్ = (నీడల) ప్రతిబింబమందు, స్వచ్ఛతన్ = స్ఫుటముగా, నాన్ తే = ఓపలుగా, తోఁపన్ = అగపడఁగా, నెలంతల్ = ఆమేడలలో నున్న (ప్రతిబింబము (మధురాస్వర్గ)) యువతులు సరకు లిచ్చి అందులకు బదులుగా సరకులు కైకొనుట్టైన. కోలలన్ = గడలకు, కట్టి, ఇచ్చు(నట్టి) - నిజస్వాప విచిత్ర పట్ట వసన స్తోమంబు నాన్ = తమ(తమ) నీడలకుండెడి సాదృశ్యతపుఁ బట్టువస్త్రముల మొత్తమో యను నట్లు, అని...ర్ధ - అనిల = గాలిచేత - అన్యోన్య = ఒండొంటిని - విమర్శి = ఒరసికొనుచున్న - తన్నగర = ఆ(మధురా) పురముయొక్కయు - నాక = స్వర్గముయొక్కయు - అనేక = పెక్కులయిన - కేతు = జెండాలయొక్క - ఛటలు = సమూహములు, పెల్లు = మిక్కిలి, పొల్చున్ = ప్రకాశించును.

సముద్రములో ఒకదీవి వర్తకనావలు మఱియొక దీవి వర్తకనావలను తారసిల్లినప్పుడు, ఒక దీవి యోడవర్తకులు తమదీవిసరకులను మచ్చుకై ఒకపట్టువలువలో ముడిచి ఆమూట నొకగడకుం గట్టి రెండవదీవి యోడవర్తకులకు వారియోడ మీఁదికి వ్రాల్చుటయు, వారు దానిం గయికొని అందులకు బదులుగా తమసరకుల మచ్చును, వల్లెకట్టి వీరి యోడమీఁదికి వాల్చుటయు, (బేరము కుదిరిన యనంతరము సరకులం గొని సరకు లిచ్చుటయు) ప్రసిద్ధము. మధురాపురి మేడలు మిన్నేటికన్న నున్నతము లగుటచేత తమయందలి స్త్రీజనముతోఁగూడ, తమ జెండాలతోఁ

గూడను, ఆమిన్నేటం బ్రతిబింబించినవి. నాకపురిమేడలును ఆట్లే అచ్చరలతోఁగూడ తమజెండాలతోఁగూడను ఆమిన్నేటం బ్రతిబింబించినవి. మఱియు వాయు వశమున నాకపురి మేడల జెండాల ప్రతింబింబములు మధురాపురి మేడల జెండాల ప్రతిబింబముల మీఁదికిని మధురాపురి మేడల జెండాల ప్రతిబింబములు నాకపురిమేడల జెండాల ప్రతిబింబముల మీఁదికిని, వ్రాలుచుండును. ఈవృత్తి మెల్ల నెట్లున్నదనఁగా—మిన్నేఱు సముద్రమువలెను, మేడల ప్రతిబింబములు ఓడలవలెను, అందు నెలఁతల ప్రతిబింబములు వర్తకులవలెను, నాకపుర సౌధప్రతిబింబములు ఒకదీవి రేవులుగాను, మధురాసౌధ ప్రతిబింబములు మఱియొకదీవి రేవులుగాను, ప్రతిబింబమందు ఈజెండాలు ఆజెండాలకును ఆజెండాలు ఈజెండాలకును తగులుచుండుట సరకు మార్చుకొనుటకై ప్రతిదీవి వర్తకులు తమసరకుల మచ్చులను విచిత్రపట్టువస్త్రములందు ముడిచి గడలకుఁగట్టి కడమ దీవివర్తకుల కడకు వ్రాలుచుటగాను, ఉండును.—ఉత్ప్రేక్షాలంకారము.

ఉ. సోరణగండ్లఁ దాఁ గొదమచుక్కలు పట్టసతుల్ కవాటముల్
జేరుప మౌక్తికంబు లని చిల్కలు వ్రుత్తురటంచుఁ బో
ల్పారువితానహారములయం దొగి హారతఁ ద్రేలి ప్రొద్దు పోఁ
గా రతి డస్సి గాడ్పులకుఁగాఁ దెఱవంగను విచ్చి మేడలన్. ౧౩

మేడలన్ = మేడలయందు, కొదమ చుక్కలు = పిల్లనక్షత్రములు, సోరణగండ్లన్ = గవాక్షమార్గమున, రాన్ = మేడలలోఁ జొచ్చినప్పుడు, సతుల్ = అందలిస్త్రీలు, పట్టన్ = ఆనక్షత్రములను పోనీక పట్టుకొనుటకై. కవాటముల్ = కిటికీలయొక్క తలుపులను, చేరుపన్ = మూసినంతట, తమ్మున్ = ఆనక్షత్రములను, మౌక్తికంబులు అని = ముక్తాఫలము లని భ్రమించి, చిలుకలు వ్రుత్తురు = బెజ్జము పొడుతురు. అటంచున్ = అని భయపడి, పో...దున్ = పోల్పారు = అంద మయిన - వితాన = మేలుకట్లయొక్క ('అస్త్రీ వితాన ముల్లోచః' అమ.) - హారములయందున్ = ముత్తెపు సరములతోఁగూడ, ఒగిన్ = క్రమముగా, హారతన్ = సరిరూపమున, ద్రేలి = ద్రేలాడి, ప్రొద్దు పోఁగాన్ = కొంతకాల మయినతర్వాత. రతిన్ డస్సి = (ఆ విలాసవతులు) మదనక్రీడచేత బడలికం జెంది, గాడ్పులకుఁగాన్ = చల్లగాలికై, తెఱవన్ = (కిటికీలయొక్క) తలుపులను తెఱవఁగానే, విచ్చి = విడఁబడి (అనఁగా హారరూపమును మాని చెదరి), చనున్ = తప్పించుకొని పోవును.

మధురాపురమందు మేడలు నక్షత్రమండలము నతిక్రమించి యుండుటచేత పిల్లనక్షత్రములు మేడ లడ్డము కాఁగానే కిటికీలవలన ఆమేడలలోనికిం జొరఁబడును; అంతట నచటి విలాసవతులు వీనిం బట్టుటకై తలుపులు మూయుదురు. అంతట నివి తమ్ము వారు ముత్తెము లనుకొని పుట్టి ధరించుటకై బెజ్జము పొడుతు రని భయపడి, వారిచేతినుండి తప్పించుకొనుటకై మేలుకట్లలో వ్రేలుచున్న హారములతోఁగూడ తాము ఒక హారముగా వ్రేలును. వారు అందువలన ఏమఱి పోదురు. పిమ్మట వారు కొంతసేపటికి రతిక్రీడలచే నలసి చల్లగాలికై తలుపులు తెఱతురు, ఆసమయమున ఈపిల్లచుక్కలు హారరూపమును మాని చెదరి, దేని దారి నది చూచుకొని పాఱిపోవును. 'కొదమ' యనఁగా పిల్ల; పిల్లలు గానిచో మేడలోఁ దూరవు; పట్టుదు రని

'పర్యాప్త ముద్ధతం నృత్త్వా స్వప్రయుక్తం తతో హరః
తణ్డునా స్వగణాగ్రణ్యా భరతాయ న్యదీదిశత్
లాస్య మస్యాగ్రతః ప్రీత్యా పార్వత్యా సమదీదిశత్.' భర.

ఆటకు మగనెమలియే ('కలాపి' = కలాపము అనఁగా కుంచె కలది.) వలయును.(ఆఁడు నెమలికి కుంచె లేదు. కుంచె లేనియాఁడు వెక్కిరించిన ట్లుండును.), అయినను శేషపము జల్లారు చెఱంగును భూషణంబులుం బోలె కుంచె వెలుంగుటం బట్టి మగనెమలికి స్త్రీత్వమే చెప్పఁబడినది, ఆడించువారు పిలాసినులు గావునను, నెఱజాణలునుం గావునను, నెపు హెచ్చునట్లుగానే సరిపఱుతురు. — అతిశయోక్తి.



చ. అనిమిషపట్టణంబు పురహర్మ్యపతాకలు మువ్వమ్రోఁతతో
డనగృహపంక్తిపైఁ గలశతామరసంబులఁ గప్పఁ గ్రింద నుం
డును నిజలక్ష్మి చేసరిపణుల్ మొఱయంగఁ దదియలక్ష్మి క
న్గను మొగ మెత్తి చూచుతఱిఁ గన్నులు కేళిక మూయఁగా బలెన్.

అనిమిష పట్టణంబు = దేవపురము (స్వర్గము. — 'అనిమిష శ్చానిమిషో దేవతా ద్వౌ సుర మర్త్యయోః' నానా.). పుర హర్మ్యపతాకలు = మధురాపురి సౌధముల జెండాలు ('హర్మ్యాది ధనినాం వాసః,' 'పతాకా వైజయన్తీ స్యాత్ కేతనం ధ్వజ మస్త్రియామ్' అమ.), మువ్వమ్రోఁతతోడన్ = చిఱుగంటల నిస్వనముతో, తన..... తన (స్వర్గపురముయొక్క) యింటివరుస మీఁది తామర మొగ్గల వంటి గిండులను, కప్పన్ క్రిందన్ = ఆమధురా సౌధముల పతాకలకు క్రింద, ఉండును ననఁగా, నిజలక్ష్మి = ఆ స్వర్గలక్ష్మి, చేసరి పణుల్ = చేతిబంగారుగొలుసులు, మొఱయంగన్ = శబ్దింపఁగా, శబ్ద — ఎవ తెయొ ఇచ్చట మీఁద వచ్చియున్నది అను తలంపుతోడి జిజ్ఞాసచే, మొగ మెత్తి చూచుతఱిన్ (= సమయమందు), తదీయలక్ష్మి = మధురాపురిలక్ష్మి, కేళికన్ = వేడుకకై, కన్నులు = స్వర్గలక్ష్మియొక్క నేత్రములను, మూయఁగా బలెన్ మూసినట్టుం బోల, (క్రిందను) — ఉండును. — అతిశయోక్త్యను ప్రాణితమయిన యుత్ప్రేక్ష.

స్వర్గపురగృహపంక్తిపై తామరసాకారము లయిన కలశములు కలవు. మధురాపుర హర్మ్య పతాకలు ఆకలశములను మువ్వమ్రోఁతతోఁ గప్పఁగా ఆపతాకల క్రింద స్వర్గపట్టణ ముండుట ఎట్లున్న దనఁగా, పై మువ్వమ్రోఁతను విని స్వర్గపురలక్ష్మి, ఎవ తెదో చేసరిపణుల మ్రోఁత సుమా ఇది యని జిజ్ఞాసచేత తనతలయెత్తి చూడఁగా, ఆమధురాపురలక్ష్మి తన చేతులతో స్వర్గపురలక్ష్మికన్నులను వేడుకకు మూయఁగా, ఆచేతులకు క్రిందనుండుట వలె ఉన్నది. — ఇట మువ్వమ్రోఁత చేసరిపణుల మ్రోఁతగాను, పతాకలు హస్తములుగాను, కలశతామరసంబులు కన్నులుగాను, కప్పుట కేళికి మూయుటగాను, కలశతామరసంబులు నిక్కియుండుట మొగ మెత్తి చూచుటగాను, ఉత్ప్రేక్షింపఁబడినవి. — మధురాపుర గృహపతాకలు స్వర్గపురగృహకలశములకంటె పైక నిగిడిన వనుట. పురసౌధౌన్నత్యవర్ణనము. అతిశయోక్తి; తదనుప్రాణిత మైన యుత్ప్రేక్షయు.

చ. ఘనగతశంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి, ఘునుం గినోష్మఁ ద
ట్టినది యలంది, కైశికము దేవఁ బ్రభాతశశాంకు మోప వి
చ్చిననవహల్లకాళిఁ గయిసేసి, సతుల్పతితో రమింతు, ర
మ్మునిజరఠాంగనల్ కలహముల్ కృప నేడ్వురుఁ దీర్ప మేడలన్. ౧౬

మేడలన్ = మధురాపుర సౌధములయందు, సతులు = స్త్రీలు, ఆ ముని జరఠ అంగనల్ ఏడ్వురున్ = సప్తర్షులయొక్క (భార్య లయిన) యావృద్ధస్త్రీలు ఏడుగురును, కృపన్ = (సామీప్యపరిచయము చేతనయిన) వాత్సల్యముచేత, కలహములు తీర్పన్ = దంపతుల పొలయలుకలను మంచిమాటలచేత పోఁగొట్టఁగా, ఘన గత శంపన్ = మేఘమును ('మేఘే పుమాన్ ఘనః' నానా.) పొందినట్టి (మేఘమందలి) - మెఱుపునందు ('శమ్పా శతహ్రదా' అమ.), కంచము = పళ్లెమును, ఇడి = ఉంచి, కాటుకఁ దీర్చి = ఆకంచమున కంటినట్టి కాటుకను కన్నులకుం బెట్టుకొని; (ప్రేయసి కాంతుని అనలంకృతగాఁ గలయఁగూడదు గావునను, పొలయలుక తీఱిన హర్షముం దెలుపుటకును, యథాసిద్ధమైన యలంకృతిం దాల్చుట), ఇన ఊష్మ దట్టినది ఘునుంగు = తూర్పున నుదయించువాఁడై ఊర్ధ్వముఖుఁడై వచ్చుచున్న సూర్యుని వేఁడి సోఁకి కరఁగినట్టి ఘునుఁగును (ఇట్లు చేత అతినాగరకత్వత్తిని సూచించుచున్నది - వారి జాణతనమును గూడ), అలంది — పూసికొని, కైశికమున్ = కేశపాశమును ('తద్వృన్దే కైశికం కైశ్యమ్' అమ.), ప్రభాతశశాంకున్ = ప్రాతఃకాలపుఁ జంద్రునికి ('ప్రత్యూషోఽహర్ముఖం కల్య ముషఃప్రత్యుషసీ అపి, ప్రభాతంచ', 'ద్విజరాజః శశధరో నక్షత్రేశః క్షపాకరః' అమ.), మోపన్ = తగిలింపఁగా, విచ్చిన నవ హల్లక ఆళిన్ = వికసించిన క్రొత్త చెంగలువల సమూహముతో, దేవన్ = ఒప్పుగా, కయిసేసి = అలంకరించికొని, పతితోన్ = మగనితో, రమింతురు (కర్త 'సతుల్' అని బహువచనమైనను 'పతులతో' అని బహువచనముం బెట్టమి అర్థలాఘవస్ఫూర్తిం దప్పించుటకు).

మధురాపుర సౌధములయందు యువతులు రాత్రియెల్ల పొలయలుకలోనే గడచిపోయి నందునను, తెల్లవాఱినపిమ్మట కామక్రీడ కూడదు గావునను, తమప్రణయ కలహములను, సప్తర్షుల భార్యలయిన ముదుసలి పేరంటాండ్రు ఇరుగుపొరుగుల మీఁది వాత్సల్యముచేత తీర్పఁగా, అపర బాదర క్షణములో సిద్ధించెడి సాధనములచే అలంకరించుకొని,—అది యెట్లన్న, మేఘమండలి మెఱుపుజ్వాలమీఁద కంచ ముంచి దాని కంటినమసితో కాటుక పెట్టుకొని. ఘునుఁగును ఉదయింపనున్న సూర్యునియొక్క యూర్ధ్వముఖమయూఖములకు చూపి, ఆ వేఁడికిం గరంగినంతట దానిని అలందుకొని, చెంగలువ మొగ్గలను చంద్రుని కంటించి వికసింపఁజేసి. వానితో నొప్పుగా కొప్పు నలంకరించుకొని,—పతితో క్రీడింతురు. సప్తర్షిమండల పర్యంతము మేడలు వ్యాపించి యున్న వని భా.—అతిశయోక్తి.—మేడలు మహోన్నతము లనుట.

'జరఠ'—ముదుసళ్లు గావున చీవాట్లు పెట్టుటకును అధికారిణులు. 'ఊష్మ' సోకించుట మెత్తఁబడకున్న పూసికొన నలవడదు, తాపి పర్వదు. ['ఉగాగమంబు లేమి నాంతంబులకు అస్త్రీలింగంబులకుం బ్రథమైకవచన లోపంబు లేదు.' అనుటవలన 'ఊష్మము' అనవలయును,

ములోపమును చరితాది కార్యముగానో, ఇమనిజంతనూత్రగత బహుళ గ్రహణముచేతనో సాధింపవలయును;]. 'ప్రభాత' మగుటచే ముకుళించుకొన్నందున విరియించుటకై మోపవలసి వచ్చినది, రాత్రి శశాంకుఁడయిన దూరమునుండియే విరియించియే యుండును; 'మోపుట' = తగిలించుట;— ప్రాతస్తన శశాంకుఁడు గావున దుర్బలుఁడు, అందువలన గట్టిగా అద్దననేగాని విరియింపఁ జాలఁడని, 'నవ' ఆరాత్రిదే అనుట. 'హల్లక'—కలువకు రాత్రి వికాసముగాన; కమలముం జెప్పమి యేలన - అది పెద్ద దగుటచే ధమ్మిల్లప్రవేశనార్హము కానందునను, రాత్రి దానికి వికాసము లేనందునను. 'ఏడ్వురుఁ'-అలుక మిక్కుటమని సూచించుచున్నది. 'తీర్పన్'-వీరిమంచి మాటలు అలుకతీఱుటకు బయటికారణములు, వాస్తవకారణము 'ప్రభాత' మే. 'సతుల్' అలుక వీరిదే యని సూచన. 'దానిని చూచితివి దీనిని పలచితివి' అని సతి పతిపై నలుగుట రసము గాని, 'వానిం గంటివి, వీనిం దగులుకొంటివి' అని పతి సతింబట్టి పట్టించుట సరసముకాదు. 'పతిన్'- జాత్యేకవచనమని యొక వ్యాఖ్య. జాత్యేకవచనమయినచో బహుత్వమే వివక్షిత మగునుగాన అట్టి రసాభాసార్థ స్ఫూర్తి కాకుండుటకై యీయేక వచనప్రయోగ మని మదీయమతము.

చ. రవి యనుదివ్వెఁ గేతువు చెఱంగున మూసి ధుతోర్ధ్వయంత్రవా
రవిరళఘర్మ మై కలరవాల్పరవోక్తుల వాంతధూపరా
జివరనిశ స్ఫురన్మదనచేతులఁ జాతురి నెయ్యపుంగురుం
జువిదలు దార్ప విష్ణుపద మొత్తెఁ బురీగృహలక్ష్మి నూత్న నాక్. ౧౮

కనన్ = చూడఁగా, పురీగృహ లక్ష్మి = మధురాపుర మందిర శ్రీ, నూత్న నాక్ =నవోఢయౌ (అనఁగా క్రొత్త పెండ్లికూఁతురో) యనునట్లుగా. వాం....శన్ - వాంత = వెలువరింపఁబడిన - ధూపరాజి=పరిమళద్రవ్య ధూప మనెడి - వరనిశన్ = మంచిరాత్రిలో, నెయ్య.... లు - నెయ్యపు = ప్రేమయుక్తలైన - కురుంజు = మూలములమీఁది గుజ్జు లనెడి - ఉవిదలు = చెలులు, చాతురిన్ = మెలపుతో, మదనచేతులన్ = కురుజాలమీఁద నుండెడు పట్టె లనెడు చేతులతో, తార్పన్ = పెనిమిటియగు విష్ణునికడకు చేర్పఁగా, రవియనుదివ్వెన్ = సూర్యుఁ డనెడి దీపమును. కేతువుచెఱంగునన్ = జెండావలువ యనెడి కొంగుతో ('కేతు ర్నారుక్ పతాకారి గ్రహోత్పాతేషు లక్ష్మణి' నేది.), మూసి = కప్పి, ధు...ర్మ—ధుత = చిమ్మఁబడిన - ఊర్ధ్వ = మీఁది - యంత్ర = (జలమును పైకి దుమికించెడి) యంత్రములయొక్క - వాః = నీ రనెడి (జలయంత్రములనుండి పైకెగయుచున్న నీ రనెడి) - అవిరళ = దట్టమైన - ఘర్మ = చెమరు గలది ('ఘర్మ స్స్యాదాతపే గ్రీష్మేఽప్యుష్ణ స్వేదామ్బునో రపి' అమ.), ఐ, కల...లన్ - కలరవ = పావురములయొక్క ('పారావతః కలరవః కపోతః' అమ.) - అల్పరవ = మెల్లనికూఁతలనెడి-ఉక్తులన్=పలుకులతో (పావురముల రవము లనెడి మాటలతోను మణితములతోను అనియు స్ఫురణము), విష్ణుపదము = ఆకాశమనెడి మహావిష్ణుచరణమును, కనన్మదన - కనత్ = ప్రకాశించుచున్న - మదన = కామముకలదై (ఉపయతొక్కమయి), చేతులన్ = హస్తములతో (అని శ్లేష), ఒత్తున్ = పట్టుచున్నది (ఆకాశమును త్రోయుచున్నదని శ్లేష.)

మధురాపురలక్ష్మి క్రొత్త పెండ్లి కూఁతురో యనునట్లుగా, కురుంజులనెడి యనుంగుఁజెలికత్తెలు మదనచేతులనెడి చేతులతో ఆమెపెనిమిటియైన విష్ణుదేవునికడకు కిటికీలనుండి వెలువడిన పరిమళ ధూపములనెడినిశలో నేర్పుమైఁ దార్పఁగా, ప్రకాశముగా ఆయనతో విహరించుటకు లజ్జించి, అప్రకాశార్థమై సూర్యుఁడను దీపమును (దీపమును, ఆర్పఁగూడదు గావున) జెండావలువయనెడు కొంగుతో మఱుఁగుపఱిచి, జంత్రానాల నీటి తుంపురులనెడి నిండుక్రొంజెమరు గలదై, పావురముల నునుఁబల్కులేయనెడి తనపల్కులు గలదై, ఆకాశమనెడి యామహావిష్ణువుయొక్క పదమును ఒత్తుచున్నది.

లోకములో నవోఢ రాత్రిసమయమున చెలికత్తెలు పడుకటింట భర్తకడకు నేర్పుమెయిం జేతితో లాగికొని పోయి తార్పఁగా, ఎట్టకేలకుం జేరి దీపమునకు చాటుచేసి చెమర్చుచు పావురముల పలుకులవంటి నునుఁబల్కులు పల్కుచు చేతులతో భర్తకు పాదములొత్తును. మధురాపుర గృహలక్ష్మివృత్తమును అట్లేయున్న దని భా.—అతిశయోక్తి రూపకోత్థాపితోత్ప్రేక్ష.

'రవి...మూసి' - పురసౌధములు సూర్యమండలాతిగామము లనుట. 'ఘర్మ' - ఇంతికి కాంతునిం గలిసినప్పుడు సత్త్వవికారముచే నుదయించు నెనిమిది సాత్త్వికభావములలో నొకటి, ఆయెనిమిదియు

'స్తమ్భః ప్రళయ రోమాఞ్చాః స్వేదో వైవర్ణ్య వేపథూ
అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః.'

'కలరవ' —సౌధవలభులయందు పారావతము లుండుట ప్రసిద్ధము—'తాం కస్యాంచి ద్భవన వలభౌ సుప్తపారావతాయామ్' - మేఘ. మణితము కపోతరవమువలె నుండు ననుటకు.—

'తచ్చ లావక కపోత కోకిలా హంస కేకి సదృశై రుతైః క్రమైః
మిశ్రితం ప్రహరణే ప్రయుజ్యతే చాన్యథాపి రుత మిష్యతే బుధైః'. కామశా.

మేఘములో I (42) 'తాం కస్యాంచిత్త్'ను శ్లోకము క్రింద మల్లి టీకం గనుఁడు. 'వాంతి' - 'క్రక్కఁబడిన' అని వాచ్యార్థము - అది గ్రామ్యము. ఇట గౌణార్థంబునం బ్రయుక్తముగాన నతిసుందరము.

'నిష్ఠ్యూతోద్గీర్ణ వాన్తాది గౌణవృత్తి వ్యపాశ్రయమ్
అతిసున్దర మన్యత్ర గ్రామ్యకక్ష్యాం విగాహతే'. దండి.

'వర' - జ్యోతిశ్శాస్త్రము ప్రకారము శుభకాలమునం గలయుట ప్రసిద్ధము. మదనచేతులు కురుఁజాలపై నుండు నవి గావునను, గృహలక్ష్మి మదనచేతుల పయిని గూడి సాక్షాద్విష్ణుపదము కడకు పోయియున్నది గావునను, కురుంజులను చెలులనుగాను, మదనచేతులను గృహలక్ష్మిని పడుకగదిలో పెనిమిటిచరణములకడకు నెట్టెడు (నయ్యావిపల) చేతులనుగాను, వర్ణించుట హృద్యముగా నున్నది. 'ధూప'ము నలుపుగావునను, 'నిశ'యు చీకటిచే నలుపుగా తోఁచును గావునను, సామ్యము. 'ధుత—ఊర్ధ్వ' - చెమరును ఉన్నట్లుండి వెలికి ఊలుకునదిగదా. రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్ష.

'చెరంగు' - ఈశబ్దమును సీతారామాచార్యులవారు 'చెఱంగు' అని శకటరేఫపంక్తియుగా పఠించినారు. అందులకు ప్రమాణముగా శ్రీనాథప్రయోగమును శృంగారనైషధమునుండి 'అవిక

యుఁ బట్టుఁబుట్టము చెఱంగు' అని ఒక్కదానినే యుదాహరించినారు. మఱియు 'చెఱంగు శబ్దము నొకానొక కవి లఘురేఫముగా వాడె' నని వ్రాసినారు కాని, ఆకవిపేరు వారు వ్రాయలేదు; వారు తడవిన యాయితరప్రయోగము ఆముక్తమాల్యదలోని యీ 'చెఱంగే' యేమో? మఱియు 'అఱిక' యందలి శకటరేఫమును 'చెఱంగు' లోని యతిచేతను 'చెఱంగు' లోని శకటరేఫమును 'అఱిక' లోని యతిచేతను సాధింపఁ జూచినారు. ఇట్లు అన్యోన్యాశ్రయ దోష దూషితంబగుటచే ఈశ్రీనాథప్రయోగము అసాధకమైనది. భారతాదిప్రమాణములచే శకటరేఫవంత మని నిర్ణీతమైన పాఱుధాతువును రేఫ యతిలో 'శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బారెం బక్షులు' అని మనుచరిత్రలో పెద్దన్నగారు ప్రయోగించినారు. ఈకవులు కడమతావుల రఱలకు మైత్రి చెప్పనివారైనందున ఈతావుల శబ్దములందు లఘురేఫమనియే తలంచి రని యెన్నవలసి యున్నది. రఱయతికై పీఠికం గనుఁడు.

చ. గిఱికొను గోపురాగ్రపరికీలితపంకజరాగరశ్మిఁ గ
ట్టెఱ యగుచాయఁ బొల్చు దివసేంద్రుఁడు చక్కనమింటఁ బోవుచో
మఱచి విధాత పాటలిమ మధ్యమసంధ్యకుఁ జేయ లేమియా
కొఱఁతయుఁ దీర్చుకోఁ దొగరు గొల్పినకైవడిఁ బట్టణంబునన్. ౧౮

విధాత = బ్రహ్మ ('విధాతా విశ్వ సృడ్విధిః' అమ.), మఱచి = పరాకుచేత, (సూర్యునికి); మధ్యమసంధ్యకున్ = నడిమిసంధ్యయందు (మధ్యాహ్నసంధ్యలో), పాటలిమన్ = ఆరుణ్యమును, చేయ లేమి యా కొఱఁతయుఁ దీర్చు కోన్ = చేయనట్టి యాలోపమును దిద్దుకొనువాఁడై, తొగరు గొల్పినకైవడిన్ = ఎఱుపెక్కించినాఁడో (ఎఱ్ఱవానినిగాఁ గావించినాఁడో) యనునట్లుగా, పట్టణంబునన్ = మధురయందు, దివస ఇంద్రుఁడు = దిననాథుఁడు (సూర్యుఁడు - 'సూర సూర్యార్యమాదిత్య ద్వాదశాత్మ దివాకరాః' అమ.), చక్కనన్ మింటఁ బోవుచోన్ = సరిగా నెత్తిమీఁది యాకాశమునం బోవునపుడు, గిఱి...శ్మిన్ - గిఱికొను = ఆవరించుచున్న (రశ్మికి విశేషణము - గిఱి = వలయాకారరేఖ) - గోపుర = గవనుయొక్క ('గోపురం ద్వారి పూర్ద్వారం' వై.) - అగ్ర = తుదను - పరికీలిత = తాపింపఁబడిన - పంకజ రాగ = పద్మరాగ మణులయొక్క (పద్మరాగము ఎఱుపు) - 'శోణరత్నం లోహితకః పద్మరాగః' అమ.) - రశ్మిన్ = కాంతులచేత ('కిరణ ప్రగ్రహౌ రశ్మీ' అమ.), కట్టెఱ = మిక్కిలి యెఱుపు, అగుచాయన్ = అగునట్టి కాంతిచేత, పొల్చున్ = ప్రకాశించును.

సూర్యుఁడు మధ్యాహ్నకాలమున నడిమింట అపురిగవనుమీఁదుగా పోవునపుడు అందు తాపింపఁబడిన పద్మరాగముల కాంతులు తన మెయిచుట్టుం బర్వుటచే కట్టెఱ్ఱనివాఁడుగా నగపడును. అక్కడికి రాఁగానే అట్లు అగుట యెట్లున్న దనఁగా, సృష్ట్యాదిలో బ్రహ్మ సూర్యునికి సాయంప్రాతః సంధ్యలయందు ఎఱుపుంజేసి మధ్యాహ్నసంధ్యయందు చేయం బరాకుపడిన లోపమును తీర్చుకొనువాఁడై అట్లు ప్రతిదినము ఆసంధ్యయందు సూర్యుని నెఱుపు గావించుచున్నాఁడో యనునట్లున్నది.

సూర్యుఁడు తనభాస్వరశుక్లతం గోలుపోయి పద్మరాగముల భాస్వరపాటలిమను బొందుట తద్గుణాలంకారము, తొగరుకొల్పె ననుట తదనుప్రాణితమైన యుత్ప్రేక్ష.

'సంధ్యకున్' - సప్తమ్యర్థమందు 'కు'షష్ఠి. 'కొంతయున్' - యుశబ్దము వాక్యాలంకారము. 'తీర్చుకోన్' - 'ముజ్ఞు పరంబగు నపుడు కోశబ్దంబు కొనునకు బహుళంబుగా నగు'- బా. వ్యా. క్రి. 60. 'కన్గొంజాల కుజృంభితస్తనయుగ్మంబు' అని వను. - ఈపద్యమునందు శకటరేఫప్రాసము నిర్వహింపఁ బడినది. 'గిఱికొను' -

"చ. చఱిబడి తీవ్రఘూర్ణ వశంబున నొక్కటఁ దీఁగచుట్టు నె
త్తఱు లయియున్న పాపతతి త్రాటిమలంకల నిర్ఝరాంబువుల్
గిఱికొని మీఁదనుండి డిగఁ గిన్నరకంఠి, పయోధిఁ ద్రచ్చు న
త్తఱి ఫణిరాజు చుట్టినవిధంబున నున్నది చూడు మిగ్గిరిన్."

—*పుష్పలావికలు*—

సీ. వెలఁది, యీనీదండ వెలయెంత? నాదండ
కును వెలఁ బెట్ట నెవ్వనితరంబు?
కలువఁదాపులు గాన మలికదంబకవేణి?
కలువతావులు వాడకయ కలుగునె?
కడివోదు నాకిమ్ము పడఁతి యీగేదంగి
ననఁ, గడిగొమ్ము ముందఱికిఁ జూడు.
జాతు లే సంబుజేక్షణ? పద్మినులు సైత
మును నున్నయవె జాతు లునికి యుండదె?
తే. యనుచుఁ దొలి నుడి సభిలాష లెల్లయ మూఁగి
పలుకుతోడనె సర్వగర్భంబు గాఁగ
నుత్తరము పల్లవశ్రేణి కొసఁగు చలరు
లమ్ముదురు పుష్పలావిక లప్పురమున. ౧౯

విటులయు పుష్పలావికలయు సరసోక్తులు.—

1. విటప్రశ్న.—వెలఁది = ఓచెలువా, ఈనిదండ వెల = నీదయిన యీపూల సరమునకు (బాహువునకు అనియు - వానికి దండలు తిరిగియున్నవి, దండకడియములు ఇత్యాది వ్యవహారము ప్రమాణము) విలువ; ఎంత? పుష్పలావి కోత్తరము.—నాదండకున్ = నాపూల సరమునకు (నాబాహువున కనియు),... ఎవ్వనితరంబు = ఎవనికి శక్యము (ఎక్కువ వెలగల దని భా. నాతోడి పొందునకు తగినధనమును ఎవఁడును ఇయ్యనేరఁడు - అనఁగా నా పొందు మిక్కిలి దొడ్డది అని భా. - పూర్వులు దండశబ్దమునకు బాహ్వర్థమును వ్రాయక సామీప్యార్థ

మును వ్రాసిరి. ఆ పక్షమందును పొందే అర్థము. బాహువును ఆలింగన ముఖముగా పొందు నే తెలుపుచున్నది.)

2. వి.- అలికదంబక వేణి = తుమ్మెదల మొత్తమువంటి జడగలదానా, కలువక = ఈ కలువపువ్వునందు (కూడుటకు అనియు - కలుగక - 'క్వచిద్గకారో వః' - కలువక - 'వినుము నరేంద్ర, విప్రుఁ డలిగెక;' అనినట్లు కలుగుధాతువునకు కూడుటయు అర్థము.-

"కలికి మాటలు వేయు నేటికి కేఁక నీకాయంబు తో వాని తోఁ

గలుగక భాగ్యము గల్గకున్న విభునింగాఁ జేయుమీ వీని రాఁ

గలజన్మంబున . ." అని. ౨ ఆ. - శబ్దరత్నాకరము). తావులు=పరిమళమును (ప్రదేశములు అనియు), కానము = చూడము (అగపడలేదు అనుట) - పూర్వులు 'కలువతావులు' అని పఠించి కలువకు స్థానములయిన సరస్సు లనియు దానిచే విషయనిగరణమువలన నాభులు సూచితము లనియు వ్రాసినారు. ఈపక్షమున బహుత్వము అవివక్షితము. గాంభీర్యమును బట్టి నాభికి సరస్యుపమ ప్రసిద్ధము. 'మెఱసె నాభి గభీరజలాశయంబనక' వసు. 2 ఆ. 46. 'నాభిహ్రదైః పరిగృహీతరయాణి' మాఘ. 5 స. 29. 'గభీరే తే నాభీసరసి కృత ఝంపో మనసిజః'-సౌందర్యలహరి. 77 శ్లో. [ఒండె, కలువతావులు = సంగమ స్థానములు, కానము - మనకు సంగమించుటకు తా వెక్కడ ? (కలువ = సంగమము అని నన్నెచోడుని ప్రయోగము కలదు)]. పు.—కలువతావులు = ఉత్పల పరిమళములు (పూర్వోక్తవిధమున నే నాభులు అనియు), వాడకయ కలుగునె = పువ్వు వాడుసూపకుండఁగా నే పరిచయము లేకయే కలుగవు - (నాతో మైత్రి చేసికొందువేని ఎన్నింటి నేని మనకూటమికిం దగిన రహస్యప్రదేశములను నేను చెప్పఁగలను అనుట).

3. వి.—పడఁతి = ఓ వెలఁదీ, కడిపోదు = పరిమళము చెడదు, (నీపొందులేక నాకు కబళము దిగకయున్నది అనియు), ఈగేదంగి ననక = ఈ పైఁడి మొగలి పువ్వును (ఈనీవరాంగమును అనియు), నాకు = ఇమ్ము; పు.—కడివోమిక = పరిమళము చెడమిని ... [ఇప్పుడు కబళము దిగని మాటకేమి నన్నుంగవసి యెడఁబాసినంతట కబళము దిగ నే దిగదు అనుటయు. —"కబళపరిమళక్షుత్యర్థములయందుఁ। గనుపట్టుచుండును గడియనంగ." ఆం. భా. 3(61).

"క. పడఁతికిఁ గన్యా ధర్మం
బెడలినఁ గొఱయగునె వెండి? యెవ్వం డైనక
కడివోయిన పువ్వులు మఱి
ముడుచునె రసికుఁ డగువాఁ డమోఘవిచారా." భోజ. 4 (224).]

4. వి.—అంబుజ ఈక్షణ = తామరలవంటికన్నులు గలదానా, జాతులు = జాజులు (పద్మిని, హస్తిని, శంఖిని, చిత్రిణి అను స్త్రీజాతులు), ఏవి = కలవా ? (నీవు ఆజాతులలో ఏజాతియందు చేరిన దానవు ?) పు. - పద్మినులు సైతమునుక = తామరల మొత్తములు కూడను ('పద్మినీ పద్మసంఘాతే స్త్రీ విశేషే సరోఽమ్బుజే' మేది. పద్మినీజాతి స్త్రీలు కూడను—తల్లక్షణము రతిరహస్యమున—

'కమలముకుళమృద్వీ ఫుల్లరాజీవగన్ధిః। సురతపయసి యస్యాః సౌరభం దివ్య మఙ్గే,
చకితమృగ దృగాభే ప్రాన్త రక్తే చ నేత్రే। స్తనయుగళ మనర్ఘ్య శ్రీఫల శ్రీవిడమ్బి,
వ్రజతి మృదు సలీలం రాజహంసీవ తన్వీ। త్రివళిలలితమధ్యా హంసవాణీ సుకేశా,
మృదు శుచి లఘు భుక్తే మానినీ గాఢలజ్జా। ధవళకుసుమ వాసో వల్లభా పద్మినీ స్యాత్.'),
ఉన్నయెడన్ = ఉన్నతావున, జాతులు = జాజిపువ్వులు (హస్తినీ శంఖినీ చిత్రిణీ జాతులు), ఉనికి = ఉండుట, అరుదె = ఆశ్చర్యము గాదు (తప్పక యుండును.)

అనుచున్ = ఇట్లని, అప్పురమునన్ = మథురలో, అభిలాషలు = పుష్పములమీఁదను (పుష్పలావికలమీఁదను) కోరికలు, ఎనయన్ = పుట్టుచుండఁగా, మూఁగి=ఆపుష్పలావికలను కమ్ముకొని, తొలినుడిన్ = మొదటి మాటను, పలుకుతోడనె=విటులు వచించిన వెంటనే (లేక మాటవెంబడినే), నర్మగర్భంబుగాఁగన్ = లోపలపరిహాసముగల యట్లుగా (పైకి పువ్వులం గూర్చియే పలికినట్లును లోపలికి ఎగతాళి యర్థ మగునట్లును—'ద్రవకేళిపరీహాసాః క్రీడా ఖేలా చ నర్మ చ' అమ.), పల్లవశ్రేణికిన్=విటరాజికి ('అథ పల్లవః। అస్త్రీ ప్రవాళే నా షిద్గే' నానా. 'శ్రేణిః స్త్రీపుంసయోః పఙ్క్తౌ సమాన శిల్పి సంహతౌ' మేది.), ఒసఁగుచున్=ఇచ్చుచు, పుష్పలావికలు = పువ్వులుకోసి యమ్మెడు స్త్రీలు, అలరులు = పువ్వులను, అమ్మెదురు.

"ఇట వ్యాజోక్తి — —
క. తేజరిల వేడ్కతోన। వ్యాజసముద్భూత మైన వస్తువు నెలమిన్
వ్యాజముగఁ జేసి పలికిన। వ్యాజోక్తి యనంగఁబరఁగు నది యెట్లన్నన్."
అని జోగి జగన్నాథ పండిత వ్యాఖ్య.

చ. సరసులనర్మ మింపుల నొసంగఁ గదంబపుదండఁ గట్టుచోఁ
గరఁగుటఁ దెల్పుదృక్తరళకాంతులు నుత్తర మిచ్చునంతరాం
తరముల నవ్వులుం గలువతండము మొల్లలు నంచు మిన్నుగ్రు
చ్చి రహిని రిత్తనూ లొసఁగి సిగ్గు వహింతురు పుష్పలావికల్. ౨౦

పుష్పలావికల్ = పువ్వులు కోసెడు (కోసియమ్మెడు) స్త్రీలు, సరసుల నర్మము = రసికు లయిన విటులయొక్క పరిహాస (వాక్య)ము, ఇంపులన్ ఒసఁగన్ = తమకు ప్రీతిని గావించుచుండఁగా, కదంబపు దండన్ = (ఆవిటులకై) మిశ్రమాల్యమును, కట్టుచోన్ = తాము గ్రుచ్చునప్పుడు, కరఁగుటన్ = ఆవిటులపరసోక్తులకు తమ మనస్సు కరంగి నందులకు, తెల్పు....లున్ — తెల్పు = సూచకములయిన – దృక్ = కన్నులయొక్క – తరళ = తళుకుగల ('తరళం చఞ్చలే షిద్గే భాస్వరేఽపి త్రిలిఙ్గకమ్' మేది.) కాంతులున్ = ప్రభలను, ఉత్తరము = విటులమాటలకు జవాబు – ఇచ్చునంతరాంతరముల నవ్వులున్ = చెప్పునట్టి [ప్రత్యుత్తర మైన నడిమినడిమిహాసితంబులను, కలువతండము = తొగమొత్తము, మొల్లలున్ = కుంద ములను (పా. మల్లెలు), అంచున్ = అని భ్రమించి (తమ దృగ్రోచులను నల్లగలువలను గాను తమ నవ్వులను మొల్లలనుగాను భ్రమపడి-యని క్రమాన్వయము – తత్త త్సాదృశ్యము ప్రసిద్ధము), మిన్నుగ్రుచ్చి = ఆకాశమును (అనఁగా ఆదృగ్రోచులను ఆనవ్వులను అవి స్పర్శహీనము లగుటం

జేసి మింటివంటివే-వానిని) పూమాలగా గ్రుచ్చి, రహిన్ = ఆసక్తితో, రిత్తనూలు = (పూవ లయను భ్రమచేత) పువ్వులులేని వట్టి దారమును, ఒసఁగి = ఆవిటులకిచ్చి, సిగ్గు వహింతురు = అంతలో (తమపొరఁబాటు తమకుం దెలియఁగా) లజ్జపడుదురు.

ఆపురమందు పుష్పలావికలు కడుధూర్తలైనను, విటపుంగవులు వారిని సయితము మోహాము పాలుసేయునట్టి సరసభాషణము లనుట. భ్రాంతిమదలంకారము,యథాసంఖ్యంబును.

సీ. పద్మాస్య, పురి ననుభవితకు నీవ యె
　　త్తులు వెట్టెద ననఁగ రావలసె నిటకుఁ;
దెలుపుమా, జాముండు నలరింపొ ఘటికాద్వ
　　యం బుండు నలరింపొ కంబుకంఠి?
నా వేఁడుటకు నీవు బూతు వేల చెప్పెద?
　　వువిద. మే మందారక నోర్వఁగలమె?
చేరఁగా రాదె. బాసికము గేలొసఁగిన.
　　యంతనే చెడునె యోణాయతాక్షి?
తే. యనుచుఁ, బరిభాషఁ బోలెఁ బద్మాస్య దొరల
నాడ. మోవిఁ జెఱం గిడి, యాఁగు నవ్వు
కంట నిగుడ, విటు ల్నాన్పుకరణిఁ జల్లు
సరసపుజలంబె జాణల మరులు కొల్పు. ౨౧

1. పద్మ ఆస్య = ఓతామరస వదనా, పురిన్ = ఈయూర, అనుభవితకున్ = భోగించు వానికి, నీవ = నీవే, ఎత్తులు వెట్టెదు = పూవుబొత్తులు (మాల్యములు) కట్టెదవు, అనఁగన్ ఇట కున్ రావలసెన్ = అని విని నీకడకు వచ్చితిని (ఈయూర మాల్యము ననుభవించువారికి నీపూ వుబొత్తులే శ్రేష్ఠములు అని విని నీవలన వాని కలిచికొన వచ్చితిని అనుట - ఎత్తు = ఎదురు - అనఁగా వలపుకత్తెయే తన విటునికిచ్చు ధనము-కావున - నిన్ననుభవించువానికి నీవే ధనమిచ్చెద వని విని నిన్ను తనియించి నీవలన ఎదురు కైకొనఁగలవాఁడనై నీకడకు వచ్చితిని - అనియ ర్థాంతరము;)—'అనుభవిత' - అనుభవితృ శబ్దము ఋకారాంతము; 'నీవ' - అశబ్దమునకు అవధారణార్థము వలపుకానివలన ధనముం గైకొనక యని భా. 'ఎత్తులు వెట్టెదు' అనఁగా ప్రయ త్నములు చేసెదవు అని కొందఱు అర్థము చెప్పుదురు; 'అనుభవితకున్'-'అనుభవతకున్' అను పా. పొరఁబాటు, దానికి అనుభవమునకు అనునర్థమును రాదు, అందలి తల్ప్రత్యయము అప్రస క్తము అంతర్గడువు; 'అనుభవమున కీవ' అని సీతారామాచార్య పా.

2. కంబుకంఠి = శంఖమువంటి కంఠముకలదానా, జాము ఉండు నలరు ఇంపొ = జాము సేపు (ఏడు నర గడియలకాలము) పరిమళము చెడక (వాడక) యుండునట్టి పువ్వము మనోజ్ఞ

**మో**, ఘటికాద్వయంబు = రెండుగడియలకాలము మాత్రమే - ఉండు నలరు ఇంపొ=పరిమళము చెడక (వాడక) యుండునట్టి పువ్వు మనోజ్ఞమో, తెలుపుమా = చెప్పుమా; (నీపువ్వులు చాలసేపు చెడకయుండును గావున మాకు అవియే వలయు ననుట) - (**గూఢార్థము**.- అలరు అనఁగా సంతోషము - సంభోగము లక్ష్యము - నీకు జాముసేపు ఉండునట్టి సంభోగము మనోజ్ఞమా-అనఁగా అది కావలయునా, రెండు గడియలే యుండునట్టి సంభోగము మనోజ్ఞమా-అనఁగా ఇది కావలయునా, చెప్పుము.— ఒరులు రెండు గడియల సంభోగము నే యొసంగుదురు, నేను జామునే పుండుసంభోగము నొసంగుదును గావున నన్నే సేవింపు మనుట ;

'ఏక వారావధి ర్జ్ఞామో రతస్య పరమో మతః
చణ్డ శక్తిమతో ర్యూనో రుస్ఫుట క్రమవర్తినోః.' రతిసర్వస్వము.

3. ఉవిద = ఓజవరాలా, ఏకా = నేను, వేఁడుటకున్ = కోరినందులకు, నీవు, ఋతువేళ= వసంతాది ఋతుకాలము రానిమ్ము అని. చెప్పెదవు, ఏము = మేము, అందాఁక = ఆయాఋతువు వచ్చువఱకు ('గ్రీష్మదౌ స్త్రీగజ స్య తుః.' నానా.), ఓర్వఁ గలమే=ఓర్వలేము (పొగడ నడిగిన వసంతము రానిమ్మని, తామర నడిగిన శరత్తు రానిమ్మని, - ఇట్లు ఆయా పుష్పమునకు ఆయాఋతువు వచ్చువఱకు వేచి యుండు మని చెప్పుచున్నావే, మాకు అవి ఇప్పుడే కావలయును, మేము వేచ నేరము, కావున దోహద విశేషములచే నీవు ఇప్పుడే పుష్పింపఁజేసి యా పుష్పములను మా కిమ్ము అని యర్థము;)—(**గూఢార్థము**— నేను నీతోడి పొందుం గోరినందులకు ఋతుస్నానమగు సమయమువఱకును నన్ను వేచు మనియెదవే, నేను అందాఁక వేచఁజాలను, కావున ఇప్పుడే నాకు సంభోగం బొసంగుము.); ['ఋతువు + ఏల' అనియేని గ్రహింపవచ్చును. అర్థములకు అభేదము కలదు.]

4. ఏణ ఆయత అక్షి = లేడివలె వాలిక కన్నులు గలదానా ('దీర్ఘ మాయతమ్' అమ.
'కృష్ణసారరురు న్యఙ్కు రఙ్కు శమ్బర రౌహిషాః
గోకర్ణ పృషతై ణర్శ్య రోహితా శ్చమరో మృగాః.' అమ.).

చేరఁగారాద = నేను నీపూవుపుచేయుటకు రాఁగూడదా, కేలు సోఁకినయంతనే=నాచేయి తగిలిన మాత్రానకే, బాసికము = నీవు గ్రుచ్చి విక్రయార్థమై పెట్టుకొని యున్న యీ బాసికపుదండ (వివాహకాలమందు వధూవరుల నొసటం గట్టఁబడునది మూఁడు ప్రక్కలు తీరినట్టి హారవిశేషము), చెదునె = వాడిపోవునా, - (గూఢార్థము. నిన్ను నేను తసలఁ గూడదా, నీబాసికము అనఁగా ఊరుమూలము నాచేయి తగిలిన మాత్రాన వికృతి నొందునా ?—అభిప్రాయము నూహించుకొనునది.);

అనుచున్ = పూర్వోక్తప్రకారంబున, పరిభాషఁ బోలెన్ = సంకేతపు మాటలచేతనుం బోలె, తమ్ముల్ (పుష్పలావికలను గూర్చి), ఆస నోరలన్ = కోరిక పొరలుచుండఁగా అత్యంతాభిలాషతో ననుట), ఆడన్ = విటులు పలుకఁగా, (ఆపుష్పలావికలు), మోవిన్ చెఱంగు ఇడి = తమ యధరోష్ఠమును పైఁటచెఱంగుతో కప్పుకొని, అఁగు నవ్వు = అఁపుకొనుచున్న హసితము, కంటన్ = కన్నులయందు, నిగుడన్ = వెలువడఁగా, విరులు = పువ్వులను. నాన్చు కరణిన్ = తడుపుట కనుమిషచేత, చల్లు=విటులమీఁదనుం బడునట్లు చిలుకరించు నట్టి, సరసపు

జలంబె = సయ్యాట నీళ్లే (సరసా లాడుటగా చల్లిన నీళ్లే), జాణలఁ = రసజ్ఞు (లయిన యా విటు) లను, మరులుకొల్పుఁ = మోహింపఁజేయును (వశపఱుచు కొను ననుట.)

ప్రకృతవస్తు గోపనార్థమైన యవాస్తవ హేతూక్తి కానందున వ్యాజోక్తి కాదు, శ్లేషమాత్రము. 'నాన్చుకరణిఁ' - కైతవాపహ్నుతి.

'నీవు ఋతువు' — 'ఋ ఌ వర్ణంబులు రల తుల్యంబులు' బా. వ్యా.- కావున సంధిలేదు. 'అందాఁకఁ' = అంత + దాఁకఁ (= దనుకఁ), మోవిం జెఱంగిడుట నవ్వును దాఁచుటకు, నవ్వును దాఁచుట తమ బెట్టు చెడకయుండుటకు. 'జాణఁడు' మగాదుల లోనిది.

సీ. ఇంచు మన్నతిఁ గుందదంతాభఁ గూడి ని
చ్చలపుఁజూపులు మున్న సంభ్రమింప,
వెల యొప్పకవలఁ బో విలుచు మోవియుఁ గోప
మొదవెడుచూపు మోమోటఁ ద్రిప్పఁ,
దిరిగిన సస్మితోక్తియుఁ జూపుటొయ్యారి
ములు నగుఁ గాదను పలుకు లుడుప,
నవి గాని కావో సి కను పరసాపత్న్య
సంపాదనం బుబ్బు నింపుఁ బెనుపఁ,
తే. జతురవచనవిలాసాంగసౌష్ఠవములఁ
బసిఁడిఁ దా నిచ్చినట్టి యప్పణాంత్రె మఱిసఁ
బతికిఁ గ్రొత్తదిపు లందిచ్చు రతివిధమున
విటుల కిత్తెఱఁగు మఱి నాఁగ విరులు పురిని. ౨౨

1. ఇంచిమ = పువ్వులు ఇవిగో పుచ్చుకొనుము. అన్నతిఁ = అనెడు సమయమందు, దం......భఁ - కుంద = మొల్లలవంటి - దంత - పండ్లయొక్క, - ఆభఁ = కాంతిని, కూడి = కలసికొని. నిచ్చలపుఁ జూపులు = నిర్దోషము లైన చూడ్కులు. మున్న = ఆదిలోనే, సంభ్రమింపఁ = పండువు సేయఁగా ;

2. వెల, ఒప్పక - ఎక్కువయని, కవలఁ = మఱియొక పుష్పలావిక కడకు, పోఁ = విటుఁడు పోయినంతట, విలుచు మోవియు = పెదవిని పిలుచు తీరును. కోప మొదవెడు చూపుఁ = (ఆవిటునిమీఁద కోపముతోఁ గూడిన పుష్పలావిక చూడ్కియు, మోమోటఁ ద్రిప్పఁ = దాక్షిణ్యము గలవాఁడై వెనుకకు వచ్చునట్లు చేయఁగా (ఆచూడ్కి చేతను ఆమోవి పిలుపుచేతను అతఁడు మోమోటపడి మరల ఆపుష్పలావిక కడకే వచ్చు నని భా.);

3. తిరిగినఁ = మరల తనకడకే (ఆవిటుఁడు రాఁగా, సస్మిత ఉక్తియుఁ = చిఱునవ్వుతోఁ గూడుకొన్న మాటయును, చూపు టొయ్యారములుఁ = చూపుయొక్క విలాసములును, అగుఁ కాదు అను పలుకులు ఉడుపఁ = వెల సరి యనియేని హెచ్చు అనియేని పలుక నీయక చెప్పిన వెలకే కొనునట్లు చేయఁగా (అట్లు వశీకరించుచుండఁగా);

4. నీకున్, అవిగాని = ఆపువ్వులేగాని, కావో = వేఱుపువ్వులు పనికి రావా (గూఢార్థము — నీకు దాని పువ్వులేగాని నాపువ్వులు పనికి రావా-ఆపుష్పలావికను మరులుకొని నన్నుపేక్షించెదవు అని భా.), అను = అని, పరసాపత్న్య సంపాదనంబు = అన్యపుష్పలావికతో తనకు సవతి తనమును కల్పించు కొనుట (అదియు తాను ఆవిటునికి విటకత్తెలు అని కల్పించుట), ఉబ్బున్ = గర్వమును, ఇంపున్ = ప్రీతిని, పెనుపన్ = వర్ధిల్లఁ జేయుచుండఁగా ;

చతుర....లన్—చతురవచన=చదురు మాటలు - విలాస=ఒయ్యారములు - అంగసౌష్ఠవములన్=అవయవ సౌందర్యము-అనువాని (మూఁటి) చేతను, తాను = ఆవిటుఁడు, పసిఁడి ఇచ్చినట్టి అప్పుఁడటన్ = ఎవతెకు పువ్వులకొఱకు ముందుగా బంగారము సంచకారముగా ఇచ్చియున్నాఁడో ఆవనితను, మఱవన్ = ఆవిటుఁడు మఱచి పోఁగా, పతికిన్=మన్మథునికి, కైదువులు=ఆయుధము లయిన పువ్వులను, అందిచ్చు రతి విధమునన్=చైత్రయాత్రకై తెచ్చి చేత నుంచెడు రతివలె, వారు = ఆయూరి పుష్పలావికలు, విటులకున్, విరులు = పువ్వులను, ఇత్తురు. (రతి మన్మథ రూపమచే ఆవిటపిటులు అతిసుందరులనియు, కైదువు లిచ్చిన ట్లనుటచే ద్రష్టలకు ఆదర్శనము మదనావేశకరముగా నున్న దనియు భా. జాణలైన లాపుష్పలావికలు తమకడకు వచ్చిన విటుని ఎటులేని వలపించి తనపువ్వులే కొనునట్లు చేయుదు రనుట.—స్వభావోక్తి; 'పతికి.... విరులు' - ఉపమ.

'ఇంపము' - నిపాత్యము ('హిండ గ్రహణార్థే' అని హేమచంద్రుని దేశినామమాల యందుం గలదు.). 'సంబ్రమింప' - నామధాతువు – సంబ్రమము = సంబరము = పండుగు (కన్నుల పండువుగా నుండఁగా ననుట). 'చూపుటొయ్యారము' – టుగాగమము 'వేల్పుటావు' ఇత్యాదుల యందుంబోలె. 'పరసాపత్న్య' - ఇట 'సర్వనామ్నాం వృత్తిమాత్రే పుంవద్భావః' అనుటచే పరాశబ్దమునకు పుంవద్భావము రాఁగా నై రూపము సిద్ధించును.

'ప్రభాత వాతాహత కమ్ప్రతాకృతిః కుముద్వతీ రేణు పిశఙ్గ విగ్రహామ్
నిరాస భృఙ్గం కుప తేవ పద్మినీ న మానినీ సంసహతేఽన్యసంగమమ్.' భట్టి.

ఇట 'అన్యాసంగమమ్' అనక 'అన్యసంగమమ్' అనుటను బరికించునది. సాపత్న్యము = సపత్నీ భావము. 'అందిచ్చు' - దీనిని క్త్వార్థకాంత సంధిగా తత్సంబులు వాడెంతురు; అందు ధాతువు ఇచ్చు ధాతువు నిటుకలసి తెలుచుగా ప్రయోగములం గానిపించుటచేత దీనిని శబ్దపల్లవముగా గ్రహింప నొప్పును. 'పిశాచి నిను కఱుకు ట్లందిన్' ఆము. ఉ. ౨౦. 'మడిచి యందిచ్చునపుడు గోరిడుదుఁ గేల' నైష. 8 ఆ. 84. 'చాపము నాకందిమ్ము.' అను భారత ప్రయోగమును జట్టిదియు. ఈ శబ్దపల్లవమునకు ప్రయోగములు ప్రబంధములలో పరిశ్యతములు కలవు; కొన్నిటిని పీఠికయందుం గనునది.

చ. దలమగు చంద్రఖండములు దారలు, సాంకవ మొప్పుపాళిపా
టల మగుదంతపుంగరవటంబు శశాంకుఁడు, గుంకుమైనచీ
రలజిగి కెంపు, గా బయటి రథ్యల నొప్పు మదిందుకాంతవే
దులపయి సంధ్యయై బహుళతం దోఁచె నన న్పురి నిట్టినాల్గతుల్.

పురిన్ — ఆ పురమందు, బయటి రథ్యలన్ = వెలుపలి వీథులయందు - అనఁగా-పెద్ద వీథులయందు, గట్టివాల్ సతులు = పరిమళద్రవ్యము లమ్మెడు స్త్రీలు, పలుకు అను చంద్రఖండములు = మెండయిన కప్పురపుం దునియలు ('అథ కర్పూర మస్త్రియాం ఘనసారశ్చన్ద్ర సంజ్ఞః' అమ.), తారలు = నక్షత్రములు ('నక్షత్ర మృక్షం భం తారా' అమ.), సాంకవము ఒప్పు = జవ్వాది దేనియందు ఒప్పుచున్నదో అట్టి (సంకు వనఁగా జవ్వాది పిల్లి, దానివలనం గలుగునది గాన సాంకవము జవ్వాది) - పాణి పాటలము = నిగనిగలాడి శ్వేతరక్తము (పాణి = ముత్తెపు సిరు - 'శ్వేతరక్తస్తు పాటలః' అమ.), అగు - దంతపుం గరపటంబు = ఏనుఁగు దంతముతోఁ జేసిన బరణి, శశాంకుఁడు=చంద్రుఁడును, కుంకుమ ఐన చీరల జిగి=చెందిరము అంటిన కోకల డాలు, కెంపు = (సంధ్యా) రాగంబును, కాన్ = కాఁగా, ఇందుకాంత వేదుల పయిన్ = చంద్రకాంతపుఁ దిన్నెలమీఁద, సంధ్యయే = సంధ్యాకాలమే, బహుతన్ = అనేకత్వము పొంది, పొంచెన్ = అగపడినది, అనునటుగా, ఒప్పుదురు.

ఆపురమందు బయటి వీథులలో చంద్రకాంతమయవేదికలయందు సంజప్రొద్దుల పరిమళద్రవ్యము లమ్మెడుస్త్రీలు - మెండయిన కప్పురపుం దునియలు గల్గి జవ్వాదితోఁ నిండి నిగనిగలాడు పాటలవర్ణముతో నొప్పుచున్న దంతపు బరణియు, కుంకుమము లగిలిన చీరలకాంతియు, నొప్పారుచుండఁగా నెట్లు శోభింతురనఁగా, ఒక్కటియైన సంధ్య పెక్కుసంధ్యలై, ఒక్కొక్కసంధ్యయు చంద్రకాంతపు దరుగులయందు పెక్కునక్షత్రములు, మచ్చతోఁడి యొక్కచంద్రబింబము, రక్తమయూ, కలదై, అట కానిపించినదో యనునట్లు శోభిలుచుందురు.—రూపకానుప్రాణితమయిన యుత్ప్రేక్ష.

'పలుకు' —కప్పురపుం దునియలు చక్కగాఁ బుసను ఎక్కువగా అమ్మెడువారును గాఁబను అంగడిలో పెక్కులుగా నుండుట ప్రసిద్ధము; బహుత్వమును చెప్పుట సంఖ్యలలోనగు నక్షత్రములతో సామ్యముండుటకు. 'తారలు' —ఇవి నిశ్చయమునకు చంద్రభార్యలయిన యిరువదియేడు నక్షత్రములు మాత్రమేగాక నక్షత్రసామాన్యము అర్థము, 'నక్షత్ర తారా గ్రహా' అను ప్రయోగమందు నప్పుడేమయిన భేద మిచ్చుట ఇచ టుచితము గాదు. 'కరపటంబు' ఏకత్వము చంద్రసంఖ్యాసామ్యమునకౌను, పునుఁగు మిక్కిలి వెలపోదును వస్తువు గావునను ఇంచించుకయే అమ్మబడును గావునను ఒకకరపటము పునుఁగున పెక్కుజనములు విక్రయమునకు చాలుం గావునను అది ఒక కరపటమున నుండును. 'సాంకవ మొప్పు పాణిపాటల మగు దంతపుంగరపటంబు'-ఇందు 'సాంకవము' శ్రుతియార్థప్రథమ యని పూర్వముద్రణపాఠ్యం; అది హృద్యముకాదు; ఒప్పినది సాంకవమేగావున సాంకవమునకు ప్రథమ వచ్చినది; 'ఒప్పు' 'అగు' అను విశేషణోభయపదంబులు కేవలక్రియాజన్యవిశేషణ ఘటితంబులై సందర్భయోగ్యమయిన 'పాణిపాటలము' అనుపదముచే వ్యవహితము లయినవి. చూ. ప్రౌఢవ్యా. సమాస. 18 సూ. 'ఒప్పు' అను ధాతుజవిశేషణము అధికరణప్రాధాన్యవివక్షచేతను, 'అగు' అను ధాతుజవిశేషణము కర్తృప్రాధాన్య వివక్షచేతను, 'దంతపుం గరపటంబు' అను విశేష్యంబుతో సమసించినవి. చూ. బా. సమా. 26. సూ. 'ఇందుకాంతముల జెప్పుట ప్రతిఫలనార్థము, ప్రతిఫలనము బహుత్వార్థము. ఆసతులు దృశ్యమానలు గావున సంధ్య తాను మూర్తీభవించి నిజలక్షణములతో ప్రతిఫలించిన

డని యుత్ప్రేక్షాభిప్రాయము. 'గట్టివాల్పతులు' అనుపదము భారతప్రసిద్ధ మని పూర్వముద్రణ వ్యా. కాని భారతాది బహుగ్రంథములం దటితద్జ్ఞు లయినసీతారామాచార్యులవారు 'గట్టువాలు' అని పఠించి దానికి స్థిరం ధర్మార్థమునుమాత్రమే వ్రాసినారు. పోనిమదొరగారు 'గట్టివాల్ సతులు' అని పఠించి మామిడి వెంకన్న కృతాంధ్రదీపికయొక్క అనుబంధమునుండి పరిమళ ద్రవ్యము లమ్మెడుస్త్రీలు అని యర్థము వ్రాసినారు.

సీ. ఉపరిస్థజనవారణోక్తికిఁ జెవి దార్చి
యమ్మొగంబై బయ ల్చిమ్మి చిమ్మి,
గవను వెన్నొరయ మి న్నవియ దట్టించు తో
త్రధరు బందపుదాంట్లఁ దటిమి తటిమి,
చలువచే ద్వారవేదు లెటంగి నిల్చి త
జ్జనసమ్ముఖుకుఁ గేలు సాఁచి సాఁచి,
తొండములు కుబ్బ గండాల్పదాస మే
అలుగఁ బద్మాహు లాల ఉవ్వి ఉవ్వి,
తే. వేఁటకాఁడుతులకు పీడు వెడలి వెడలి,
పరపథగవధ్వనికిఁ బోక తిరిగి తిరిగి,
కృత్రిపుటలు వైరులకుఁ బంపు కృత్యలన వ
శానుగతిఁ జేరు నెలఁ గరు లగ్గలికల. ౨౧౦.

1. కరులు = ఏనుఁగులు, ఉపరి...కిన్ - ఉపరి = (మెడ) మీఁద - స్థ = (కూర్చుండి) ఉన్న - జన = మనుష్యుని యొక్క (మావటీనాని యొక్క యనుట) - వారణ = ఉక్తికిన్ = నివారణ వచనమునకు (అటు చేయరాలదు అను నపలింపునకు), చెవి దార్చి = చెవి యొగ్గి విని, ఆమ్మొగంబై = ఆమావటీనివైపు ముగముంచి (తలపైకెత్తి), బయల్ చిమ్మిచిమ్మి = ఆకాశమును మాటిమాటికిని మీటి; - చెవిదార్చుట మనమొక్కయుండుటచే అప్రయత్నముగా మావటీనిమాట వినఁబడనం దున; అమ్మొగంబై బయల్చిమ్ముట నివారణ సేయఁ గూడ దను నభిప్రాయమును అతనికి సూచించు టకు; 'చిమ్మిచిమ్మి' — ఆమ్రేడితము ముహురర్థకము.

2. మిన్ను అవియన్ = ఆకాశము బ్రద్దలగునట్టుగా (పా. మన్నవియ = భూమి బ్రద్దలగు నట్టుగా), ద...రున్ - దట్టించు = అదలించుచున్నట్టి - తోత్రధరున్ = బరిగెల ('తోత్రం వైణుకమ్' అమ.) పూనినవానిని, గవను = పురద్వారము, వెన్ను = తనవీపును, ఒరయన్ = రాచు కొనునట్లుగా, బందపుదాంట్లన్ = బంధములుగలకాళ్లతో దాంట్లు వైచుచు, తటిమితటిమి = మాటి మాటికి తటిమి; [మిన్నవియ బిగ్గరగా దట్టించుట ఇతఁడు కడుబల్లిదుఁడు చావఁగొట్టును అని భయముగొల్పుటకు; గవను వెన్నొరయుట దాంట్లచేత; దాంట్లు బంధములచేత.]

3. ద్వారవేదుల=వాకిళ్లకడనుండు తిన్నెలను, చలువచేన్ = అచ్చటి చల్లఁదనముచేత, ఎఱిఁగి, నిల్చినతతిజనజిఘృక్షకున్ = అందలిమనుష్యులను పట్టుకొనునిచ్ఛచేత, కేలు=తుండమును, సాఁచి సాఁచి=మరలమరలపొడిగించి; 'చలువ' — కర్మోపితోఁనగు కారణములచేత;చలువచే నెఱుఁగ నేల, కంటికి కనఁబడరా యనిన, మదముక్కియుండుటచే ముందువేదులవైపు సరిగా చూడలేదనియు, చలువచే వేదు లని తెలిసిన యనంతరము అటు చూచిన దనియు తలంపఁదగును; 'జిఘృక్ష' మదముచేత.

4. గండ అల్పదానము=చెక్కులలోని యించుక మదజలము,డిండిమంబులకున్=రాయిడి గిడిగిడియను వాద్యములయొక్క ధ్వనుల (ను ఏనుఁగు వినుట) చేత, ఏఱులుగన్ = ఏఱులవలె - అనఁగా - మిక్కుటముగా, ఉబ్బన్ = ఉప్పొంగఁగా. తద్వాహున్ = ఆడిండిమవాదకుని, తాలన్=శిలలతోఁ. ఉవ్విళ్లు = మాటిమాటికిం గొట్టి; - డిండిమధ్వనిచే ఏనుఁగునకు కోపము వచ్చినందున దాన ముబ్బుటయు వాదకుని తాలం గొట్టుటయు.

వేణుక ఆహతులకున్=వెదురుకోలల దెబ్బలచేత, వీడు వెడలి వెడలి=ఊరువెలువడి మరల వచ్చి మరలవెలువడి, పరిపథ గజధ్వనికిన్=వేఱుదారిలోని యేనుఁగుల ఘీంకారముచేత, పోక= ఊరువెడలిపోక, తిరిగితిరిగి=మరలమరల ఊరిలోనికి ప్రవేశించి, వశా అనుగతిన్=పిడియేనుఁగును ('కరణీ ధేనుకా వశా' అమ. పిడి=ఆడుమృగము.) వెంబడించుటచేత, వెలిన్=ఊరివెలుపలికి, అగ్గలికలన్=ఉత్సాహములతోఁ. వృక్పుటలు=చూడ్కులసమూహములు, వైరులకున్=శత్రురాజులమీఁదికి. పంపుకృత్యలు అనన్= ఆపాండ్యరాజు పంపెడు సంహారకదేవతలు అనునటు ఒప్పుచుండఁగా (ఉత్ప్రేక్ష. 'కృత్యా క్రియా దేవతయోః' అమ. 'సంహారకదేవత' యని ప్రాను. 'భార్గవ నిర్మితయైన కృత్యచేతం జంపింప సమకట్టిన' అని తద్వి త విష్ణుపురాణ ప్రయోగము.), చేరున్=పోవును. [పిడియేనుఁగువలన వెలుపలికేఁగినదిగాని ఒండుపిధమున నేఁగింప నలవిగా దని భా. ఆపాండ్యునికి అట్టి మదపుటేనుఁగులు పెక్కులు గల వని భా. మత్తగజస్వభావోక్తి.]

'ఏఱులుగన్ - ఇచ్చట క్రియావిశేషణమునకు నాన్యంతం బసుధాతువు అను ప్రయుక్తమై ప్రాస్వమును బొందినది. 'ఏఱులుకాఁగా' అనఁగా ఏఱులై ప్రవహించఁగా అని యర్థమగునట్లుగా 'ఏఱులు' క్రియావిశేషణముగాక నుబ్యంతమునకుం గర్తయగునేని, అపక్షంబున 'కన్' అని ప్రాస్వంబురాదు; కావున 'ఏఱులుగన్' అనునది ఉబ్బుటకు (క్రియా)విశేషణము కావలయును. పూర్వకాలికంబునకు 'ఉబ్బి' కి 'ఉవ్వి' తో సమానాశ్రయత్వము లేమింజేసి ఇప్రత్యయము ఘటిల్లదు, అందుకై 'ఉబ్బన్' అనియే పఠింపవలయును.

ఆపురమున మదపుటేనుఁగులు తమ్ము ఇచ్చవచ్చిన ట్లెల్ల పోనీయక మావటీఁడు అదలించునందులకు కెరలుచు, ఒరిగోలతో పొడుచువానిని బందాలలోనే యుండియు దాంట్లతోనే మాటిమాటికి తఱుముచు, చలువచే ఇండ్లవాకిళ్ల తిన్నెల నెఱిఁగి అందుండువారిని పట్టఁబోవుచు, డిండిమధ్వనికి గండమదము ఏఱులవలె నుబ్బుచుండఁగా, ఆడిండిమవాదకుని తాల ఉవ్వుచు, వెదురుకోలలపెట్లకు వీడువెడలియు, ఊరిలోనే వేఱుదారిం బోవు నేనుఁగు ఘీంకారము విని మరల ఊరిలోనికి తిరుగుచు, తుదకు పిడియేనుఁగు కనఁబడఁగా ఊరివెలుపలికి దానివెంట మహోత్సాహముతో పరువిడుచు, వైరిభయంకర మయినచూపులు చూచుచు పోవును.

ఉ. పై ననిశంబు జల్లుకొను పాంసువుపై ఖగతుండఖండితా
లానమహామహీరుహఫలచ్యుతబీజము లుత్క్షిపత్కరాం
భోనిబిడాప్లుతిన్ మొలకఁ బొల్చు నగమ్యతఁ దూలుచు న్పురో
ద్యానముల న్మదేభములు ప్రాణముతోడినగంబులో యనన్. ౨౭.

పురి ఉద్యానములన్=ఊరితోఁటలయందు, మద ఇభములు = మత్తగజములు, పైన్= తమయొడలిమీఁద, అనిశంబు=సర్వదా ('సతతానారతాశ్రాన్త సన్తతావిరతానిశమ్' అమ.), చల్లుకొను పాంసువుపైన్ = తాము తొండముతో చల్లుకొనెడి దుమ్ముమీఁద ('రేణుర్ద్వయోః స్త్రియాం ధూళిః పాంసు ర్నా న ద్వయో రజః' అమ. పా. పాంశుః). ఖగ...లు-ఖగ=పక్షుల యొక్క ('ఖగే విహఙ్గ విహగ విహఙ్గమ విహాయసః' అమ.)-తుణ్డ=నోళ్లచేత ('వక్త్రాస్య వదనం తుణ్డ మాననం లపనం ముఖమ్' అమ.) - ఖండిత= కొఱుకఁబడిన (ఫలవిశేషణము) - ఆలాన= (ఏనుఁగునకు) కట్టుఁగంబ మయిన('ఆలానం బన్ధన స్తమ్భే' అమ.)—మహామహీరుహ=పెద్దచెట్టు యొక్క ('వృక్షో మహీరుహః శాఖీ' అమ.)-ఫల=పండ్లనుండి - చ్యుత=రాలిన - బీజములు=గింజలు, ఉత్...లన్ - ఉత్క్షిపత్=మీఁదఁజల్లుకొనెడి - కరఅంభః=తొండపునీటియొక్క - నిబిడ= దట్టమయిన - ఆప్లుతిన్=తడుపుటచేత. మొలవన్=మొలకలెత్తఁగా, అగమ్యతన్ - సమీపింప రానివై (కొండలను అట్టివై), తూలుచున్ =ఊఁగులాడుచు, ప్రాణముతోడి నగంబులో యనన్= ప్రాణముగలవై సంచరించుచున్న కొండలో యనునట్లు, పొల్చున్=ఒప్పారుచుండును.

ఆపురమందు, ఊరితోఁటలలో మత్తేభములు-తాము నిరంతరము తొండములతో దేహము మీఁద చల్లుకొనెడి దుమ్ములో, తమకు కట్టుఁగంబము లై యున్న మహావృక్షముల పండ్లను పక్షులు కొఱుకుటంజేసి, వానిగింజలు పడఁగా, తాము తొండములతో ఎత్తి పయిం జల్లుకొనెడి నీటిపట్టం పుఁ బడిచేత మొలకలెత్తఁగా, ఆస్థితిలో చేరువకుపో నెవరికిని శక్యముగాక, ప్రాణముతోడి నగగొం డలవలె ఊఁగులాడుచు సంచరించుచుండును.—ఉత్ప్రేక్షాలంకారము.

శా. మౌనిక్రోధవిఘాతపత్త్రముల మా మాతో సపత్త్రి ల్గదా
కాసీ రం డని కేకరాక్షిరుచిమొక్కల్ ప్రక్కల న్వాగ్గతా
శాసల్పాహిపకల్పకాండతతులం దారం బురిం బొల్చు నా
జానేయంబులు ఫేనహాస మిడి కైజామోర లల్లార్చుచున్. ౨౮.

పురిన్ =మథురాపురమందు, ఆజానేయంబులు = ఉత్తమజాతిగుఱ్ఱములు ('ఆజానేయాః కులీనాశ్వాః' అమ.), మౌ...లము---మౌని =శాలిహోత్రమునియొక్క - క్రోధ=కోపముచేత - విఘాత=పోఁగొట్టఁబడిన - పత్త్రములము= ఱెక్కలుగలవారము (అనఁగా - ఱెక్కలులేనివార ము—'పత్త్రం వాహనపక్షయోః' అమ.), మీ మాతోన్, సపత్త్రిల్ గదా= ఱెక్కలుగలవార లుగదా, కానీ రండు =వచ్చి వేగముచూపుఁడు, అని =అనుటయర్థముగా, కే...క్కల్ - కేకరఅక్షి = మెల్లకంటియొక్క ('వలిరః కేకరే' అమ.- అపాంగముకడకు ఒఱగిన తారక కలిగినకన్ను మెల్ల కన్ను - ఆకేకరదృష్టిలక్షణము.-

'ఆకుఞ్చిత పుటాపాఙ్గపాటాసం తార్ధనిమీలితా
ముహుర్వ్యావృత్తతారాచ దృష్టి రాకేకరా మతా.')—

రుచి=కాంతులయొక్క - మొక్కల్=అంకురములు, ప్రక్కలన్=పార్శ్వములయందు, శా... లన్ — శార్ఙ్గ=సింగిణి విండ్లతోఁ గూడిన-తూణ=అమ్ముల పొదులయందలి - అనల్ప=గొప్ప - అహిపకల్ప=పాప తెండ్లవంటి - కాండ=బాణములయొక్క - తతులన్ = సమూహములయందు, తారన్=చొచ్చుచుండఁగా. ఫేనహాసము = నురుగనెడి నవ్వును, ఇడి=నవ్వి. జైజామోరలు = కళ్లెము పైకెత్తి బిగఁగట్టిన ముఖములను, ఊర్చుచున్=ఊంకించుచు. పొల్చెన్=ఒప్పుచున్నవి.

గుఱ్ఱములకు కపికంటి పార్శ్వదృష్టియు, నోటఫేనంబును, కళ్లెమెత్తి బిగఁగట్టినప్పుడు తల నుంకించుచుండుటయు స్వాభావికము. మఱియు వానికి పూర్వము ఱెక్కలుండి మునిశాపమువలనం బోయినవి. బాణములకు ఱెక్కలు గట్టియుండును. ఆగుఱియందలి యుత్తమజాత్యశ్వముల యాకేకరదృష్టులు తమప్రక్కలం గట్టియున్న సింగిణి విండ్లతోడి యమ్ములపొదులలోని పాఁప తెండ్లవంటి బాణములపైఁదికి ప్రసరించుటయు, ఫేనంబును, తలయూంకించుటయు నెట్లున్నదనఁగా, 'మాకు మునిశాపమువలన ఱెక్కలుపోయినవి, మీకు నున్నవి, అయినను మీరు వేగములో మాతోరండు' అని యాబాణములను పరిహాసపూర్వముగా పందెమునకు పిలుచుచున్నవో యనున ట్లున్నది. అంపలి గుఱ్ఱములు శరములకన్న వేగవంతము లని యర్థము. మహావేగము లనుట.— వాచకము లేమిచే గమ్యోత్ప్రేక్ష; 'అహిపకల్ప'-ఉపమ; 'ఫేనహాసము'-రూపకము.

'వాజిక్రోధ విఘాతపత్త్రిములము.'—

"పురా సపక్షా హరయో విచేరుః ఖేచరాః కిల,
గన్ధర్వేభ్యః సముత్పన్నాః సదా స్వచ్ఛన్దచారిణః.
తేజసో వా య్వమ్బుదగతై ర్ధర్ఘ్లక్షితలక్షణాన్
వీక్ష్య శక్రో జగామేదం శాలిహోత్రం మహామునిమ్.
ఛిన్ధి పక్షా నమీషాం త్వం యథా స్యు ర్వాహనాని మే;
ఇషీకాస్త్రేణ సోఽప్యేషాం పక్షాం స్త్రిప్రతయేఽచ్ఛినత్.
తతః ప్రసాదిత స్తైస్తు ప్రాదా ద్వర మిమం మునిః
యుష్మత్పక్షోపమో వేగ శ్శరగణానాం భవిష్యతి,
యూయం శక్రాదిదేవానాం వాహనత్వం గమిష్యథ,
తథా భూమి పతీనాం చ గౌరవేణ సమన్వితాః." శార్ఙ్గధరుఁడు.

'సపత్త్రిల్' - స్త్రీత్వము తతులు అను మహతీతర స్త్రీలింగమునకు విశేషణమగుటచేత; పాక్షికముగా 'సపత్త్రిములు' అనవచ్చును. 'సపత్త్రిల్' అను పా. అసాధువు. 'శార్ఙ్గ' ముం జెప్పుట వైణవమునకన్న శార్ఙ్గము బలిష్ఠముగావున; తదీయబాణములు దృఢతరములును వేగవత్తరములును గావున అంతకన్న వేగవంతము లగుట గుఱ్ఱములకు పరమోత్కర్ష. 'ఆజానేయంబులు'- 'ఆజాన' అని ఆఫ్రికాఖండములో నొకదేశము, అందు నుత్తమాశ్వము లుత్పన్నములై యితర దేశములకుం దేఁబడును. ఆజానదేశ భవములు గావున, ఆజానేయసంజ్ఞ. అయినను 'అజగతి క్షేపణయోః - ఆజేన క్షేపేణ ఆనేయాః ప్రాపణీయాః ఆజానేయాః' అని నిఘంటువ్యాఖ్యాతలును,

(చక్రవాకమిథునములును పక్షులగుటచేత ఆకాశముమీఁద మెఱయును, కావున), చక్రద్వితయి= జక్కవ దంపతులు,...; 'ఇఱిగాను మిన్ను' - రూపకము.

4. పొలసు = కౌటిల్యము (మత్స్యపరముగా - దాని దేహముమీఁది పొట్టు), దొలఁగన్ = పొరలి వచ్చునట్లుగా (మత్స్యపరముగా - పొరలి వచ్చుచుండఁగా), చూచు కలికిచూపులన్ = చూచెడి మనోజ్ఞమైన చూపులు గల వగుటచేత (మత్స్యంబును పొలసు దొర్లుచుండఁగా మనోజ్ఞమయిన చూపులు చూచునది - కావున), విరులు = మత్స్యములు, తెలిగన్నులు - తెల్లకాంతులు గల యావనితల నేత్రములు...;

పొలసినన్ = సమీపించినమాత్రాననే, తావి - పరిమళము, బుసులుకొనన్ = బుసలు కొనఁగా గుప్పని కమ్ముకొనుచుండుటచేత (అలరుఁదీఁగయు నట్లె), అలరుఁదీఁగ - పుష్పవల్లి. తిన్నని శరీరము = అందమయిన మేను,.....; అనఁగన్ - అనునట్లుగా. చెలువపు సంపద = సౌందర్యముగలనాతి, సురతక్రియాత్యనిధుల్ = కామకేళియందలి దిట్టతనమునకు స్థానములయిన ('ధృష్టే ధృష్ణగ్వియాతశ్చ' అమ.). పుష్యయుతతులు - నలజవరాండ్రు. పట్టణమునన్ - మధురాపురి యందు, పొలుతురు - ఒప్పుచుందురు.

ప్రతి పెద్దపాదమందును గత పూర్వార్ధమందును ఉత్ప్రేక్షాలంకారము. - రెండవలో 'అనఁగన్' తద్వాచకము.

మనోహరమయిన యీపద్యమున నాపల్కు పుస్తకములలో 'పద్ములపైన ప్రాఁకఁ జెన్నులు తేంట్లనఁగ' యని పా. ఉన్నది. కడమ యన్ని పాదములందును కారులు మొదటిదిగాను ఉపమానము రెండవదిగాను, ఉపమేయమయిన వనితాదులు మూఁడవదిగాను ఈక్రమమున చెప్పఁబడియున్నవి. ప్రథమపాదమున ఆక్రమము తప్పియుండుట అందముగా నుండనందున, 'పద్ములనె ప్రాఁకుఁ దేంట్లు నెఱికురు లగుట'అని మార్పు చేయఁబడినది. ఈమార్పునందు 'నెఱికురులు' అనఁగా కుటిలకుంతలములు - కురులుశబ్దము కురులనే గాక నంద్రుకలను గూడ చెప్పును' అని సీతారామాచార్యులవారు,

'కొప్పు మెల్లనె విచ్చి కురుల చిక్కుడలించి
తలయంటు నేర్పుతోఁ బొలఁతి యొకతె.' వసు. ౬ ఆ.

అను నుదాహరణముతోఁగూడ వ్రాసియున్నారు. ఇంక నుదాహరణములం బెక్కింటి నటునటుం గనవచ్చును. కేశకుటిలత శోభన మనుటకు —

'స్నిగ్ధనీల మృదు కుఞ్చితైకజా మూర్ధజాః సుఖకరాః ప్రసూన శీర్షః.' సా. సం.
'సస్మార సస్మరమతిః ప్రతినైషధీయం త్రోమాలయమరాలమరాలకేశీ.' నైష.
'అపరాధిని మయి దణ్డం సంహరసి కిముద్యతం కుటిలకేశి.' విక్రమో.

('కుటిలకేశి' అని ఊర్వశికి సంబోధన.)

మ. ప్రతతప్రాంతపిశంగ కుంకుమ జటాపాళీ కురంగీమదా
న్విత పీనాళికలస్వనంబు లెసఁగం జెన్నారు కర్పూరపుం
జ తతుల్ కంటికి నారజత్వమున మించన్ గామినీ కామి సం
తతి కేలా మెడఁ దెచ్చుఁ గంతుకల హాసోన్మాదంబు లాప్రోలునన్. ౩౯

ఆ - ప్రోలునన్ = పట్టణమందు, ప్రత...లు - ప్రతత = విస్తీర్ణములును (జటలకు విశేషణము) - ప్రాంత = తుదలయందు - పిశంగ = ఎఱుపుమించిన పసుపువన్నె కలవియు నయిన - కుంకుమ = కుంకుమ పుష్పములనెడి - జటా = జడలయొక్క - పాళీ=సమూహమును- కురంగీమద = కస్తూరియనెడి - అసితపీణా = నల్లనివీణియందలి - అళీ = తుమ్మెదయొక్క- కలస్వనంబులు - అవ్యక్త మధురధ్వను లనెడి - అళి కల స్వనంబులు = తుమ్మెద (ధ్వని) వలె నవ్యక్తమధురమైన ధ్వనులును, ఎసఁగన్ = ఒప్పుమీరుచుండఁగా, చె...ల్ - చెన్నారు = మనోహరము లయిన - కర్పూర - పచ్చకర్పూరముయొక్క - పుంజ= రాసులయొక్క-తతుల్= సమూహములు, కంటికిన్ = దృష్టికి. నారదత్వమునన్ - నారదమునిగా. మించన్ = అతిశయించుచుండఁగా. కామిని కామి సంతతికిన్ = వలపు కత్తెలయొక్కయు వలపు కాండ్ర యొక్కయు సమూహమునకు,కంతు కలహ ఉన్మాదంబులు=మరు దూతముల యుద్రేకములు(కామ క్రీడాడంబరము లనుట). ఏలా ఎడ తెచ్చున్=ఎందువలన విరమించును- (విరమింపవనుట.)

ఆపురమున కాముకులయిన స్త్రీపురుషులకు కంటియెదుట కలహములు పెట్టుటకు సమర్థుఁడైన నారదమహాముని కుంకుమపూ మొత్తము లనెడి యెఱ్ఱకోసల నిడుద జడలతోను, కస్తురి వీణ యనెడి కస్తురి పి...యొక్క, తుమ్మెదల మధుర నాదము లనెడి తుమ్మెదలనాదమువంటి, మధుర నాదంబులతోను, పచ్చకర్పూరపురాశిరూపమున ప్రత్యక్షమై యుండఁగా మదనకలహములకు ఏమి కొఱఁత?

కుంకుమపుష్ప కస్తురికణాలు అళినాదములు నను వీనితోడి పచ్చకర్పూరపు రాసులు కామోద్దీపకములు గావున (కంతు) కలహముం జేయించును; నారదుండును కలహము లాడించు వాఁడు గావున అట్టి యాకర్పూర రాసులు నారదులుగా నుత్ప్రేక్షింపఁబడినవి. అందులకు కుంకుమ జటాది రూపకములు అంగములు.

'ప్రోలునన్' - సప్తమ విభక్తికి కార్యము రామికి పీఠికం గనునది. 'పిశంగ' - 'పిశఙ్గః పద్మరాగవల్' - తమ్మిపుప్పొడివంటి వన్నెను. 'కుంకుమ' - కుంకుమపూవు సన్నగా ఎఱ్ఱగా కేసరములుగా జడల కుచ్చుకలవలె నుండును, మొత్తము జటలవలె పెనఁచికొనియు నుండును. 'కురంగీమదాసిత వీణా' - ఇట 'కురంగీ' యని స్త్రీత్వము అవివక్షితము. కస్తూరి మగమృగము నుండి వచ్చునుగాని ఆఁడుదానినుండి రాదు. అట్లుండ, 'కురంగ మద' అనక 'కురంగీమద' అనుట చాపలము. ఇట్లే ముక్కుతిమ్మనగారును -

చ. 'అలఘుతరా...త్నములు నాగభోత్కటగండగంధముల్
తలఁపునఁ గాటి నవ్వ చనుధారసతి దా భుజకీర్తిమౌక్తిక
చ్ఛలమునఁ గృష్ణరాయనృపచంద్రుని బాహువునందు భూషణో
జ్జ్వలమణులన్ మృగీమదమువాసనయుం గని; ధూర్త లంగనల్. పారి. 1. (20.)

కస్తురిపికె యనఁగా - 'కస్తూరి మృగముయొక్క కస్తురి యుండెడిబొడ్డుకాయ.' అట్టి కస్తురి పికెలనెడి కస్తురి పికెలు వివక్షితములు. ఆకాయకు వాచకమయిన పికెశబ్దముంబట్టి యీవ్యవహారము కలిగినది. 'అళి కలస్వనములు' - కస్తురికడ నళులు శబ్దించు చుండుటకు.—

'నమ మేరుమద్ధి ర్వదాపణే తులయన్ సౌరభలోభ నిశ్చలమ్
పణితా న జనార్ఘవైరపి కూజన్త మళిం మలీమసమ్' నైష. 2 (92.)

కలిగినందున త్రిశంకుఁడను పేరు గలిగినది. 'ఎఱిఁగి' - 'అరిగి' అని పూ. ము. పా. 'గ్రహ' - తూర్పునుండి పడమటికి చరించుచో నితరములకు వెనుకఁ బడునట్టి సూర్యచంద్రాదికములు ఆఱు నొకటి; 'తారా' లు చంద్రభార్య లయిన అశ్విన్యాదులు ఇరువదియేడు; ఆకాశమందు ప్రకాశమానములయిన కడమగోళములు నక్షత్రములు.

'కామం నృపాః సన్తు సహస్రశోఽన్యే । రాజన్వతీ మాహు రనేన భూమిమ్;
నక్షత్ర తారా గ్రహ సంకులాపి । జ్యోతిష్మతీ చన్ద్రమసైవ రాత్రిః.' రఘు. 6 (22).

'నవరత్నములు' - 'ముక్తా మాణిక్య వజ్ర వైడూర్య గోమేధిక పుష్యరాగ నీల ప్రవాళ మరకతములు. ఇవి నానా వర్ణములు, అశ్వి నక్షత్రాదులును. కావున సామ్యసంపద. 'గ్రహోడు'లనియు బహువచనము గావించిన సామ్యము మెఱుఁగెక్కును. రాశికి 'రాసుల'ని బహువచనమున సాదేశము.

చ. చిరసముపార్జితాగ్ని తడిఁ జెంది నశించు నటంచునో, కృతా
ధ్వరతఁ బవిత్రమైన నునికి దాన నొకంగము దాఁచుచేతనో,
పురధరణీసురుల్ నిగమభూధరము ల్జపయజ్ఞశీలు రా
హరిధనదాదు లైన వలహస్తము సాఁపరు దానధారకుల్. 33

నిగమభూధరముల్ = వేదపర్వతములును (అనఁగా అనంతవేదములను అపారముగా అధ్యయనము చేసినవారును. 'దక్షిణస్య పుం వేదో నిగమః' అమ.), జపయజ్ఞశీలురు = మంత్రావర్తనములు యజ్ఞములు చేయించుట స్వభావముగాఁ గలవారును, (అగు) - పురధరణీసురుల్ = ఆపట్టణపుబ్రాహ్మణులు ('ద్విజాత్యగ్రజన్మ భూదేవ బాడబాః' అమ.), (దాతలు), ఆహరి ధనదాదులు = ఇంద్రుఁడు కుబేరుఁడు లోనగుమహాదాయులు, ('యమానిలేన్ద్ర చన్ద్రార్క విష్ణు సింహాంశు వాజిషు। శుకాహికపి భేకేషు హరి ర్నా కపిలే త్రిషు.', కుబేర స్త్ర్యమ్బకసఖో యక్షరాడ్గుహ్యకేశ్వరః। మనుష్యధర్మా ధనదో రాజరాజో ధనాధిపః.' అమ.), ఐనన్ = అయినను, దానధారకుల్ = దానోదకధారను గ్రహించుటకు, వలహస్తముల్ = కుడిచేతిని, - చిర సముపార్జిత అగ్ని = చిరకాలమునుండి గడించికొనియున్న నిప్పు, తడఁజెంది - తడిసి, నశించున్ అటంచునో = ఆఱిపోవు నను కారణంబుననో, కృత అధ్వరతన్ = చేసిన యజ్ఞము కల్గినవారగుటచేత (యజ్ఞము చేసినవారై నందున—'యజ్ఞః సవోఽధ్వరో యాగః సప్తతన్తు ర్మఖః క్రతుః' అమ.), తదగ్ని = ఆయజ్ఞాగ్ని, మేనన్ = తమదేహమందు, ఉనికిన్ = ఉన్నందువలన, దానన్ = ఆదక్షిణహస్తమునందును, ఒక - అంగము = అవయవము (ఇచట ఆయగ్నియొక్క దక్షిణహస్తమనుట), దాఁచుచేతనో - ఇమిడ్చుకొని యున్నందుననో, - చాఁపరు.

వేదపారగులును జపయజ్ఞశీలురులు నయిన యా మధురాపురి బ్రాహ్మణులు ఆయింద్రకుబేరాదులు ఇచ్చెదమన్నను దానము పుచ్చుకొనరు, (బ్రాహ్మణుల దక్షిణహస్తమందు అగ్నియుండు నని వేదప్రమాణము గావున) దానోదకధారాగ్రహణార్థమై కుడిచేతిని చాఁపరు; ఏకారణముచేత ననఁగా, - చిరకాలమునుండి అగ్నికర్మచేత గడించుకొనఁగా దక్షిణహస్తమందు నెలకొనియున్న యగ్ని ఆధారచేత తడిసి చల్లాఱి పోవునను కారణముచేతనో, లేక -

యాజ్ఞము చేసినవారై నందున ఆయజ్ఞాగ్ని తమ దేహమం దుండుటంబట్టి యథోచితముగా ఆ యగ్నియొక్క దక్షిణహస్తము తమ దక్షిణహస్తమందు ఇమిడి యున్నందున తమ కుడిచేతిని తాము చాచుటచేత ఆ యగ్నిచేత తదీయ దక్షిణహస్తము దానధారాగ్రహణార్థము చాపc జేసినవారై అనురాగు లైరను కారణంబుననో.— హేతూత్ప్రేక్ష. వికల్పితకారణ సందేహమే గాని సాదృశ్యబీజకమయిన విషయి విషయ విషయక సందేహము గానందున సందేహాలంకారము లేదు.

'చిర' - ఉపనయన మయినప్పటినుండి. 'జనయజ్ఞశీలురు' - ఇవంత దీర్ఘలోపధమహత్తు గాన విభక్తి లకారాగమునకు దేశము. బా. వ్యా. తత్స - 39. 'హరి ధనము' - ఎంతటివారు ప్రార్థించినను మోమోటమింత జెందక తమ మహిమచే కాపాడుకొందు రనుట. 'వల' - దానధారను సంప్రదానముయొక్క వల హస్తమునం బోయవలయును. 'హరి ధన దాదికైన'- అని పఠించిన వక్తవ్యము ఇంతకన్న స్ఫుటపడును.

చ. ఉరవడిc బోరికై కవచ మొల్లరు మంత్రములందుc దక్క, సు
స్థిరభుజశక్తి నైదుపది సేయరు దత్తిన తక్క, మంటికై
పోరల రక్షణc జీ కమలబుద్ధి ఖళూరికc దక్క, వజ్రదో
ఃపరిఘవశీకృతాన్యనరపాలకు లప్పురి రాకుమారకుల్. ౩౮

అప్పురిన్ = మధురా పురమందు, వజ్ర...లు- వజ్రాయుధముల లె (=పిడుగువలె) దారుణమైన ('వజ్రోఽస్త్రీ పవిహీరయోః' నానా.) - దోః పరిఘ = చేతి దెబ్బచేత ('భుజబాహూ ప్రవేష్టోదోః' అమ.- 'పరిఘో యోగభేదేఽస్త్రీ విశేషేఽర్గళ ఘాతయోః' మే.ది.) - వశీకృత = లొంగదీయcబడిన - అన్యనరపాలకులు = ఇతరరాజులు కలవారు, (అయిన) రాకుమారకుల్ = రాచ కుమారులు. కవచము = మై మఱువును ('ఉరశ్ఛదః కఙ్కటకో జగరః కవచోఽస్త్రియామ్' అమ.), మంత్రములందున్ తక్కన్ = మంత్రోపాసనలయందు ధరింతురే గాని, ఉరవడిన్ = వేగమున, పోరికై = యుద్ధము కొఱకు, ఒల్లరు = అంగీకరింపరు; దత్తిన్ + అ + తక్కన్ = దానమందుc దప్ప (అనcగా దానము సేయునప్పుడు అయి దీవలసినచోట పదిగా నిత్తురు - శ్లో గా నిత్తురు గాని), సుస్థిర భుజశక్తిన్ ఎప్పుడును తప్పని బాహు బలముచేత (అట్టి బాహుబలము కలవారగుటచేత - అనcగా - వైరులకొట్టి జయింపcగలవారగుటచేత వైరి నుండి), ఐదు పది సేయరు = వెనుకంజవేయరు (ముందు పాదమును వెనుక కిడుటచేత అనcగా రెండుపాదములు ప్రక్క ప్రక్కగా నుంచి నిలుచుటచేత అయిదయిదుగానున్న వ్రేళ్లను పదిగా చేయరు- 'అయిదు పదిసేసె వెనుకముందయ్యె జూనగ' అని ఆంధ్రనామశేషము- వైరిని శరణు వేడుటగా రెండుచేతులను జోడింపరు అని యొక వ్యాఖ్య.), ఖళూరికన్ తక్కన్ =గరడీలోc దప్ప (గరడీలో నేల దొర్లుదురు గాని), మంటికై = భూజీవనములకొఱకు (జాగీరులు సామంత రాజ్యములు నిమ్మని), అమలబుద్ధిన్ =పరిశుద్ధ చిత్తముతో (అట్టి చిత్తము గలవారై), అధిపుcడు ఈక = ఎలిక ఇయ్యనప్పుడు, పొరలరు = (ఇచ్చినప్పుడు కైకొందురు గాని ఎట్లయినను అతని హృదయమును కరcగించి వానిని సంపాదించుకొందమని, నేలcబడి దండాలు పెట్టరు.

ఆయూరి రాజపుత్త్రులు పిడుగులవంటి బెట్టిదపు గ్రుద్దులచేతనే ఇతరరాజులను లోఁగఁదీసినవారు, మంత్రోపాసనలయందు మంత్రకవచములను పఠింతురే గాని, యుద్ధమున కేఁగుచో దేహరక్షణార్థమయి మైమఱువుం దాల్పరు, తాము దానములు సేయునో శెట్టింపుగా నిత్తురు గాని పోరిలో వైరినుండి వెనుకంజ యిడరు, గరడీలలో నేలఁబడి పొరలుదురే గాని తమయేలిక తమకు సామంతరాజ్యములు ఈయక విలంబించుచున్నయెడల ఎట్లయినను దాని దడవడచి వానిని సంపాదించుకొందమని అందుకై దండాలు పెట్టక మంచి మనస్సు గలవారై అతఁడే ఇచ్చువఱకు వేచి యుందురు. - పరిసంఖ్యాలంకారము.

'పోరికై' - లోపవిభక్తికము - 'పోరునకై' అనఁగూడదు. 'ఒల్లరు'- వలచు ధాతువు- 'వలవరు' అని రూ. 'దత్తి' - దా (దానే) + క్తిన్ - స్త్రీ లింగము. 'ఖుషూరకన్' గరడీలలో పొట్లాట ప్రసిద్ధము. 'వజ్రదోః పరిఘు' - వజ్రమువంటి దోః పరిఘము అని విగ్రహించుటకు సంస్కృతములో ఉపమాన పూర్వపద కర్మధారయము లేమింజేసి 'వజ్రదారుణమైన దోః పరిఘ'మని మధ్యమపద లోపి సమాసముగా విగ్రహింపవలసి వచ్చినది. 'పరిఘ'-దీనికి దబ్బయు నినుపకట్ల గుదియయు నర్థములు. కొందఱు ఇట నిరంకుశ యర్థమును జెప్పుదురు. 'అన్యనరపాలకులు' - తమ యేలికకైన యని యర్థము. 'రాఁ కుమారకుల్'- 'రా' - వృత్తియందు 'రాచ' శబ్దమునకు లుప్తశేషము, 'రాజ' శబ్దమునకు కాదు; ప్రాంతాది గణోక్త లోపము గాదు, అట్లగునేని 'రాఁ గుమారకుల్' కావలయును. 'దత్తి' = దానము - 'అనుస్మృత దమనజ సుకృతము। ఘనదత్తిన గొనఁగ వలయు.' ర (౨౦).

శా. దంభాపేతవితీర్ణతోయములు రథ్యం దొట్టి హట్టస్థిత
స్తంభంబుల్ చిగిరించుచున్నవి యనన్ ధర్మైకనిత్యార్జనన్
సంభూతంబగు పైఁడికోటి కొకటై నానాఁటికిన్ హెచ్చుచ
న్యుంభోదావళిఁ గప్పఁ గేతువులు వైశ్యశ్రేణి పొల్చున్ బురిన్. ౨౫

పురిన్ - మధురయందు, వైశ్యశ్రేణి = కోమటులవీథి ('వీథ్యాళి రావళిః పంక్తిః శ్రేణీ' అమ.), దం...లు - దంభ అపేత = వ్యాజమునుండి తొలఁగినట్టి (వ్యాజములేనట్టి - 'కపటో౽స్త్రీ వ్యాజ దంభోపధయ శ్ఛద్మ కైతవే' అమ.) - వితీర్ణి = దానముయొక్క (వితీర్ణి = వితరణము) - తోయములు = ధారాజలములు, రథ్యన్ = నగరిమధ్య మార్గమందు ('రథ్యా ప్రతోళీ విశిఖా' అమ. 'శ్రేణి గ్రామమధ్యమార్గస్య.' రామా.), తొట్టి = ఎగఁదొట్టి, హట్టస్థిత స్తంభంబుల్ = అంగడివీథియందు ('హట్టః ఆపణః' అని రామాశ్రమి.) ఉన్నట్టి కంబములు, చిగిరించుచున్నవి = చిగురు లెత్తుచున్నవి (ఎత్తిన చిగురు [illegible]), అనన్ = అనునట్లుగా, కేతువులు = టెక్కెములు, ధ...నన్ - ధర్మైక = ధర్మప్రధానమయిన - అర్జనన్ = సంపాదనచేత, సంభూతంబు = కలిగినట్టిది (లభించినట్టిది), పైఁడి = బంగారముయొక్క (వరహాల యొక్క అనుట) - కోటికిన్ = కోటిసంఖ్యకు, ఒకటి ఐ = ఒక జెండా చొప్పున, నానాఁటికిన్ = దినదినమునకు, హెచ్చుచున్ = సంఖ్య ఎక్కువ యగుచు, అంభోద ఆవళిన్ = ప్రసిద్ధమయిన మేఘపంక్తిని, కప్పన్ = ఆవరించుచుండఁగా, పొల్చున్ = శోభించును.

ఆపురమందు కోమట్లు న్యాయమార్గముననే ధన మార్జించువారు, మహాదాతలు, దిన దినము కోటి వరాల లాభమునకు ఒక పడగచొప్పున పడగ లెత్తుచుందురు. వారు పారమార్థికముగా దానము లిచ్చునప్పుడు గ్రహీతలచేతంబోయు జలధారలు వీథి నెగఁదట్టి యుండును. అందువలన వారు దినదినంబును ఎత్తెడు నాపడగలు (జెండాలు) ఎట్లున్నవనఁగా — ఆదానజల ధారలవెల్లువ నెగఁదట్టుటచే బజారులలోని కొయ్యస్తంభములు చిగురుపట్టి దినదినమును వేసిన క్రొత్త చిగుళ్లో అనున ట్లున్నవి.

గొప్పవర్తకులు కోటికి పడగ యెత్తుటయు, కొన్ని కొయ్యలు తడిక మరల చిగుర్చుటయు ప్రసిద్ధము. చిగురాకు (జెండాల) నన్నని యెఱ్ఱ వస్త్రములతో సామ్యంబు మనోరమము.

'ధున్వన్ కల్పద్రుమ కిసలయా న్యంశుకానీవ వాతైః.' మేఘ. ఉత్ప్రేక్షాలంకారము.

'దంభ' – ఇటు మహాదానములు చేసినయెడల రాజేమని బిరుదములును మర్యాదలును వచ్చుబడులును ఇచ్చునుగాక, లోకులు నమ్మి ధనమును నాయొద్ద దాఁచుకొందురుగాక, దాని నెల్ల నొక్కసారి పెద్దమొత్తముగా హరించి దివాలా తీయుదునుగాక అని సంకల్పించుట దంభము. 'ధర్మ, – స్వప్రవృత్తి ప్రకారమును బొంకకయు — క్రయ విక్రయముల బొంకక సద్వ్యవసాయుఁడైన వైశ్యుండు గాంచుఁ గల్యపదవి.' జై. భా. నానాఁటికిన్ హెచ్చుచున్' – 'చెట్లు చిగుర్చునప్పుడు చిగుళ్లను నానాఁటికి హెచ్చుచుండును. 'కప్పుకేతువులన్' అని పా. 'అంభోదావళిఁ గప్పన్' – వృక్షములను కప్పుజల్లు మేఘములం గనఁబడనియుమియు ప్రసిద్ధము. ఇట అతిశయోక్తి.

తే. నృపులపదహలరేఖల కెల్ల మాభు
జాగ్రహలరేఖలే మూల మనుచుఁ గోటి
కొండలుగ ధాన్యరాసులు పండుపేట
సుజనభజనైకవిఖ్యాతి శూద్రజాతి. ౩౬

కోటికొండలుగన్ = లెక్కకు మిక్కిలియు పర్వతములంతవియునగు (అంతలేసి యనుట), ధాన్యరాసులు = వరిప్రోవులు, పండుపేటన్ = ఫలించుచున్నట్టి యూపట్టణమున, శూద్రజాతి, నృపుల పదహలరేఖల కెల్లన్ = రాజుల చరణములయందలి నాఁగేటి రేఖలకంతయు, మాభుజాగ్రహలరేఖలే = మాయొక్క బాహువులమీఁది నాఁగేళ్లచాళ్లే ('లాఙ్గలం హలం గోదారణం చ సీరం స్యాత్' అమ.), మూలము = కారణము, అనుచున్, సుజన భజన ఏక విఖ్యాతి = సాధుజనులను సేవించుటచేతి నయిన ముఖ్యకర్తి గలదై, 'ఉన్నది' అని శేషము.

ఆపురిలోని శూద్రులు కొండలంతలేసి ధాన్యరాసులను కోటానకోట్లుగా పండించుచు, మాబుజాలమీఁది నాఁగేళ్లచాలుచేతఁ గదా రాజులయొక్క పాదములలోని నాఁగేటిరేఖలు ఉండుట అని సంతోషించుచు పెద్దలను సేవించుటచే కీర్తి పొందుచు నుందురు.

'పదహలరేఖ' – పాదమందు హలరేఖ పంచమహాపురుషలక్షణములలో చెప్పఁబడినది.-
'హల ముసల గదా శంఖ చక్ర । ద్విప మకరాబ్జ రథాద్యా త్రాఙ్క్షి హస్తః
విభవ మపి జనోఽస్య భుఙ్క్తే । క్షమతి హి న స్వజనం స్వతన్త్రబుద్ధిః.' బృ.సం.

హాలరేఖచే మహావిభవము చెప్పఁబడినది, పంటలులేనిచో అది యెట్లు కలుగును? కావున రాజుల హాలరేఖలకు రైతుల నాఁగేటి రేఖలే మూలము. 'పండన్' అని పా. సమన్వితము గాదు. 'భజన' – 'శూద్రస్య శుశ్రూషా ఇతరేషాం వర్ణానాం' అని ధర్మశాస్త్రము. 'రేఖలేమూలము'- రేఖలు మూలము గావు, పంటయు మూలము గాదు, ఈపంటలకే రాజుల పాద హాలరేఖలు మూలము.-మూలముకాని దానికి మూలత్వము జెప్పుట అసంబంధంబున సంబంధాతిశయోక్తి.

చ. ఉమియఁగఁ దన్న నవ్వ నన నొచ్చెము గాంచిన కొన్నిద్రుమాఁకులా
ప్రమదల నప్పగింపుఁ డని రంజలు నేతలు గన్న చెట్లకున్
దమ కళిశృంఖలన్ బెనఁచి నమ్మిక మొట్టెఁ బురంబుఁ గంతుసై
న్యముఁ గొని నా వెలిన్ శుకపికాదులఁ గేళివనాళి బొల్పగున్. 32

జవరాండ్రు చెట్లను పుష్పింపఁజేయుటకై దోహదములు చేయుటలో, —ఉమియఁగన్ = ఉమియుటచేతను, తన్నన్ = తన్నుటచేతను, నవ్వన్ = నవ్వుటచేతను (పరిహసించుటచేత నని యర్థాంతరము), అనన్ = పలుకరించుటచేతను (మాట అనుటచేత నని యర్థాంతరము), ఒచ్చెము = అవమానము, కాంచిన కొన్నిద్రుమాఁకులు = పొందిన కొన్ని చెట్లు. ఆ ప్రమదలన్ = తమ్ము ట్లవమానించిన ప్రబలమదలను (పొగరుఁబోతు స్త్రీలను - మదవతులను - 'ప్రమదా సమ్మతే మత్తే స్త్రీయాముత్తమయోషితి'. మేద.), అప్పగింపుఁడు = మాకు స్వాధీనపఱుపుఁడు, అని, రంజిలు చేతలు = ఏచేతలచేత చెట్లు రంజిలునో ఆచేతలు (అనఁగా ఆలింగనాదులు - అట్టి కమనీయ దోహదములను), కన్న = పొందిన - చెట్లకున్, తమకున్. అళిశృంఖలన్ = తుమ్మెదల నడి గొలుసును, పెనఁచి = కట్టి, నమ్మిక = అప్పటికిని ఆచెట్లు వారిని తమకు అప్పగించు నని విశ్వసింపక, పురంబున్ = పట్టణమును, కంతుసైన్యముఁ గొని = మదనుని సేనను తోడు తెచ్చుకొని, వెలిన్ = ఊరిబయట, ముట్టడి నాన్ = ముట్టడి వైచినవో యనునట్లుగా, శుక పిక ఆదుల = చిలుకలచేతను కోయిలలచేతను సంపడించుచున్నట్టిది - కేళి వన ఆళి = క్రీడోద్యానములపంక్తి, పొల్పు అగున్ = సొంపారుచుండును.

ప్రమదలు వసంతకాలమున పుష్పింపఁజేయుటకై పదిజాతుల చెట్లకు పది విధముల చేతలు చేయుదురు. అది యెట్లన.—అశోకమును తన్నుదురు, పొగడపై నోటినుండి నుమియుదురు, గోరంటను కవుఁగలింతురు, బొట్టుఁగుఁ జెట్టును చూతురు, మామిడిని గోటం దాఁకుదురు, చంపకముం గూర్చి ముఖమున రాగము పూనుదురు, కొండగోఁగుతో సల్లాపింతురు, వావిలిపై యూర్పుఁ బుత్తురు, ప్రియాళమునకు (=మోరటి చెట్టునకు) పాడుదురు, సురపొన్నకు నవ్వుదురు. ఇందులకు కారిక-

'అశోకశ్చరణాహత్యా వకులో ముఖసీధునా। ఆలిఙ్గనా త్కురవక స్తిలకో వీక్షణేన చ॥
కరస్పర్శన మాకన్దో ముఖరాగేణ చమ్పకః। సల్లాపైః కర్ణికారః స్యాద్వారో ముఖానిలాత్॥
గీత్యా ప్రియాళు ర్నితరాం నమేరు ర్హసితేన చ.'

ఇందు వకుళాశోకనమేరు కర్ణికారములకు క్రమముగా ఉమియుట తన్నుట నవ్వుట (శ్లేషచే పరిహసించుట) పలుకుట (శ్లేషచే దూషించుట) అనునవి కలిమి అవమానకరమైన దోహదములు; కడమ కురవకాదులు ఆలింగనాదులు అభిలషణీయమైన చేతలు. ఈ చెట్ల కన్నిటికిని

వారు దోహదము చేయఁగా, అందులో అవమానపు దోహదము బొందిన వకుళాది వృక్షములు ఆ ప్రమదలను దండించుటకై వారిని తమ కప్పగింపుఁడని వారిచే మంచి చేఁతలు పొందిన కురవకాదులకు తుమ్మెద బారులనెడి గొలుసులు కట్టి ఆచెట్లు తప్పించుకొని పోక యుండునట్లు ఆగొలుసుల రెండవకొనను తమకే కట్టుకొని, అప్పటికిని అవి యప్పగించుటను నమ్మకము లేక, ఆపట్టణమును 'నీవే ఆప్రమదలను మాకు అప్పగింపుము' అని యడలించి మదనుని రాణువను సాయము తెచ్చుకొని దానితో ముట్టడి వేసినవా ? యనునట్లు ఊరి వెలుపల మదనసైన్యమయిన శుకపికములు గలవై ఊరినుండి రాకపోకలకు సందులేనియట్లుగా తుమ్మెదగొలుసు కట్టిన చెట్లునుం గలవై క్రీడోద్యానములు శోభిల్లుచుండును. - ఉత్ప్రేక్షాలంకారము.

'ప్రమదలన్' - ప్రమదలకే ఈదోహదాద్యుత్సాహము గాని బాలలకును వృద్ధలకును ఇది యెక్కడిది? తమకు ఒచ్చెము గావించినందున ఈవృక్షములు 'ప్రమదలు' అనఁగా పొగరుఁబోతులు అనుట. 'రంజిలు... చెట్లకున్' - ఆచెట్లకు వారితో మైత్రి గావున ఇవి వారిని సాధించి యీఁగలవని భా. 'తమకున్'-ఆచెట్లు తప్పించుకొని పోకుండుటకు ఆదోహదములచేత తమకుఁ గూడ పూఁతగలిగి తుమ్మెదపిండు నాకర్షించినది గావున. 'నమ్మక' - వారిమిత్రములు గాన వారిని పట్టియీక వారిని ఎక్కడికేని తప్పించుకొనిపొందని హెచ్చరింతు నని సందేహము. 'ముట్టడిన్ '-పురమును ముట్టుట పురమునుండి వారు దాఁటి పోకుండుటకు. 'వెలిన్' - వైరరాజులు వచ్చి యొకరాజుపురమునకు ముట్టడిగా బయట విడిసి యున్నట్లుగా; శుకపికములు మదనసైన్యము. 'అలిశృంఖల' - అలులు దట్టముగా క్రమ్ముట యుత్ప్రేయమైన మకరంద సమృద్ధిని దాననే పుష్పసమృద్ధిని తెల్పుచున్నది. 'శుకపికాకుల' - ఇంతవఱకు వేఱుపదము, 'కేళీవనాళి' తో ఏకసమాసము గాదు; ఏకసమాసమైనచో అవిమృష్టవిధేయాంశతా దోషము ఘటిల్లును. శుకములచే ఫలములయు పికములచే చిగుళ్లయు పెంపు సూచితము. కేళీవనములు ఫలకుసుమకిసలయసంభృతములై శుకపికాకులములై మన్మథస్కంధావారముగా సర్వేంద్రియాహ్లాద కరముగా నున్నవని భా.

సీ. మదగంధతారతమ్యము సామ్యకరికిఁ జ
త్కరులకుం గసబలెఁ గటము లొరసి,
సురతశ్రమజ మూటఁ జూపోపకయుబలెఁ
గామినీమృదుగండఘర్మ ముడిపి,
పరిమళవాహేచ్ఛఁ బ్రాణమీఁబలెఁ జించు
మృగనాభిచర్మభస్త్రికలు దూఱి,
అహితపన్నగభేదు లనిబలె గృహావిటం
కపుఁగలాపుల నొయ్య గఱులు నిమిరి,
తే. వీటిసామగ్రిఁ గనుఁగొన వేగపడక,
నడవఁ దనదిక్కుపుష్పదంతద్విపంబు

నెక్కెనో యన జడగతి నెపుడుఁ బొలయు
నందుఁ జందనశిఖరిమందానిలుండు. 38

అందుల్=మధురాపురమందు, చందన శిఖరి మందానిలుండు = మలయపర్వతముయొక్క మెల్లని తెమ్మెర (మంద మలయానిల మనుట),

1. యామ్యకరికిల్ = దక్షిణ దిగ్గజమయిన వామనమునకును, తదురుకుల్ = ఆయూరి యేనుఁగులకును, మద గంధ తారతమ్యము = దానజలముయొక్క పరిమళముయొక్క హెచ్చు తగ్గులను, కనల్ బలెల్ = పరీక్షించుటకో యను నటుగా, కటములు = ఆయూరియేనుఁగుల గండస్థలములను ('గజగణ్డ కటీ కటౌ' అమ.) ఒరసి = రాచుకొనుచు; 'యామ్య' = యమ సంబంధియయిన - యమునకాసంబంధి యయిన యనుట;

"ప్రాచ్య మాజ్ఞాహి పాణ్ఫ్రేన్ ప్రహస్తో రావణాజ్ఞయా
ద్వారం రరక్షతు ర్యామ్యం మహాపార్శ్వో మహోదరా." భట్టి.

'గంధ' - ఏనుఁగు మదమునకు గంధము గలదు—

"స ప్తచ్ఛదక్షీరకటుప్రవాహ మసహ్య మాఘ్రాయ మదం తదీయమ్
విలఙ్ఘితా ధోరణ తీవ్రయత్నాః సేనాగజేన్ద్రా విముఖా బభూవుః." రఘు.

ఆయూరి యేనుఁగులు వామన దిగ్గజమునకు సాటి యనియు భా.

2. సు...ము - సురతి = కామక్రీడచేత నయిన - శ్రమ = బడలికచేత-జము = పుట్టినది, కోటల్=అగుటచేత, చూపు ఓపకయు బలెల్=చూడలేనందున (కనికరముచేత) అను నట్లుగా (యు శబ్దము వాక్యాలంకారము), కా...ము - కామినీ = కాముకు రాండ్రయొక్క - మృదు= కోమలములైన-గండ=చెక్కిళ్లయొక్క - ఘర్మము = చెమటను ('ఘర్మః స్యా దాతపే గ్రీష్మే ఽప్యుష్ణ స్వేదామ్బునో రపి' మేది.), ఉడిపి = ఆర్పి;

3. పరి మళ వాహ ఇచ్ఛల్ = తావిని గ్రహించు కోరికచేత, ప్రాణ మీ బలెల్=ప్రాణ మిచ్చుటకో యనునట్లు, చిం...లు - చించు = చింపఁబడిన - మృగ = కస్తూరి మృగముయొక్క- నాభి=బొడ్డుల నెడి - చర్మ భస్త్రికలు= తోలు సంచులను ('భస్త్రా చర్మ ప్రసేవికా' అమ.), తూటి = చొచ్చి; - ఇవి బ్రదికినయెడల పీనికి వెండియు నాభియందు కస్తురి యుద్భవించును, అంతట దాని పరిమళమును నేను వహింపుదును గాక అను కోరికచేత కస్తూరి మృగములకు ప్రాణ మిచ్చుచున్నదో యనునట్లుగా వానియొక్క చింపఁబడినట్టి నాభిసంచులయందుఁ దూటి; నాభి సంచులం జించుట అందలి కస్తూరిని గ్రహించుటకు.

4. అ...లు. - అహిత = తనకు వైరులయిన (తన్ను భక్షించెడు) - పన్నగ = పాములను - భేదుల = భేదించునవి (భక్షించునవి), అని బలెల్ = అనుకారణముచేత నను నట్లు, గృ...లల్ - గృహ = ఇండ్లయొక్క - విటంకపు = కొణిగల యందలి - కలాపులల్ = నెమళ్లను, ఒయ్యల్ = మెల్లనగా, గఱులు నిమిరి = కుంచెలను నివిరి, వీటి సామగ్రిల్ = ఆయూరి సంపత్సమృద్ధిని, వేగపడక = నింపాదిగా (సమస్తము చక్కఁగాఁ దెలియు నట్లుగా), కనుఁగొనల్= చూచుటకై, తనదిక్కు పుష్పదంతి మను (గజగమనము మెల్లన గావున గజము నెక్కుట, తన

గిక్కుడి తనకు స్వాధీనముగాన దాని నెక్కుట), ఎక్కెనో యన, జడగతిన్ = మంద ప్రచారముతో, ఎపుడున్ = సదా, పొలయున్ = వీచును. సదా మలయమారుతము వీచుట ఆదేశమునే ఆపురిసమీపముననే మలయాచల ముండుటచేత.—'క్రీడాచలీకృత శ్రీఖండగిరిరాజు' ౩౯.

ఇచట మలయానిలమునకు కవిసంప్రదాయముబడి శైత్యమాంద్య సౌరభంబులు చెప్పఁబడినవి; - కామినీ గరుపలనొయుటచేత శైత్యమును, గఱుల నిమురుటచేత మాంద్యంబును, కరిమద మృగమదములచేత సౌరభంబును కలిగినవి.—అంతటను ఉత్ప్రేక్షలు. 'కటములు' - ఏనుఁగు యొక్క మదస్థానము లేడింటిలో గండము ప్రధానస్థానము. 'చించు' - నాభిలోని కస్తూరికై కస్తూరి మృగమును చంపుదురు, దానినాభిని కోయుదురు.

'చర్మణి ద్వీపినం హన్తి దన్తయోర్హన్తి కుఞ్జరమ్
కేశేషు చమరీం హన్తి సీమ్ని పుష్కలకో హతః.'
'ఐరావతః పుణ్డరీకో వామనః కుముదోఞ్జనః
పుష్పదన్తః సార్వభౌమః సుప్రతీక స్తు దిగ్గజాః.' అని దిగ్గజములు. అమ.

—*మత్స్యధ్వజ [illegible]*—

సీ. ద్విద్వ్యుపాయ నివిష్ట ద్విష్టతంత్రంబు,
షాడ్గుణ్యచాతురీ చక్రవర్తి,
క్రీడాచలీకృత శ్రీఖండగిరిరాజు,
కనకాద్రిముద్రణ గ్రంథకర్త,
యందాని బద్ధాభ్రబృంద వేదండశాలి,
వననిధిస్తంభ నాథునికర ఘువు,
తామ్రపర్ణీ మలపాథఃకేళిహంసంబు,
లంకేశమైత్రీప్రియంకరుండు,

తే. స్వస్తికృద్ద్వాస్థవస్తుత్య గస్తి, మధుర
మకుటమోటన శరకోటి మంత్రిభృత్య,
భూతభూతాస్తిశాంభవ భూమికుంభ
దత్పురం బేలుఁ బాండ్య మత్స్యధ్వజుండు. ౩౯

తత్పురంబు = ఆమధురాపురమును, పాండ్య మత్స్యధ్వజుండు = పాండ్యదేశరాజు మత్స్యధ్వజుఁ డను నాతఁడు, ఏలున్. ఆరా జెట్టివాఁ డనిన.

1. ద్వి...బు-ద్వి = రెండు-ద్వయ = జంటలు - ఉపాయ - (సామదాన భేదదండము లనెడి నాల్గు) ఉపాయముల ('సామ దానే భేదదణ్డా వి త్యుపాయ చతుష్టయమ్' అమ.- ఇందు శత్రువున కనుకూలములయిన సామదానములు రెండును ఒకజంట. శత్రువునకు ప్రతికూలమయిన

భేదదండములు మఱియొకజంట; కావున నాలుగు అనక 'రెండుజంటలు' 'ద్విద్వయ' అనుట) - ధీ = చింతయందు - విద్వద్వతంసంబు = పండితశ్రేష్ఠుఁడు (వతంసంబు = అవతంసంబు); షా...ర్తి - షాడ్గుణ్య = సంధి విగ్రహ యాన నాసన ద్వైధీభావ సమాశ్రయములయొక్క ('సంధిర్నా విగ్రహో యాన మాసనం ద్వైధ మాశ్రయః । షడ్గుణాః' అమ. - షడ్గుణా ఏవ షాడ్గుణ్యమ్) - చాతురీ = నేర్పునందు - చక్రవర్తి = సార్వభౌముఁడు (అంబుజకంకటు డైనవాఁ డనుట- 'చక్రవర్తీ సార్వభౌమః' అమ.);

2. క్రీ...జు. - క్రీడాచలీకృత = ఆటకొండఁగాఁ జేయఁబడిన - శ్రీఖండగిరి రాజు = చందన పర్వతరాజము కలవాఁడు. (మలయగిరి తన రాజ్యములోనిది గావున దానియందు క్రీడించువాఁడు. 'క్రీడాచలీకృత శ్రీఖండగిరిరాజు'-ఇట నుపసర్జనత్వంబున రాజు అనురూపము ఎటులఅందు రేని. ఇట ఉపసర్జనత్వము లేదు. క్రీడాచలీకృతః శ్రీఖణ్డగిరి శ్చాసౌ రాజా చేతి కర్మధారయసమాసము.), కనకాద్రి ముద్రణ గ్రంథకర్త = బంగరు కొండపై (తన బిరుదములను) ముద్రించిన కవి —

'చక్రీంద్రం దిశనాక్రమ్య పాణ్డ్యః పరమధార్మికః
ప్రాంశ్య మేరుగిరిం న్యస్య విచేలా బిరుదాన్ స్వకాః.' హాలాస్యము.
ఈతఁడు మహా దిగంత విజయం బొనరించి సురాద్రియందు
స్వత నిజమీన లాంఛన మొనర్చుటకై గిరిరాజుఁ ద్రిప్ప న
ప్రవిను తనీయ సౌదర్య ధగద్ధగ్రిమితాచల శృంగసంగతా
మినుకన రూఢి నేఁడును గ్రిమించుఁ దదగ్రగతల్ గ్రహావళుల్.'

అని నాగరాజీయములో కవి కాలనాగని వ్యాసన.);

3. అం...రి - అంమా - గొలుసులచేత - నిబద్ధ = కట్టఁబడిన - అభ్రబృంద = మేఘసమూహ మనెడి - వేదండ ఆళి = ఏనుఁగులగుంపు గలవాఁడు (ఏనుఁగుల గుంపును గొలుసులతో కట్టి తోటలలో ఉంచినట్లు మేఘములను వశపఱుచుకొని సంకెలలు వైచినవాఁడు-రూపకాలంకారము), వన...ప్త - వననిధి = సముద్రముయొక్క - స్తంభన = కట్టుటయందు - ఆధునిక = ఇప్పటి - రఘుజ = శ్రీరాముఁడు (రఘువంశమువాఁడు గావున ఉపచారముచే రఘుజ వనుట- అధునా = ఇప్పుడు - ఆధునిక = ఇప్పటి - 'ఏతర్హి సంప్రతీదానీ మధునా' అమ. - సముద్రమునకు అడ్డముగా ఈయన కట్ట కట్టినాఁ డనుట.);

4. తా...బు. - తామ్రపర్ణీ = తామ్రపర్ణి నదియొక్క - అమల = నిర్మలమయిన - పాథః = నీటియందు - కేళి = ఆటగల - హంసంబు = రాయంచ (తామ్రపర్ణినది తన రాజ్యములోనిది గాన అందు జలవిహారము సల్పువాఁ డనుట. - రూపకము.), లంకేశ మైత్రీ ప్రియంకరుండు = లంకాపతియైన విభీషణునికి చెలిమిచేత ఇష్టము నెఱవేర్చువాఁడు;

స్వస్తి...స్తి - స్వస్తికృత్ = ఆశీర్వాదము చేయుచున్న ('స్వస్త్యాశీః క్షేమ పుణ్యాదౌ' అమ.) - వాస్తవస్తుతి = సత్యమయిన పొగడ్తగల (సత్యమయినపొగడ్త చేయునట్టి) - అగస్తి = కుంభసంభవుని కలవాఁడు (అగస్త్యాశ్రమము ఈతనిరాజ్యమం దున్న దనియు, అగస్తిముని ఈతనికి మేలు కోరుచుండు ననియు భా. - అగమస్య తీత్యగస్తిః - వింధ్యపర్వతమును త్రోసిన

వాఁడు. 'అథాగస్త్యః కుమ్భయోని రగస్తిః కలశీసుతః' శబ్దార్ణవము.); మఘు...టి-మఘవి= ఇంద్రునియొక్క ('ఇన్ద్రో మరుత్వా న్మఘవా' అమ.)-మకుట = కిరీటమును ('అథ మకుటం కిరీటం పు న్నపుంసకమ్' అమ.) - మోటన = నుగ్గుచేయునట్టి ('మోట సంచూర్ణనే' ధా. పా.)- శరకోటి = బాణములసమూహములు కలవాఁడు. (అతిశయోక్తి), మం...డు-మంత్ర= మంత్రములచేత - భృత్యభూత = సేవకు లయినట్టి - భూత = బూచులచేత (బూచుల మూల ముగా) - ఆప్త = పొందఁబడిన - శాంభవ = శివసంబంధియైన - భూమికుండు = వేషముకల వాఁడు (భూతములను పనిగొనుచు అపరశివుఁడో యన నున్నాఁ డనుట.-ఉపమ.).

నాలుగు ఉపాయములు ఆఱు గుణములు యథాయోగము ప్రయోగింప సమర్థుఁడు, మలయ పర్వతమందు విహరించువాఁడు, మేరువుపై తన మీనలాంఛనమును చెక్కించినవాఁడు, ఏనుఁగులంబోలె మేఘములను గొలుసులం గట్టివేసినవాఁడు, రామునివలె సముద్రమున కొండొకచో కట్ట కట్టినవాఁడు, తామ్రపర్ణిలో జలకేళి సలుపువాఁడు, విభీషణుని చెలికాఁడు, అగస్త్యునియొక్క యాశీర్వచనంబులం బొందువాఁడు. ఇంద్రుని దండింపఁగల విలుకాఁడు, మంత్రములచే బూచులను వశీకరించి పనిగొనుచు నపర మహేశ్వరుఁడో యన నొప్పువాఁడు పాండ్య మత్స్యధ్వజుఁడు మధురము నేలుచుండెను.

ఉ. ఇందుకులావతంసు డతఁ డెన్నఁడు నేతరిగాఁడు ప్రజ
ల్గందఁగ నొనంగొనం డొరుఁ డొరుంతల నొప్పనిపించినమాట డెందమున్
జెందఁడు ముదంబు పెక్కు చెడఁజేయఁడు వారు నుతింపఁ దానతాననుఁ డొ
గిన మనుఁ బందనుం గొఱంత పల్కఁడు శౌర్యమున దాను మించియున్. ౧౦

ఇందుకుల అవతంసుఁడు = చంద్రవంశ శేఖర మయిన, అతఁడు = ఆమత్స్యధ్వజుఁడు, ఏన్నఁడున్ = ఏసమయమందును, ఏతరి = నీతిమాలినవాఁడు, కాఁడు; ప్రజల్ = జనులు, కందన్ = నొచ్చునట్లుగా, అరిన్ = పన్నును, కొనండు; ఒరుండు = ఎవఁడేని, ఒరుతలన్ = మఱియొకని మీఁద, వినిపించినమాట = చెప్పినకొండెము, డెందమున్ జెందదు = తన మనస్సునకు తగులఁగా (అంగీకరించి). ముదంబు పెక్కు = కోపము వహించి, ముదంబు = సంతోషము - 'ముత్'అని ప్రాతిపదికము), ఒరున్ = మఱియొకనిని, చెడఁ జేయఁడు = చెఱుపఁడు ('చేయఁడు' అను క్రియా పదమునకు వ్యతిరేకార్థము, దానితోఁ జేరిన పూర్వధాతువులకును అన్వయించును; దానం జేసి, డెందముం జెందనీయఁడు, ముదంబు పెక్కఁడు అని యర్థము.); తనున్ = తన్ను, నుతింపన్ = పొగడఁగా, వినత ఆననుఁడు ఔనే = వంగిన ముఖము కలవాఁడు అగును (మొగము వాంచును- 'మహతాం కులస్త్రీణాంచ పురస్స్తోత్రం నహి ప్రియమ్' అన్నట్లు ముఖస్తుతి సహింపక తలవంచు కొను ననుట;), శౌర్యతన్ = శౌర్యముచేత, తాను, మించియున్ = అతిక్రమించియును, పందనున్ = పిఱికివానినిఁగూడ, కొఱంతపల్కఁడు = న్యూనముగా పలుకఁడు.

చంద్రవంశ భూషణమైన యామత్స్యధ్వజ మహారాజు ఎప్పుడును నీతి తప్పఁడు, ప్రజలు నొవ్వకుండ పన్ను కైకొనును, కొండెములు విని ఎవరికిని చెఱుపు చేయఁడు, తన్ను ఎవ్వరైన ముఖస్తుతి చేసినయెడల లజ్జచే మొగమును వాంచును, పరాక్రమమందు తానధికుఁడయ్యును పందను సయితము న్యూనముగా మాటలాడఁడు. - ధీరోదాత్తుఁ డనుట. - తల్లక్షణము—

తిమి తోఁకతో అలం గొట్టి వెనుకకు మరలిచి పెద్దదాఁటు దాఁటుట వంటిది, కత్తితో ఏనుఁగు శిరమును గొట్టుట తోఁకతో అలయొక్క విఱుపుం గొట్టుట వంటిది, కత్తిదెబ్బకు ముత్తెములు చట్టముగా లేచుట తోఁకదెబ్బకు నీటిబొట్టులు లేచుట వంటిది.—ఇందు ప్రతిపదమునకును ప్రయోజనము కలదు, దానిని ఇయ్యుపమయందలి సాదృశ్యలక్ష్మిని సులువుగా నరసికొనవచ్చును.—ఉపమాలంకారము.

'లహరిః' - 'లహరి (రీ) స్త్రీ. లేన - ఇక్షైర్ణేవ హ్రీయతే ఊర్ధ్వగమనాయ - హృ - కర్మణి ఇన్ - వా ఙీప్ - మహాతరఙ్గే' శబ్దస్తోమ మహానిధి. 'తరఙ్గే ఋర్మి వీచ్యౌ ర్మ్యుత్కలికా మహాతి త్వేషాం లహ ర్యుల్లోల కల్లోలాః' హేమ. - ఇందువలన లహరి శబ్దము హ్రస్వాంతము కూడ; దీనికి కొందఱు వ్రాసిన ప్రవాహార్థము గౌణంబును నిజోపమితికి పనికి రానిదియుంగా నున్నది. 'వలన్' - 'యాన్త్యా ముహుర్వలిత కన్ధర మాననం తదావృత్త వృన్త శతపత్త్రనిభం వహన్త్యా.' మాలతి. i. 32. 'వళిత కన్ధరం పరివర్తిత గ్రీవం అతఏవ ఆవృత్తవృన్త శతపత్త్రనిభం కుసుమబన్ధనావృత్త వికచ పుణ్డరీక సదృశ మాననమ్' త్రిపురారి వ్యా. - ఇట్టిదే 'ఆసీ ద్వ్యావృత్త వదనా చపి మోచయన్తీ' ఇత్యాది శాకుంతల పద్యములో 'వ్యావృత్త వదనా' యను విశేషణము. 'తిమివర'—

> 'అస్తి మత్స్య స్తిమి ర్నామ శతయోజన మాయతః
> య స్తం గిళతి మత్స్య స్తు తతః ప్రోక్త స్తిమిఙ్గిలః
> తిమిఙ్గిల గిలోఽప్యస్తి తద్గిలోఽప్యస్తి రాఘవ.'

మహామత్స్యములు సముద్రములో నీటిని తోఁకతోఁ గొట్టుటయు ఆదెబ్బకు జలధారలెగయుటయు అవి ముత్తెపు రాసులవలె తెల్లగా నుండుటయు ప్రసిద్ధము. —

> 'కపట మత్స్యంబనై నేను కడలి నడుమఁ బుచ్ఛ మల్లార్ప నెగసిన ఘోరజలము
> మింటఁ గడుఁ దెల్లనై పాఱుచుంటఁ జూచి యాభ్రనదియని వర్ణించె నఖిల జగము.'

వసు. 6 ఆ. 120.

ఏనుఁగు కుంభములనుండి ముత్తెములు పుట్టును - ౧ ఆ. ౭౦. వ్యా. చూ. 'ఉత్పతన్' - పా. 'ఉత్ప్లవన్'

1. పా...టిన్ - పాటీర గిరి = గంధపుఁగొండయందును (చందనపర్వత మయిన మలయ పర్వతమునందలి) - వనివాటిన్ = అడవుల శ్రేణిలో, క్రీడించియున్ = విహరించియు, అవంత (అవ + అంత) ఐనన్ = అంచుకేనియు, అహి భయంబు = పాములవలని వెఱపును(తన వారివలన నేకలుగు భయమును- 'రాజ్ఞో మహీభయం ప్రోక్తం స్వపక్ష ప్రభవం భయమ్', 'భుజఙ్గోఽహి ర్భుజఙ్గమః' అమ.) ఎఱుఁగఁడు—

మలయములు నాలుగు,- అందు మొదటిది,—

> 'ఆమూలయష్టేః ఫణివేష్టితానాం సచ్చన్దనానాం జననన్దనానామ్
> కక్కోల లైలా మరిచై ర్వృతానాం జాతీతరూణాం చ స జన్మభూమిః.'

రెండవ మలయము,—

> 'యస్యోత్తమాం మౌక్తిక కామధేను రుపత్యకా మర్చతి తామ్రపర్ణీ,
> రత్నేశ్వరో రత్న మహానిధానం కుమ్భోద్భవ స్తం మలయం పునాతు.'

మూఁడవది మఱియొకటి; నాలవది లంకాపురము. అన్నింటియందును (సర్పవేష్టితములు) చందన ద్రుమములు కలవని 'మలయశ్చన్దనాలయః' అను నమరోక్తిచే నెఱుంగనగు. చందనద్రుమము లున్నచో పాము లుండును గాన (ద్వితీయ)మలయ వనములలో చరించియు పాములవలని యుపద్రవ మెట్టిదో యెఱుంగమి విరోధము, అహిభయాస్పదమునకుం గల స్వపక్షములవలని భయము అను నర్థముచే తత్పరిహారము. కావున విరోధాభాసాలంకారము.

2. అత్యంత మితభాషణ = మిక్కిలి యల్పసంభాషణచే (మిక్కిలి కొంచెముగా మాటలాడువాఁడగుటచేత), అవికత్థనుండు = ఆత్మశ్లాఘావిముఖుఁడు ('అవికత్థనః = ఆత్మశ్లాఘావిముఖః' ప్రతాపరుద్రీయ మందర వ్యాఖ్య), అయ్యున్, పరులన్ = ఇతరులను (వైరులను), కేరడమునన్ = పరిహాసపు మాటలయందు (కేరడి కేళమం చనియు - శిడల కథేపము), భంగపఱచున్ = ఓడించును.- అవికత్థనునికి పరపరిహాసపటిమ విరోధము, అర్థాంతరముచే నది పరిహృతము; కావున విరోధాభాసాలంకారము.

3. ప్రేమన్ = అనురాగముతో, తాను, తామ్రపర్ణికన్ = ఆపేరి పడమటి దిగ్గజభార్యకు (ఆపేరి నదికి ననియు), నాథుఁడు అయ్యున్, సద్గోష్ఠిచేన్ = మంచి (వారితోడి) సహవాసము చేత, అనంజనతన్ = అంజన గజము కామిచేత (అంజనము అనఁగా అంటు, అదే మాలిన్యము, అది లేనివాఁడై) మెలఁగున్ = వర్తించును.

తామ్రపర్ణియను కరేణుకకు పెనిమిటియై అంజనమను పడమటి దిగ్గజము కాకుంట విరోధము, నదీ నిర్మాలిన్యార్థములచే తత్పరిహారము విరోధాభాసాలంకారము. అష్టదిగ్గజములను ౨రా వ్యా. లో చూ. విద్యాభర్యల పేరులు,—

'కరిణ్యోఽభ్రముః కపిలా పిఙ్గలాఽనుపమా క్రమాత్
తామ్రకర్ణీ శుభ్రదన్తీ చాఙ్గనా చాఞ్జనావతీ.' అమ.

మ...డు - మహనీయ = దివ్యమయిన - మహిమన్ = ప్రభావముచేత, తాను, మధుర ఆస్పదుండు = తీపునకు తావు (మధుర శబ్దము మధురరసమునకును ... కలదానికిని పేరు—

'తువరస్తు కషాయోఽస్త్రీ మధురో లవణః కటుః
తిక్తోఽమ్లశ్చ రసాః పుంసి తద్వత్సు షడమీ త్రిషు.' అమ.

మధురా = మధురాపురము - ఆస్పదుండు = రాజధానిగాఁ గలవాఁడు), అయ్యున్, లావణ్య కలనన్ - లావణ్య = ఉప్పఁదనముయొక్క (దేహకాంతి విశేషముయొక్క-

'ముక్తాఫలేషు చ్ఛాయాయా స్తరళత్వ మివాన్తరా
ప్రతిభాతి య దఙ్గేషు తల్లావణ్య మిహోచ్యతే.' - శబ్దకల్పద్రుమము.)-

కలనన్ = ప్రాప్తిచేత, ఉల్లాసము = ప్రకాశమును, పొందును - తీపు ఉప్పుచేరిన యెడల రుచి మీఱు ననుట విరోధము; మధురాపుర దేహకాంత్యర్థములచే తత్పరిహారము గాన విరోధాభాసాలంకారము.

ఇట 'మధుర'అని పాండ్యనగర నామము వర్గచతుర్థ మధ్యముగానున్నది. ఈగ్రంథమందు మఱియొకచోట 'విధినిషేధంబు లెఱిఁగితే మధురకరిగ' అని ధ ప్రాసమును, ఇందే తనరు దక్షిణ మధుర సాంద్రద్రుమమధుర' అని యంత్యానుప్రాసయమకమును కలవు. శ్రీమజ్జగద్గురు ప్రణీత సౌందర్యలహరీస్తోత్రమందును,

'విశాలా కల్యాణీ స్ఫుటరుచి రయోధ్యా కువలయోః
కృపాధారా ధారా కిమపి మధురా భోగవతికా
అవన్తీ దృష్టిస్తే బహునగర విస్తార విజయా
ధ్రువం తత్తన్నామ వ్యవహరణ యోగ్యావిజయతే.'

శ్లేషలో ధమధ్యమే కలదు. ఉణాదిసూత్ర నిష్పన్నమయిన మథురా (రూ. మథూరా) శబ్దము వర్గద్వితీయమధ్యము ఒకటి కలదు. అది శ్రీకృష్ణులవా రుండిన పట్టణమునకు పేరుగా సుప్రసిద్ధమై యున్నది. తదనుగుణముగానే దానికి 'మట్రా' అని యింగ్లీషున వ్యవహారము, 'మడ్రా' అని కాదు. కావున అది దానికిని ఇది పాండ్యనగరికిని పేరు లని భేదము గ్రహింప మన్న - ఇందులోనే 'దక్షిణమధుర' అని వ్యవహరించినందునను,

'మధురం విషే। మధుర స్తు ప్రియే స్వాదౌ రసేచ రసవ త్యపి
మధురా మథురాపుర్యాం యష్టీమేదామధూళిషు
మధు కుక్కుటికాయాంచ మిశ్రేయాం శత పుష్పయోః. హేమ.

అను నిఘంటువునందు మథురా మధురా శబ్దములకు పర్యాయత్వమే చెప్పఁబడినది. ఉత్తర మధురయు మథుం నామాసురం రాతీతి యనువ్యుత్పత్తిచే ధ మధ్యముగాను అంగీకృతము. ఈరెండునామములను రెండుపట్టణములకును గ్రహించుట యుచితము.

శా. దానత్యాగపవిత్రమై తొలుపవిత్రం బంబుధారన్ సదా
స్నానం, దత్సితకీర్తిహంసి చను మింటం; గ్రొత్త నాఁ డేల, నా
నానీరార్ద్రపవిత్ర యయ్యు వడి మింటం బోవు తజ్జాతికే
లా నిల్చు న్గతి యన్యపత్త్రిగతిఁ బత్త్రైకప్రదేశాప్లుతిన్? ౧౨

దా...త్రి - దాన=ఉదకధారా పూర్వకమయిన యీవియు - త్యాగ=అప్రార్థితముగా ఉదకధారలేకయే యిచ్చునవియు - పత్త్రము = రెక్కలుగాఁ గలది, ద, త...సి - దద్ = ఆరాజుయొక్క - సిత=తెల్లని - కీర్తి=విఖ్యాతి యనెడి - హంసి=ఆఁడుహంస, తొలుపవిత్రంబు = మొదటఁ జేర్కొనంబడిన రెక్క (ఉదకదానము), సదా = సర్వదా, అంబుధారన్ = నీటిప్రోవుచేత, స్నానన్ = ఊరినను, మింటన్ చనున్ = ఆకాశమున నెగయును; క్రొత్త నాఁడేల=ఇది వింత యనవలదు, నా...త్రి - నానా=పెక్కు ('నానానేకో భయార్థయోః' అమ.)- నీర=నీళ్లచేత - ఆర్ద్ర=తడిసియున్న - పత్త్ర=రెక్కలుగలది, అయ్యున్ = అయినప్పటికిని, వడిన్=వేగముతో, మింటన్ పోవు - తజ్జాతికిన్=ఆహంసజాతికి, అన్యపత్త్రిగతిన్=వేఱు పక్షికింబోలె, ప...తిన్ - పత్త్ర=రెక్కలయొక్క - ఏకప్రదేశ=ఒకభాగముయొక్క - ఆప్లుతిన్ =తడియుటచేత, గతి=సంచారము, ఏలా నిల్చున్=నిలువదు.

ఉదకధారా పూర్వకమయిన యీవి ఒకరెక్కగాను అప్రార్థితముగా (=అడుగఁబడక ఉదకధారలేకయే ఇచ్చునట్టి యీవి రెండవరెక్కగాను కలదైన యారేని తెల్లనికీర్తి హంసి, ఆతొలిరెక్క ఎల్లప్పుడును ఆనీటిధారచేత నానుచున్నను ఆకాశమున సంచరించుచునే యున్నది; ఇది యొక వింతయని తలంపవలదు, ఏలయన,—రెండురెక్కలును నానాజలములలో నాను

చ. పొలమరు లంది కూఁత లిడ, భూసురు లన్నదిలోన వార్చి, ప్రాఁ
కుల తుద లెక్కి, చప్పటలు గొట్టి యదల్పఁగ, సాహిణీలు వా
ఫులఁ బఱపంగ, వైచి సెలవుల్ త్వర నాకుచుఁ బోయె వృక్షమం
డలికయి తేలుచున్ గుటగుటధ్వని సారె మలంగి చూచుచున్. ౨౨

పొలమరులు = పొలము కాపరులు [‘పొలమరియనఁగఁ గాపును పితమరిదోఁచు’ ఆ. 3 (నా. నా. 49)], అంది = సమీపించి, కూఁతలిడన్ = కేకలువేయుటచేతను, భూసురులు = బ్రాహ్మణులు, అన్నదిలోనన్ = ఆయిక్షుమతియందు, వార్చి,... సాహిణీలు = రౌతులు, మాఫులన్ పఱపంగన్ = గుఱ్ఱములనెక్కి ఘీదెసకు వేగముగా తఱిమినందునను, వైచి = (పులి గోవును) విడిచి పెట్టి; సెలవుల్ = పెదవుల మూలలను, నాకుచున్, గుటగుటధ్వని, సారెన్ = మాటిమాటికి, మలంగిచూచుచున్ = వెనుకకుఁదిరిగి పరికించుచు, వృక్షమండలికయి = చెట్లజీబునుగూర్చి, తేలుచున్ = పొడసూపుచు, వసన్ పోయెన్ = వడిగా నేఁగెను.

పొలము కాపరులుకూడి యఱచినందునను, బ్రాహ్మణులు ఆపన్నివారణార్థము కృతాచమనులై చెట్లతుదలకెక్కి చప్పటలుకొట్టి బెదరించుటచేతను, రౌతులు గుఱ్ఱముల నెక్కి తనమీఁదికి తఱుముకొని వచ్చుటచేతను, పులి గోవును వదలి మాటిమాటికి వెనుకకుందిరిగి చూచుచు, గుటగుటధ్వనిసేయుచు, పెదవిమూలలను నాకుచు, తెట్టలున చెట్లజీబులోనికి పాఱిపోయెను. ‘వార్చుట’- ఆపన్నివారణేచ్ఛతో సిద్ధసిద్ధము. ‘సాహిణీలు’ - దీర్ఘాంతరూపము ముద్రితమైనట్లు కనఁబడలేదని శబ్దరత్నాకరము. ‘మాఫల’-‘తూపులన్’ అని పా. ‘సెలవు...చూచుచున్’- ఇందుస్వభావోక్తి కలదు. ‘సెలవులు నాకుట’ తిండికై నోరూఱుటచేత - ‘ధ్వని’ కోపముచేత, ‘మలంగి చూచుట’- మరలంబోయి తెచ్చుకొనుట సాధ్యమో యని కనుఁగొనుటకు, ‘మండలికి’ - కానరాక తప్పించుకొనుటకు - ‘గుటగుట ధ్వని’ - ఇది సిద్ధసమాసము; కానిని రెండవటాకు గురుత్వము రాదు. ‘ఘుటఘుటధ్వని’ - పూ. ము. పా.

క. జుఱుజుఱుకని నెత్తురు వెలి
కుఱుకుచు రొదసేయ, నఱితి యొడపిన యూర్పుల్
పఱవ, మిడిగ్రుడ్లు వణకుచుఁ,
గొఱప్రాణముతోడఁ దన్నుకొను నమ్మొదవున్. ౨౩

జుఱుజుఱుకు అని = జుఱుకు జుఱుకు అను శబ్దముతో, నెత్తురు, వెలికిన్ = దేహము నుండి, బయటికి, ఉఱుకుచున్ = ఉరికిపాఱుచు, రొదసేయన్ = చప్పుడుగావించుచుండఁగా, అఱితియొడపిన్ ఎ = గొంతుగండినుండియే, ఊర్పుల్ = నిశ్వసితములు, పఱవన్ = వడివడిగా ప్రసరించుచుండఁగా, మిడిగ్రుడ్లన్ = ముందఱికుఱికిన కనుగ్రుడ్లయందు, వణకుచున్ = కంపిల్లుచు, కొఱప్రాణముతోడన్ = కొనయూపిరితో, (గుడిగుడిజీవముతో), తన్నుకొను, అమ్మొదవున్ = ఆధేనువును - స్వభావోక్తి.

‘జుఱుజుఱు కని’ - బ. సీ. పా. ‘ఘుఱుచుఱుకున’ పూ. ము. పా. ఈశబ్దము ఈయర్థమున శబ్దరత్నాకరములో లేదు.

సీ. విన్నవించుటయు ఋత్విజులఁ బ్రాయశ్చిత్త
మడిగె రా; జడిగిన నడుగు మనిరి
వారు కసేరుపుఁ డా రెఱుంగక పోయి;
యాతఁడును శునకుని నడుగు మనియె;
నతఁడు దాను నెఱుంగ నని పల్కి, 'నృప, విను;
నను ఋత్విజులపిండు నా కసేరు
నేను నెఱుఁగ లే మింక నొక్కఁ డొకఁడె కాఁ
డిల మఱి యెవ్వఁడు నెఱుఁగఁ; డెవ్వఁ
తే. డేని సప్తాంగములు నీకు నిచ్చి చెట్లు
పట్టి పెనురాలతిప్పలు పట్టి తిరుగు
నట్టి ఖాండిక్యుఁ డొక్కఁడె యరయ నెఱిఁగె
నే నెఱుఁగు నే వేఁడు మది కర్తమేని' యనిన. ౨౧౮

ఋత్విజులు = యజమానునివలన ధనసత్కారము పొంది యజ్ఞము చేయించు బ్రాహ్మణులు, ప్రాయశ్చిత్తము = యజ్ఞప్రమాదములవలన వచ్చిన దోషమును పోఁగొట్టుకొనునట్టి క్రియ, కసేరుపుఁడు = కసేరు వను పేరి విద్వాంసుని, శునకుని = శునకుఁ డను పేరి విద్వాంసుని, పిండు = సమూహము, సప్తాంగములు = స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్ర దుర్గబలములు, నీకు నిచ్చి = నీకు లోఁబఱిచి (స్వామి యయినతాను లోఁబడుటయే స్వామినిచ్చుట), చెట్లు = వృక్ష సమూహములను - పట్టి = శూన్యములయిన - పెనురాలతిప్పలు = పెద్దశిలలకొండలను (పా. గిరిగిచెట్టు చెన్నొప్పు తిప్పలు), పట్టి = ఆశ్రయించి, అరయన్ = ఆలోచించి చూడఁగా, అది = అతని వేఁడుట, కర్తమేని = కార్యమేని = చేయఁదగినపని యేని, వేఁడుము = అతనిం బ్రార్థింపుము.

యజ్ఞగవి వ్యాఘ్రహతి సందియములకు రాజు ప్రాయశ్చిత్త మడుగఁగా ఋత్విక్కులును కసేరుపుఁడును తమకు తెలియ దనిరి. శునకముని ఖాండిక్యు నడుగు మనియె.

చ. నరపతి పల్కె, 'మానివర, నారిపు నిష్కృతి వేఁడఁబోయిన
ధర నతుఁ జేసె నేని సవనంపు ఫలం బొడఁగూడుఁ; గాక మ
త్సరగతిఁ జెప్పె నేని మఖతంత్రి మతంత్రముఁ గాక పూర్ణమౌ;
నిది యెఱుఁగు న్నదీప్సితమొ [illegible] నంచు రథాధిరూఢుఁడై. ౨౧౯

మానివర = ఓశునకముని. నారిపున్ = నా వైరిని (ఖాండిక్యుని), నిష్కృతి = ప్రాయశ్చిత్తము, వేఁడఁబోయినన్ = నే నడుగఁబోయినంతట, (అతఁడు నన్ను), ధరన్ హతుఁ జేసె నేని = నేలంగూల్చె నేని (=చంపినయెడల), సవనంపుఫలంబు = యజ్ఞఫలము ('సవనం త్వధ్వరే స్నానే సోమనిర్దళనేఽపి చ' మేది.), ఒడఁగూడున్ = నాకుం జేకుఱును; కాక = అటుగాక (నన్ను చంపక), అమత్సరగతిన్ = ఒకరి మేలును ఓర్చుమార్గమున (ద్వేషబుద్ధి లేక - 'మత్సరోఽన్యశుభ

క్షేపే తద్వ త్కృపణయో రపి' అమ.), చెప్పనేని = ప్రాయశ్చిత్తమును తెలిపినయెడల, మఖతంత్రము = నాయజ్ఞప్రయోగము; అతంత్రము = వికలము, కాక,...మత్ ఈప్సితమె = నాకు ఇష్టమె,...అంచుఁ బల్కి = అని వచించి, రథ అధిరూఢుఁడు = తేరు ఎక్కినవాఁడు...ఐ - (ముందటికన్వయము).

కేశిధ్వజుఁడు 'ఓ మునీంద్రా, నేను ఖాండిక్యుని ప్రాయశ్చిత్త మడుగం బోఁగా అతఁడు నన్ను చంపెనా నాకు క్రతుఫలము దక్కును, సాధుత్వముచే ప్రాయశ్చిత్తము చెప్పెనా నాక్రతువు సంపూర్ణముగా ఈడేఱును. రెండువిధములను నాకు మేలే, కావున అతనికడకే పోయెదను' అని పలికి రథ మెక్కెను. - వికల్పాలంకారము.

ఈపద్యములో 'పల్కె' అని సమాపకక్రియగా పూ. ము. పా.; ఆపాఠమున 'రథాధిరూఢుఁడై' అనుచోట అసంధాతువునకుం గర్త యుండదు; పల్కుటయే పూర్వకాలికము గావలయు, కావున 'పల్కి' అని మార్పుచేయఁబడినది.

క. హారిణాజినోత్తరీయుఁడు
నిరాయుధుఁడు నగుచు నతని నెల వగు నడవిం
జొరఁ, గోట్టికాండ్రు డెక్కముఁ
బరికించి, యెఱింగి, కలయఁబడి, కూఁత లిడన్. ౨౬

హారి...డు. - హారిణ అజిన = జింకతోలు - ఉత్తరీయుఁడు - పైవస్త్రముగాఁ గలవాఁడును, నిరాయుధుఁడును = కైదువులు లేనివాఁడును, అగుచున్ (కేశిధ్వజుఁడు కర్త), అతని నెలవు = ఖాండిక్యనిమనికి, అగు = అయిన- అడవిన్ = అరణ్యమును, చొరన్ = ప్రవేశింపఁగానే. కోట్టికాండ్రు = వేఁటవాండ్రు [పా. కోటి], డెక్కమున్ = ఇతని తేరుజెండాను, పరికించి = కని, ఎఱింగి = ఇతఁ డని తెలిసికొని, కలియఁబడి = కలసి మొత్తముగా, కూఁత లిడన్ = వలసవారికి తెలియునట్లుగా కూఁతలు పెట్టఁగా.

కేశిధ్వజుఁడు జింకతోలు ఉత్తరీయముగాఁ దాల్చి, కైదువులేక ఖాండిక్యుని నివాసమయిన యడవి కేఁగఁగా, కొండకోనలఁ నున్నకోట్టికాండ్రు జెండాను చూచి యితఁ డని యెఱిఁగి కూఁతలిడి వలసవారికిం దెలియఁజేసిరి.

ఆ. వలస బెదర, నృపతి కలఁగక ప్రజవగ
లార్పఁ బనిచి, కనుమ లందు నిలువ
వేలు వేలు నేర్చి విలుమందిఁ బనిచి, తాఁ
దడుకు పెండె మలుక వాడమ వెడలి. ౨౭

వలస = వలసవచ్చియున్న జనులు, బెదరన్ = భయపడఁగా, నృపతి = ఖాండిక్యుఁడు, కలఁగక = కలఁతపడక, ప్రజవగలు = ప్రజయొక్క దుఃఖములను [- పొగలు పా. పొగలు అని నామవాచకము మృగ్యము], ఆర్పన్ = పోఁగొట్టుటకు, పనిచి = తగినవారిని నియమించి, కనుమలందున్ = కొండలసందుత్రోవలందు, నిలువన్ = వైరులను ఎదురుటకై కనుపెట్టుకొనియుండుటకు, వేలు వేలు = వేవేలుగా, విలుమందిన్ = విలుకాండ్రజలనును, ఏర్చి = ఏర్పరించి (ఈయాకనుమయందు వీరువీరు ఉండవలసిన దని నిర్ధారించి), పనిచి = ఆయా కనుమలకుంబంపి,

తాన్, అలుక, పొడమన్ = పుట్టఁగా (కోపముతోఁ గూడుకొన్నవాఁడై), తడుకు పెండెము వెడలి = వెలుపలకు వైచిన పలుగాఁడితలుపును తెఱచికొని వెలువడి.

వలసవచ్చియున్నవారు తమ్ము సంహరింప శత్రువు వచ్చుచున్నాఁడని భయపడఁగా ఖాండిక్యుఁడు వారిభయమును తీర్చుటకు కొందఱ నియమించి వైరిసేనలరాక నడ్డగించుటకై వేలువేలు కనుమలకు వేలువేలు విలుకాండ్రను పంపి తాను కోపోద్దీపితుఁడై కంపకోటయొక్క పెండెముం దెఱచికొని వెడలినవాఁడై.

క. వచ్చు రిపుఁ జూపులనె చుఱు
చ్చుచు, సిరిఁ గొనుట మగుడఁ బొడముట రుష ము
చ్చిచ్చున లావెచ్చఁగ వి
ద్యుచ్చలచాపమునఁ దూపు దొడుగుచుఁ బలికెన్. ౨౮

వచ్చు (చున్న) - రిపున్ = శత్రుని, చూపులనె = తనదృష్టులచేతనే, చుఱుచుఱుచుచున్ = కాల్చుచు, సిరిన్ = (తన) అనఁగా ఖాండిక్యుని ఐశ్వర్యమును, కొనుటన్ = హరించుటచేతను, మగుడన్ = మఱియు, పొడముటన్ = జనించుట (వచ్చుట) చేతను, రుషన్ = కోపముచేతను, ముచ్చిచ్చునన్ = ఈ మూఁడు ననెడి మూఁడుచిచ్చులచేత, లావు ఎచ్చఁగన్ = బలము అతిశయింపఁగా, వి...నన్ - విద్యుత్ = మెఱుపువలె - చల = చలించుచున్న - చాపమునన్ = వింటియందు (ఒండె - చాపలతన్ = తీఁగవంటి వింటియందు), తూపు దొడుగుచున్ = అమ్మును సంధించుచు, పలికెను.

వచ్చుచున్న శత్రువును చూపులచేతనే దహించుచు, తనసిరిం గొనుటచేతను, మరల తన మీఁదికి వచ్చుటచేతను, తనకోపముచేతను - ఈ మూఁడునిప్పులచేతను కలిగిన బలముకలవాఁడై మెఱుపువలె చంచలమయినవింట నమ్మెక్కుచుం బలికెను. 'సిరిఁగొనుట...ముచ్చిచ్చునన్' వ్యస్తరూపకము.

'ముచ్చిచ్చునను వెచ్చమరి' పూ. ము. పా. (వెచ్చ = వేఁడి - అమరి = కలిగి. - 'ముచ్చిచ్చున లావెచ్చఁగ' అనియు పా.); 'చాపలతి' - 'చాపజ్య' పూ. ము. పా. ఇందు 'జ్యా' శబ్దము ఏకాక్షర మగుటచేత 'జ్య' - అని హ్రస్వము అశాస్త్రీయము. మఱి 'చాపలతన్' అనుపాఠములో నారిని చెప్పలేదా యనిన, వలదు; 'వింట నమ్మెర్చి యాము వెన్వెంటఁ దఱుము' అని పాండురంగమాహాత్మ్యము. 'విద్యుచ్చలధను మౌర్వీ' అనియేని పఠింపవచ్చును. ధనుశ్శబ్దము ఉకారాంతమును గలదు. "ధనుః పుమాన్ రాశిభేదే ప్రియాళద్రౌ శరాసనే' ఇతి నానార్థేషు మేదినీ." - అని రామాశ్రమము. పీఠికయందు దీనిచర్చం గనుఁడు.

మ. ధన ధాన్య ద్విర దాశ్వ గోగణ సమేతం బెల్ల సామ్రాజ్యముం
గొనియుం జాలక తాటకేయ పలభుక్కూటాకృతిం జెంకతో
లున నాచ్ఛన్నుఁడవై ప్రశాంతుగతి మాలోఁ జొచ్చి ప్రాణంబులుం
గొన నేతెంచెదె! దుర్మతీ, కెడపెద న్ఘోరంపు భల్లంబునన్. ౨౯

**దుర్మతీ** = ఓరిదుష్టబుద్ధీ, ధన...బు = ధనములు ధాన్యములు ఏనుఁగులు (ద్విరదా యస్య స = రెండుకోఱలు కలది) గుఱ్ఱములు పసులమందలు - వీనితోఁ గూడుకొన్నట్లుగా, ఎల్ల సామ్రాజ్యముఁ = సకలైశ్వర్యమును, కొనియుఁ = హరించియును, చాలక = తనివి తీఱక, తా...తిఁ - తాటకేయ = తాటకాసుతుఁడను మారీచుఁడను - పలభుక్ = పొలదిండియొక్క ('పల మున్మాంసమాంసయోః' నానా.) - కూట ఆకృతిఁ = మాయ రూపుతో

['మాయానిశ్చలయన్త్రేషు కైతవానృతరాశిషు
అయోఘనే శైలశృఙ్గే సీరాఙ్గే కూట మస్త్రియామ్.'],

జింకతోలునఁ, అచ్ఛన్నుఁడవు = కప్పఁబడినవాఁడవు, ఐ, ప్రశాంతుగతిఁ - కామక్రోధాద్యరిషడ్వర్గము ఉడిగినవానివలె, ...కొనఁ = హరించుటకు, ఏతెంచెదె = వచ్చుచున్నావా? క్రూరంపుభల్లంబునఁ = తీక్ష్ణమయిన బల్లెముతోఁ, కెడపెదఁ = నిన్ను పరిమార్చెదను.

ఓయిదుష్టుఁడా, ధనధాన్యాదికమయినమదైశ్వర్యము నంతయు హరించియుం దనియక, మారీచాకృతిగా జింకతోలు దాల్చి ప్రశాంతవేషంబున మాలోఁ జొచ్చి తత్వవేది మా ప్రాణములంగూడ హరింప వచ్చుచున్నావా? ఇదె నిన్ను వాఁడిబల్లెముతోఁ గూల్చెదను.

'గొనియుఁ'- 'గొనెన' అను పూ.ప్ర. పాఠమున ధనశబ్దము రెండుమార్లు వచ్చిన దని ఇందు 'గణ' అని మార్పఁబడినది. 'సామ్రాజ్య'- పా. 'సామగ్రి.' 'తాటకేయ పలభుక్కూటాకృతిఁ'- పదార్థవృత్తి నిదర్శన. మారీచుఁడు జింకవేషమున వచ్చి శ్రీరాములను వంచించినకథ నిట నను సంధించుకొనవలయును. 'ఏతెంచెదు' - పా. 'ఏతెంచితె'

మహాస్రగ్ధర.

అనినం, జేయెత్తి, "యోగాహా! యలుగక వినుఁ; తా నాతతాయిం బ్రమాదం
బున వైకల్యంబు యాగంబునకుఁ బొడమ, నే భూసురశ్రేణి వేఁడన్,
నిను నావేదించి పంపెన్; నృప! యతఁ డెఱుఁగు న్నిష్కృతిన్; వాఁడుం బోవో
మ్మని, కోప మ్మొన రోప మ్మొనఁ బఱుపు; మఱైన మే లింక" నన్నన్. 30

**అనినన్** = ఖాండిక్యుఁడు ఇట్లు పలుకఁగా, (కేశిధ్వజుఁడు), చేయెత్తియును, ...కాను ఆతతాయిన్ = చంపవచ్చినవాఁడను ('ఆతతాయీ వధోద్యతః' అమ.) కాను, ప్రమాదంబునన్ = మాయేమఱుపాటుచేత, యాగంబున వైకల్యంబు పొడమినన్, నేన్,...శ్రేణిన్ = సమూహమును, వేఁడన్ = (ప్రాయశ్చిత్తమును) అడుగఁగా, (ఆభూసురసమూహము), నినున్ ఆవేదించి = నిన్ను నిర్దేశించి, పంపెన్ = నన్నుపంపెను,...రోపమ్ము = బాణము ('పత్త్రీ రోప ఇషు ర్ద్వయోః' అమ.)...

ఖాండిక్యుఁ డిట్లు పలుకఁగా, కేశిధ్వజుఁడు చేయెత్తి యిట్లు బదులు చెప్పెను:— నేను నిన్ను చంప రాలేదు. నాకు ప్రమాదంబున యాగములో వైకల్యము సంభవించినది. అందులకుం బ్రాయశ్చిత్తమును నేను బుత్విగాదుల నడుగఁగా, వారు నీ వయినం జెప్పఁగల వని తెలిపి నీకడకు నన్నంపిరి. ఇది వృత్తాంతము; నీవు నాపై కోపము విడిచి ప్రాయశ్చిత్తము చెప్పినను సరియే, వైర మగుట నన్నుఁ జంపినను సరియే.

ఆండ్రును = (మా) భార్యలును, బిడ్డలును, అంటలు గట్టి = గుంపులు కూడి, చెల్కలకున్ = చేలకలకున్ = బీటి నేలలకు,...కంటకముల్ = ముండ్లు, పద అబ్జములన్ = అడుగుఁదమ్ములయందు, కాఁడన్ = గ్రుచ్చుకొనఁగా, ఒపర్చిననొప్పిన్ = ఊడలాగినబాధచేత, కూయిడన్ = ఏడ్చుచుండఁగా, ఒదుఁగంబడి = ఒదిఁగి, వేఁగెదము = తపించుచున్నాము, ఇందున్ = మనలో, ఒక్కమాకున్ అంటదుకాదు = మాకుమాత్రమే ఈకష్టము గల్గినుటయే గాదు....

మాభార్యలును బిడ్డలును బీళ్లకు కూడఁ గోసికొనుటకు పోఁగా, కాళ్లలో ముండ్లు గ్రుచ్చుకొనఁగా, వానిని ఊడలాగిన నొప్పిచే వారు రాత్రి అంతయు నేడ్చుచుండుటచేత, మాకు నిద్ర పట్టుట లేదు. ఈకష్టము మాకుమాత్రమే అని మేము చెప్పుకొనుటగాదు, నీవు పడుచున్న దురవస్థను వర్ణింపఁదమా? - మాకీకును నీకీకునుంగూడ ఈశ్వరుని సంహారింపు మనుట. - స్వభావోక్తి.

'చెల్కలకున్' - 'చేలకును' పూ. ము. పా. 'పదాగ్రముల' పూ. ము. పా. పదాబ్జముల' సీ. పా. - స్త్రీలయు బిడ్డలయు పాదములు గాన మృదుత్వమును సూచించుటకు అబ్జోపమ; అగ్రమునకే కంటకములు గ్రుచ్చుకొను నను నియమము లేదు. 'కాఁడ నొపర్చిన' - ప్రాంతప్రతులపా., సీ.పా.; 'కాఁడెఁగఁదూసిన' పూ.ము.పా. 'కూయిడన్' - ఇత్వసంధి - 'కూయుడున్' అని పఠించిన సరిపడును. 'అయ్యోడున్' అని యొక పా.

తే. స్వామ్యమాత్య సుహృత్కోశ జనపద బల
దుర్గములు స్వామి గలిగినఁ దొలుతఁ గలవు;
అంగి సుఖియైన సంగంబు లటుపు మునుపె
చాల సుఖు లౌట మనకు దృష్టంబు గాదె? 38

స్వా...లు - స్వామి = ఱేఁడు ('స్వామీ త్వీశ్వరః పతి రీశితా' అమ.), అమాత్య = మంత్రులు ('మన్త్రీ ధీసచివోఽమాత్యః' అమ.) - సుహృత్ = మిత్రులు ('అథ మిత్త్రం సఖా సుహృత్' అమ. - 'సుహృ ద్దుర్హృదౌ మిత్త్రామిత్త్రయోః' సూ. - అన్యత్ర సుహృదయః దుర్హృదయః' - అని సి. కౌ.) - కోశ = బొక్కసము ('కోశో స్త్రీ కుట్మలే ఖడ్గపిధానే ర్థౌఘ దివ్యయోః' అమ.) - జనపద = రాష్ట్రము - బల - చతురంగబలములు ('బలం సైన్యమ్' రామాశ్రమ.) - దుర్గములు = కోటలు, (అనుసిపి), స్వామి గలిగినన్ = ఱేఁడు ఉండెనేని, తొలుతన్ కలవు = అంతకుముందే సిద్ధముగా నుండును; అంగి = అవయవి (శరీర = ఆత్మ), సుఖి ఐనన్ = సుఖముగా నుండినయెడల, అంగంబులు = అవయవములు,... దృష్టంబు = ప్రత్యక్షానుభూతము...

సప్తాంగములలో రాజుకలిగెనేని కడమయంగములు అప్పుడే కలవు. ఆత్మ సుఖముగా నున్న అవయవములు సుఖముగా నుండుట ఎఱిఁగినదేగదా. - కావున నిసిద్ధిని ముందుగా చూచుకొనవలసిన దని భా. - అప్రస్తుతప్రశంస, అర్థాంతరన్యాసంబును.

క. అతనిపని దీర్ప రాజ్య
ద్వితయము నినుఁ జేరు; నెట్టివెఱవుననైనన్

క్షితిపుల కరిజయము ధనో
న్నతియుఁ బ్రజాసదయరక్షణము ధర్మంబుల్. 3౫

అతనిపని దీర్పన్=అతనిం జంపినయెడల, రాజ్య ద్వితయము= రాజ్యములద్వయి = రెండు రాజ్యములను,... వెఱవునన్ = ఉపాయముచేత,... క్షితిపులకున్ = భూపతులకు, అరిజయము= శత్రువులను జయించుటయు, ధన ఉన్నతియున్ = ధనవృద్ధియు, ప్రజా సదయ రక్షణమున్ = ప్రజలను దయతోఁ గాపాడుటయు, ధర్మంబుల్ = విహితకృత్యములు.

అతనిం గెడపెదేని రెండురాజ్యములును నీకే వచ్చును. ఏయుపాయమున నేని వైరులం దును ముటయు, ధనవృద్ధి కాపించుకొనుటయు ప్రజలను దయతోఁ గాచుటయు రాజధర్మములు.---- కావున అవి నీకును ధర్మములు అనుట. - అప్రస్తుతప్రశంస.

'సదయ' - ప్రాఁతపా. - 'నీతి' పూ. ము. పా.

క. అన్యాయంబున నున్నహ
మన్యుం డగుప్రబలరిపుని మడియించిన ధ
ర్మన్యక్కృతి కగు నిష్కృతి
సన్యాయంబునఁ బ్రజాళి సంరక్షింపన్. 3౬

దున్నహమన్యుండు=హైఁపరాని క్రోధముగలవాఁడు('మన్యుర్దైన్యే క్రతౌ క్రుధి' అమ.), అగు - ప్రబలరిపునిన్ = బల్లిదుఁ డయినశత్రువును, మడియించిన ధర్మన్యక్కృతికిన్ = పరిమార్చి నందుచేత నగు నధర్మమునకు (ధర్మ - ధర్మముయొక్క - న్యక్కృతి - క్రిందుపఱుచుట), ప్రజా ఆళిన్ - జనసమూహమును. సన్యాయంబునన్ = సమంజసముగా, సంరక్షింపన్ = పరిపాలిం చుటచేత, నిష్కృతి - ప్రాయశ్చిత్తము, అగున్.

ద్రోహియు బలీదుఁడు నయిన శత్రువును అన్యాయముగా వధించినపాపము ప్రజలను చక్కఁగా పాలించుటచేత తొలఁగును. సామాన్యముగా చెప్పినమాట విశేషముగా ఈరాజున కును ఇతని యావైరికిని అన్వయించుచున్నదిగాన అప్రస్తుత ప్రశంసాలంకారము.

'అన్యాయంబునన్' - ఇచట నఞ్సునకు విరోధ మర్థము - న్యాయవిరుద్ధముగా ననుట.

క. తనరాష్ట్రము చెడ వచ్చిన
ననిమిషపతి విప్రుఁ డనక యాచార్యుఁ ద్రిశీ
ర్షునిఁ దునుమఁడె? విడువుము దయ;
నిను నమ్మిన ప్రజలు సదయ నీ దయ లేలా? 3౭

అనిమిషపతి=ఇంద్రుఁడు, తనరాష్ట్రము=ఇంద్రునిదేశము, చెడన్ వచ్చినన్ = చెడునట్లు సంభవింపఁగా, విప్రుఁడు అనక=బ్రాహ్మణుఁ డని సంకోచింపక (బ్రహ్మహత్యకు వెఱవక), ఆచార్యున్ = గురువైనట్టి, త్రిశీర్షునిన్ = విశ్వరూపుని, తునుమఁడె = చంపలేదా ('తం హేన్ద్ర ఉవాచ...య న్మాం విజానీయాం త్రిశీర్షాణం త్వాష్ట్ర మహానమ్' అని కౌషీతకి బ్రాహ్మ

క నిదిధ్యాసకు బ్రహ్మం
బెనయునె? పరిభవపుశల్య మెదలో మెఱమర్. ౪౦

జనవర = ఓ రాజా, పరిభవపుశల్యము = అవమాన మనెడి యలుఁగు ('శల్యం శఙ్కౌ శరే వంశే కవిన్కాయాం చ నోమర కోశిశ్వ.'),ఎదలోన్ = గుండెలో, మెఱమర్ = మెదలుచుండఁగా, తపమునకుం జొచ్చినన్ = తపస్సు చేయం బూనినను,....సెలవు = ఉపయోగము,...నిదిధ్యాసకున్ = ఏకాగ్రధ్యానమునకు. బ్రహ్మంబు = పరమాత్మ, ఎనయునె = చేకూఱునా.

ఓ రాజా తపస్సునకుం బూనితివేని, అవమాన మనెడియలుఁగు హృదయమునందు మెదలు చుండఁగా, కన్నులు మూసికొనదగునే గాని ధ్యానమునకు బ్రహ్మము నిలుచునా.— ఈయవమాన దుఃఖము నీ తపస్సునకు బాధకము కావున నీకు తెరవకన్న వేఱుమార్గము లేదని భా.–పరిసంఖ్యాలంకారము. 'పరిభవపుశల్యము' – రూపకము. 'మెఱయు' సకర్మకము, ఇట అకర్మకము.

క. అవమతిఁ బిత్రుఘ్నులగు భూ
ధవులను వెదకి పిల్లపిల్లతరము తునిమి భా
ర్గవుఁడు మునియయ్యె: మఱి వై
భవమును గాంచెనె శాంతి? బగ వెగ టగునే? ౪౧

భార్గవుఁడు = పరశురాముఁడు ('భార్గవః శంకరో రేణుకాసుత శుక్రయోః' నానా.), అవమతిన్ = అవమానముచేత. పిత్రుఘ్నులు = (తన) తండ్రినిచంపినవారు, అగు – భూధవులన్ = రాజులను, వెదకి, పిల్లపిల్లతరము = పిల్లలనుసయితము వరుసగా, తునిమి = చంపి, ముని = తపస్సుం బూనినవాఁడు,......వైభవము = ఐశ్వర్యము......

పరశురాముఁడు తనతండ్రిం జంపిన రాజులను అవమానముచేత పిల్లపిల్ల వరుసగా వెదకి వెదకి సంహరించి పగదీర్చుకొని వైరాగ్యాన తపస్సునకు బ్రవేశించినాఁడు. అట్లు పగదీర్చుకొనంతకాలము వైభవము కలుగదు సరియేగదా. శాంతి సయితము కలుగదు. కావున నీవు వైభవమును వదలుకొని శాంతినే కోరుదువేనియు పగదీర్చుకొనక తప్పదు. కావున ఈతనిని వెంటనే తునుమము. – అప్రస్తుతప్రశంస. అర్థాంతరన్యాసంబును. పగతుం దునుమక భ్రమము లేదని కామందకము:— 'సాధవో రిద్రుమోత్ఖాత మకృత్వైవ కుతః సుఖమ్?'

తే. పగయు వగయును లేక సంపాదిఁ గన్న
నలరు సామాన్య సంసారి యగుట మేలు;
మఱి తగిలెనేని శాంతిచే మఱవఁ దగదు
రాజ్యభూమికఁ దాల్చిన రాజునకును. ౪౨

...,వగయున్ = దుఃఖమును, లేక = వహింపక,...కన్నన్ = పొందినను (దొరకినదానికే), అలరు = సంతోషించునట్టి – సామాన్యసంసారి = సాధారణ గృహస్థుఁడు,...అటుగాక, రాజ్యభూమికన్ = దొరతన మనెడు వేషమును ('అన్యరూపై ర్యదన్యస్య ప్రవేశః సతు భూమికా.' భరతుఁడు.),...తగిలెనేని = పగయు వగయుం గలిగినయెడల, శాంతిచేన్ = ఓర్పుచేత, మఱవఁ దగదు = మఱచుట ఉచితముగాదు.

'అపశూలం త మాసాద్య లవణం లక్ష్మణానుజః
రురోధ సంముఖీనో హి జయో రన్ధ్రప్రహారిణామ్.' రఘు. 15-17.

'రన్ధ్రప్రహారిణాం రన్ధ్రప్రహరణశీలానామ్; అపశూలత్వమేవాత్ర రన్ధ్రమ్' అని మల్లినాథః. దీనికే- 'తదా యాయాద్విగృహ్యైవ వ్యసనే చోత్థితే రిపోః' ఇతివచనాత్ పరవ్యసనే ఆక్రమణం విజిగీషోః సిద్ధికారకమ్। యథా మాఘే;- 'ఆత్మోదయః పరజ్యాని ర్ద్వయం నీతి రితీయతీ.' అథవా - 'స్వశక్త్యుపచయే కేచిత్ పరస్య వ్యసనేఽపరే.' తథాహి - 'ఆప్నోత్యాత్మనో రన్ధ్రం రన్ధ్రేషు ప్రహరన్ రిపూన్' - అని హేమ.వ్యాఖ్య.

వ. లేలెమ్మనుటయుఁ బ్రధానులకు భూనాథుం డిట్లనియె. ౮౭

క. మీ రాడినయది కార్యం
బే; నిప్పని సేయ రాజ్య మంతయు మనికిన్,
వానికిఁ బరలోకము జిత
మౌ నొక్కట; నిందు వాసు లరయఁగ వలయున్. ౮౮

మీ రాడిన యది = మీరు చెప్పినపనిని, కార్యంబు = ...; ఇప్పని = ఈశత్రుహననమును, చేయన్ = కావించుటచేత, ఒక్కటన్ = ఏకకాలములో, రాజ్యమంతయున్ = ఇరువురి రాజ్యంబును, మనికిని = మనకును, పరలోకము = స్వర్గము, వానికిన్ = వానికిని జితమగును = లభించును; ఇందున్ = ఈరెండుఫలములయందును గల, వాసులు = తారతమ్యములను, అరయఁగ వలయున్ = ఆలోచింపుఁడు.

ఆతనిం జంపుటచే, ఒక్కమాఱే మనకు సర్వరాజ్యమును, అతనికి స్వర్గమును వచ్చును; ఈరెండు ఫలములలో అతనికిం గలుగునదే యుత్కృష్టమో మనకుం గలుగునది యుత్కృష్టమో ఆలోచింపుఁడు.-ఆవాసినే అనంతరపద్యమందు చెప్పుచున్నాఁడు.

క. పరలోకసుఖము శాశ్వత
మరయ; మహీరాజ్యసౌఖ్య మల్పానేహః
పరిభోగ్యం; బిందులకై
దురితము కావించి తొలఁగుదునె పరమునకున్. ౮౯

అరయన్ = ఆలోచింపఁగా, పరలోకసుఖము, శాశ్వతము = చిరకాలము ఉండునది, మహీరాజ్యసుఖము = భూమియందలి రాజ్యసౌఖ్యము, ....బు - అల్ప = కొంచెమైన - అనేహః = కాలముచే - పరిభోగ్యంబు = అనుభవింపఁదగినది; ఇందులకై = ఈయల్పకాలరాజ్యసౌఖ్యముకొఱకు, దురితము = పాపమును ('అంహో దురిత దుష్కృతమ్' అమ.), కావించి = చేసి, పరమునకున్ = స్వర్గమునకు, తొలఁగుదునె = దూరమగుదునా.

మీరు చెప్పినపాపకృత్యమును నేను జేసినచో నాహతునికి శాశ్వతమయినపరలోకసుఖమును, నాకు స్వల్పకాలభోగ్యమగుమహీరాజ్యసుఖమును కలుగును, స్వర్గము నాకు తప్పును, కావున ఆపాపమును నేను చేయను.

శాశ్వతత్వమును అల్పానేహః పరభాగ్యత్వంబును ఆదురితము గావింపనికి కారణంబులు గాన కావ్యలింగాలంకారము.

క. 'బద్ధాంజలిపుటు దీనుఁ
గ్రుద్ధుండై శరణు సొరఁగఁ గూల్పుట కడుఁ గీ,
డుద్ధతి పరలోకార్జన
బుద్ధికి' ననుకణ్వవాక్యములు దలఁపరొకో? ౫౦

దీనున్ = గర్వ ముడిగినవానిని, బ....టున్ - బద్ధ - కూర్పఁబడిన, అంజలిపుటున్ = మోడ్పుకేలిదొన్నె గలవానిని (దోసిలి కేలుమోడ్చినవానిని), శరణు చొరఁగన్ = శరణు చొచ్చినప్పుడు, క్రుద్ధుండు = కోపించినవాఁడు. ఐ, కూల్పుట = చంపుట, పరలోకఅర్జన బుద్ధికిన్ = స్వర్గమును సంపాదించుటయందు తలంపు గలవానికి, కడున్ కీడు = మిక్కిలి చెఱుపు, అను - కణ్వ (మహాముని) వాక్యములు, తలంపరొకో - మీరు తలంపరా యేమి.

శరణాగతుని దీనుని చంపుట మహాపాప మనెడు కణ్వమహాముని వచనములను స్మరింపుడు. - ఇది సామాన్యోక్తి - ఓడినున్నవానిని చంపుట మహాపాతక మని విశేషము - అప్రస్తుతప్రశంస.

'క్రుద్ధుండై శరణు' - 'పా. క్రుద్ధుఁడై చనముఱుఁగ,' 'క్రుద్ధుండైమఱుఁగ.'

ఆ. అనుచు వెడల వచ్చె, యూపాల సరిగ, నా
ధ్వర్యవమున విధి క్రమంబు
దెలిసి, సగిస నిష్కృతి పచింప, నాతండు
మనుడఁ గ్రతువు సాంగముగ నొనర్చె. ౫౧

.....పడిటి = (మంత్రాలోచనకై వచ్చినతరుణమునుండి) వెలుపలికి,...రాజున్ = కేశిధ్వజుని.........తఁడు - అతని - ధుర్యత్వంబికి - యజ్ఞధనువుయొక్క ('ఉత్తమా గోష నైచికి' అమ.) - విధి = కోలయొక్క - క్రమంబు - ప్రకారమును, తెలిసి = ఎఱిఁగి,...నిష్కృతి - ప్రాయశ్చిత్తమును,...మనుడన్ - పెంపుయు,...క్రతువున్ = యజ్ఞమును, సాంగముగన్ - సంపూర్ణముగా, ఒనర్చె - చేసె (ముందటి కన్వయము).

ఆ. అవభృథాప్లుతోత్తమాంగుఁడై, ఋత్విక్స
దస్యగణముఁ బూజఁ దనిపి, పిదప
సూత మాగధ వంది వైతాళిక ప్రభృ
త్యర్థికోటి కభిమతార్థ మొసఁగి. ౫౨

అ...డు-అవభృథ = యజ్ఞాంతస్నానముచేత ('మే ధ్యా నావభృథ దహ' హేము. 1 (84). 'అవభృథాదపి - అవభృథస్నానాదపి' మల్లి. న్యా.) - ఆప్లుత = చక్కఁగా తడుపఁబడిన - ఉత్తమాంగుఁడు = శిరస్సు కలవాఁడు ('ఉత్తమాఙ్గం శిర శ్శీర్షమ్' అమ.), ఐ, ఋ...గణమున్ - ఋత్విక్

డమలిన యోగాశ్రయుఁ; డు

త్తమయోగము గొనుట యురవొ, ధరఁ గొను టురవో? ౫౯

నిమివంశ ఉత్పన్నుల మాట= నిమిచక్రవర్తిసంతానమందు పుట్టినవార మాట,...అమలి న యోగ ఆశ్రయుఁడు = దోషములేని రాజయోగమునకు తావలమైనవాఁడు,...ఉరవొ = ఉచితమొ,......నిమివంశమునఁ బుట్టినవారమనుటచే మిక్కిలి జ్ఞానవైరాగ్యాది దివ్యగుణసంపన్నులని భా.ఆవంశపువాఁడు జనకుఁడు.పలువురు మునులకు బ్రహ్మవిద్యాగురు వని రామాయణమున ప్రసిద్ధము. శ్రీరాములవారు పిమ్మట విఱిచిన వింటిని నిమికి అవతారమువాఁ డయిన దేవ రాతునియొద్ద మహేశ్వరుఁడు ఉంచియుంచుటగూడ ఆవంశమువారి ప్రభావమునకు తార్కాణము. — 'ఉరవొ' -'ఎరవొ' అనిపూ. ము. పా. ఎరవు శబ్దము ఈయర్థమున నిఘంటువులందు కనఁబడదు.

సీ. వినుఁడు దన్ని యీస వెల్వడి వచ్చి ఖాండిక్యుఁ
డా రాజుఁ గని మోద మారఁ దనమున,
'గురునిష్క్రయంబు నిక్కముగా నొసఁగెదే?'
యని పల్కఁ, 'బుత్తుఁ దథ్యముగ' నన్న;
'నవనీతలేంద్ర, నీ వధ్యాత్మరతుఁడవు;
దక్షిణగురునకుఁ దలఁచితేని,
సకలభవక్లేశ సంక్షయం బెయ్యది
యవ్విద్య బోధింపు' మనిన, నవ్వి,
తే. 'యహహ! నిష్కంటకాస్మదీయాధిరాజ్య
మడుగ కొల్లక యిది యేటి కడిగి తివుడు?
క్షత్త్రియుల కెల్ల రాజ్యంబు కంటె మఱి ప్రి
యంబుగలదె?' యటన్న నిట్లనియె నతఁడు. ౬౦

....ఆరాజుఁ = కేశిధ్వజుని - గురునిష్క్రయంబు = గురువుయొక్క వెలను (గురుదక్షిణను). నిక్కమముగా = నిక్కముగా = సత్యముగా. తథ్యముగఁ = సత్యముగా. అవనీతలేంద్ర = ఓభూతలపతీ (రాజాయనుట), అధ్యాత్మరతుఁడవు = బ్రహ్మవిద్యాతత్పరుఁడవు. స....బు - సకల = అఖిలమైన - భవక్లేశ = సంసారదుఃఖములయొక్క ('భవః క్షేమే సంసారే సత్తాయాం ప్రాప్తి జన్మనోః' మే.)- సంక్షయంబు = నాశకము, ని...ము - నిష్కంటక = శత్రురహితమైన - అస్మదీయ = నాదు - అధిరాజ్యము = సామ్రాజ్యమును, ఒల్లక = వలవక = కోరక, ఏటికిఁ — ఏమిటికి = ఏల.

మ. 'విను, కేశిధ్వజ, ధాత్రి వేఁడమికి నావేదించెద న్నేతు; వ
జ్ఞానకుం గాక వివేకి కేల జనియించుఁ లొల్క మెంమఁ? రణం

మమకారము ఉడుగని మూఢమతులవలె పండితులు రాజ్యమునకు ఆసపడుదురా? అహంకార మమకారము లుడిగిన మాబోంట్లకు రాజ్య మేల? - అని ఖాండిక్యుఁడు చెప్పెను. అందులకు ప్రీతుఁడై ఆ కేశిధ్వజజనకుఁడు ఇట్లు ఉత్తరము చెప్పెను. - బుధత్వము ఆసపడమికిని, మమత, జడాత్మత, ఉక్తమత్తతయు ఆసపడుటకును కారణములు గాన పదార్థహేతుక కావ్యలింగము

ఆ. 'ఏ నవిద్యవలన మృత్యువుఁ దరియింప,
ననఘ, రాజ్యములు మఖాదికములుఁ
జేయుచున్నవాఁడ; క్షీణింపఁ జేయుదుఁ
బుణ్యఫలము భోగభుక్తిచేత. ౬౭

అనఘ= పాపరహితుఁడా, ఏన్ = నేను, అవిద్యవలనన్ = మఖాదికర్మముచేత, మృత్యువున్ = ప్రమాదమును, తరియింపన్ = దాఁటుటకై, రాజ్యములున్, మఖ ఆదికములున్ = యజ్ఞములోనగు కర్మలును, చేయుచున్నవాఁడన్ = చేయుచున్నాను; పుణ్యఫలమున్ = (కర్మవలని) శుభాదృష్టముయొక్క ఫలమును, భోగభుక్తిచేతన్ = భోగముల ననుభవించుటచేత, క్షీణింపఁ జేయుదున్ = నాశ మొందించెదను.

నేను, స్వాభావికమైన బ్రహ్మనిష్ఠనుండి కలిగిన ప్రమాదమును దాఁటుటకొఱకు, అందులకు సాధనముగా యజ్ఞములు చేయుచున్నాను. అయినను పూర్వకృతకర్మఫలము సంసారమును బలపఱుచుచుండలేదా, దానివలననుండి ముక్తియెక్కడిది, అనిన, ఆఫలమును భోగముచేత క్షయ మొందించుటకై రాజ్యము లేలుచున్నాను.

అవిద్య యనఁగా మఖాదికర్మ. 'అవిద్యవలన' - కరణార్థమున 'వలన' సాధువుగాన, అవిద్య 'చేత' అనఁదగును.

'ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి' అను సనత్సుజాతీయవాక్యముచేతను,
'ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన।
ప్రమాదో మృత్యు రిత్యాహు ర్విద్యాయాం బ్రహ్మవాదినః.'

ఇత్యాద్యధ్యాత్మోపనిషద్వాక్యాదులచేతను మృత్యు వనఁగా బ్రహ్మనిష్ఠనుండి పరాకుపడుట. నరుఁడు అవిద్యచేత మృత్యువుం దరించు ననుటకు —

'విద్యాం చావిద్యాం చ య స్తద్వే దోభయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే.' ఈశా. ఉ. 11.
'యోగినః కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వాత్మశుద్ధయే.' భ. గీ. 5, 11.
'యజ్ఞో దానం తప శ్చైవ పావనాని మనీషిణామ్.' భ. గీ. 18,5.

మఖాదులు చేయుటచేత తత్ఫలానుభవరూప మయిన సంసారము బలపడును గదా యనిన, 'సఙ్గం త్యక్త్వా' అనుటచే ఫలాపేక్ష లేక చేయువానికి ఫలానుభవరూపబంధము ఉండదు. ఇంతకు ముందు చేసియున్న కర్మయొక్క ఫలము—

క. 'విను కర్మం బొనరించును। జననము మరణంబు, నదియ సౌఖ్యము దుఃఖం
బును గావించును, దనచే। సినదానం బడకపోవ శివునకు వశమే?'

'జ్ఞానోదయా త్పురాఽఽరబ్ధం కర్మ జ్ఞానా న్ననశ్యతి
అదత్త్వా స్వఫలం, లక్ష్య ముద్దిశ్యోత్సృష్టబాణవత్.
వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తు గోమతౌ
న తిష్ఠతి ఛినత్త్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్.' అధ్యాత్మోపనిషత్తు

అన్నట్లు, తనకు తప్పదు గదా, ఆరూఢ మయిన సంసారమునకు క్షయ మెట్లనిన, అందులకే, 'ప్రారబ్ధం భోగతో నశ్య' త్తి నాకారణంబున రాజ్యభోగములచే దానిని క్షయ మొందించుచున్నాను, అని చెప్పినాఁడు.

క. మన యీ నిమివంశము పా
వన మగుభాగ్యమునఁ, మనుజవర, తత్త్వవిదే
చనచింత నికఁ బొడమెను;
విను మింక వినుపింతు నే నవిద్యావిధముల్. ౬౫

మనుజవర = మనుష్యశ్రేష్ఠుఁడా, పావనము = పవిత్రము ('పవిత్రం పావనం పూతమ్' హేమ.), భాగ్యమునన్ = అదృష్టముచేత, త...దే - తత్త్వ = పరమాత్మయొక్క ('తత్త్వం పరాత్మని వాద్యభేదే స్వరూపే చ' హేమ.), అవిద్యావిధముల్ = అజ్ఞానముయొక్క ప్రకారమును.

'నేను విద్యా' అని పూ. ము. పా. 'నే నవిద్యా' అని వ్రాఁతప్రతుల పా. ఇదియే సమంజసముగాఁ గాన్పించుచున్నది. చూ. ౭౭ (2).

ఆ. ఆత్మగాని మేనఁ నాత్మబుద్ధియును న
స్వంబునందు మిగుల స్వత్వమతియు,
నవనివర, యవిద్య యను మహాతరువు న
త్పత్తికిన్ ద్వయంబు విత్తు మొదలు. ౬౬

అవనివర = ఓరాజా, ఆత్మ = తాను
('ఆత్మా కళేబరే యత్నే స్వభావే పరమాత్మని
చిత్తే ధృతౌ చ బుద్ధౌ చ పరవ్యావర్తనేఽపి చ' ధరణి.),
కాని మేనన్ = కానట్టి దేహమందు, ఆత్మ బుద్ధియున్ = తా ననెడితలంపును, అస్వంబునందున్ = తనవిగాని దానియందు ('స్వో జ్ఞాతా వాత్మని స్వం త్రిష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే' అమ.), మిగులన్ = మిక్కిలి, స్వత్వమతియున్ = తనది యనెడు భావంబును, ఈ - ద్వయంబు = రెండును, అవిద్య = అజ్ఞానము. అను = అనెడు - మహాతరువు నుత్పత్తికిన్ = గొప్ప వృక్షముయొక్క పుట్టుకకు, విత్తు మొదలు = ఆది బీజము.

ఓరాజా, తానుగానట్టి దేహమందు తా ననెడి తలంపును, బంధుమిత్త్రకళత్రపుత్త్రాదులు తనవి అను తలంపును, ఈరెండును అజ్ఞానమహావృక్షమునకు ఆదిబీజము. - రూపకాలంకారము.

ఈపద్యమునకు మూలమైన విష్ణుపురాణశ్లోకము:—

'అనాత్మ న్యాత్మబుద్ధి ర్యా అస్వే స్వ మితి యా మతిః
అవిద్యా తరుసంభూతి బీజ మేత ద్ద్విధా స్థితమ్'.

బీజము దళద్వయరూపముగా నుండును గాన అహంకార మమకారములు రెండును బీజ మను టచే అవి ఒకటొకటియు ఒక్కొక్కదళ మని భా.

క. నరనాథ, పాంచభౌతిక
శరీరమున దేహి మోహసాంద్రతమతమః
పరివృతుఁడై, 'నే. నిది, నా
పరికర' మని యవధి లేనిభ్రమఁ బడి తిరుగున్. ౯౭

నరనాథ = ఓరాజా, పాం...నన్ = పృథివ్యప్తేజో వాయ్వాకాశము లనెడి పంచ భూతముల పరిణామ మగుదేహమందు, దేహి = జీవుఁడు, మో...డు - మోహ = అవిద్యవలని ('అథ మోహో న్పులిఙ్గః స్యా దవిద్యాయాం చ మూర్ఛనే' మేది.) - సాంద్రతమ = మిక్కిలి దట్టమైన - తమః = చీకటిచేత - పరివృతుఁడు = ఆవరింపఁబడినవాఁడు, ఐ, ఏను = నేను అనెడి భావమును (అహంకారమును), ఇది నా పరికరము = ఈవస్తువు నాసొత్తు, అని = అనెడి - అవధి లేని = హద్దులేనట్టి - భ్రమన్ = తిరుగుడులో ('భ్రమో భ్రమిః' అమ.), పడి, తిరుగున్ = పడియు చుండును.

ఓరాజా పంచభూతాత్మకమయిన శరీరమందు జీవాత్మ అవిద్యవలని దట్టంపు టిరులుచే నావరింపఁ బడినవాఁడై అహంకార మమకారము లనెడి యనవధికభ్రాంతిలో పడి తిరుగు చుండును. అవిద్యచే తమస్సునం బడు నని శ్రుతి:—

'అన్ధం తమః ప్రవిశన్తి యే ఽవిద్యా ముపాసతే.' ఈశా.

క. జలవసుధాంబరపవన
జ్వలనంబులకంటెఁ దా నజస్రంబు వెలిఁ
వెలుఁగొందుచునాత్మ యుండఁగఁ
గళేబరము నెవ్వఁ డాత్మగాఁ దలపోయున్? ౯౮

ఆత్మ = జీవుఁడు, జల వసుధా అంబర పవన జ్వలనంబులకంటెన్ = నీరు మన్ను ఆకాశము గాలి అగ్ని అను వానికంటె, తాను, వెలిన్ = వేఱయి, అజస్రంబు = సర్వదా, వెలుఁగొందుచున్ = ప్రకాశించుచు, ఉండఁగాన్, కళేబరమున్ = (జలాది వికారమయిన) దేహమును, ఆత్మగాన్, ఎవ్వఁడు, తలపోయున్.

ఆత్మ పృథివ్యప్తేజోవాయ్వాకాశములకంటె వేఱయి సర్వదా ప్రకాశించుచుండఁగా, పృథివ్యాదిమయ మయిన దేహమే ఆత్మ యని యెవ్వఁడును తలంపఁడు.

సీ. వపు రుపభోగ్యముల్ నృప గృహక్షేత్రాదు;
లవి పొందు నౌఁగాక యాత్మ వగునె?
యట్లన పుత్త్రమిత్త్రానీకములు నాత్మ
కాని మైఁ బుట్టుటఁ గావు తనవి;

గాన మృత్యువుఁ గను కాయంబున జనించు
పుత్త్రాదులెడ స్వత్వబుద్ధి దగదు;
ఎపుడేని యాత్మ వేఱే యనునప్పుడె
యడరు భోగంబు లేయాత్మకంట;
తే. నట్లుగా కీయొడలె యాత్మ యన్న నంటు;
మృద్గృహము నిల్చు నెట్లు మృజ్జలాది
నట్లు భౌతికభోగాశనాది భౌతి
కాంగములు నిల్చు; భోగ మిం దాత్మ కెద్ది? ౭౯

1. నృప - ఓ రాజా, గృహ క్షేత్ర ఆదులు = ఇండ్లు భార్యలు (లేక - పొలములు) లోనగునవి ('క్షేత్రం పత్నీశరీరయోః' అమ.), వ...ల్ - వపుః = దేహమునకు - ఉపభోగ్యములు = అనుభవింపఁదగినవి: అవి = ఆగృహక్షేత్రాదులు, బొందివి - దేహమువి, కాఁగాక = అవునుగాని, ఆత్మవి = జీవునివి, అగునె = కావు;

2. అట్లన = ఆప్రకారముగానే, పుత్త్రపౌత్త్ర అనేకములున్ = కొడుకులయు కొడుకులకొడుకులయు సమూహములు. సైతము, ఆత్మ కాని మైన్ = జీవుఁడు కానట్టి దేహమందు, పుట్టుటన్ = జనించుటవలన, తనవి = జీవునివి, కావు.

3. కానన్ = కావున, మృత్యువుఁ గనుకాయంబునన్ = మృతిం బొందున దైన దేహమునందు,...స్వత్వ బుద్ధి = తనవా రనెడి తలంపు, తగదు;

4. అడరు భోగంబులు = అతిశయించు విషయానుభవములు, ఆత్మ మేనికి వేఱే ఎపుడేని, అప్పుడె = ఆత్మ దేహమునకన్న భిన్నుఁ డయిన కారణంబున నే...

...అట్లు - మృత్ జల ఆదిన్ = దేనితో నలుకుదురో మన్ను నీళ్లు లోనగు నావస్తువుచేత, మృత్ గృహము = మట్టియిల్లు, ఎట్లునిల్చున్ = ఎట్లునిలుచునో, అట్లు, భౌ...దిన్ - భౌతిక = పంచభూతమయ మయిన - భోగ = భోగ్యవస్తువులును - అశన = అన్నమును - ఆదిన్ = లోనగువాని చేత, భౌతిక అంగములు = పంచభూతవికారము లగునట్టివి దేహములు, నిల్చున్.

ఓరాజా, ఇండ్లు కళత్రములు లోనగునవి దేహమునకు భోగ్యములు, కావున అవి దేహమునకే చెందునుగాని, ఆత్మకు చెందవు, అట్లే దేహమువలన జనించిన పుత్త్రపౌత్త్రాదికము దేహముదే గాని ఆత్మది గాదు. కావున జీవాత్మ(డైన తనకు మృతినొందున దైన దేహమున జనించిన పుత్త్రాదులయందు తనవారు అనెడి తలంపు తగదు. దేహమే ఆత్మయగునెడల దేహముయొక్క భోగములు ఆత్మ కంటునుగాని, దేహము ఆత్మ కానందున అవి ఆత్మకు అంటవు. మట్టియిల్లు మట్టితో అలికిన నిలుచును, అట్లే పాంచభౌతిక మయిన శరీరము పాంచభౌతిక భోగానుభవముల చేత నిలుచును. భౌతికము కానట్టి యాత్మకు భౌతికములయిన యీభోగములు అంటవు.

మ. జనిసాహస్రబహుప్రయాణ మగు సంసారంపుఁ ద్రోవ న్సదా
చనుచుండు న్ఘన మోహఖేద మలమ న్సంసారిపాంథుండు, నా

సనలన్ ధూళి ముసుంగు గాఁగ; నెపుడేని జ్ఞానంపుటుష్ణోదకం
బునఁ దత్క్షాళన సేయు, వాని కపు డమ్మోహశ్రమంబు జ్జనున్. ౨౦

**సంసారి పాంథుండు** = సంసరణశీలుఁ డనెడి నిత్యపథికుఁడు, జ...ము- జని = **పుట్టువుల** యొక్క - సాహస్ర = **వేల**సంఖ్యలను లనెడి - బహు = పెక్కు - ప్రయాణము = **పయనములు** (**మజిలీలు**) గలదై, అగు - **సంసారంపుఁ** ద్రోవన్ = జననమరణ ప్రవాహమనెడు మార్గములో, **వాసనలు** = అనాదికర్మ **సంస్కారములు**, అన్ = అను - అనియెడి - **ధూళి** = పరాగము, ముసుంగు కాఁగన్ = పైకప్పు కాఁగా, ఘన**మోహ**ఖేదము = దట్టమయిన యవిద్యావలని శ్రమ, అలమన్ = ఆక్రమించుచుండఁగా, సదా, చనుచుండున్ = నడచుచుండును; ఎపుడేని = ఎప్పుడైనను, జ్ఞానంపు టుష్ణోదకంబునన్ = విద్య యనెడి వేడినీళ్లతో, త...న - తత్ = ఆవాసనా ధూళి ముసుఁగుయొక్క - క్షాళన = కడుగుటను, చేయున్ = కావించునో, అపుడు, వానికిన్ = ఆసంసారి పాంథునికి, అమ్మోహశ్రమంబున్ = ఆయవిద్యారూపమోహమువలని యాశ్రమకూడ, చనున్ = తొలఁగును.

సంసారియైన జీవుఁడు వేలకొలంది జన్మము లనెడి పెక్కు పయనములు (మజిలీలు) గల సంసార మార్గమందు అనాదికర్మవాసన లనెడి ధూళిలోఁ గ్రుంగుచు అవిద్యయనెడి సొలపువలని శ్రమలో మునిఁగి సర్వదా పయనము నడచుచుండును. ఎప్పుడు విద్యయనెడి వేఁడినీళ్ల (స్నానము) చేత ఆకర్మవాసనాధూళిని కడిగికొనునో అప్పుడు అవిద్యారూపమయిన సొలపువలని **యాబడలికయు** తీఱిపోవును. - అనాదికర్మ వాసనంజేసి అవిద్యావశుఁడై **సంచరించుచున్న జీవుఁడు** విద్యచే ఆవాసనను జయించి ఆనందమును బొందును; అని భా. రూపకాలంకారము.

ఈయర్థమే గీతయందు ఇట్లు చెప్పఁబడినది:—
'యథైధాంసి **సమిద్ధో**ఽగ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా.' భ. గీ. **4, 37.**
'జ్ఞానంలబ్ధ్వా పరాంశాన్తి మచిరే ణాధిగచ్ఛతి.' భ. గీ. **4, 39.**

తే. అట్టి మోహశ్రమం బాఱ నాశరీరి
స్వస్థుఁ డై తా ననన్యాతిశయ మబాధ
మనఁగ విలసిల్లు నిర్వాణమును భజించు
ననఘ తొల్లియు నిర్వాణ ఖనియ కాన. ౨౧

అనఘ = **పాపరహితుఁడా**, తాను, తొల్లియున్ = ఆదిలోఁగూడ, ని...య - నిర్వాణ = **ముక్తికి** ('ముక్తిః కైవల్య నిర్వాణ శ్రేయో నిఃశ్రేయసామృతం। **మోక్షో**పవర్గః' అమ.)— ఖనియ = గనియే ('ఖనిః **స్త్రియా** మాకరఃస్యాత్' అమ.), కానన్ = అగుటంజేసి, ఆశరీరి = ఆజీవుఁడు, **అట్టి - మో**హశ్రమంబు = **అవిద్యా**రూప మయిన యలసట, ఆఱన్ = **తీఱిపోఁగా**, **స్వస్థుఁడై** = **నిర్వికారుఁడై**, అనన్య అతిశయము = తనకంటె **నధికము లేనిదియు**, **అబాధము** = **దుఃఖములేనిదియు**, అనఁగ విలసిల్లు = అని వర్ణింపఁబడినదై **యొప్పుచున్న - నిర్వాణము** = **మోక్షమును; భజించున్** = **పొందును.**

ధ్వంసము చేయునది,...యోగంబు= అష్టాంగము,...విజ్ఞాత యోగశాస్త్రుండవు= ఎఱుఁగఁబడిన యోగశాస్త్రము కలవాఁడవు (యోగశాస్త్రము నెఱుంగువాఁడవు),...కృపాళుండు = దయగలవాఁడు,...సంస్థితుండై = మృతుఁడై ('పరాసు ప్రాప్తపఞ్చత్వ పరేత ప్రేత సంస్థితాః। మృతప్రమీతౌ త్రిష్వేతే' అమ.)...ముని=జ్ఞాని ('మన జ్ఞానే' ధా. పా.)...పునర్భవంబు నకుఁ రాక=పునర్జన్మమునకు రాక (మరలఁ బుట్టక), బ్రహ్మసాధర్మ్యంబు = బ్రహ్మతోసమాన ధర్మము కలవాఁడగుటను (బ్రహ్మధర్మములను), పొందు నట్టి యోగంబు= ఏయోగమువలనఁ బొందునో ఆయోగమును, స అవధానుండవై = హెచ్చరిక కలవాఁడవై,...

పూర్వముద్రణమున 'ఎందేని సంస్థితుండై = ఏయోగ శాస్త్రమందైన నున్నవాఁడై' అని వ్యాఖ్య. ఇట్టి ప్రకరణములో చావును చెప్పుటయు ప్రసిద్ధమే అయి యున్నది:—

'జీవన్ముక్తశ్చ భవతి దేహాన్తే తమసః పరం ధామ ప్రాప్నుయాత్ ...న చ పునరావర్తతే.' అక్ష్యుప.

'తనుం త్యజతు వా తీర్థే శ్వపచస్య గృహేఽథవా
జ్ఞానసంప్రాప్తిసమయే ముక్తోఽసౌ విమలాశయః.
న మోక్షో నభసః పృష్ఠే న పాతాళే న భూతలే
సర్వాశాసంక్షయే చేతఃక్షయో మోక్ష ఇతి శ్రుతేః.' సాంఖ్యసా.
'జీవన్ముక్తపదం త్యక్త్వా స్వదేహే కాలసాత్కృతే
విశత్యదేహముక్తత్వం పవనోఽస్పన్దతామివ.'

[యోగకుం. ముక్తికో. మహోప.]

ఆ. "ప్రాణికోటి కెల్ల బంధంబు మోక్షంబు
చేరుటకును మనసు కారణంబు;
విషయసంగి యైన, విను బంధకారి; ని
ర్విషయ మైన, ముక్తివిభవకారి. 23

వినుము, ప్రాణికోటికిన్ ఎల్లన్ = జంతువుల సమూహమునకంతటికిని, బంధంబున్ = సంసారరూపమయిన కట్టును, మోక్షంబున్ = ఆకట్టునుండి విడుదలయును, చేరుటకున్ = కలుగుటకు, మనస్సే, కారణంబు; (ఆమనస్సు), విషయసంగి = విషయములతోఁ గూడినట్టి, ఐనన్ = అయినేని, బంధకారి = (పైనిచెప్పిన) బంధమును చేయును, నిర్విషయము = విషయరహితము,ఐనన్ = అయినేని,ముక్తి విభవకారి= మోక్షరూపమయిన యైశ్వర్యమును కావించును.

ప్రాణులకు బంధమోక్షములకు మనస్సే కారణము, ఆమనస్సు సవిషయ మైనచో బంధముం జేయును, నిర్విషయ మైనచో మోక్షముం జేయును.

ఈపద్యము శాట్యాయనీయాది బహూపనిషత్తులందుఁ గల యీశ్లోకమునకు అనువాదము:-

'మన ఏవ మనుష్యాణాం కారణం బన్ధమోక్షయోః;
బన్ధాయ విషయాసక్తం; ముక్త్యై నిర్విషయం స్మృతమ్.'

తర్వాతి పద్యములోని '**విద్వాంసులు**' అనుపదముతో నన్వయము.—

**1.** విద్వాంసులు=(ఓడిపోయిన) పండితులు, పెలవులు=పెదవుల మూలలను, **నాకుచున్**= నాలుకతో తడుపుకొనుచు - **వెలియరంగులు** = బయటి తిన్నెలను, చూడక, అరిగి = పోయి, **పాదూవాహున్**=తమ చెప్పులు మోచువానిని ('అథ పాదుకా పాదూ రుపానత్ స్త్రీ' అమ.), అరయువారు = వెదకువారు;

**2.** తమ ముంగలన్ = ఎదుట, ఉండా = ఉన్నట్టి - అందెలగుజ్జు = అరుగోలికను (అందెల మనఁగా - పార్శ్వములందు మాఁతలేని పల్లకి - టాంజాను), కానక, దాఁటి - ఆవలికి పోయి, పేరెలుంగు ఇడి - పెద్దకేక వేసి [మిక్కిలి బిగ్గరగా - పా. చేవెలుంగిడి=(చేవ + ఎలుంగు) పటిమ గల కంఠస్వరము చేసికొని - పా. చేగొలుంగిడి = చేతితో కూడుకొన్న గొలుసు కాయించి - చేయెత్తి కూకవేసి అనుట. మఱియు లక్ష్యము -

క. "దీపించి, యతని వదనము। చేఁ గొలుఁగిడి చూచి యేమి చెప్పెదు, రఘువరా,
యేపీనుల వినఁ, గానవ।ని వాపుచుఁ జెప్పఁ చెప్పెదని మహాత్మా." సారంగ.],

బెస్తన్ = బోయను (జాత్యేకవచనము - బోయల ననుట, 'భారవాహకు పేరు పరఁగు మంచము బెస్తమోచరి బోయఁడు బోయి నాఁగ' - ఆం. ని. 288.), పిలువారు = పిలుచునట్టివారును;

**3.** నగరు వెల్వడుదాఁక = రాజగృహమునుండి వెలికిపోవునంతకు, తొలఁగిపోయి - ఒకరు నొకరు విడిపోయి, మఱి = వెల్వడిన యనంతరము, నిల్చి, తోడివిద్వాంసులఁ గూడువారున్;

**4.** ఎదురు అయిన (= ఎదురుపడిన) - తమవానిన్, గృహకృత్యము = తమ యింటిపనిని, అడిగి, వాఁడు, అనునవి = చెప్పునట్టి యుత్తరములను, తప్పన్ = ఒకటి చెప్పిన మఱియొకటిగా. ఊఁకొనెడువారున్ - 'ఊ' 'ఊ' అనుచు వినువారును;

వాదము ఏమి ఆయెన్ - వాదములో ఎవరు జయించినారు, అన్నన్ - అని ఎవరేనడిగి నంతట, భూవరుని = రాజునియొక్క - పక్షపాతము, ఆదాసరికిన్ = ఆ పాఁడు వైష్ణవునికి (దాసరి యనఁగా విష్ణుభక్తుఁడయిన శూద్రుఁడు, ఇట బ్రాహ్మణుఁడగు విష్ణుచిత్తుని ఇతరమతస్థులు దాసరి యనుట తిరస్కారసూచకము), కలిగి=కలిగినందున, బతికెన్ = (ఆదాసరి) మావాదములనుండి తప్పించుకొనెను, అనెడువారును, వేఁడెందు = వేఁడను లెండి, ఇటు, విమర్శ = విచారణ, సారము అయినవాకిటన్ = లేనిసారమందు, ఎవ్వాఁడు వసించును = ఎవఁడు నిలుచును, అను వారును, అనుచున్ - అయి.

ఓడిన పండితులు వాదమందయిన యోటమిదుఃఖముచే పెదవిమూలలను నాలుకతో మాటి మాటికి నాకుకొనుచు, తమ సేవకుని తమపాదరక్షలను చేత నుంచికొనియుండు వానిని, ఆస్థానివెలుపలి యరంగులమీఁద తమకై కనుపెట్టుకొనియున్నవానిని, తమ తత్తఱపాటులో చూడకయే దాఁటిపోయి, అక్కడ వెదకుచుండిరి; తమతబ్బిబ్బులో ఎట్టయెదుట నేయున్న తమయందలమును చూడక దాఁటిపోయి అక్కడ బిగ్గరగా బోయీలను పిలువఁదొడంగిరి; రాచనగరు వెలువడువఱకు తమతోడి పండితులను విడిపోయి అచటనిలిచి మరల కలసికొనిరి; కొందఱు తమయింటి వాఁ డెవఁడేని అగపడఁగా, వానిని యింటిపను లడిగి వానియుత్తరమును

స్తోత్రములును, ఏనుఁగులయు, గుఱ్ఱాలయు గంటలును, వేశ్యాయువతుల యందెలును మ్రోఁగుచుండఁగా, ఆదొరలును రాజకుమారులును అభక్తునివెంట ఇరుపార్శ్వములందును,గొలిచి పోవుచుండఁగా, నడిదారిలో (ఈవక్ష్యమాణము జరిగెను.). -వారకాంతలను గజేంద్రహయములతో చేర్చి చెప్పుటచే వారకాంతలు గజేంద్రగామినులును గజ్జలగుజ్జరిణులునుగా నుండిరని సూచన. మధ్యమధ్య సానిమేళములు వాడించుచు నడచిరనియు భావము.-రాజాదులను కూడఁ బంపుట అభక్తునియందలి భక్త్యతిశయముచేత. 'నిరంతరు' అనుటచే ఆవంగులే భక్త్యావేశ పారవశ్యముచే తెంపులేక గతించిరనుట.

'బడిఁకన్' - ప్రా. పా. 'బడికన్';- 'పురుగడ' - ద్విగుసమాసము.-'పురియేఁగించి'-ఊరేఁగించుట యనువ్యాపారమున 'ఊరు'నకుం బోలె ఇట 'పురి' కిం బ్రథమ అర్థభావనచేత వచ్చినది. ఇట్టిప్రయోగ ద్వితీయము కలదు. - పరమయోగివిలాసమున 3 (303)

క. 'నిను సేవకుఁడు నయుత్త మొంగుదుచు నారిప్రువకు భక్తితో మ్రొక్కి నుతిం
చుచుఁ దాను బల్లకి మోఁచుచు నేఁగించెన్ విభూతి శోభిల్లఁ బురిన్'.

ఇట 'పురిన్' సప్తమ్యర్థకము కాదగు. పరమయోగివిలాసముననే యిట్టిప్పట్టునం బ్రథమయుం గలదు.

గీ. 'మఱియునిజవైభవం బెల్ల మెఱసి తనదు। పట్టపేనుంగు మీఁదటఁ బెట్టి యూరిఁ
బురయి గలయ నేఁగింపఁ హరి సమ సు।నురలుగొలువఁ ద్విభవంబుఁ జూడవచ్చె.'4(35)

——*విష్ణుచిత్తునకు భగవంతుఁడు సాక్షాత్కరించుట*——

ఉ. ఇంగిలికంబునం దడిపి యెత్తు కసీసపు రెంటెమో యనన్
నింగి గరుత్పరంపరలనిగ్గున లేఁదొగ రెక్కె; నంత పి
సెం గలశాబ్ధిమీఁగడలజిడ్డెఱిఁగించెడు కమ్మగాడ్పు; దం
డం గడు మ్రోఁత; పెల్లురువడిం గని; రాఖగరాజు మూఁపునన్. ౧౦

ఇంగిలికంబునన్ = ఇంగిలీకమునందు, (ఇంగిలీకము కలిపిననీటియందనుట), తడిపి = తోఁచి, ఎత్తుకసీసపురెంటెమో = ఎత్తుచున్న నల్లనిబంట నేఁతవస్త్రమో, అనన్ = అనునట్లుగా, నింగి = ఆకాశము, గరు...నన్ - గరుత్ = (వక్ష్యమాణుఁడైన ఖగరాజుయొక్క) ఱెక్కల యొక్క ('గరుత్పక్షచ్ఛదాః పత్త్రం పతత్త్రం చ తనూరుహమ్' అమ.)-పరంపరల=పంక్తుల యొక్క - నిగ్గునన్ = ధాళధళ్యముచేత, లేఁదొగరు ఎక్కెన్ = లేఁతయెఱుపుం బొందెను. అంతన్ = వెంటనే, కలశాబ్ధి మీఁగడలజిడ్డు=పాలసముద్రపు మీఁగడలజిడ్డుస్పర్శను,ఎఱిఁగించెడు కమ్మగాడ్పు=తెలుపుచున్న తావిగాలి, పిసెన్=ప్రసరించెను. (అంతన్),కడున్ మ్రోఁత=గొప్ప ధ్వని,నిండెన్=పర్వెను. (అంతన్),పెల్లురువడిన్ - గరుత్మంతుని,(ఆజనులు) కనిరి. (అంతన్), ఆఖగరాజుమూఁపునన్ = ప్రసిద్ధుఁడయిన యాగరుత్మంతునిబుజములమీఁద ('గరుత్మాన్ గరుడస్తార్క్ష్యో వైనతేయః ఖగేశ్వరః' అమ.), తరువాతి కన్వయము. - ప్రథమపాదమున-'దడిపి యెత్తినసీసపురెంటెమో' అని పా.-ఆపాఠమునందు 'రెంటె'మనఁగా తేకు అని వ్యాఖ్య యున్నది.

వారటు పోవుచుండఁగా మధ్యదారిలో మహావిష్ణువు వారికి అభక్తునిమూలముగా దివ్యదర్శన మొసంగెను.దానివివర మెట్లనఁగా-మొదట ఆకాశము భగవద్వాహన మయిన గరుత్మంతుని

ఱెక్కల యొత్తుకాంతిచేత ఇంగిలీకపునీటఁ దడిపియెత్తుచున్న నల్లదుప్పటియో యన శేఁతయొఱుపుం బొందెను; పిమ్మట ఆయన ఱెక్కలగాలి వానియందలి పాలసంద్రపు మీఁగడలజిడ్డును వారి యొడళ్లకు ఇంచుకతగిలించుచు ఆపరిమళమును వారిమీఁదికి వీచెను. అతఁడు ఇంకను సమీపింపఁగా రింగని యా ఱెక్కలమ్రోఁత వినంబడం దొడంగెను. పిమ్మట అతఁడు కనులకుం దోఁచెను. ఇంకను సమీపగతుఁడైనంతట అతనిమీఁదఁ గూర్చున్న భగవంతుఁడు ప్రత్యక్షుఁడాయెను.

'ఎత్తు' అనుతద్ధర్మార్థకరూపముచేత క్రియ జరుగుచు నే యున్నదశ తెలుపఁబడినది; అందువలన ఆకాశమున క్రమముగా క్రిందినుండి పైకి అంతయును తొగరు పర్వె నని భా. పాల సముద్రపు మట్టమునుండి పైకి లేచుటవలన ఆయొఱుపు క్రిందినుండి పైకి పర్వినది.

'ఎఱిఁగించెడు' అనుటచేత విస్తారముగాఁ గాక ఇంచుకయే తగిలించెడు అని భా. – 'కమ్మ'-ఆజిడ్డు తావి గలది యనుట.-పద్యమందు క్రమముగా గరుత్మంతుఁడు దూరమునుండి వారి తావున పైకి వచ్చుటయు, పైనుండి క్రిందికి వచ్చి వారికి సమీపగతుఁడగుటయు తెలుపఁబడినవి. 'కసీసపు' - కసీసము అనఁగా నల్లనిది, దీనికి ప్రకృతి 'కాసీసము.' కాసీస మనఁగా మైలుతుత్తము; అది నలుపుగాన దీనికి ఈయర్థము వచ్చినది. ఆకాశమున వర్ణము కసీస మని మనుచ లోనుం గలదు:—

క. 'కుంజరకళభాంగ హయఘట। పుంజితమై వైరజులు పసింపుల లలమన్
మంజులకాంతిఁ గసీసపు। మాంజిష్ఠముఁబోలె గగనమండప మమరెన్'. 5 (42).

'పరంపరల' అనుటచేత ఱెక్కలను చాఁచి నింపుం బఱ్వుచున్నాఁడని భా. 'ఎక్కెన్' అని శబ్దరత్నాకర పా. దానికి పా. ఎక్కెన్-'వాలెన్' అని పూర్వపద్యమం దున్నతుమున్నర్థకము నకు 'ఎక్కెన్', 'వీచెన్' అను సమాపకక్రియలతో నన్వయము. 'జిడ్డు' - ఇది గరుత్మంతుని ఱెక్కలకు,అతఁడు సర్వదా పాలసముద్రపుమీఁగడలమీఁద శేషశాయిసన్నిధిలో వేచియుండుటచేత అంటుకొన్నట్టిది. దానినాడించుటచేత ఆజిడ్డును ఆపరిమళమును ప్రసరింపినవి. 'కలశాబ్ధి'-కలశము (రూ. కలసము) అనఁగా పాలకడలియొక్క యమృతమును పోసియుంచుటకై విశ్వకర్మచే సృజింపఁబడిన ఘటము,దానికి సంబంధించినది గాన కలశాబ్ధియనన పాలకడలి. 'పెన్దిరువడి' - ద్రావిడభాషయందు- పెరియ=పెద్దవాఁడైన - తిరు = శ్రీ = పూజ్యుఁడయిన - అడి = పాదముగలవాఁడు,- పెద్దపూజ్యపాదుఁడు అనుట- ఇది గరుత్మంతునికి పేరు, ఇట్లే ఆంజనేయునికి సిఱియతిరువడి యనిపేరు. 'రెంటెమాయఁగన్' - ఉత్ప్రేక్షాలంకారము: పద్యములో స్వభావోక్తియు స్ఫురించుచున్నది.

సీ. చివురుఁబోల్పుపదోయి జెందమ్ము లనఁ దార్క్ష్య
హస్తోదరముల దివ్యాంఘ్రు లమర,
నునుఁగప్పుమేనఁ దోఁచిన తటిద్ధామచ్ఛాయ
లీలఁ దాల్చుపసిండిచేల మెఱయ,
ప్రాలిన యోగివర్గము నిర్మలాంతఃక
రణములువోలె హారములు దనర,

సిరికిఁ బుట్టింటినెచ్చెలు లౌట మనవిక
చేసెనా మకరకుండలము లమర,

తే. శ్రితసితచ్ఛద వాత్యాభిహత పరాగ
వలయమండిత కల్పశాఖలొ యనంగ
శంఖచక్రాంచితోరుహస్తములు దనరఁ,
గమలేక్షణుండు చతుర్భుజుండు. ౧౧

(శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమగుటను కవి వర్ణించుచున్నాఁడు).-చివురుఁబోట్లపు రాయి తేనెకమ్మలు పనక్ - చిగురుటు పొట్లాలజంటలోని యొప్పుటామరలు అనునట్లుగా, తా ... లు - తార్క్ష్య = గరుత్మంతునియొక్క - ('గరుత్మాన్ గరుడస్తార్క్ష్యః' అమ.) - హస్త = చేతుల యొక్క - ఉపరములు = తలములయందలి - (అరచేతులయందలి అనుట) - దివ్యఅంఘ్రులు = లోకాతీతము లయిన పాదములు ('పదఙ్ఘ్రిశ్చరణోఽస్త్రియామ్' అమ.), అమరన్ = ఒప్పుచుండఁగాను;

మనోఁగప్పు తనక్ - నున్నని నల్లనైనామంచు, తో ... లీలన్ - తోఁచిన = అగపడిన - తత్ = ఆతార్క్ష్యునియొక్క - ఊర్ధ్వచ్ఛ మలెలన్ - మీఁదికిఁ బ్రసరించు కాంతియాయన [పా. తదస్వ - తత్ = ఆ - అస్వ = ప్రోఁతముయొక్క (వాహనమయిన గరుత్మంతునియొక్క యనుట - 'వాహనాం యాన్వ గ్రవ్థ హాయ నైన్ధవ సప్తయః' అమ.)]- ఛాయ = ప్రతిబింబముయొక్క ('ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః' అమ.), లీలన్ = విలాసముతోన్ = తాల్చునవిండిచేల - ధరించిన బంగారువలువ, మెఱయన్ = ప్రకాశించుచుండఁగాను,

వ్రా... వోలెన్ - వ్రాలిన = వచ్చి పైఁబడినవైన - యోగిసద్గణ = సంయముల సమూహముయొక్క ('బృన్దభేదా స్సమైర్వర్గః' అమ.) - నిర్మల = పరిశుద్ధములయిన - అంతఃకరణములు వోలెన్ = మనస్సులో యనునట్లుగా, హారములు = ముత్యాల పేరులు, ('హారో ముక్తావళిః' అమ.) తనరన్ - ఒప్పుచుండఁగాను;

సిరికిన్ = మహాలక్ష్మికి, పుట్టింటినెచ్చెలులు = పుట్టినిల్లయిన సముద్రమందలి యనుఁగుఁ జెలులు, ఔటన్ = అయినకారణమున, మనవికిన్ - ఏమో చెప్పుకొనుటకై, డాసెనో నాన్ = సమీపించినవో (సమీపించిన మకరములో)యనునట్లుగా, మకరకుండలములు = మకరాకారము గలవైన కర్ణాభరణములు, అమరన్;

శ్రి... లొ - శ్రిత = ఆశ్రయించిన - సితచ్ఛద = హంసలు గలది - ('హంసాస్తు శ్వేతగరుతః' - అమ.) - వాత్యా = సుడిగాలిచే (వాతానాం సమూహో వాత్యా)- అభిహత = తేపఁబడిన - పరాగ = పుష్పాదియొక్క - వలయ = చక్రముచేతను, మండిత = అలంకరింపఁబడినవియు నగు- కల్పశాఖలో = కల్పవృక్షకొమ్మలో, అనంగన్ = అనునట్లుగా, శం... లు = శంఖ = పాంచజన్యంబును - చక్ర = సుదర్శనమును ('శఙ్ఖో లక్ష్మీపతేః పాఞ్చజన్య శ్చక్రం సుదర్శనమ్' - అమ.)- అనువానిచే- అంచిత = ఒప్పుచున్న - ఉరు = గొప్ప-హస్తములు = చేతులు, తనరన్, కమలేక్షణుండు - కమల = పుండరీక (ములవంటి) - ఈక్షణుండు = నేత్రములు గలవాఁడైన, చతుర్భుజుండు = (నాలుగుచేతుల కల్గినయట్టి) నారాయణుఁడు,

తోఁచెన్ = ప్రత్యక్షుఁడాయెను. (౧౦ వ పద్యములో 'మూఁపునన్' అను పదము ఈ క్రియాపదముతో నన్వయించును.)

తార్క్ష్యుని మూఁపునం గూర్చుండియున్న శ్రీమన్నారాయణుని దివ్యపాదములను తార్క్ష్యుఁడు తన యరచేతులయందు మోచుచుండెను. పాదములు ఎఱుపులై యొప్పుని తామరసములవలె నుండెను. వానికి సుఖస్పర్శగా నతికోమలములై యొప్పినవియునై తార్క్ష్యుని అరచేతులు చిగుళ్ల పొట్లములవలె నుండెను. తార్క్ష్యుఁడు అరచేతులను ఆ దివ్యపాదములకు సుఖస్పర్శకై యట్లు గావించుకొనె ననుట.

తళతళని నల్లని తన (మేని) నిగ్గులో సువర్ణవర్ణుఁడైన తార్క్ష్యుని ప్రతిబింబము తోఁచుచున్నదా యన భగవంతునిమీఁది పీతాంబరము వెలుఁగొందుచుండెను.

భగవంతునిపై వ్రాలిన వైన యోగీశ్వరులపరిశుద్ధాంతఃకరణముల వరుసలలో యన భగవంతుని యురమునందు ఆణిముత్యాల హారములు వెలుఁగుచుండెను. ఒక్కొక్కముత్తెము ఒక్కొక్క యంతఃకరణమువలె నుండె ననుట, ఇత్యాది. సముద్రములోనే పుట్టినవగుటచేత శ్రీదేవికి పుట్టినింటి నేస్తాలగుటచేత ఆచారముచేత ఏమో మనవిచేసికొనుటకై చెవులఁ బట్టిన మకరములో యన మకరాకారము లయిన కుండలములు భగవంతునికర్ణములందు భాసిల్లుచుండెను. (వరములిచ్చునవయిన) దీర్ఘబాహువులు కల్పశాఖలవలెను, అంగుళీ శంఖచక్రములు హంసలవలెను సుడిగాలికి తిరిగిన పుష్పపు చక్రమువలెను ఉండెను.

నేత్రములు కమలములవలె నుండెను. ఈవిధముగా నాలుగు భుజములు గలవాఁడైన శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమాయెను.

ఇందు అంతటను ఉత్ప్రేక్షాలంకారము. 'చేల'-పోలికముగా హంసాదిగల కార్య మయిన ములోపము. మకరకుండలములు - మధ్యమపదలోపిసమాసము. గీతాదిలో-'శ్రితసితమున్' అని ఉపలబ్ధపాఠము. -అందు 'సితమహా' యనునది అప్రస్తుతాద్యపోహతి మగుటచే లేఖకాది ప్రమాదజనిత మయియుండునో? యనుతలంపున నాచే 'సితచ్ఛద' అని మార్పఁబడినది.

క. ఎప్పుడు హరి గని రమరులు
ముప్పదియును మూఁడుకోట్లు మునిఁ గనుఁగొనువా
రప్పుడు తత్కరములతో
విప్పిన గొడుగులును మింట వేగమ మొగిడెన్. ౧౨

మింటన్ = ఆకాశమందు, మునిఁ గనుఁగొనువారు = విష్ణుచిత్తునిఁ జూచుచున్న, ముప్పదియును మూఁడు కోట్లు అమరులు, — ఎప్పుడు = ఏక్షణమున, హరిన్, కనిరి = చూచినారో అప్పుడు = ఆక్షణమందే, తత్కరములతోన్ = వారి చేతులతోఁగూడ, విప్పిన గొడుగులును = వారు విప్పి ధరించియున్న ఛత్త్రములును, వేగమ = అటులున, మొగిడెన్ = ముకిళితములాయెను.

ఆకాశమందు వచ్చి నిల్చి విష్ణుమతస్థాపకుని ఆవిష్ణుచిత్తుని కాంచుచున్న ముప్పది మూఁడు కోట్ల దేవతలును శ్రీహరి కనఁబడఁగానే తమ తాల్చియున్న గొడుగులను ముడిఁచి అంజలి చేసిరి. - సహోక్త్యలంకారము:—

నీరం...బు - నీరంధ్ర = దట్టమయిన (నిర్ + రంధ్ర = సందులేని = దట్టమయిన) - కుసుమ = పువ్వులయొక్క - ధారా ఆసార = తెంపులేని వర్షమందు ('ధారా సంపాత ఆసారః' అమ.) - చరత్ (పా. సరత్) = సంచరించుచున్న - చంచరీక = తుమ్మెదలయొక్క ('ఇన్దిన్దిర శ్చఞ్చరీకః' - అమ.) - సంకుల = కలగొనిన ('అథ సంకులం। పరస్పరాహతవచ స్యక్లిష్టే వ్యాకులే ఽపిచ' - నానా.) - కల = అవ్యక్త మధురమైన - ఝంకార = ఝుంఝుం ఝుమ్మనెడి ధ్వనిని, - అనుకారి = పోలిన (సామగానమునకు వికారము) - సంస్తవకారి = స్తోత్రములు చేయుచున్న ('స్తవః స్తోత్రం స్తుతి ర్నుతిః' అమ.) - మునిస్తోమ = నారదాదియోగిబృందముయొక్క - ('స్తోమః స్తోత్రే ఽధ్వరే బృన్దే' అమ.) - సామగానంబు = సామవేదముయొక్క పాట ('సామ క్లీబ ముపాయస్య భేదే వేదాన్తరేఽపి చ' అమ.), చెసఁగెన్ = ఒప్పెను.

ఆసమయమందు మహామునులు అచ్చోటికి వచ్చి భగవంతుని పర్యంచి సామగానము చేసిరి. దేవతలు పూలవానలు గురిసిరి. ఆగానము అప్పుడు ఆపుష్పవర్షములోని తుమ్మెదల ఝుంకారమునకు అనుకరణమువలె నుండెను.

'వేదానాం సామవేదోఽస్మి' - అనఁగా వేదములలో నేను సామవేదమును అని గీతలో భగవంతుఁడే చెప్పుకొనియుండుటచేత సర్వవేదశ్రేష్ఠ మయిన సామవేదమును, భగవంతుఁడు సామగానలోలుఁడౌటచేత, తత్ప్రీత్యర్థము భక్తిచే పాడిరనుట. తుమ్మెదలు ఎట్లు శ్రుతి హెచ్చించుచును, తగ్గించుచును శబ్దించునో, అట్లే మునులును గానములో శ్రుతి సారించుచుండిరనియు, ఎల్లతుమ్మెదల రావములను ఒకటేరావమైనట్లు ఎల్లమునులును ఒక రాగంబున నించిన సామము నేకమయముగను పాడిరనియు, సామ్యసంపద. ఆపాటలలో మాధుర్యముమాత్రమే గాక, తుమ్మెదలు సంకులముగాను స్తోమముగాను పాడుట సామ్యమును మఱియు సూచించుచున్నది.- ఉపమాలంకారము; వృత్త్యనుప్రాసము.

తే. అట్లు ప్రత్యక్షమైనపద్మాక్షు నంత
రిక్షమునఁ గాంచి, ముని ప్రమోదాశ్రుజలము
నిగుడఁ బులకించి, కరటిఘంటికలె తాళ
ములుగ నిట్లని యమ్మహాత్ముని నుతించె. ౧౫

అట్లు, ప్రత్యక్షమైన పద్మాక్షున్ = కనులకుం గోచరించిన శ్రీహరిని ('దైత్యారిః పుణ్డరీకాక్షో గోవిన్దో గరుడధ్వజః' అమ.), అంతరిక్షమునన్ = ఆకాశమందు కాంచి, ముని = విష్ణుచిత్తుఁడు, ప్రమోద అశ్రుజలము = ఆనంద బాష్పములు ('ముత్ప్రీతిః ప్రమదో హర్షః ప్రమోదామోద సమ్మదాః। స్యాదానన్దథు రానన్దః శర్మ శాత సుఖాని చ' అమ.), నిగుడన్ = ఉప్పతిల్లఁగా, పులకించి = గగుర్పాటుఁ గొని, కరటిఘంటికలె = ఏనుఁగుయొక్క ఘంటలనాదములే ('కరటో గజగణ్డే స్యాత్' మేది.- కరట మనఁగా ఏనుఁగుయొక్క గండస్థలము, అది కలది గావున ఏనుఁగు కరటి - ఘంటికాశబ్దమునకు లక్షణచేత తన్నాద మర్థము.), తాళములుగన్ = (స్తోత్రముం బాడుటలోని) కాలక్రియలయొక్క కొలఁత కాఁగా ('తాళః కాలక్రియామానమ్' అమ.), ఇట్లు అని - ఈవక్ష్యమాణ పద్యార్థములచేత, ఆమహాత్మునిన్ = పరమాత్మయైన యామహావిష్ణువును, నుతించెన్.

'కరటిఘంటికలె తాళములుగన్' - ఆమని ఏనుఁగు మెడలో వ్రేలుచున్న గంటలనే తాళముగా చేతులం దాల్చి వాయించుచు భగవంతుని స్తుతులు పాడెను - అనుట. ఆకరముల యందట్లే యున్నది:—

'తాళాన్ గృహీత్వా కరిరాజఘంటాః తన్మంగళాశాసనగేయ గానం.' దివ్యసూరిచ. 5 (69).

'ఈసాటి గీవిలాసకలోసిరు లింతవహించు నిగుణో
ద్భాసికి దృష్టిదోషములు దాఁకకపోవలె నంచుఁ బ్రేమపీ
యూసనువార్తిఁ దాళములుగా గజఘంటలు పూని మంగళా
శాసనమప్డు జెట్లనుచుఁ జల్వ మనోహరగానలీలలన్'. పరమయోగి. 4 (37).

'ఘంటికనె'-అని ఏకవచనపాఠమే పెక్కువ్రాఁతప్రతులయందు అగపడుచున్నది. కాని అది మూలమునకు విరుద్ధము.

—* విష్ణుచిత్తుఁడు శ్రీమహావిష్ణువును స్తుతించుట. *—

కవిరాజ విరాజితము.

జయ జయ దానవదారణకారణ శార్ఙ్గరథాంగగదాసిధరా,
జయ జయ చంద్రదినేంద్రశతాయుత సాంద్రశరీరమహః ప్రసరా,
జయ జయ తామరసోదరసోదర చారుపదోజ్ఝితగాంగఝరా,
జయ జయ కేశవ కేశినిషూదన శౌరి శరజ్జలజాక్ష హరీ. ౧౬

దా...రా- దానవ=అసురులయొక్క- ('అసురా దైత్య దైతేయ దనుజేన్ద్రారి దానవాః' అమ.)- దారణ = చీల్చుటకు (సంహారమునకు) - కారణ = కరణములయిన (సాధనములయిన- 'కారణం ఘాత నే హేతౌ కరణే'-హైమ.) - శార్ఙ్గ = (శృంగ)ధనుస్సు ('చాపః శార్ఙ్గం మురారేస్తు'అమ.)-రథాఙ్గ=(సుదర్శన) చక్రము ('చక్రం రథాఙ్గమ్' అమ.)-గదా—(కౌమోదకి యనెడి) గదియయు- అసి = (నందక మనెడు) కత్తియు - వీనియొక్క (వీనిని) - ధరా = తాల్చువాఁడా, జయజయ = సర్వోత్కృష్టుఁడవు గ మ్మందుము. [అతిశయముచేత రెండు మారులు చెప్పుట]; చంద్ర - చంద్రులయొక్కయు, - దినేంద్ర= సూర్యులయొక్కయు-శత- నూరులయొక్క- (నూఱులకొలఁది)- అయుత = అయుతములవంటి (అయుత మనఁగా పదివేలు) - సాంద్ర = దట్టమయిన- శరీర = దేహముయొక్క, మహః= తేజస్సుయొక్క- ('మహః స్తూత్సవ తేజసోః' - అమ.) - ప్రసరా = వ్యాప్తికలవాఁడా, జయజయ. తా ... రా - తామరస = పద్మముయొక్క- ('తామరసం పద్మే తామ్రే కాఞ్చనయోరపి' - మేది.) - ఉదర=లోపలనిక, సోదర = తోఁబుట్టువైన (అనఁగా తత్తుల్య మయిన) - చారు = అందమయిన - పద=అడుగు చేత,ఉజ్ఝిత = వెలువరింపఁబడిన - గాంగ=గంగాసంబంధియైన-ఝరా=ప్రవాహముకలవాఁడా, జయజయ; కేశవ=బ్రహ్మశివులకు ఉత్పత్తికారణమైనవాఁడా-[కః= బ్రహ్మ - ఈశః = శివుఁడు- కేశౌ = బ్రహ్మశివులను - వాతి = పొందువాఁడు, - వాగతౌ. - ('శంభోః పితామహో బ్రహ్మా పితా' అని పద్మపురాణములో మహావిష్ణువర్ణనము), కేశి - నిషూదన = కేశి (యనురక్కసుని)

సంహరించినవాఁడా, శౌరి = శూరుఁ డనువాని వంశమునఁ బుట్టినవాఁడా, శరత్ జలజ అక్ష = శరత్కాలంపుఁ గమలములవంటి నేత్రములు గలవాఁడా, హరీ = నారాయణుఁడా;

దానవులను సంహరించుటకు సాధనము లగు చాప చక్ర గదా ఖడ్గములు ధరించువాఁడా, చంద్రసూర్యుల నాయుతకోటులఁదియుయుతముల కాంతితో సమాన మయిన దేహకాంతి గలవాఁడా, గంగానదికి జన్మస్థానమయిన యడుగుఁ దామరగలవాఁడా, బ్రహ్మశివులకు మూలమైనవాఁడా, కేశియను దానవుని సంహరించినవాఁడా, శూరుఁడను యాదవుని వంశమున జనించినవాఁడా, శరత్కాలంపుఁ దామరలవంటి నేత్రములు కలవాఁడా, పాపమును హరించువాఁడా, నీవు సర్వోత్కృష్టుఁడవుగా నుండుము.

'ధరా' 'ప్రసరా' ఇత్యాది సంబుద్ధి దీర్ఘములచేత ఈపద్యము తెలుఁగేగాని సంస్కృతము గాదని తెలియ నగుచున్నది. అట్లుండఁగా, 'జనా' అనునది మాత్రము తెలుఁగుకవులు ఇట్టి స్తోత్రములందు వాడిన సంస్కృతపదము - ఇందు ద్వితీయపాదమున దండిమతమున అసమాతో పమ, పర్యవసానమున ఉత్ప్రేక్ష.

'సర్వపద్మ ప్రభాసారః సమాహృత ఇవ క్వచిత్
త్వదాననం విభాతీతి తా మభూతోపమాం విదుః.' దండి.

ఇది కవిరాజవిరాజిత వృత్తము, ఇందులకు అప్పకవిలక్షణము—

'రవి న జషట్క మొలంగ్ గవిరాజవిరాజిత మష్టవిరామ గిరిక్ల్' — నజ జజ జజ జవ గణములు - ౮, ౧౫, ౧౫. అక్షరములయందు యతులు. ఈపద్యము మనుచరిత్రమందునుం గలదు. గతి ఒకటియే.

—*మత్స్యావతారము*—

మ. దివిజద్వేషి నుదారవారిచరమూర్తిం ద్రుంచి, చాతుర్య మొ
ప్ప వడిం జోకపుఁదెల్లకోచుగమి దంభం బొంద మైఁ దాల్చి, వే
దవిశుద్ధాక్షరపఙ్క్తిఁ గ్రమ్మఱఁగ వేధం జేర్చెదో నాఁగ, న
ద్భువనం బబ్ధిసితాంబుబిందు లలమం బ్రోద్యద్రుచిద్యోటవే. ౧౭

దివిజద్వేషిన్ = సురశత్రువగు సోమకుని, ఉ...మ్ - ఉదారః=గొప్పదైన ('ఉదారో దాతృ మహతోః' - అమ.)-వారిచర=మీనముయొక్క - మూర్తిన్ = దేహముచేత ('స్త్రియాం మూర్తి స్తను స్తనూః' అమ.) - ద్రుంచి = చీల్చి, చాతుర్యము = నేర్పు, ఒప్పన్ = తగియుండఁగా- జోకపుఁదెల్లకోచుగమి దంభంబు ఒంపన్ = చతురమైన తెల్లని పోలసుల సమూహముయొక్క మిషకలుగునట్లుగా ('కపటోఽస్త్రీ వ్యాజ దంభోపధయ శ్ఛద్మ కైతవే' అమ.), మైన్ = (నీ) దేహమున, తాల్చి = ధరించి, వేదవిశుద్ధ అక్షరపఙ్క్తిన్ = వేదములయొక్క తెల్లనైన వర్ణముల వరుసను, - వడిన్ = శీఘ్రముగా, క్రమ్మఱఁగన్ = మరల - వేధన్ చేర్చెదో నాఁగన్ = బ్రహ్మకు కొనిపోయి యిచ్చెదవో యనునట్లుగా, తద్భువనంబు = ఆబ్రహ్మయొక్క లోకమును ('అథో జగతీ లోకో విష్టపం భువనం జగత్' అమ.), అబ్ధిసిత అంబుబిందులు = సముద్రముయొక్క తెల్లని ('అవదాత స్సితో గౌరో వలక్షో ధవళోఽర్జునః' అమ.) నీటిబొట్టులు, అలమన్ =

ఆప్రవాహముచే వివశములై కొట్టుకొనివచ్చి గుహలవంటి నీపుక్కిళ్లలోనికిఁ జొచ్చి, నీవు నీ పుక్కిళ్లలోనే పిమ్మటికై పదిలముగా నుంచుకొనియున్న బ్రహ్మాండమునందే దాఁగియుండఁగా, ఆమొరయుట ఆవేదగ్రహణసోమకాసురసంహారసూచకజయమునకైన దుందుభి వాదనముగా నొప్పెనుగదా. — ఆబ్రహ్మాండధ్వానము చేత నీజయము ప్రకటమాయెనని భా. —

పూర్వము పర్వతములకు రెక్కలుండిన సమయము, ఇంద్రుఁడు వజ్రాయుధముచే రెక్కలను బడఁగొట్టఁ దొరంకొనఁగా, మైనాకాదిపర్వతములు సముద్రములో దాఁగి, తమ రెక్కలను గాపాడుకొన్న వనియు, పురాణకథ. ప్రస్తుత జలప్రవాహము ప్రళయసంబంధి యైనను శ్రీహర్యవతారమైన మహామత్స్యమును మత్స్యజాతిస్వభావోచితముగా దానికి ఎదురెక్కినదిగాని, ఆవెల్లి సర్వనాశక మగుటచేత, ఇతరమహామత్స్యములు అట్లు ఎదురు పోలేవాయెను సరియే గదా, అవశములై దానితోఁగూడఁ గొట్టుకొని పోయినవాయెను;-అని స్వభావోక్తి. జలప్రకటనరూపక్రియార్థమై అజాండమునకు దుందుభిరూపపరిణామము చెప్పినందున పరిణామము.

తద్గతత - పా. (1) గదత, (2) గ్రక్కు. ఈపద్యము మనువులోను గలదు.

చ. మితి గడవం దిమింగిలము మెయ్యగు మేనఁ బెంచిన న్నిదు నాభి నుం
డి నిలత పలాశియైన చిఱుఁజేఁ పది యెట్లు నీవు మ్రింగఁగలవు?
శ్రుతు లగునూరుపు ల్మగుడఁ జొచ్చుతఱిన్ స్వనదేహవృద్ధన
ధృత జవశక్తి నీడ్చికొని తెచ్చుటకాక తదల్పతాల్పతన్. ౧౯

తిమింగిలతన్ = మహామత్స్యత్వమును - (మహామత్స్యమూర్తిని అని భావము), -తిమింగిలాది స్వరూప మిట్లు చెప్పఁబడి యున్నది. —

'అస్తి మత్స్య స్తిమి ర్నామ శతయోజన మాయతః,
త న్నిగిళతి మత్స్యస్తు తిమింగిల ఇతీరితః,
తిమింగిల గిలోఽప్యస్తి తద్గిలోఽప్యస్తి రాఘవ.'

మితిగడవన్ = కల్పము ముగియఁగా, మెయ్యయిన్ = అవలీలగా, పెంచిన (నీవు), నీదునాభిన్ = నీనోటిలోపలికి, కుత్సిత పలలాశి యైన చిఱుఁజేఁప అది - ప్రముక్కుడిచిక్కనుచేయిన యాచిన్న చేఁప ('పలాశీ వృత్తిః రక్షసాం' మేది. - 'పిశితం తరసం మాంసం పలలం క్రవ్య మామిషమ్', 'స్యాచ్ఛామిషే పలమ్' అమ.), త్రెళ్లుట - తిరుగుట, ఏమనఁగా?, శ్రుతులు అను ఊరుపుల్ - వేదము లనెడు (నీ) నిశ్వాసములు ('శ్రుతి స్త్రీ వేద ఆమ్నాయః' అమ.), మగుడన్ చొచ్చు తఱిన్ = మరల నీ నోటం బ్రవేశించునప్పుడు, స్వ... క్తి - స్వవన్ = నీయొక్క - ఏధనవృధన = ఒక్కొక్క పెంపుచేతను (పెరిఁగిన కొలఁదియు)-ఏధిత = పెంపఁబడిన ('ఏధ వృద్ధౌ' ధా.పా.)- జవ = వేగముయొక్క ('రంహ స్తరసీ తు రయః స్యదః జవః' అమ.) - శక్తిన్ = బలముచేత, త...తన్ - తత్ = ఆపలలాశియొక్క-అల్పతాల్పతన్ - మఱియు మఱియు చిన్నదగుటచేతను, ఈడ్చికొని తెచ్చుటకాక = నీనోటిలోనికి బలాత్కారమున కొట్టుకొని వచ్చుటగా నున్నదిగాని, నీవు, మ్రింగుటే = మ్రింగుట యేమోగాదు (ఏకారము ప్రశ్నార్థకము).

ప్రళయకాలమందు నీవు నీతిమింగిలమూర్తిని అపరిమేయముగా అవలీలగా పెంచుకొన్నవాఁడవై, మహావిపులమైన నీనోట వేదచోరకుని సోమకుని ఒక చిన్నచేపంబోలె మ్రింగుట ఎట్లుండెననఁగా-మ్రింగుటవలె నుండలేదు, వాఁడు చోరించిన వేదములైన నీయూర్పులు నీవు మహత్తరముగా పెరిఁగిన కొలందియు ప్రవాహవేగము హెచ్చినవై మరల నీనోరం బ్రవేశించునప్పుడు వానినిగూడ నీనోటిలోనికి కొట్టుకొనివచ్చుటగా నుండెను. వేదములు భగవంతుని తొలియూర్పులనుండి వెడలెనని పురాణములందు ప్రసిద్ధము. 'తస్మాత్తేఽపానాత్త్రయో వేదాఅజాయన్త' అని శ్రుతి.- సాపహ్నవోత్ప్రేక్షాలంకారము. - 'మెయిమెయి' అనునది 'చెట్టుము' అనునట్టి సయందుంబోలె ఇత్వలోపముచేత 'మెయ్మెయి' అని అయినది.- 'మెటిమగల్బలంబెసఁగె మెయ్మెయి మార్కొనలేక పాఱనే' ఇత్యాది ప్రయోగములు నిర్వచనోత్తరరామాయణ భాగవతాదులందు కలవు.

—* కూర్మమూర్తి. *—

మ. జలపూరప్లవమానమృన్మయమహీసంరక్షకై గార యీ
పలె ముక్తామణిశుక్తిశంఖనికరంబుల్ చూర్ణంబుగా
బలభిద్వజ్రసమానపృష్ఠతటిభ్రామ్యన్మహామందరా
చలసంఘృష్టఘనపృష్ఠు నైన కమఠస్వామి న్నినుం గొల్చెదన్. ౨౦

జల...క్షకై- జలపూర = నీటి ప్రవాహమందు ('పూరో జలప్రవాహేస్యాద్ వ్రణసంశుద్ధి భక్ష్యయోః' - మేది.) - ప్లవమాన = తేలుచున్న-మృన్మయ = మట్టియొక్క వికారమైన - మహీ - భూమియొక్క - సంరక్షకై - కాపాడుటకొఱకు, గారయీఁబలెన్ = గచ్చుచేయుటకో యనునట్లుగా, ముక్తా...లు - ముక్తామణి = ముత్తెము లనెడి మణులు-శుక్తి=ముత్తెపుఁజిప్పలు-శంఖ - శంఖముల (అను వీనియొక్క) - నికరంబులు - సమూహములు ('స్త్రియాం తు సంహతిర్బృన్దం నికురుమ్బం కదమ్బకమ్' అమ.), ఎల్లన్ - సమస్తమును, చూర్ణంబుగాన్ = నున్నమగునట్లుగా ('చూర్ణాని ధూలిక్షారభేదే' మేది.), బల...ము- బలభిత్ = ఇంద్రునియొక్క - వజ్ర = వజ్రాయుధముతో - సదృక్ సమానమైన నిజపృష్ఠ = తనవెన్ను పైభాగమందు- పరిభ్రామ్యత్ - తిరుగుచున్న - మహాత్ - గొప్పదైన - మందరాచలము = మందరపర్వతముతోడి-సంఘృష్ట= ఒరయికకు. - ఘట్టము - (క్రంది తిరుగట ('సంఘట్టశ్చతుష్పాషాణోఘర్షణే' అని నైషధ వ్యాఖ్య.) - ఐన- కమఠస్వామికిన్ = తాఁబేటిదొరను ('కూర్మే కమఠ కచ్ఛపౌ' అమ. 'స్వామీ ప్రభువిశాఖయోః' మేది.), నినున్, కొల్చెదన్.

సాగరమథనకాలమందు ఆదికూర్మము వీఁపుపై మందరపర్వతము తిరుగుడువడుచుండుటయుఁ దానివలన ముత్తెములు ముత్తెపుఁజిప్పలు శంఖములును నున్నమువలె నలిగిపోవుటయుఁ జూడఁగా నెట్లుండెననఁగా, మట్టి మొత్తమయినభూమి నీటివెల్లిలో తేలుచుండుటచేత దినదినమునకు నాని కరఁగి పోవునే యని, స్థిత్యధికృతుఁడవైన నీవు శంకించినవాఁడవై, అట్లు కరంగనీక కాపాడుటకై భూమికి గారవూయుటకై, ఓస్వామీ, నీవు, కమఠరూపివై వజ్రాయుధమువలె కఠినమైన నీవీఁపున క్రింది తిరుగలిగా నుంచి మందరమును పైతిరుగలిగా చేసి ఆముక్తాశుక్తిశంఖములను నున్నముగా నూరించుచున్నావో యనునట్లుండెను. - ఉత్ప్రేక్ష.

ముక్తాఫలకిరీటంభములు నున్నమగుట ప్రసిద్ధము. 'బలభిద్వజ్రసదృక్' - అంతకఠినము కాదేని అది మందరపర్వతభారమునకును దానియొరయికకును ఆఁగదు. తాఁ బేటివీఁపుయొక్క కఠినత విదితమే. ఈపద్యమును మనువులో కలదు.

—* వ రా హ మూ ర్తి *—

చ. ఒకమఱి బుడ్డగింప విలయోదకము ల్పయి కుబ్బ, చిప్ప ద్ర
చ్చుకొని, మహాభ్రవీథిఁ జన, సూకరత న్మెయి వెంచి. వెండి క్రిం
దికిఁ గయిత్రావాలు తత్సలిలనిర్మలధార నదఃపరస్ఫుర
త్ప్రకృతికి నీ యజాండమును బంగరు ముంగఱఁగా నొనర్పవే? ౨౧

(స్వామీ నీవు)- సూకరతన్ = వరాహత్వమందు - మెయి = శరీరమును, పెంచి, ఒకమఱి = ఒక్కసారి, బుడ్డగింపన్ = ముట్టెతో [illegible]గింపఁగా, విలయోదకముల్ = ప్రళయజలములు, పయికిన్, ఉబ్బి = లేచి, చిప్ప = బ్రహ్మాండపు గుల్లను, ద్రచ్చుకొని = దుస్సి, మహాభ్రవీథిన్ = ఆ వెలుపలియాకాశమార్గమందు, ('అభ్రం మేఘు చ గగనే ధామఫదే చ కాఞ్చనే' మేది.), చనన్ = పోఁగాను, వెండి = మరల, క్రిందికిన్, క...రన్ - కయిత్రావాలు = వంపుగా వాలిపడుచున్న-తత్ సలిల నిర్మల ధారన్ = ఆనీటియొక్క స్వచ్ఛమైన పడుచున్న పరంపరచేత ('సలిలం కమలం జలమ్' అమ.-'ధారా పూః కాపి సేనాగ్రం పతదంబ్వా సంతతౌ' నానా.), అ...కిన్ - అదః = బ్రహ్మాండముకంటె- పర = [illegible]- స్ఫురత్ = ప్రకాశించుచున్న-ప్రకృతికిన్ = మాయకు, ఈయజాండమును = ఈబ్రహ్మాండమునే, బంగరు ముంగఱగాన్ - బంగారపు ముక్కుఱగా, ఒనర్పవే = చేసితివిగదా.

భగవంతుఁడు వరాహావతారమందు దేహమును మహత్తరముగా పెంచుకొని ప్రళయంపు నీటివెల్లిని ఒకమారు ముట్టెతో పొడిచి [illegible], ఆనీళ్లు ఆమీటినవేగముచేత మీఁది బ్రహ్మాండపుగుల్లను దుస్సి పైకి ఎగసి వంగి క్రిందికి పడుచున్నప్పుడు, ఆ తేటనీటి ధారతోడి యీ బ్రహ్మాండము సకలసృష్టికిం గారణభూతురాలై దానికి వెలి[illegible]యున్న ప్రకృతికాంతకు భగవంతుఁడు చేయించిపెట్టిన బంగారపు ముంగఱయా యున్నట్లుండెను.- ఉత్ప్రేక్షాలంకారము, అతిశయోక్త్యనుప్రాణితము.

ఇట 'ముంగఱ' అనునది - సన్నపాటి బంగారపుఁగాఁడకు కాఁడ కనఁబడనియట్లుగా సన్నముత్తెములు గ్రుచ్చి నడుమ పెద్దబంగారపుఁ బూసను గ్రుచ్చినదిగా నుద్దేశింపఁబడినది. 'నిర్మలధార' అనుటచేత సన్నముత్తెములు గ్రుచ్చినది యని లభించుచున్నది. కాఁడకుం బూసకుం జేర్చియు ముంగఱ యని వ్యవహారము; ప్రాధాన్యముచేత పూసకు మాత్రమె ఆవ్యవహారము కలదు.- '[illegible]ధర మాధుర్య భిక్షాగతిం బగుసుధా ఘుటిక నా ముంగఱ కుదురుపఱచి'-శృం. నై. బంగరుకాఁడకు ముత్తెములు గ్రుచ్చకయె పెద్దపూసగామాత్రము ఒకపెద్ద ముత్తెముం గ్రుచ్చుటయుం గలదు. ఇట బంగరుపూసగా చెప్పుటకుం గారణమే మన బ్రహ్మాండము బంగారుగ్రుడ్డు-

'అప ఏవ ససర్జాదౌ, తాసు వీర్య మపాసృజత్,
త దణ్డ మభవ ద్ధైమం, సహస్రాంశు సమప్రభమ్.' మనుస్మృతి.

'బుద్ధగించుట' వరాహచేష్ట - దానిని భగవంతుఁడు కావించుట ప్రళయజలమును తీర్చి భూమిని రక్షించుటకు. వశీకృతప్రకృతియైనభగవంతుని కాంతునిఁగాను, ప్రకృతిని తత్కాంతఁగాను, భావించుట ప్రసిద్ధము; కాంతుఁడు కాంతకు నగలుచేయించి పెట్టుటయుఁ బ్రసిద్ధమే. 'మెయివెంచి'- ఒకమాఱు బుద్ధగించినమాత్రాన ప్రళయజలమెల్ల ఎగిరిపోవునంతటి మహత్తరరూపమును వరాహభగవంతుఁడు దాల్చెనని భావము.- 'బుద్ధగించుట' - బుద్ధవలె అనఁగా తోరంపుమొత్తముగా లేచునట్లు పొడిచి యెత్తుట. - 'మహత్' అనుటచే బ్రహ్మాండమునకు లోనిదైన యాకాశము గాదు, వెలుపలిది అని భావము. మనువులోని సూకరావతారవర్ణనము దీనిం బోలియున్నది.

—*నృసింహమూర్తి*—

మ. అసురేంద్రాశయకుండికాసృగుదధిన్ వ్యాప్తిస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్చేష్టన్ సముద్దామదీ
ర్ఘసటాఝాటముఁ బెల్లగించుగతి నాంత్రశ్రేణిఁ గిన్కన్ వెరం
జు సితక్రూరభవన్నఖావళులు ప్రోచు న్మర్త్యపంచాననా. ౨౨

మర్త్యపంచాననా = ఓనరసింహా - ('మనుష్యా మానుషా మర్త్యా మనుజా మానవా నరాః' - 'సింహో మృగేన్ద్రః పఞ్చాస్యః' - అమ.). అసు...డుకన్ - అసురేంద్ర=దానవరాజయిన హిరణ్యకశిపునియొక్క-ఆశయ-హృదయ మనెడు ('ఆశయో స్థాన తాత్పర్యే' నానా.- లక్షణచేత తాత్పర్యస్థాన మగు హృదయము నని చెప్పుచున్నది) - కుండికా = కుండమునందలి ('కుణ్డం పిఠరే గోయాన్తరే ఔ శేఽపి చ వహ్నికుణ్డే చ' - నానా. అచ్ఛ = తేటయయిన - రుధిర = నెత్తుటియందు-వ్యాప్త-వ్యాపియున్న-స్వక = తనదైన ('స్వో జ్ఞాతా వాత్మని స్వం త్రి ష్వాత్మీయే స్వోఽస్త్రియాం ధనే' అమ. స్వ ఏవ స్వకా.)-ఛాయ = ప్రతిబింబమును ('ఛాయా సూర్యప్రియా కాన్తిః ప్రతిబిమ్బ మనాతపః' అమ.) - కాంచి - చూచి, స...ష్టన్ - సముద్యత్ = (తన)మీఁదికి వచ్చుచున్న - ప్రతిసింహ - వైరిసింహమనెడి-మత్సర = క్రోధముతో('మత్సరా మక్షికాయాం స్యా న్మాత్సర్యే క్రోధవైరయోః పుమాన్' మేది.) - మిళత్ - కూడుకొన్న, చేష్టన్ = వ్యాపారముగా, త...ము - తత్ = ఆప్రతిసింహముయొక్క - ఉద్దామ = ఉత్కటమయిన - దీర్ఘ = నిడుదలైన - సటా = జూలుయొక్క ('సటా జటా కేసరయోః' మేది.) - ఝాటమున్ = సమూహమును, పెల్లగించుగతిన్ = పెఱికివైచురీతిగా, ఆం...ణిన్ - ఆంత్ర = ప్రేవులయొక్క- ('అన్త్రం పురీతత్' అమ.) - శ్రేణిన్ = వరుసను, కిన్కన్ = కోపముతో వె...లు - వెరంజు = జన్నరుకొనుచున్న- సిత = తెల్లని- క్రూర = కఠినమైన ('క్రూరో నృశంస ఘోరోష్ణ కఠినాః' హైమ.) - భవత్ నఖ = నీగోళ్లయొక్క, ఆవళులు = పంక్తులు('వీథ్యాళి రావళిః పఙ్క్తిః' అమ.) - ప్రోచున్ = (మమ్ము) రక్షించును గాక.

నరసింహమూర్తి హిరణ్యకశిపునిగుండియం జీల్చి, ప్రేవులం బెల్లగించివైచుట యిట్లుండె ననఁగా, విశాలమును లోఁతు నయిన భగవంతునిచేష్టచేత చర్మాదిరూపయిన పైకప్పు ఎడలిన యాతని యాహృదయము ఒకనెత్తుటికుండ అనునట్లుగా నుండెను; అందునుండి భగవంతుఁడు ఆంత్రములం బెకలించి వైచుట, అందు తన ప్రతిబింబమునే తాఁ గాంచి, అది తనకు వైరిసింహ

మనియు తనమీఁదికి దుముక నుంకించుచున్నదనియు భ్రమసి దానిజూలును తాఁ జెకలించుట యనునట్లుగా నుండెను.

'కుండిక' యనుటచే హృదయముయొక్క విరివియు పెల్లును లోఁతును నెత్తుటిపెక్కువయు వానిచే అసురుని మహాబలాఢ్యతయు తెలియుచున్నవి. - 'అచ్ఛ' అనుట ఛాయాసిద్ధికి. - 'సముప్యత్' - తాను ఆరుధిరమున కభిముఖుఁ డైనప్పుడు తనఛాయయు తన కభిముఖ మగును. తా నెట్లు చేష్టించిన నదియు నట్లే చేష్టించును. - 'సిత' - ఉత్తరికాయము సింహమగుటచేత; నరుఁడుగా నే యుండిన ఎఱుపుగలిగి యుండును. 'క్రూర' యయ్యు సింహముగోళ్లగుటచేత. - ఉత్ప్రేక్ష - భ్రాంతిమదనుప్రాణితము.

ఉ. మునుము న్దెల్పును, దూఱఁదూఱ మఱి కెంపు, న్వెండియుం దూఱఁ గం
దనగా నుంగలనల్పుఁ, దోఁప నఖకోణశ్రేణిచే విక్రమం
బున వాఁ డుగ్రతఁ గొన్నయట్టి విలసన్మూర్తిత్రయీతేజముం
గొను లీల న్వివరించెనో యసురవక్షోభిత్తి మిథ్యాహరీ? ౧౩

మిథ్యాహరీ - ఓ మాయాసింహమా ('మృషా మిథ్యా చ వితథే' - 'సింహో మృగేన్ద్రః పఞ్చాస్యో హర్యక్షః కేసరీ హరిః' అమ.), మునుముఁ = మొదలమొదల. తెల్పును, మఱి = అనంతరము, దూఱఁదూఱఁ = చొచ్చినకొలందియు. కెంపుఁ = ఎఱుపును, వెండియుఁ = తూఱఁ = ఇంకను జొచ్చి పోఁగా, కందనగానుఁ = ఉండెడుకాయమునందు, కల (= ఉన్నట్టి), నల్పును, తోఁపఁ = అగపడుచుండఁగా, విక్రమంబునఁ = పరాక్రమముచేత, వాఁడు = ఆహిరణ్యకశిపుఁడు, ఉగ్రతఁ = భయంకరత్వముచేత, కొ...ముఁ - కొన్నయట్టి = అపహరించిన- విలసత్ = ఒప్పుచున్న- మూర్తిత్రయీ = మూర్తిత్రయముయొక్క (బ్రహ్మవిష్ణుమహేశ్వరుల యొక్క - 'త్రయీ త్రి వేద్యాం త్రితయే పురన్ధ్ర్యాం సుమతావపి' నానా.)- తేజముఁ = తేజస్సులను, కొనులీలన్ = మరలఁ బుచ్చుకొనుచున్నవో యనునట్లుగా, నఖకోణశ్రేణిచేన్ = గోటికొనల వరుసచే ('కోణో౽స్త్రే లగుడే కృణే' నానా.). అ...త్తి = - అసుర - హిరణ్యకశిపునియొక్క - వక్షోభిత్తిః = గోడవంటిదైన, రొమ్మును - ('భిత్తిః స్త్రీ కుడ్యమ్' అమ.). వివరించెన్ = చీల్చి తివిరెఁగదా.

ఆరొమ్ము జీల్చినపుడు తొలుత చర్మపుంగోత తెల్లఁగాను, దానివెంబడి మాంసము ఎఱ్ఱఁగాను, దానివెంబడి నుండెడుకాయము నల్లగాను, ఉండును గావున, నరసింహమూర్తి హిరణ్యకశిపుని రొమ్ముగోడను చీల్చినప్పుడు ఆవరుసను ఆవర్ణములు అగపడుట యెట్లుండె ననఁగా - ఆరక్కసుఁడు విక్రాంతుఁడై ఔద్ధత్యముచేత హరించి తనయందుంచుకొన్నవానిని- తెల్లని శివతేజమును, ఎఱ్ఱని బ్రహ్మతేజమును-మరల గోటికొనలచే కైకొనుటయో యన నొప్పారెను. - ఉత్ప్రేక్షాలంకారము.

—* వామనమూర్తి *—

మ. బలిదైతేయభయాంధకారభరితబ్రహ్మాండగేహంబులోఁ
పలఁదై మందెడుతత్ప్రతాపమయదీపజ్వాల డిందన్, గడుం

దలమై మింటికిఁ గ్రక్కున న్నెగయునుద్యత్తన్మహాచ్ఛాయ నాఁ
గలనీలాంగము శింశుమార మొరయంగాఁ బెంపవే వామనా? ౨౮

వామనా, బలి...పలన్ - బలి = బలిచక్రవర్తి యనెడు - దైతేయ = అసురునివలన, ('అసురా దైత్య దైతేయ దనుజేన్ద్రారిదానవాః' అమ.) - భయ = వెఱపనెడి-అంధకార = చీఁకటిచేత - భరిత = నిండిన- బ్రహ్మాండ - బ్రహ్మాండమనెడి- గేహంబులోపలన్ = ఇంటియందు, పైన్ = ఊర్ధ్వభాగమందు, మం...ల - మండెడి = వెలుఁగుచున్న, తత్ = ఆబలియొక్క- ప్రతాపమయ = తేజోరూపమయిన, దీపజ్వాల = దివ్వెముగ్గ, డింపన్ = ఆఱిపోఁగా, కడున్ = మిక్కిలి, దలమై = దట్టమై, మింటికిన్ = ఆకాశమునకు, గ్రక్కునన్ = తటాలున, నెగ...య - నెగయు = లేచునట్టి- ఉద్యత్ = పైకి లేచి పోవుచున్న (ఆఱిపోవుచున్న) - తత్ = ఆదీపముయొక్క- మహాచ్ఛాయ = గొప్పచీకటి, నాన్ = అనునట్లుగా, కలనీలాంగమున్ = ఒప్పుచున్న నల్లనిదేహమును, శింశుమారము = మొసలియాకృతినున్న, జ్యోతిశ్చక్రమునకు - ఉరయంగాన్ = రాచుకొనునట్లు, పెంపవే = వర్ధిల్లఁజేసితివి కదా.

ఓ వామనమూర్తీ! బ్రహ్మాండమనెడియింటిలో బలిచక్రవర్తివలనిభయమనెడియంధకారము నిండియుండఁగా, నీవు నల్లనిదేహమును క్రిందనుండి పై శింశుమారచక్రమువఱకును పెంచి వ్యాపించుట యెట్లుండె ననఁగా -ఆదానవుని ప్రతాపము-బ్రహ్మాండగేహములో ముల్లోకములపైని ప్రకాశించుచున్నట్టిది-ఉన్నట్టేయుండి యాఱిపోఁగా దాని క్రీనీడ పెంజీకటియై పైకిం బర్వెట యనునట్లుగా నుండెను. వామనవిజృంభణముచేత భయాంధకారము పోయి ప్రతాపనిర్వాణాంధకారము వ్యాపించె నని భా. - రూపకానుప్రాణితోత్ప్రేక్షాలంకారము.

'శింశుమారము'-శ్రీమన్నారాయణుఁడు నక్షత్రమండలములో మొసలియాకారపునక్షత్ర సంఘరూపమున యోగనిద్రం బొందుచున్నాఁ డని విష్ణుపురాణ శ్రీమద్భాగవతములందు చెప్పఁబడియున్నది. 'శిశూన్ మారయతీతి శింశుమారః ... శిశువులనుచంపునది.' రూ. శిశుమారః. 'శింశుమార' అను రూపమున అనుస్వారము పృషోదరాదిత్వముచే సాధ్యము. మదీయశృంగార నైషధవ్యాఖ్య 8. (28) చూ.

—* పరశురామావతారము *—

మ. శమితక్షత్త్రికళత్రనేత్రజలవర్షావేళ నీకే నైనా
సము క్రౌంచస్ఫుటతాపకాండకను ... జాఁగంగ నిర్జించి, వ
ర్షము రా నంచలు నంగ నేఁడుఁ జను నిచ్చన్నాటి తచ్చేష్ట నా
యమిఁ;దిర్యక్త్వత దా గతానుగతికం బౌఁగా కుఠారీ హరీ. ౨౯

కుఠారీ హరీ=గండ్రగొడ్డలికలవాఁడవయిన ('ద్వయోః కుఠారః స్వధితిః పరశుశ్చ పరశ్వధః' అమ.), శమి...ళన్ - శమిత = సంహరింపఁబడిన, క్షత్త్రి = క్షత్త్రియులయొక్క, కళత్ర = భార్యలయొక్క ('కళత్రం శ్రోణి భార్యయోః' అమ) - నేత్రజల = అశ్రువులచేతనైన ('అస్రు నేత్రాంబు రోదనం చాస్రమశ్రుచ' అమ.), వర్షావేళన్ = వర్షాకాలమందు (ఆయశ్రువులు వర్షములవలె నమితముగాఁ గురిసినందున ఆకాలము వర్షాకాలమువలె నుండె ననుట-

'స్త్రియాం ప్రావృట్ స్త్రియాం భూమ్ని వర్షాః' - అమ.) - నీకీర్తిహంసము = నీయొక్క విజయఖ్యాతి యనెడి హంస ('యశః కీర్తిః సమజ్ఞాచ' - అమ.). క్రౌం....షిన్ - క్రౌంచ = క్రౌంచపర్వతమునందు - స్ఫుట = స్పష్టమయిన, తావక = నీదైన, అంబకసుషిన్ = బాణంపు రంధ్రమునందు ('రన్ధ్రం శ్వభ్రం వపా సుషిః' అమ.), వానగాన్ = ఏఁగఁగా, ఈక్షించి = చూచి.వర్షము రాన్ = వానవచ్చినప్పుడు. ('వృష్టిర్వర్షమ్' - అమ.)- అంచలు = హంసలు, ఇచ్చన్ = మనస్సునందు, - తత్ = ఆకీర్తిహంసయొక్క చేష్ట = క్రౌంచ రంధ్రమార్గ గమన వ్యాపారము, నాటి = పాదుకొని (అనఁగా స్వాభావికమై), పాయమిన్ = వదలిపోకుండుటచేత, అంప = ఆదారినే, నేఁడున్ = ఇప్పటికిని, చనున్ = పోవుచున్నవి. తిర్యక్తతి - తిర్యక్ = కడుపును నేలవైపు పెట్టుకొని చరించు (నవైన పశుపక్ష్యాది) జంతువులయొక్క, తతి = సమూహము, తాను,గతాను గతికంబు = పోయినదానివెంబడిం బోవునది, కాఁగా = అగునుగదా.

ధనుర్విద్యలో శివశిష్యుఁడైన పరశురాముఁడు తనసహాధ్యాయియు శివపుత్త్రుఁడును ఐన కుమారస్వామితోడి పందెములో, క్రౌంచమనుపర్వతమును ఒక్క బాణమున తూఁటుపడ నేసెను. ఆతూఁటువలన అతని కోదండవిద్యాపాండిత్యకీర్తి వ్యాపించుటను కవి ఇట కీర్తిహంసము ఆరంధ్రముదారిని నిర్గమించుటగా వర్ణించినాఁడు; హంస తెలుపుగావునను- 'మాలిన్యం వ్యోమ్ని పాపే యశసి ధవళతా వర్ణ్యతే హాసకీర్త్యోః'- సా.ద. అను కవిసమయముంబట్టి, కీర్తియు తెలుపుగావున కీర్తిని హంసగాఁ జెప్పుట.;-'జలధర సమయే మానసం యాన్తి హంసాః' సా.ద.- అనఁగా- 'వర్షాకాలమందు హంసలు మానససరోవరమునకుం బోవును. అనియు, కవిసమయము;-'వీరః క్రౌఞ్చస్య భేదాత్ క్షితధరణితలాపూర్వహంసావతారః' మహావీర. - "హంసద్వారం భృగుపతియశోవర్త్మయత్ క్రౌఞ్చరన్ధ్రమ్" మేఘసం. - ఇత్యాదివ్యవహారముచేత హంసములు క్రౌంచరంధ్రము మార్గముగా రాకపోకలు గావించుననియు కవిసమయము.-వీని నెల్ల నిట నను సంధింపవలయును.) 'ఓ పరశురామమూర్తీ, తిర్యగ్జంతువులు స్వతంత్రమార్గముల నవలంబింపక, పోయినదాని వెంబడినే పోవునవి. అట్లే మున్ను నీకుఠారముచే నిహతులయిన రాజన్యులకై తద్భార్యలు వెల్లుగా నేడ్వఁగాఁ గల్గినతదీయబాష్ప ధారావర్షములు గురియుచుండినకాలమనెడు వర్షాకాలమందు నీకీర్తిహంస క్రౌంచరంధ్రమార్గమున వెడలుటంబట్టి హంసజాతి యిప్పటికిని వానలు రాఁగానే ఆక్రౌంచరంధ్రమార్గముననే చనుచున్నవి. ఓస్వామీ: నీవు బాల్యముననే లోకోత్తరమహావీరుఁడవై పిమ్మట దుష్టక్షత్రియ సంహారముం గావించినదేవుఁడవు; కావున నిను గొల్చెదను'- అనిసారాంశము - సంపకానుప్రాణితమైన హేతూత్ప్రేక్షయు సామాన్యముచే విశేష సమర్థన రూపమయిన యర్థాంతరన్యాసంబునుం గలవు.

వర్షాశబ్దము ఆ. స్త్రీ. నిత్యబ. వర్షర్తువాచకము;వర్షశబ్దము. అ.నపుం. వానకు వాచకము; హంసము - యా.హంస. కా- కళ. అవ్య. కదార్థకము.

—* శ్రీ రా మా వ తా ర ము *—

మ. పవిధారాపతనంబుఁ గైకొనని యవ్వేలస్వ్యమై సత్త్వధా
తువులం దూఱు పరిశ్రమంబునకు నుద్యోగించె నా; సత్త్వసా

లవిభేదం బొనరించి నిల్వక సలీలన్ జన్న యుష్మన్మరు
జ్జవనాస్త్రం బొసఁగు న్సిరుల్ రఘుకులస్వామీ రమావల్లభా. ౨౬

రఘుకులస్వామీ = రఘువంశప్రభూ, రమావల్లభా = లక్ష్మీకాంతుఁడా, (శ్రీరాముఁడా యనుట), ప...బున్ = పవి = వజ్రాయుధముయొక్క - ధారా = వాదరలయొక్క - పతనంబున్ = పాటును (వ్రేటు ననుట), కై...లన్ - కైకొనని = సరకుసేయని (మైకి విశేషణము) - ఆపౌలస్త్య = ఆరావణునియొక్క - మై - దేహముయొక్క - సప్తధాతువులన్ = వస (= కడుపులో బొడ్డుక్రిందఁ ఉల్లి పొరవలెనుండు క్రొవ్వు) నెత్తురు మాంసము ఎముకలోని నేయి ఎముక మెదడు శుక్రము అనెడు ఏడుధాతువులను - (సకలదేహమును అనుట), దూఱుపరిక్రమంబునకున్ = దూర్చెడు నలవాటునకు, ఉద్యోగించెదనా యిదెరంగొనెనో యనునట్లుగా, స...బు - సప్త = ఏడైన - తాళ = (తాటి) చెట్లయొక్క - విభేదంబు = చీల్చుటను, బనరించి = జేసి, నిల్వక, సలీలన్ = క్రీడగా, చన్న...స్త్రంబు - చన్న = పోయిన - యుష్మత్ = నీయొక్క - మరుత్ = గాలివలె - జవన = వడిగలదైన - అస్త్రంబు = బాణము, సిరుల్ = సంపదలను, ఒసఁగున్ = ఇచ్చునుగాక.

రఘువంశమున శ్రీరాముఁడవుగా అవతరించిన యోమాధవా, ఇంద్రుని వజ్రాయుధంపు వాదరలవేట్లను సరకుగొనని దైన యారావణాసురుని దేహమందలి సప్తధాతువులను దూర్చి చీల్చెడు నేర్పును ముందుగా అలవాటు చేసికొనుచున్నదో యనునట్లుగా ఏడుతాటిచెట్లను ఒక్కుమ్మడి దుస్సి అటునిలువక వడిగా నేఁగుపడిన నీవాయువేగి బాణము సంపదల నిచ్చుఁగాక.

ఇట కిష్కింధాకాండములోని యీకథ ననుసంధించుకొనవలయును. - వాలిం గూల్చి సుగ్రీవునికి కపిరాజ్య మొసంగఁగల మహావీరుఁడని శ్రీరామునితో సఖ్యము చేయింప ఆంజనేయుఁడు యత్నింపఁగా, సుగ్రీవుఁడు రాముని బలమందు సందేహముగొన్నవాఁడై 'యీయన ఇదిగో ఈయేడు తాటిచెట్లను ఒక్కబాణమునం గూల్చినచో వాలిం గూల్చుపాటి బల్లిదుఁడని నమ్మెద' నని చెప్పఁగా, శ్రీరాముఁడు అట్లే అతనితార్కాణమై ఒకచే అలుగువ్రేటున ఆయేడు తాళములను గూల్చెను. ఆబాణము వానియందు నిలువక దూసిపోయి రసాతలమంటివచ్చి యాతని యంపపొదిం జొచ్చెను. సుగ్రీవునికి సిరులిచ్చుటయే భక్తులకెల్ల నిచ్చు ననుటకు తార్కాణము. ఉపాయము ఉపేయమునకు కొఱవడం గూడదు గావున, ఏడుధాతువులను దూయునదై ఏడు తాళములను దూయుట; రామబాణము అతిపవిత్ర మనుట; రావణునిం జంకలో నుంచుకొని జపముసేయువానిని గొట్టఁగలదైన బాణము ఆరావణుం గూల్చుటలో సందేహమా అని యానుషంగికము. 'సలీలన్' అనుటచే భగవత్స్వభావము సూచితము ఇందు ఉత్ప్రేక్షాలంకారము. పులస్తియొక్క గోత్రాపత్యము పౌలస్త్యుఁడు.

'వసాసృఙ్మాంసమజ్జాస్థి మేదశ్శుక్రాణి ధాతవః.' భావప్రకాశము.

ఇప్పద్యము మూఁడవ పాదములోని దుష్టయతితప్ప కడమయెల్ల మనుచరిత్రములోనిదే [6.110]; 'సలీలన్' అనుట యతిని సరిపఱుచుటకు. ఉత్ప్రేక్షాలంకారము.

సీ. (1) స్యందనస్థితబిడౌజఃకుత్సజాడ్యకృ
జ్జంఝామరుద్గరుజ్జ్వాత్కృతములు,

(2) క్రవ్యాశిరాడ్గాత్రకనదసృగ్గాహన
స్ఫుటశల్యహవ్యభుక్ఘూత్కృతములు,
(3) యోధవర్మితహృత్పుటోత్క్రాంతనిజపాత
సాలాశ్మకృతముహుర్ఘ్నాత్కృతములు,
(4) పతితోగ్రరక్షఃకబంధభారభృశార్తి
భుగ్నభోగఫణీంద్రఫూత్కృతములు,
తే. క్రాంతరథ్యనిరంతరచ్ఛాయదములు,
దివ్యతావకకార్ముకోత్ప్రేరితములు,
కలుషము లడంచుఁగాత లంకాపురాంగ
ణాంబరచలత్కలంబకదంబకములు. ౨౭

1. [దేవా = ఓ స్వామీ (శ్రీరామా)]- స్యం... లు - స్యందన = తేరియందు, స్థిత = ఉన్నట్టి, బిడౌజఃసూత = ఇంద్రసారథి యైన మాతలికి- జాడ్య = జడిమను (జడతను - బమ్మెరను) - కృత్ = చేయునట్టి- ఝుంఝా = తుపానువంటి- మరుత్ = గాలిగలదైన- గరుత్ = ఱెక్కలయొక్క, ఝాత్కృతములు = ఝాత్కారము అనఁగా ఝాత్ అనెడు మ్రోఁత గలవియు;

2. క్ర...లు- క్రవ్యాశి = రాక్షసులయొక్క - రాట్ = ప్రభువయిన రావణునియొక్క - గాత్ర = దేహమందు- కనత్ = వెలుంగుచున్న - అసృక్ = నెత్తుటిని- గాహన = చొచ్చుట చేత- స్ఫుట = స్పష్టమయిన- శల్య = అలుఁగుల- హవ్యభుక్ = నిప్పుయొక్క - ఘూత్కృతములు = ఘూత్ ఘూత్ అనెడు మ్రోఁతగలవియు;

3. యోధ = జోదులయొక్క - వర్మిత = కవచము గలిగిన - హృత్ = గుండియల - పుట = సంపుటమునుండి - ఉత్క్రాంత = దుస్సిన - నిజ = తమయొక్క (= తాము) - పాత = పాటుచేత (= పడుటచేత) సాల = ప్రాకారముయొక్క - అశ్మ = ఱాలయందు - కృత = చేయఁబడిన - ముహుః = తఱచైన - ఘ్నాత్కృతములు = ఘ్నాత్ అను శబ్దము కలవి;

4. ప...లు - పతిత = కూలిన- ఉగ్ర = భయంకరములైన - రక్షఃకబంధ = రాక్షసుల మొండెములయొక్క - భార = బరువుచేతనైన- భృశ = మిక్కుటమైన - ఆర్తి = పీడచేత - భుగ్న = మణిఁగిన- భోగ = పడగలుగల- ఫణీంద్ర = శేషాహియొక్క - ఫూత్కృతములు = ఫూత్ అనెడు ధ్వనులు (బుసలు) కలవియు —

క్రాం...లు - క్రాంత = దుస్సిన- రథ్య = తేరి గుఱ్ఱములకు- నిరంతర = దట్టము లయిన తమ యొక్క - ఛాయ = నీడను- దములు = ఇచ్చునవియు, (ఐన) - తా...లు - తావక = నీయొక్క - కార్ముక = వింటినుండి- ఉత్ప్రేరితములు = ప్రయోగింపఁ బడినట్టివి. లం....లు - లంకా = లంక యనెడి- పుర = పట్టణముయొక్క - అంగణ = ముంగిటియొక్క - అంబర = ఆకాశమందు- చలత్ = సంచరించుచున్న - కలంబ = బాణములయొక్క, కదంబకములు = సమూహములు, కలుషములు = పాపములను, అడంచుఁగాతన్ = పోఁగొట్టునుగాక.

'విడిది'-'విడియు'నకు కృ. 'ఆదిమపరుండు' = లోకమాతకు భర్త యయినందున ఆదిముఁడు. కౌస్తుభము సముద్రము ద్రచ్చినపుడు అందుండి యుద్భవించినపద్మరాగమణి, దానిని శ్రీహరి హృదయ మందుఁ దాల్చినాఁడు. 'వాదిత్రంబులు'-'తతం వీణాదికం వాద్య మానద్ధం మురజాదికం । వంశాదికంతు సుషిరం కాంస్యం తాలాదికం ఘనం । చతుర్విధ మిదం వాద్యం వాదిత్రాతోద్యనామకమ్' 'గుణిత రూషితే,'-అమ.

క. శర్వాణీ వాణీ ముఖ। గీర్వాణీకోటి జానకీరఘుకులరా
ట్పూర్వాచరిత వివాహా। ఖర్వ సుగీతములు పాడఁగా విభవమునన్. ౬౦

౬౦. శర్వా....టి-శర్వాణీ = మృడాని-వాణీ = సరస్వతి-ముఖ = మొదలుగాఁగల-గీర్వాణీ కోటి = అమరీసమూహము, జాన....లు-జానకీ = సీతాదేవియొక్కయు-రఘుకులరాట్ = రఘువంశపు రాజయిన శ్రీరామునియొక్కయు-పూర్వ = మున్ను-ఆచరిత = నెఱవేర్పఁబడిన-వివాహ = పెండిలి యొక్క-అఖర్వ = శ్రేష్ఠములయిన-సంగీతములు = మంచిపాటలు, పాడఁగా, విభవమునన్ = ఐశ్వర్యముతో (పై కన్వయము.)

తా.—శివా సరస్వత్యాది దేవాంగనాసమూహములు పూర్వము జరిగినసీతారాములవివాహ గీతములను పాడుచుండఁగా.—

తే. నెమ్మి నేకావళియు స్రగ్విణియును జామ। రంబు లిరుగెడ నిడ హారిద్రాద్రవమునఁ
బెట్టిరి నలుంగు లక్కన్యఁ బెండ్లికూఁతుఁ। జేయు ఋషిపత్ను లర్థి నాశీర్యుతముగ.

౬౧. నెమ్మిన్ = ప్రేమచేత, ఏకావళియున్ స్రగ్విణియున్ = ఆ పేర్లుగలవారైనయామె చెలికత్తెలు, ఇరుగెడన్ = రెండుపార్శ్వములయందును, చామరంబులు ఇడఁగన్ = వింజామరలు వీచఁగా, ఋషిపత్నులు = అరుంధత్యాదిఋషిభార్యలు, అర్థిన్ = కోరికతో, ఆశీర్యుతముగన్ = దీవెనలతోఁ గూడ, అక్కన్యన్ = ఆగోదాదేవిని, పెండ్లికూఁతుఁజేయన్, హారిద్రాద్రవమునన్ = పసుపునీటితో, నలుంగులు పెట్టిరి = ఉద్వర్తనములు గావించిరి.

తా.—ఏకావళీస్రగ్విణులు ప్రేమతో ఇరుగెడలను వింజామరలు వీచుచుండ, అరుంధత్యాది ఋషిపత్నులు ఆగోదాదేవిని దీవించుచు పసుపు నీళ్లతో నలుఁగులు పెట్టి పెండ్లికూఁతుం గావించిరి.

తే. అట్లు వైవాహికపుదీక్ష యమరఁ గమ్మ। నూనెఁ దలయంటి నెఱులు గందానఁ బులుమ
స్వర్ణమణికుంభ హిమవారి జలక మాడి। నట్టి జగదీశ్వరికి వేల్పు టబల యొర్తు. ౬౨

౬౨. అట్లు, వైవాహికపుదీక్ష = వివాహప్రయోజనకమయిన యారంభాచారము, అమరన్ = జరుగఁగా, కమ్మనూనె = పరిమళయుక్త మయినతైలముతో, తలయంటి = అభ్యంజనము గావించి, నెఱులు = తలవెండ్రుకలను, గందానన్ = శ్రీచందనముతో, పులుమన్ = రుద్దఁగా, స్వర్ణ మణి కుంభ హిమ వారిన్ = కనక రత్న మయ మయిన ఘటములందలి శీత లోదకములతో (పన్నీటితో నని యొండె), జలకము = స్నానము, ఆడినట్టి - జగదీశ్వరికిన్ = లోకనాయికకు, వేల్పుటబల = దేవాంగన, ఒర్తు (అవలి కన్వయము.)

క. తడి యొత్తిసన్నవలిపం। బిడి మణిపీఠస్థయైన యింతి మెఱుఁగు పె
న్నిడుదకురు లార్చి ధూపం। బిడి తుఱుము ఘటించె నొకమృగేక్షణ నెమ్మిన్. ౬౩

౬౩. ఒక-మృగేక్షణ = హరిణాక్షి, తడి, ఒత్తి = అద్ది, సన్న వలిపంబు = సన్నని వలువను, ఇడి = కట్టి, మణిపీఠస్థ = రతనంపుఁ బీటపై కూర్చున్నట్టిది,....ఆర్చి = తడియారంజేసి,....తుఱుము=

కొప్పు....[ఈచిన్నపద్యమున ఇడి అనెడి యొకటే పదము రెండుమార్లు ప్రయుక్తము. అట్లు చేఁత ప్రశస్యము గాదు.]

సీ. యావకద్రవమున నరుణాంఘ్రి నఖపంక్తు | లభ్యక్తములు సేసె నతివయొకర్తు
నయకల వ్రేళ్లమట్టియలుఁ బిల్లాండ్లిడి | పాయవట్టముఁ బెట్టెఁ బైనొకర్తు
నెతికపట్టి పసిండి నీటివ్రాఁత చెఱంగు | వెలిపట్టు రహిఁ గట్టె వెలఁది యొకర్తు
కటిసీమఁ గనకమేఖలఁ జేర్చి తారహా | రములు గీలించెఁ గంఠమున నొకర్తు
తే. కటకములు హస్తసరము లంగదము లంగు | ళీయకములును బాహువల్లికల వ్రేళ్ల
నిలిపి తాటంకనానామణుల సమర్చి | చొనిపె సీమంతవీథిఁ జేర్చుక్క యొకర్తు. ౬౮

౬౮. (1) అతివయొకర్తు, యావకద్రవమునన్ = లత్తుకనీళ్లతో, అరుణ అంఘ్రి నఖ పంక్తులం = ఎఱ్ఱని యడుగు గోరుల వరుసలను, అభ్యక్తములు = పూయఁబడినవానినిగా, [పారాణిపెట్టెననుట.]

(2) నయ కల = నయము కల = నాణె మయిన....మట్టియలును పిల్లాండ్లును పాదాంగుళ్యాభరణవిశేషములు, పాయవట్టము = అందె (అందె లనుట);

(3) నెతిక పట్టి = కుచ్చిళ్లు పెట్టి, పసిఁడి నీటి వ్రాఁత చెఱంగు వెలిపట్టు = బంగారు ద్రవంపుఁ జిత్తరువుపనిగలదైన చెఱంగుగల తెల్లపట్టు-చీరను.

(4) కటిసీమన్ = పిఱుందుమీఁద, కనక మేఖలన్ = బంగారపు మొలత్రాటిని,....తారహారములు = ముత్యాలసరములు, కీలించెన్ = తగిలించెను; కటకములు = చేతికడియములు, హస్తసరములు = చేగొలుసులు, అంగదములు = బాజిబందులు, అంగుళీయకములు = ఉంగరములు, బాహు వల్లికలన్ = తీవలవంటి బాహువులయందును, వ్రేళ్లన్ = చేతియంగుళులయందును, నిలిపి = పెట్టి, తాటంకనానామణులన్ = కమ్మలను బులాకిని, అమర్చి = సవరించి, సీమంత వీథిన్ = పాపట రేఖయందు, చేర్చుక్క = పాపటబొట్టు, చొనిపెన్ = పెట్టెను.

- - - 'యావోఽలక్తో ద్రుమామయః', 'పదఙ్ఘ్రిశ్చరణోఽస్త్రియామ్,' అమ. 'నయకల'-'ము'లోపము శిష్టప్రయోగముచే సాధువు. "తాటంకవాచకంబగుట గమ్మ యనఁగాను," ఆం. భా. "పాపట బొట్టు జిలిబిలిజల్లియుఁ జేరుచుక్క," ఆం. భా. "మొలనూ లనంగ నొప్పును గటిసూత్రాఖ్య | మంగుళీయంబగు నుంగర మన," ఆం. భా. "మను వీరమద్దె నా మట్టె యనఁగ | బిబ్బిలికాయ నాఁ బిల్లాణి యనఁ జెటి | బొద్దు నాఁగను గ్రమంబుగఁ బదాంగు | ళీవిభూషలు," ఆం. భా. "కచ్ఛభేదాభిధాన మెసంగుఁ | గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజ | చుంగు రింగు నెఱిక చింగు నెతి యనంగ," ఆం. భా.

క. కలికి తెలిగన్నుఁగనఁ గ | జ్జలరేఖలు దీర్చి మెన సారంగమదం
బలఁది లలామక మిడి చెం | గలువలు క్రొవ్వేదకు వేఱొకర్తు ఘటించెన్. ౬౯

౬౯. కజ్జల రేఖలు = కాటుక గీఱలు, సారంగమదంబు = కస్తూరి, అలఁది = పూసి, లలామకము = నొసటఁ గట్టెడుబాసికము, క్రొవ్వేదకున్ = కొప్పునకు.

"కజ్జలేఽఞ్జనమ్" నా. నా. 'మృగనాభిర్మృగమదః కస్తూరీ చ,' అమ. 'మృగ' = సారంగ; "లలామకము-'లలాటోపరి ముక్తాజాలవద్భానురమాల్యభేదే' S. C. అని బ్రౌణ్యము; 'పురోన్యస్తం లలామకమ్'' అమ.

వ. ఇట్లలంకృతయై యుండ లగ్నం బాసన్నంబయ్యె నని విన్నవించుటయుఁ బన్నగశ
యనుండు మార్తాండ మండలంబులు పంద్రెండును దివియలై వెలుఁగఁ, దారకల

గుంపు జగజంపుగా శతపత్త్రశత్త్రుండాతపత్త్రత యంగీకరింప, సింధుపతి సౌగంధికదళోపహారసహితంబుగా విపణిఁ గలయుంపిఁ జెలికింపఁ, బ్రకృతికాంత క్రంత సురకాంతలం గూడుకొని సంతరింప, హుంకవహుం డగరుధూపంబు రేఁపఁ, బర్జన్యుం డుల్లెడ యిడఁ, బ్రాచీనపాఠంబులు పాఠకౌఘంబు లయి బిరుదప్రబంధంబులు పఠియింప, విధినందన సనందనాదులు సంగీతమాంగల్యంబున నంతరంగంబున కింపొసంగ, విహంగపుంగవుండు నుత్తమాతంగంబై ఖచితమణికల్యాణం బగు పల్యాణం బంగీకరింప, నప్రాకృతవైభవంబునం జని, పరమసంభ్రమంబున భాగవతవతంసంబు భక్తికలితబహుప్రణామపూర్వకంబుగా నెదుర్కొన నెక్కిరింత డిగ్గి విష్వక్సేను కరం బవలంబించి కక్ష్యాంతరంబులం జంచలాక్షులు గడుగు నడుగుల జలంబులకుం బయి వయిం బడి గీర్వాణ సిద్ధసంఘంబు లహంపూర్విక నుర్విరార్వరిగా నూర్చికొని ప్రావేశింపఁ బ్రవేశించి తదీయ నిర్దిష్టం బగు జాంబూనదపీఠంబున నుపవిష్టుండై యతండు వెండియు బంగారుభృంగారుకంబులఁ గనకభాజననిక్షిప్తంబు లగు కుశేశయ పేశల పదకిసలయంబులు గడిగి షోడశోపచారసహితంబును సపరిష్క్రియంబు నగు మధుపర్కంబు నొసంగం గొని యయ్యాళ్వారు దేవేరియుం దానును ధారవోయు నా కన్యకారత్నంబుఁ బరిగ్రహించె ననంతరంబ. ౬౬

66-వ. జగజంపుగా=ప్రకాశమానమైన ముత్యాలజాలరుగా, శతపత్త్రశత్త్రుండు=చంద్రుఁడు ఆతపత్త్రతయంగీకరింపన్ = గొడుగుకాఁగా, సింధుపతి = సముద్రుఁడు, సౌగంధికదళోపహార = కహ్లారంపు రేకులకానుక, ప్రకృతికాంత = మాయయను నాతి, క్రంత = పెండ్లికొడుకువారు పెండ్లి కూఁతునకు తీసికొనిపోవు ప్రధానద్రవ్యసముదాయము, పర్జన్యుండు = మేఘుఁడు, ఉల్లెడ = మేలు కట్టు, ప్రాచీనపాఠంబులు = వేదములు, అప్రాకృత = అలౌకికసామాన్యమైన, ఎక్కిరింత = వాహనము, అహంపూర్విక = నేనుముందు నేనుముందు అని త్వరపడుచు, షోడశోపచారంబులు—ఆవాహన—ఆసన—పాద్య—అర్ఘ్య—అచమనీయ—స్నాన—వస్త్ర—యజ్ఞోపవీత—గంధ—పుష్ప—ధూప—దీప—నైవేద్య—తాంబూల—ఉత్తరనీరజన—మంత్రపుష్పములు.

మ. కలధౌతద్రవ చిత్రము ల్మెఱయ ముక్తాస్యూతమౌ మేచకాం
చలపుం బెందెఱ వారి లగ్నము సమాసన్నంబుగా వేల్పుఁ బె
ద్దలు వంపన్ గుడ జీరకంబులు సముద్యత్ప్రేమ నన్యోన్య మం
జుల హస్తంబుల నుంచి రర్థిఁ గనుమించుల్ చిట్టుముట్టాడఁగన్. ౬౭

౬౭. కల...ల్-కలధౌత = బంగారపు-ద్రవ = నీటియొక్క-చిత్రముల్ = చిత్రపుఁవ్రాఁతలు, మెఱయన్ = తళతళలాడుచుండఁగా, ముక్తాస్యూతము = ముత్తెములచేఁ గుట్టఁబడినది (ముత్యాలు కుట్టినట్టిది), మౌ-మేచక అంచలపున్ = నల్లని యంచులుగల-బెందెరన్ = పెద్దతెరను, వారి = పట్టి, లగ్నము = సుముహూర్తము, సమాసన్నంబు కాన్ = సంప్రాప్తింపఁగానే, వేల్పుఁబెద్దలు = దేవతలయందలి పెద్దవారు, వంపన్ = తెరను క్రిందికి దింపఁగా, అర్థిన్ = కోరికతో, సముద్యత్ప్రేమన్ = ఉప్పొంగుచున్న యనురక్తితో, కను మించుల్ = నేత్ర ధాళధళ్యంబులు, చిట్టుముట్టు ఆడఁగాన్ =

సందడింపఁగా, అన్యోన్య మంజులహస్తంబులన్ = ఒండొరుల మనోజ్ఞ కరములయందు, గుడజీరకంబులు = బెల్లమును జీలకఱ్ఱయును, ఉంచిరి = పెట్టిరి. ['మస్తకంబుల నించిరి'-పా. శిరములందు నిండుగా పెట్టిరని యర్థము.]

తా.—ముత్త్యాలు కుట్టినసల్లనియుంచులతోడి పెద్దతెరను ఆదంపతులనడుమ వేల్పుఁబెద్దలు పట్టుకొనియుండి, లగ్నము రాఁగానే క్రిందికి దింపిరి. అంతట నాదంపతులు ఒండొరులపై తమ చూపులు సందడింప ప్రీతిపెంపుతో ఒండొరులచేతులయందు (లేక పాదములయందు) జీలకఱ్ఱతోడి బెల్లమును ఉంచిరి. 'కలధౌతం రౌప్యహేమ్నోః,' అమ. గుడజీరకంబులు చేతియం దిడుటకు—

"గీ. అచట మణిపీఠమునను శ్రీహరి వసించు । సమయమున జంద్రకళ యతిసంభ్రమమునఁ
గనకభృంగారు గొని యుదకములు పోయఁ । గడఁకఁ బదములు గడిగి భూకాంతుఁ డపుడు,

"గీ. అర్చనలు చేసి, గంధమాల్యాదు లొసఁగి, । జీరకగుడంబు హరి వలచేతఁ దాల్చ,
వైఖరి నొసంగి, జలములు వార్వఁ జేసి, । యటు సుఖాసీనుఁ గావించినట్టియెడను.

చూ. చంద్రికాపరిణయము 6 (66)లో-గుడజీరకంబులను పెద్దలు వధూవరులశిరంబుల నుంతురని వివాహకల్పమం దున్నది. ఇందే 4 (151) చూ.

**చ. మఱి వనమాలి చూడమున మానిని ముత్తెపుఁబ్రాలు వోయుచో**
**మెఱయుఁ దదంగుళీకిసల మేళనఁ జక్రి చెమర్చ రాలి మై**
**వఱిముఱి ఘర్మబిందువులు నమ్మణులు న్మొగిలందునుండి డా**
**ల్గిఱిగొన జాలు ధారల బలె న్వడగండ్లబలె న్గనుంగొనన్.** ౯౮

టీ. మఱి = అనంతరము, మానిని = గోదాదేవి, వనమాలి చూడన్ = హరి శిరమునందు, మును = ముందుగా, [లేక వనమాలిచూడమునన్ = రంగనాథుని యూదలయందు], ముత్తెపుఁబ్రాలు = ముత్త్యాలతలంబ్రాలు, పోయుచోన్ = పోయునపుడు, అమ్మణులున్ = ఆముక్తాఫలములును, తత్.. నన్-తత్ = ఆదేవియొక్క-అంగుళీకిసల = చివుళ్లవంటి వ్రేళ్లయొక్క-మేలనన్ = తాఁకుడుచేత, చక్రి = రంగనాథుఁడు, చెమర్పన్ = చెమటం బొందఁగా, మైన్ = ఒడలియందు, అఱిముఱిన్ = దట్టముగా, రాలి = దేహమునుండి యూడి తొరఁగుచు, ఘర్మబిందువులున్ = చెమటబొట్టులును, అమ్మణులున్ = ఆతలంబ్రాలముత్తెములును, కనుంగొనన్ = చూడఁగా, మొగిలందునుండి = మేఘమునుండి, జాలు-ధారల బలెన్ = వానచినుకులవలెను, వడగండ్లబలెన్ = కరకలవలెను, డాల్ = తళుకు, గిఱికొనన్ = పర్వుచుండఁగా; మెఱయున్ = ప్రకాశించును.

తా.—గోదాదేవి రంగనాథునితలపై ముత్త్యాలతలంబ్రాలు పోయునప్పుడు ఆమెయొక్క చివుళ్లవంటిచేతులు ఆతనియూదలకు సోఁకఁగా, ఆస్పర్శప్రభావముచేత ఆతనిదేహము చెమర్చినది. అంతట ఆచెమటబొట్లును ఆతలంబ్రాల ముత్తెములు ఆతనియొడలినుండి క్రిందికి రాలినవిధమెట్లుండె ననఁగా, మేఘమునుండి వానచినుకులును వడగండ్లును రాలుటవలె నుండినది.-ఉపమాలంకారము.

'వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః,' అమ. 'శిఖాచూడాకేశపాశః' అమ. 'చూడమునన్' అనుపాఠమున మువర్ణమును సాధించుటకై చూడాశబ్దమును కంధరాదులందుఁ బఠించుకొనవలయును. ప్రాలు = బ. బియ్యము-దీనికేకవచనము ప్రాయి-హరి నల్లనివాఁడుగాన మేఘసామ్యము, స్వేదబిందువులు ద్రవరూపమున నుండునుగాన వర్షోదకబిందుసామ్యము, ముత్తెములు తెల్లగాను దృఢముగాను గుండ్రగాను ఉండుటంబట్టి కరకాసామ్యము.

తే. ఇంతి దోయిట సేసఁబ్రా లెత్తుచోట। గుబ్బపాలిండ్లక్రేవ గ్రక్కున మురారి
కన్ను వేయుటఁ గని లజ్జ గదుర బాహు। లెత్తక కరాగ్రములన పైకెగరఁజల్లె.

టీ. ఇంతి = ఆచెలువ, దోయిటన్ = దోసిటితో, సేసఁబ్రాలు = తలఁబ్రాలు, ఎత్తుచోటన్ = ఎత్తెడుసమయాన, గుబ్బ = వట్రువలైన-పాలిండ్ల-క్రేవన్ = పార్శ్వములయందు, గ్రక్కునన్ = తటాలున, మురారి = రంగనాయకుఁడు, కన్నువేయుటన్ = పాలిండ్లక్రేవఁ బొంచి గాంచుచున్నాఁడని, కని = ఎఱిఁగి, లజ్జ = సిగ్గు, కదురన్ = కలుగఁగా, బాహులు, (అతని శిరముమీఁదికి), ఎత్తక, కర అగ్రములన్ = చేతితుదలతోనే, పైకిన్ = అతని శిరముమీఁదికి, ఎగురన్ = ఎగిరిపోయి పడునట్లు, చల్లెన్.

తా.—ఆమె తలంబ్రాలదోసిటిని పై కెత్తినప్పుడు, చనుక్రేవలు చక్కఁగాఁ గనఁబడుంగాన, ఆసమయాన తటాలున వానిపైకి హరి చూడ్కి నిగుడ్పఁగా, ఆమె ఆకిటుకుం గని లజ్జచేత దోసిటిని పై కెత్తకయే అతని శిరముమీఁదికి ఆతలంబ్రాలను ఎగఁజిమ్మెను. ఇందు లజ్జయను సంచారిభావము చెప్పఁబడినది.

'సే స'-ప్ర. 'శేషా నిర్మాల్యదానేస్యాత్.' హైమ.

క. గళమునఁ గట్టెను హరి మం। గళ సూత్రము పులక లతివ గాత్రముఁ బొదువన్,
నెలఁతయుఁ బతియును గరముల। నలవఱిచిరి కంకణంబు లన్యోన్యంబున్. ౭౦

౭౦. హరి, అతివగాత్రమున్ = ఆయింతిదేహమును, పులకలు = గగుర్పాటు, అలమన్ = క్రమ్మునట్లుగా, గళమునన్ = ఆమెమెడయందు, మంగళసూత్రము, కట్టెను, నెలఁతయు = ఆచెలువయును, అన్యోన్యంబున్ = ఒండొరులకు, కరములన్ = చేతులయందు, (మనికట్లయం దనుట), కంకణంబులు = వివాహప్రతిసరములను, అలవఱిచిరి = కట్టిరి.

మంగళసూత్రము భార్యాభర్తలకు ఆయుఃప్రదము-"మాఙ్గల్యతన్తునానేన మమ జీవనహేతునా। కణ్ఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదః శతమ్" అని దానిం గట్టెడుమంత్రపర్యాయము.—కంకణము-వివాహదీక్షాతోరము-"కఙ్కణం కరభూషాయాం సూత్రమణ్డనయో రపి;" మేదిని.—మెడలోఁ గట్టఁగా భిన్నదేశమున గాత్రమునఁ బులకలు జనించుటచేత అసంగత్యలంకారము.

సీ. లలనచే నిష్ఠతో లాజలు వేల్పించి, శార్ఙ్గి మెట్టించెను సప్తపదులు।
తెఱవఁ గూడి యరుంధతీదర్శనముఁ జేసె, బ్రహ్మరుద్రాది గీర్వాణకోటి
యర్పించు నుడుగర లనుకంపఁ గైకొని। యనిచెఁ బ్రసాదభాజనులఁ జేసి,
యాత్మపట్టణమున కతివఁ దోడ్కొని విజ। యంబు సేసెను మహాహర్ష మొప్ప,
తే. సహ్యకన్యాతటోద్యాన చందనద్రు। కుంజముల నీలకుంతలఁ గుస్తరించి
కంతుసామ్రాజ్యమేలించి కరుణఁ జత్త। మొలయు జగములఁ బాలించుచున్నవాఁడు.

౭౧. శార్ఙ్గిన్ = హరి, లలనచేన్ = ఆలేమచేత, నిష్ఠతోన్ = నియమానుసారముగా, లాజలు = పేలాలను, వేల్పించి = హోమము చేయించి, సప్తపదులు మెట్టించెన్ = వివాహాగ్నిచుట్టును ఏడు అడుగులు తనవెంట నడిపించెను;

(2) తెఱవన్ = ఆయెల నాగను, కూడి, అరుంధతీవీక్షణము చేసెన్ = అరుంధతీనక్షత్రమును దర్శించెను; బ్రహ్మ రుద్ర ఆది గీర్వాణకోటి = పితామహుఁడు శివుఁడు లోనగు దేవసమూహము, (3) అర్పించు ఉడుగరలు = చదివించినట్టి కట్నములను, అనుకంపన్ = దయాపూర్వకముగా, కైకొని =

పుచ్చుకొని, ప్రసాదభాజనులఁ జేసి — వారిని అనుగ్రహమునకుం బాత్రులం గావించి, అనిచెన్ — వారి వారితావులకు అంపకము గావించెను, (4) అతివన్ = ఆయింతిని, తోడ్కొని = కూడంబెట్టుకొని, అతివైభవమ్మునన్ = మహాపరిభవముతో, ఆత్మపట్టణమునకున్ = తనపురమైన శ్రీరంగమునకు, విజయమ్ము చేసెన్ = ఏఁగుదెంచెను.

సహ్యకన్యాతట ఉద్యాన చందనద్రు కుంజముల నీడన్ = సహ్యపర్వతునికూతు రైనకావేరీ నదియొక్క తీరమండలి యారామములోనిచందనవృక్షములపొదలనీడలయందు, నీలకుంతలన్ = నల్లనితల వెండ్రుకలుగలదైనయాజాయను, కుస్తరించి = ఉపలాలనలు చేసి, కంతుసామ్రాజ్యము = మన్మథునియొక్క దొరతనమును, ఏలించి, కరుణ — కృప, చిత్తము — హృదయమును, ఒలయన్ = వ్యాపింపఁగా, జగములన్ = లోకములను, పాలించుచున్నవాఁడు = ఏలుచున్నాఁడు.

పతి నూతేండ్లు బ్రతుకుటకై వధువు లాజహోమము చేయును. సప్తపదులు ద్రొక్కించుట సఖ్యసిద్ధికొఱకు. అరుంధతీదర్శనము వధువునకు అరుంధతి సాటిగా పాతివ్రత్యాదికమును, ఆదంపతులకు అరుంధతీవసిష్ఠులదాంపత్యమువంటి దాంపత్యమును, సిద్ధించుటకు. 'సహ్యజా' - కావేరి సహ్యపర్వతమునంబుట్టినది. పాలించుట ఆయనయొక్కయధికారము.

ఉ. స్కందసరస్తటీరమణ కందర చందన కుందవాటికా
మందసమీరలోల వనమాలిక నిర్మలదివ్యవిగ్రహా
స్పందవిభాధరీకృత నభస్స్ఫుటకాళిక వల్లవాంగనా
బృందమనోభిమాన ధృతి భేదన పేశల వంశవాదనా. ౨౨

౨౨. స్కంద..మాలిక - స్కందసరః = స్వామిపుష్కరిణియొక్క - తటీ = తీరములయందలి - రమణ = రమణీయములైన - కందర = గుహలయొక్కయు, చందనకుందవాటికా = చందనవాటికయొక్కయు - మొల్లవాటికయొక్కయు - మందసమీర = మృదువాయువుచేత - లోల = చలించుచున్న - వనమాలిక = వనమాలగలవాఁడా. నిర్మ....ళిక - నిర్మల = స్వచ్ఛమైన - దివ్య = శ్రేష్ఠమైన - విగ్రహ = మూర్తియొక్క - అస్పంద = తిరమయిన - విభా = కాంతిచేత - అధరీకృత = అతికరింపఁబడిన - నభః = ఆకాశముయొక్క - స్ఫుట = ప్రవ్యక్తమయిన - కాళిక = నైల్యముకలవాఁడా, వల్ల....దన - వల్లవాంగనా = గొల్లభామలయొక్క - బృంద = సమూహములయొక్క - మనోభిమాన = ఆత్మగౌరవమును - ధృతి = ధైర్యమును - భేదన = పగుల్చునట్టి - పేశల = మంజులమైన - వంశ - పిల్లనగ్రోవియొక్క - వాదన = వాయించుటగలవాఁడా.

తా.—ఓవేంకటేశ్వరస్వామీ, నీవనమాల స్వామిపుష్కరిణిచెంగటిగుహలనుండియు, చందనవాటికలనుండియు, కుందవాటికలనుండియు, వీచెడుపిల్లతెమ్మెరలచే కదలుచున్నది. నీదివ్యమంగళవిగ్రహము నీలచ్ఛాయయందు ఆకాశముం బుగిలించుచున్నది. నీవేణునాదములు చెవింబడఁగానే గొల్లభామినులు బెట్టును తేఁకువను గోలుపోయి నిన్నుం జేరుదురు.

స్వామిపుష్కరిణి తిరుపతికొండలోనిది, గావున, దానిచేత శ్రీవేంకటాచలపతి సూచితుఁడు. 'వనమాలీ బలిధ్వంసీ కంసారాతి రధోక్షజః,' అమ. 'ఆపాదపద్మం యా మాలా వనమా లేతిసా స్మృతా' ఇతి కళిఙ్గః-అనిరామాశ్రమి; వనమాలయే వనమాలిక. "కాళికా చణ్డికాభేదే కార్ష్ణ్యే" మేదిని. వల్లవాంగనావంశవాదనములచేత కృష్ణావతారము సూచితము.

క. అరిధారాఖండిత మరు । దరిసంఘ, విహంగవాహనా, యుదరమహాం
బురుహపుటభరిత మధుళిం । బర భర జలమానుపాయమానద్రుహిణా. ౨౩

౨౩. అరి....ఘ - అరి = చక్రముయొక్క - ధారా = వాదరచేత - ఖండిత = నఱకంబడిన - మరుత్ అరి = దేవశత్రువులయొక్క (అసురులయొక్క) - సంఘ = సమూహముకలవాఁడా, విహంగవాహనా =

(గరుత్మంతుఁడు) వాహనము గాఁగలవాఁడా, ఉద....ణా - ఉదర = కడుపుయొక్క - పుట = దొన్నె యందు - భరిత = నిండిన - మధుశంబర = నీటిపంటిదైన తేనెయొక్క - భర = పూరమునందు - జల మానుషాయమాణ = నీటిమానిసివలె నొప్పుచున్న - ద్రుహిణా = బ్రహ్మగలవాఁడా.

స్వామీ, నీవు నీచక్రాయుధంపువాదరతో నసురులను పరిమార్చితివి. పక్షియైన గరుత్మంతుఁడు నీకు వాహనము. నీబొజ్జనుండి పొడమిన దొన్నెవంటిపుండరీకములో నిండియున్న తేనెవెల్లి యందు నీటిపెల్లునందుంబోలె బ్రహ్మదేవుఁడు నీటిపాపవలె నొప్పుచున్నాఁడు. ఉపమ.

స్రగ్విణి. వాలినిర్భేదనా వారిజాతేక్షణా । శైలకన్యాస్తుతా శార్ఙ్గచంచద్భుజా

ఫాలదృక్పద్మభూపాకభేదిస్ఫుర । న్మౌళిమాణిక్యరు ఙ్మండితాంఘ్రిద్వయా.

౭౮. వాలినిర్భేదనా = వాలిని తెగటార్చినవాఁడా, వారిజాతఈక్షణా = తామరసాక్షుఁడా, శైలకన్యాస్తుతా = పార్వతిచేత పొగడఁబడినవాఁడా, శార్ఙ్గ చంచత్ భుజా = సింగిణివింటితో కదలుచున్న బాహువులు గలవాఁడా, ఫాల....యా - ఫాలదృక్ = నిటలాక్షుఁడైన శివుఁడు - పద్మభూ = తమ్మిచూలియైనవలువ - పాకభేది = పాకాసురుని సంహరించినయింద్రుఁడు (అను వీరియొక్క) - స్ఫురత్ = వెలుఁగుచున్న మౌళిమాణిక్య = చూడామణులయొక్క రుక్ = కాంతులచే - మండిత = అలంకరింపఁబడిన - అంఘ్రి = చరణములయొక్క - ద్వయా = యుగళముకలవాఁడా.

ము. ఇది నీలాచలనీలచేలకసుభద్రేందీవరాభాక్షికో
ణదృగంచద్భుజవీర్యధుర్యజయసన్నాహార్భటీవాద్యభీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయమహిజాన్యుత్పాదితాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమంబలరు హృద్యంబైన పద్యంబులన్. ౭౯

౭౯. ఇది = ఈగ్రంథభాగము, నీలా—నన్ - నీలాచల = నీలాద్రి యందలి - నీలచేలక = నల్లనివస్త్రముగలవాఁడైనబలరామునితోను - సుభద్ర = సుభద్రయను చెల్లెలితోను (స సహ) = కూడుకొనువాఁడైన - ఇందీవర = నల్లగలువయొక్క - ఆభ = కాంతివంటి కాంతిగలవాఁడైన శ్రీకృష్ణుని యొక్క - అక్షి = కంటి - కోణ = కొనయందలి - దృక్ = చూపుచేత - అంచత్ = ఒప్పుచున్న - భుజ వీర్య = బాహుబలముయొక్క - ధుర్య = సమర్థమైన - జయసన్నాహ = గెలుపులకైన సరంజాముతోడి - ఆర్భటీ = మ్రోఁతతోడి - వాద్య = వాదిత్రములవలని - భీతి = భయముచేత = ఉదిత = లేచినవాఁడు (అనఁగా పలాయితుఁడు) అయిన - ఇభేశ్వర = (కటకపురరాజయిన) గజపతికలవాఁడగు - కృష్ణరాయ మహిజాని = కృష్ణరాయభూపతిచేత - ఉత్పాదిత = నిర్మింపఁబడిన (రచింపఁబడినయనుట) ఆముక్తమాల్య దన్ = ఆముక్తమాల్యదా మహాప్రబంధమునందు, సప్తమంబు ఆశ్వాసము = ఏడవ యాశ్వాసము, హృద్యంబైన పద్యంబులన్, అలరున్.

తా. నీలాద్రియని పురాణప్రసిద్ధమైన శ్రీజగన్నాథక్షేత్రమందు బలరామసుభద్రాసమేతుఁడైన శ్రీకృష్ణుని కటాక్షవీక్షణముచేఁ గలిగిన బాహుబలముతో కటకముమీఁదికి కర్ణాటమహీపతి కృష్ణరాయఁడు విజయధాటిం గావింపఁ గటకాధీశుఁడైన గజపతి వింధ్యారణ్యమునకు భయపలాయితుఁ డాయెను. అంతట నారాజ్యము కృష్ణరాయనికి వశమాయెను. ఓ వేంకటాచలపతీ, అట్టియావిజయమునం గృష్ణరాయఁడను నేను రచియించిన యాముక్తమాల్యదాప్రబంధమున ఇది ఏడవయాశ్వాసము హృద్యమయిన పద్యములతో నొప్పారుచున్నది.

శ్రీకృష్ణార్పణమస్తు. ఓం తత్ సత్.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 7 | దోఁప, నస్తో | దోఁచి, యస్తో |
| 6 | 35 | దనన్నన | దన్ననన |
| 7 | 28 | మెదు తెక్కృం | మెదు రెక్కృం [గులు |
| 14 | 5 | పరకాళయోగులు | పరకాళతిరుమంగయో |
| 17 | 32 | బా. వా. | బా. వ్యా. |
| 20 | 34 | 'రాయన' | 'రాయ' |
| ,, | 35 | కావు | కావున |
| 25 | 16 | యటను | యనుట |
| 26 | 3 | ప్రకాణ్ణ | ప్రకాణ్డ |
| 27 | 27 | నమాత్రకేంశ | నంశమాత్రకే |
| 30 | 9 | శశః | శతః |
| 31 | 3 | పూర్వార్గము | పూర్వార్థము |
| ,, | ,, | చక్కగా | చక్కఁగా |
| 32 | 7 | ఈశ్వరరాయ | ఈశ్వరరాయ |
| ,, | 32 | చెనటు నెలడి | చెనటుల నెడి |
| 41 | 17 | మాడము | మాడెము |
| 42 | ,, | పీఁటి | పీటి |
| 44 | 15 | మహిమఁగా | మహిమగా |
| 45 | 2 | దూరిన | దూఱిన |
| ,, | ,, | చీఁకటి | చీకటి |
| ,, | 17 | పేటిన | పేరిన |
| 46 | 8 | కృప్త | కృష్ణ |
| 48 | 27 | నిన్నొఱసి | నిన్నొరసి |
| 49 | 18 | సాపహ్నన | సాపహ్నప |
| 56 | 2 | చెట్టు | చెట్లు |
| ,, | 4 | పూటగా | పూఁటగా |
| 59 | 23 | వినయము చేత | వినయము చేత (లేదా) 'మన్కృవలనె యడుగం దోఁచు' అని పఠింపఁదగు. |
| 65 | 7 | సవిఁ | సవి |
| 67 | 12,17 | యొఱుగం | యొఱగం |
| 68 | 9 | పెనుబండ్లు | పెనుఁబండ్లు |
| 72 | 26 | సన్గీతి | సన్గీతి |
| ,, | 16 | దుందుభిః | దున్దుభిః |
| 72 | 27 | కాహళాఃఖిలే | కాహళాఖిలే |
| 73 | 6 | ఒరిగింప | ఒరగింప |
| ,, | ,, | ముడుచు | ముడుఁచు |
| ,, | 26 | కంపు | కంపుల |
| 75 | 18 | నునుబోఁక | నునుఁబోఁక |
| 77 | 33 | డగుదన్నను | డగుతన్నను |
| 79 | 3 | కృపచేతయు | కృపయొక్కయు |
| 80 | 12 | సమస్తమెన | సమస్తమైన |
| 81 | 15 | నిరవధి | నిరపధి |
| ,, | 17 | రక్ష | రక్షా |
| ,, | 18 | యుపయో | యువయో |
| ,, | 19 | దేహ | దేవా |
| ,, | 33 | 'అయ | 'అద్రి |
| 83 | 11 | వడలును | వడలుఁ |
| ,, | 17,29 | నూదుంగాయ | నూరుంగాయ |
| ,, | 30 | విహితము | విహితము కాదు |
| 85 | 13 | గాపుర | గాఁపుర |
| ,, | 32 | మన్గో ఉన్న | మన్గో ఉన్న |
| 88 | 10 | దలుంకో | కొందలు |
| ,, | 17 | జగన్నండ్డాలం | జగన్నణ్డాలం |
| 89 | 16 | అంతట | అంతట నాఁడు |
| 90 | 6 | య్యైన | య్యై |
| ,, | 24 | హేవాసస్తు | సహేవాకస్తు |
| 92 | 27 | సోకినచో | సోఁకినచో |
| 93 | 30 | భిధోద్యమ | భిదోద్యమ |
| 97 | 25 | నళినీ | నళినీ |
| 98 | 19 | గంగను | గంగఅను |
| 100 | 30 | సంభూతయ్ | సంభూతమ్ |
| 102 | 4 | పట్టు | పట్టి |
| ,, | 19,27 | నక్షత్రము | నక్షత్రము |
| ,, | 30 | పుట్టి | పట్టి |
| ,, | 34 | దూరవు | దూఱవు |
| 103 | 10 | లాపముఁజేసి | లాపమున్నేసి |
| ,, | 33 | యెలుంగునుది | యెలుంగునది |
| 104 | 12,20 | మొఱయంగి | మొరయంగ |

# తప్పొప్పుల పట్టిక.

| పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 22,23 | సవర్గసక్ష్మీ | స్వర్గలక్ష్మీ |
| 2 | గినోష్మఁద | గినోష్మద |
| 18 | నక్షత్రేశః | నక్షత్రేశః |
| 32 | సోకించుట | సోఁకించుట |
| 23 | కురుజుల | కురుఁజుల |
| 29 | ఘర్మస్యాదాతపే | ఘర్మఃస్యాదాతపే |
| 20 | కపోల | కపోత |
| 4 | 'చెఱంగే' | 'చెరంగే' |
| 12 | ఈపక్షమువ | ఈపక్షమున |
| 17 | పు కలువ | కలువ |
| 29 | ముడుచునె | ముడుఁచునె |
| 15 | పుష్వాలను | పుష్పాలను |
| 29 | ప్రభలను | ప్రభలును |
| 13 | గలమే | గలమె |
| 10,23 | సంబ్రమింప | సంభ్రమింప |
| 13 | సస్మితోక్తయు | సస్మితోక్తియు |
| 30 | తిరిగిసన్ | తిరిగినన్ |
| 27 | తలుచు | తఱచు |
| 9 | గనువ | గవను |
| 2 | పుంగగపాటాసం | పుటాపాఙ్గసంగ |
| 3 | ప్రథమపై | అప్రథమపై |
| 15 | ధనదాదులైన | దనదాదికైన |
| 7 | 'కటములు' | 'కటములు' కరాత్కటాభ్యాం మేఘ్రాచ్ఛ నేత్రాభ్యాం చ మదస్రుతిః |
| 35 | ననియుబా | ననియుభా |
| 33 | చతుర్థ | చతుర్థ |
| 6 | దమద్యమే | ధమధ్యమే |
| 26 | భయోర్థ | భయార్థ |
| 19 | యర్థము | యర్థము రూపమున ఏకత్వము. అర్థము యథాయోగము అనుట. |
| 18 | సవరింవ | సవరింప |
| 4 | కలియజేసెను | కలియఁజేసెను |
| 6 | నామముగ్రహణ | నామగ్రహణ |
| 26 | దానియందున | దానియందును |
| 32 | నీకుతఱచెదను | నీకుఁదఱచెదను [తోను |
| 12,13 | దోసబ్రద్దల..అమ | తెల్ల చెఱకుముక్కల |
| 16 | పరదేశ | పరదేశి |

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 177 | 22 | వార్థక్య | వార్ధక్య |
| 181 | 2 | సెతము | సైతము |
| 182 | 11 | చున్నది | చున్నవి |
| ,, | 18 | గూటపుగంబంబున | గూటపుఁగంబంబున |
| 185 | 22 | మీవిలాసము | నీవిలాసము |
| 187 | 3 | నానతిఁబడి | నానతిబడి |
| 195 | 13 | విజతుగావించి | విజితుఁగావించి |
| 202 | 3 | మాధ్యమైక | మాధ్యమిక |
| 209 | 20 | యస్యాక్షరం | యస్యాక్షరం |
| 216 | 25 | నణకుచు | వణఁకుచు |
| 220 | 23 | రోపమ్మైన | రోపమ్మయిన |
| 221 | 31 | గానకో గంటికి నిద్రదుఁగం | గంటికి నిద్రగాన కొదుగం |
| 222 | 25 | చతురఙ్గబలములు | చతురంగబలములు |
| ,, | 34 | నెట్టినెఱవున | నెట్టివెరవున |
| 226 | 29 | మడచి | మడఁచి |
| 227 | 20 | శ్రోద్రిక్తంధవేళా | శ్రోద్రిక్తుండునవేళా |
| 229 | 13 | దీనును | దీనుని |
| ,, | 14 | దీనున్ను | దీనుని |
| 230 | 73 | సమూహమునకు | సమూహమునకు |
| ,, | ,, | తొక్కుట | త్రొక్కుట |
| 231 | 21 | వివకమయిన | ముపద్ధకమయిన |
| 234 | 3 | నశోక్తత్వద్విజిత | నశోక్తుఁద్వద్విజిత |
| ,, | 6 | లోలలక్ష్మ | లలక్ష్మల |
| 236 | 30 | తపశ్చైన | తపశ్చైన |
| 237 | 12 | వినుపింతు | వినిపింతు |
| 238 | 21 | పవస | పవన |
| 241 | 10 | నంక్షయ | సంక్షయ |
| 243 | 8 | కంబైన | మైవది |
| ,, | 15 | మోక్షేదీజ్ఞా | మోక్షేధీజ్ఞా |
| ,, | 16 | గంథాదులగు | గంధాదులగు |
| ,, | 23 | విషయకము | విషయము |
| ,, | 25 | సాత్త్వక | సాత్త్వికపు |
| ,, | 27 | సంబంధినిన్ | సంబంధినిఁగాన్ |
| 244 | 23 | సంజ్ఞలందు | సంజ్ఞలందు |
| 245 | 5 | సాధ్యాయస్యాజ్జపః | స్వాధ్యాయఃస్యాజ్జపః |
| 246 | 3 | ప్రణవంబులు | ప్రవణంబులు |
| 249 | 33 | ందుకడ | అందుకడ |
| 251 | 33 | నిఖిలభూత | నఖిలభూత |
| 252 | 12 | బ్రహ్మైవావస్థిమ్ | బ్రహ్మైవావస్థితమ్ |

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 254 | 8 | భగవచ్ఛబ్ధః | భగవచ్ఛబ్దః |
| 254 | 16 | జాతులందుఁబుట్టు | జాతులందుఁబుట్టుఁ |
| 257 | 21 | ముడుతల | ముడుఁతల |
| 261 | 12 | జన్మమ్ | జన్యమ్ |
| 262 | 24 | దరిసి | దఱిసి |
| 263 | 23 | దనుః | ధనుః [అనుబంధము |
| ,, | 30 | ప్రమాకములు | ప్రమాపకములు – చూ. |
| 264 | 14 | దీప్యదుదారో | దీవ్యదుదారో |
| 266 | 18 | పోగు | పోఁగు |
| 267 | 21 | వాసచ్ఛట | వాసశ్ఛట |
| ,, | 25 | ప్రయోజనము | ప్రయోజనమో |
| 275 | 17 | సెన్ధవ | సైన్ధవ |
| 276 | 11 | శుద్ధాంతకరణ | శుద్ధాంతఃకరణ |
| 282 | 13 | గదదత | గద్గదత |
| 283 | 5 | వేగము | వేగముచే |
| 284 | 9 | యజాండమును | యజాండమునె |
| ,, | 15 | స్వచ్ఛమైన | స్వచ్ఛమైన |
| 290 | 19 | అలుగుల | అలుఁగుల |
| ,, | 20 | చూత్ | ఘూత్ |
| ,, | 23 | ఆశ్లే | అశ్లే |
| 291 | 9 | మఱపు | మఱువు |
| 294 | 10 | మ్రోగు | మ్రోఁగు |
| ,, | 26 | కటితోగూడి | కటితోఁగూడి |
| ,, | ,, | టద్ధములం | టద్ధముల |
| ,, | 31 | మమ్ముగావు | మమ్ముఁగావు |
| 298 | 7 | ప్రకృతాత్మిత | ప్రకృతాత్మత |
| ,, | 24 | చేయము | చేయుము |
| 301 | 21 | పార్శ్వవ్యోర్వయో | పార్శ్వద్వయో |
| ,, | 27 | జగజ్జ్యోతి | జగజ్జోతి |
| 303 | 4 | చేకొనుకలు | చేకానుకలు |
| ,, | 31 | మెల్లగా | మెల్లఁగా |
| 305 | 11 | గరడీలయొక్క | గరడీయొక్క |
| 308 | 2 | నితుయలతో | తునియలతో |
| 309 | 22 | సెనలయందలి | సేనలయందలి |
| 311 | 10 | నోడింపగోరు | నోడింపఁగోరు |
| ,, | 30 | న్యదదీశత్ | న్యదీదిశత్ |
| 314 | 14 | మాధర్వము | మాధర్వము |
| 317 | 23 | అగ్ర | అగ్రః |
| 319 | 2 | యొనపా | యొకపా |
| 323 | 3 | గడమబడియె | గడమపడియె |
| 324 | 19 | బుట్టించి | పుట్టించి |
| ,, | 15 | కార్పణంబ | కార్పణ్యంబ |
| ,, | 29 | తత్తర | తత్తఱ |
| 325 | 24 | ప్రభాంతంబు | ప్రభాతంబు |
| 336 | 2 | సధర్వ | సధర్వ |
| ,, | 4 | యూధంబు | యూధంబు |
| 343 | 11 | ంప్వాదేశము | పుంప్వాదేశము |
| 344 | 6 | ముఖే | ముఖే |
| 345 | 22 | శేశవో | కేశవో |
| 346 | 9 | ధూళి | ధూళి |
| ,, | 28 | వెలుగఁగా | వెలుఁగఁగా |
| 347 | 34 | ంవర్తాగ్నే | సంవర్తాగ్నే |
| 349 | 26 | కువలయాత్మని | కువలయాప్తుని |
| 350 | 25 | దాపములు | దావములు |
| ,, | 31 | వడకురేఖం | వడఁకురేఖం |
| 352 | 15 | యాకారమును | యాకారములను |
| 353 | 3 | యాక్షేపము | నాక్షేపము |
| ,, | 27 | గాలెఁగక్రక | రాలెఁదక్రక |
| 365 | 26 | సంతతకెంపు | సంతతికెంపు |
| 368 | 11 | ఒడుచున్నది | బడుచున్నవి |
| ,, | 15 | రసన్తు | రసన్తు |
| 372 | 31 | నిసుగుల | నిసుఁగుల |
| 376 | 34 | థార్యశబ్ద | రథ్యాశబ్ద |
| 378 | 11 | సోకుసెడలు | సోఁకుసెడలు |
| 380 | 4 | శిఖరనుంనూత | శిఖరంనూతన |
| ,, | 5 | 'సెనసెను' కటారి | సురెకటారి |
| ,, | 17 | సెమళ్లెనెడి | సెమళ్లెనెడి |
| 381 | 34 | నిష్ఠ్యూతోర్ద్ర | నిష్ఠ్యూతోర్ద్ర |
| 392 | 8 | భా. వ్యా. | బా. వ్యా. |
| 397 | 12 | వెలదులు | వెలఁదులు |
| 400 | 2 | నలుగునకు | నలుఁగునకు |
| ,, | 6 | నడవి | అడవి |
| ,, | ,, | అడవి | నడవి |
| ,, | 19 | శబ్దాపగగా | శబ్దాపగమా |
| ,, | 29 | మృగ | 'మృగ |
| ,, | 30 | కస్తూరీచచి | కస్తూరీచ |
| ,, | 33 | ప్రభాతి | ప్రభాత |
| 402 | 10 | విహిత | విహత |
| 406 | 21 | పాపసెజ్జ | పాఁపసెజ్జ |
| 412 | 4 | శబ్దముతో | చంశబ్దముతో |

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 412 | 30 | నున్నవాఁడు | నున్నవాఁడు |
| 415 | 33 | ంచెనో | రించెనో |
| 416 | 28 | అందువలసనే | అందువలననే |
| 417 | 9 | హాలనమక్కాదళ | హాలన మక్కాదళ |
| 419 | 29 | సంక్రమించిస | సంక్రమించిన |
| 420 | 12 | అవ్వుడు | అప్పుడు |
| 421 | 21 | జలధరఛేద | జలధరచ్ఛేద |
| ,, | 34 | త్రజత | ద్రజత |
| ,, | 35 | ఌఘుతయా | గ్లఘుతయా |
| 422 | 29 | మబ్బును | మబ్బును |
| 424 | 7 | సాలసముద్ర | పాలసముద్ర |
| ,, | 22 | త్వద్యోత్యార్థము | . త్వద్యోత్యార్థము |
| 426 | 22 | అస్తోదయపెఱును | అస్తోదయపెఱసం |
| 427 | 17 | చాపలక్ష్మీరివ | చాపలక్ష్మీరివ |
| 429 | 10,11 | హ్రీగ్లజ్జాపత్రపా | హ్రీగ్లజ్జాసాపత్రపా |
| 432 | 7 | స్వత్త్యేభవతి | స్వత్త్వేభవతి |
| 439 | 21,27,28 | తామ్రచూడ | నరుణచూడ |
| 444 | 3,25 | నుఱువనెడి | నురువనెడి |
| 446 | 2 | ద్విపదాటవి | ద్విపదాటవి |
| ,, | 32 | మ్రోగుటయు | మ్రోఁగుటయు |
| 448 | 5 | తలుగని | తెలుఁగని |
| 449 | 8 | సమ్రాట్టనిభావ | సమ్రాట్టభావ |
| ,, | 18 | హర్షాశ్రుదహార | హర్షాశ్రునైదహార |
| 451 | 28 | తృష్ణదీరనిచ్చి | తృష్ణఁదీఱ |
| 452 | 26 | ఘష్పములతో | పుష్పములతో |
| 454 | 7 | బరగు | బరఁగు |
| 455 | 5 | ప్రభాసమాన | ప్రభాభాసమాన |
| ,, | 21 | వెలిలేని | వెలలేని |
| 456 | 23 | లీలావలి | లీలావతి |
| ,, | 26 | పతిహతాపాదస్త | పతియుహతనిరస్త |
| ,, | 30 | పృధివీపతి | పృథ్వీపతియు |
| ,, | 31 | పతిహరాదపాస్త | పతియుహతనిరస్త |
| 457 | 20 | తనుఖ్యానవం | తనుఖ్యాపనం |
| ,, | 22 | ప్రారనాం | ప్రార్థనాం |
| ,, | ,, | త్రబలతత | ప్రబలతర |
| 458 | 6 | వడ్డ | పడ్డ |
| ,, | 11 | వరోరిః | పరోరిః |
| 460 | 2 | నెవ్వాఁడు | నెవ్వాఁడుఁ |
| 461 | 22 | తీర్చుపారు | తీర్చుపాఱు |
| 464 | 18 | పూరముద్రణ | పూర్వముద్రణ |
| 469 | 22 | బహుమావము | బహుమానము |
| 469 | 28 | ౬౨౨ | ౨౨౬ |
| 470 | 28 | తును; పరుల | తురు పరుల; |
| ,, | 29 | పెరవారు | పెఱవారు |
| 472 | 6 | సంచివుల | సచివుల |
| ,, | 27 | నాజను | నాఁజను |
| ,, | 30 | చంపుటకై | చంపుటకైన |
| ,, | ,, | యజ్జము | యజ్ఞము |
| ,, | 33 | తనిజ్యేష్ఠ | తనజ్యేష్ఠ |
| ,, | 34 | ఒల్ల | ఒల్లక |
| 480 | 9 | దపరాధి | నపరాధి |
| ,, | 21 | ననఁదె | ననదె |
| 486 | 3 | త్వవ్తర్థి | త్వత్తర్థి |
| 487 | 9 | నొనర్పఁ | నొనర్ప |
| 488 | 17 | పరచితులం | పరిచితులం |
| ,, | ,, | చేయు చేయుము | చేయుఁ వివేకియై రాజు చేయును |
| 491 | 13 | యంకగాఁడో | యంకకాఁడో |
| 494 | 12,17 | సంతసపువేళ | సంతసపుఁదఱి |
| 495 | 2 | తతద్విజ | సతతద్విజ |
| ,, | 14 | మిగతభోజన | మితభోజన |
| 496 | 12 | పోషంచుచు | పోషించుచు |
| ,, | 27 | మర్దవమల్ల | మర్దనమల్ల |
| 498 | 29 | నృపకార్య | నృపకృత్య |
| 499 | 6 | అహితము | ఆహితము |
| 500 | 4 | బితభక్తు | బిత్రుభక్తు |
| ,, | 21,22 | రాజ్యాంతే | రాజ్యాన్తే |
| 503 | 13 | ప్రణిధి | ప్రణిధి |
| ,, | 33 | యమయుత్త | యమయుక్త |
| 505 | 5 | గడుబధ్య | గడుఁబధ్య |
| ,, | 22 | అధిం మైన | అధిక మైన |
| 506 | 22 | వాసరుముల | వాసరముల |
| 509 | 4 | ప్రణతులై | ప్రణతులైన |
| 510 | 13 | దఊణాది | ఊణాది |
| 511 | 13 | మున్త్రణ | మన్త్రణ |
| 513 | 33 | కృష్ణోని | కృష్ణాని |
| 514 | 5 | వ్యథితాస్తథా | వ్యథితాస్తథా |
| 519 | 24 | డసఁగఁకర్పూర | డసఁగఁగర్పూర |
| 520 | 26 | గ్రాంచునది | గాంచునది |
| ,, | 27 | కిందుఁరేతు | కిందురేఁతు |

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 520 | 29 | జనఁ, బ్బగం | జనఁ బగం |
| 524 | 20 | సంపచ్ఛిహ్నము | సంపచ్ఛిహ్నము |
| 528 | 35 | ఘన్యా | ఘనా |
| 531 | 19 | బజ్త్రిఁ | పంక్తిఁ |
| 536 | 35 | బ్రాజ్మత్రి | బ్రాజ్మత్రి |
| 539 | 26 | బసదాడి | బసుపాడి |
| 541 | 27 | చేసికొఁసవచ్చు | చేసికొనవచ్చు |
| 542 | 7 | ప్రౌఢిమై | ప్రౌఢిమైఁ |
| ,, | 21 | కేసరీ | కేసరి |
| 543 | 6 | 'మానిషదే | 'మానిషా' దే |
| ,, | 14 | సపేంద్రుఁడై | నుపేంద్రుఁడై |
| ,, | 20 | శపింవఁగా | శపింపఁగా |
| 556 | 20 | యూపంజెగి | నూఁపంజెగి |
| 559 | 13 | గణబేధము | గణభేదము |
| ,, | 18 | త్రెక్కునుకాఁక | త్రెక్కొనుకాఁక |
| ,, | 27 | న్యాయమా | న్యాయ్యమా |
| ,, | 33 | వేళ్లు | లేళ్లు |
| 561 | 18 | ఆలం. సా. | అలం. సా. |
| ,, | 19 | నందినీ | నందనీ |
| 562 | 15 | పూఁబోఁడులారా | పూఁబోఁడులార |
| 564 | 17 | స్పురించి | స్ఫురించి |
| 565 | 8 | తాళనృంత | తాళవృంత |
| 575 | 11 | ధూపంబు | ధూపంబు |
| 581 | 33 | చంథ్రసూర్య | చంద్రసూర్య |
| 590 | 2 | ఆగస్తురతిథి | ఆగస్తురతిథి |
| 604 | 11 | సుళ్పతి | సుళ్లపతి |
| 606 | 17 | మనోద్రేక | మదనోద్రేక |
| 607 | 4 | దూకుంద | మాకంద |
| ,, | 15 | పల్లపగ్రాస | పల్లవగ్రాస |
| ,, | 28 | పాతుమెషా | పాతుమేషా |
| 608 | 9 | హృదయొకతె | హృదయయొకతె |
| 610 | 24 | దళఃఖణ్డే | దళఃఖణ్డే |
| 614 | 8 | జెట్టనందు | జెట్టినందు |
| 621 | 13 | అథికరణ | ఆధికరణ |
| 626 | 2 | మల్లీ | మల్లె |
| 645 | 17 | ప్రొక్కిటి | పొక్కిటి |
| 625 | 23 | ప్రతీకారోజ్ఞునగ్గ | ప్రతీకారోనగ్గ |

# పీఠికలోని సవరణలు.

| | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| iii | శ్రీయుతులు యెఱ | శ్రీయుతులు ఎఱ |
| v | ప్రపశ్నిం | ప్రశ్నిం |
| vi | మర్క్ బ్రతాపు | మర్క్ ప్రతాపు |
| 13 | పరంపలు | పరంపరలు |
| 14 | మరుదూడ | మరుదూఢ |
| | ఆయుఃక్తల | ఆయుః క్తల |
| 15 | గనపరాగోలలు | గనపరాగోలలు |
| 21 | తారుణ్యాలిగత | తారుణాలిగ |
| 22 | వార్ధుక్షికా | వార్ధుక్షికా |
| 22 | బరితాత | బరితాప |
| 23 | పరాహా...శాకలా | పరాగ...శాఖలా |
| 24 | 129 | 111 |
| 25 | బొకడ | బొగడ |
| 27 | పనిస్నల్ల | పనిస్నల్గ |
| 29 | చించ్చువారి | చించిచ్చువారి [ములు |
| 30 | క్ష్వేథకారసంధులు | క్ష్వేథకారసంధికల్వ |
| 31 | నానుడులు | శబ్దపల్లవములు |
| | నెన్నలను | వెన్నలను |
| 32 | కర్తకత | కర్తృకత |
| 33 | సుంతరీ | సుందరీ |
| 35 | వావలేని | వానలేని |
| 38 | మహాకని | మహాకవి |
| 36 | మహార్వా | మహాద్వా |
| 39 | గానగానక్ | గానక్ |
| 41 | మాడ్కిజాడ్కి | మాడ్కి, జాడ్కి |
| 42 | వాగ్విభజృజంభి | వాగ్విభవజృంభి |
| 43 | పంధాన | పరధాన |
| 47 | లెందరో | లెందలో |
| 48 | అంగస్థాయినిక్ | అంకస్థాయినిక్ |
| 49 | సామ్యములేని | సామ్యహీన |
| 52 | అతంత | అత్యంత |
| 53 | శృంగారశి | శృఙ్గారశి |
| | వంశోత్త్యసులు | వంశోత్తంసులు |
| 56 | నిశ్చయముగా | నిశ్చయముగాఁ |
| 62 | దుపయోర్వీ | డుదయోర్వీ |
| 63 | పారిజామనుముల | పారిజాతమనువుల |
| | మరుద్వృతా | మరుద్వ్రతా |

| | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| 64 | రంలిజయా | రంతి...జయా |
| 70 | తద్వ్యాఖ్యా | తద్వ్యాఖ్యా |
| 71 | రాజోత్తములై దీని | రాజోత్తములైరి. దీని |
| | సాధనములు | సాధనములని |
| 77 | జ్యోస్న్యనుంచిన | జ్యోస్న్యలుంచిన |
| 79 | పంచశరేణ | పఞ్చశరేణ |
| | బాళేముడించి | బాళేము డించి |
| | స్థానేషు | స్థానేషు |
| 80 | స్త్రాగ్రహార్య | స్థాగ్రహార్య |
| | హిమవంత | హిమవన్త |
| | శృంగాటకా | శృఙ్గాటకా |
| | రాగా | రాఁగా |
| | మన్మథ | మన్మథ |
| | శిరశృంగ | శిరశృంగ |
| 81 | గుందఁగ | గుండుగ |
| | శాఖాఞ్చ | శాఖాంచ |
| 82 | తృంగా | తృఙ్గా |
| | నికురుమ్వ | నికురుమ్బ |
| 83 | కర్పూరంబు | కర్పూరంబు |
| 84 | కాషానాం | కాష్ఠానాం |
| | స్పర్థి | స్పర్థి |
| | జగ్ధం | జగ్ధం |
| | ముఖే | ముఖే |
| | కోణప | కోణప |
| | సాలభజ్జీవ | సాలభఞ్జీవ |
| 85 | పర్కస్య | పఙ్కస్య |
| 86 | జానకీ | జానకీ |
| 87 | బన్ధంవిధాయా | బన్ధం విధాయ |
| 88 | అభిధానరత్నమాట | అభిధానరత్నమాల |
| | మఃనుమూల్య | ముక్తమాల్య |
| 91 | మల్లామణ్డిత | మల్లాముణ్డిత |
| 92 | దధిమండ | దధిముణ్డ |
| 93 | పోల్చు | పొల్చు |
| | కాన్తస్తనాస్తథలీ | కాన్తస్తనాన్తఃస్థలీ |
| 96 | తేఁటలు | తేటలు |
| 98 | బింతబి | బింబిత |
| 101 | పుఙ్ఖకిఙ్జ | పుఙ్ఖకిఙ్ఖ |

# పీఠికలోని సవరణలు.

| పుట | తప్పు. | ఒప్పు. |
|---|---|---|
| | మొసర్చి | మొనర్చి |
| 104 | దేశనాచక | దేశవాచక |
| 109 | మోర్వాస్యం | మోర్వాశ్యం |
| | మేరేయ | మైరేయ |
| | నిపుల | విపుల |
| 115 | వ్యాకర | వ్యాకరణ |
| 120 | మేథస్వ | మేధస్వ |
| 121 | అశ్వీయ | అశ్వీయ |
| | మధుసాతి | మధుపాతి |
| | ఆళినిక | అళినిక |
| 126 | వీధుందు | వీధులందు |
| | మోక్షంను | మోక్షం న |
| | వర్ధలబ్ధ | వర్ధల బ్ధ |
| 127 | హేమతం | హేమంతం |
| 129 | ఖోట్టి | ఖోట్ల |
| 131 | చేతసః | తేజసః |
| | రాక్షసే | రాక్షసీ |
| | భాస్వరక్తా | భాస్వరముక్తా |
| | ఆంధ్రని | ఆంధ్రని |
| 138 | raon | rain |
| 133 | పఠించిగను | పఠించిరను |
| 134 | నేఃకొ | నేలికొను |
| 134 | అ।మరు | ఆ।మరు |
| 138 | దొఃకొనుఁడు | దొరకొనుడు |
| 139 | చుట్టుమ | చుట్టమ |
| 140 | గెఁడె | గెండె |
| 144 | అంకుశపుటలఁగు | అంకుశపుటలుఁగు |
| | ప్ర. మే. వి. | ప్ర. వేం. వి. |

[illegible]ము క్రమాల్యర — తప్పొప్పుల శేషము.

| పుట | పంక్తి | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 96 | 2 | గురు | గరు |
| 97 | 14 | లోచనామమ్భోది | లోచనానామమ్భోధి |
| 162 | 19 | సన్నఁగింప | సన్నగింక |
| 227 | 10 | హరహాయః | హరిహాయః |
| 432 | 6 | వాస్తం | వాన్తం |
| 434 | 32 | మికుటగపు | మిక్కుటపు |
| 456 | 10 | చంద్ర | చన్ద్ర |
| | 28 | హతాపాదస్త | యాఁహతసిద్ధస్త |
| | 30 | పృథివీపతి | పృథ్వీపతి |
| | 31 | హతాత్ అపాస్త | హతాదపాస్త |
| 457 | 2 | హతాపాదస్త | హతాదపాస్త |
| 547 | 1 | దాగోదేవి | గోదాదేవి |
| 571 | 20 | ఆహ్నాయమ్భోజం | అహ్నాయమ్భోజం |
| 574 | 12 | కివ్నర | కిన్నర |
| 662 | 16 | మనస్సుదందు | మనస్సునందు |
| | 17 | విశేషోబ్ధా | విశేషోధా |
| | 7 | కృత్యుడనా | కృత్యుఁడను |
| 664 | 28 | ఓర్కనుఁడా | ఓరక్కనుఁడా |
| 668 | 23 | నూత్రుల్దవ్వ | నూతుల్ద్రివ్వ |
| 677 | 3 | ములకునె | ములకునై |
| 683 | 4 | పిమ్మ | పిమ్మట |
| 687 | 4 | బెల్లుగా | పెల్లుగా |
| 689 | 36 | సూర్పాతి | నూర్పాతి |
| 693 | 4 | సిద్ద్యాత్ | విద్ద్యాత్ |
| 698 | 20 | ధత్యపుఁబణ్యార | ధత్యపు=పణ్యార |
| 701 | 6 | పిష్యక్సేనుఁడు | విష్వక్సేనుఁడు |
| | 15 | జతుద్దిశల | జతుర్దిశల |
| | 19 | భృత్వ | భృత్య |
| | 24 | మెఱుఁగుజూక్క | మెఱుఁగుఁజూక్క |
| 704 | 9 | చే నధిష్ఠింప | చే అధిష్ఠింప |
| 707 | 12 | నందడి | సందడి |
| 711 | 25 | నదసం | సదనం |

శ్రీరస్తు.

# ఆముక్తమాల్యద—పద్యాదిసూచిక.

